


విజయ
ఆషాఢము

# భారతి

సంపుటము 30
సంచిక 7


# 'విజయ' విలాసము



శ్రీ నాయని సుబ్బారావు

మాయన్న 'నందనుండు' మహీయః ప్రేమ ప్రభా పిహిత సర్వర్తు
శ్రీయుక్తు డనుసరించిన తీయని మార్గమున నరుగుదెంచితి నేనున్.
శ్రీ మహావిష్ణు దేవప్రసిద్ధ దివ్య మందిర ద్వార సౌందర్య మధుర కాంతి
రేఖలీ రూపముగ రంగరించుకొనిన ఒక్క కృతకృత్యుడను విజయుండ నేను!

ఆది డింభకున కుయ్యాల వెట్టి పురా ప్రశస్తి గాంచిన వటత్కామ్రజ దళము
పంట గింజలనేల పట్టిగుంజిన నింగి మొలనూలు పరిగపిట్టల వలయము
చేదు తీపికి నప్పజెల్లలే యను నవ్య లేత దొంతర వేప పూత గుత్తి
శిశిరర్తు శైత్యకుంచిత ధాత్రి పులకించు ప్రాణమ్ము నులి వెచ్చ పైరగాలి
అడరు నెలగోలు బలముగా నఖిలోక నిత్యకళ్యాణ సంధాన నిపుణతా ప్ర
కీర్తనీయుండు వెడలి దిగ్విజయ యాత్రవచ్చు నవ వసంతుండు నా ప్రథమ మూర్తి

ఎండ మండించి స్రీ రిగిలించి నేల బీటలు వోవ విలయతాండవము సల్పి
జడివాన లురలించి జలధార లుబికించి ధరణి రసార్ద్రి భాసుర మొనర్చి

పైరు పచ్చపోలాలు పరవళ్ళు త్రొక్కించి నవవధూవిలసనమ్ము వెలయించి
చలిగాలి పేర్చు మంచుల ధరిత్రీ ప్రౌఢ కవగుంఠన విభూతు లలవరించి
ముసలి వసుధకు పండిన పసుపుపచ్చ పుట్టముల నూడ్చి ప్రోడైన పుడమి మరల
పసిమిసలు వోవ కాయ కల్పమ్ము సేయవచ్చినా తమ్మునకు త్రోవ వదలిపోదు.

అరువది మంది మేము పరమాద్భుత వర్తనుడైన కాల స
త్పురుషు ననుంగు పుత్రుల మపూర్వము మాచిర సౌహృదమ్ము త
త్పరమతి నన్నదమ్ములము వంతులుగా సమయమ్ము వేచి మే
మరువది యేండ్ల కొక్క పరిపాయము వత్తుము నిక్క మింతయున్

మా తత్త్వాంతర్య మ్మొక టే తీర్చిన మార్గమొక్క టే యైనను మీ
మీ తత్త్వానేకత్వ ద్యోతిత వివిధ స్వభావ యుక్తుల మెందున్.

ఇద్ధ మహిమాను వర్తనమ్మ యనంత కాలగతి దోచు కొన్ని వంకరలు మీరు
మంచి చెడ్డలుగా విమర్శించినపుడె తత్తదనురూప నామముల్ తగిలె మాకు

ఈ విజయాభిధానము వహించితి మీ దయచే సమస్త స
ద్భావ పరంపరా ప్రచలితమ్ము మదీయ హృదంతరమ్ము నా
నావిధ నూత్నశోభన సనాథ మహావిజయ ప్రసాద ల
క్ష్మీవిభవాతి రేకమున మీ చిరవాంఛితముల్ ఫలించుతన్.

నా చేనైనది యేమి విశ్వ భువనాంతర్యామి పద్మాలయా
రోచిః స్మేర తరంగపూర్ణ ప్రణయార్ణోరాశి వేదత్రయ
శ్రీ చిన్మోహనమూర్తి దివ్య కరుణా రేఖా ప్రసారమ్మునన్
మీ చిత్తమ్ములు పల్లవింప గనుటే మీకున్ సదాభ్యున్నతుల్!



# జహాన్ ఆరా

★



శ్రీ కె. అన్నమరాజశర్మ

ఈమె షాజహాన్ ముంతాజ్ బేగం దంపతుల పెద్ద కూతురు. 1614 సం. జనన మందెను. సౌందర్యమయియే కాక, విదుషీమణి. పితృభక్తి పరాయణయే కాక ప్రేమస్వరూపిణి. రాజ్య లోభముచే ఔరంగజేబుచే చెరసాల నంపబడిన తండ్రి సపర్యలం దధికాసక్త చిత్తయై బ్రతికి నన్నాళ్లు వివాహమునైన తలపెట్టక, జనకు సోదార్చుచు, కారాగారముననే విషాద జీవనము గడపి 1681 సం. కాల ధర్మము నొందెను.

జనకుని పరిపాలన కాలమున రాచకార్యములలో తండ్రికింతేని చేదోడు వాదోడుగా మెలగిన మెలత. ఇంతయేల? జగద్భూషణ మని యర్థమిచ్చు నీమె పేరు సార్థకమే! నిజముగా నీమె గుణగణముచే జగద్భూషణమే!

ఓ రాజభిక్షుకీ! ఓ రాజవసన!
పువ్వులమ్మినవీధి బుడకలమ్మంగ
వివిధ్రివాసె నీజీవితగాథ,
భోగభాగ్యచయము మూలకుద్రోసి
పరతంత్ర జీవిత బాధలంగూర్చి
ఆత్మతో గుసగుసలాడుచున్నావె?
రాచబిడ్డవు ముద్దరాలవైయుండి
చెఱసాలకిటికీల జింతావినమ్ర
గావమ్ము తండ్రితో బంచికొనెంచి
రాంజిష్ణుశోభానమంచితగండ
[illegible]ళి వివర్ణమై వసివాడిపోవ
[illegible] భారమ్ముతో గొందలమంది
[illegible]ర్చు సెగలవెన్నెలకేల బూల
[illegible]రింగ్ల కెలనవాపోయె దొంటరిగ

కడుపుకోతల బహిర్గతము గానీక
తండ్రి నాశ్వాసింప దాచనెంచితివె?
కన్నీటిచుక్కలు కలువకందోయి
నేకాంత వేళలం దెప్పుడో జారి-
జాఱికమున్న - నీ చీరచెరగున
అద్ది, కల్పితమందహాసమ్ముగదుర
జనకు సపర్యకై సాక్షాత్కరించు
ఓ జగన్మోహినీ! ఓ జహాన్ ఆర!
నీదు సౌందర్యమ్ము నిండు జవ్వనము
అక్రాంత కాలాబ్ధి నైక్యమైపోవ
అస్థిముక్తావళులాన వాల్గాగ
ఈమట్టి గుట్టలో-యీ రెల్లుపొదల
దాచి, మందాకినీ తటములందుండి
వెఱ్ఱికేకలువైచి పిలుచుచున్నావె?

ఓ కళావారాశి! ఓ ప్రేమరాశి!
కర్మసూత్రంబెంత కర్కశవృత్తి
పక్షపాతము లేక బంధించు జగతి;
అమరలావణ్యమ్ము హరియించు కతన
నీ కీదృశావస్థ నిర్జరాంగనలు
కల్పించిరో యేమొ కన్యాలలామ!
మోహమే తీర్చిన భ్రూరేఖికలను,
ధవళాతిధవళ సుందర నేత్రయుగళి
హరినీలకాంతుల నావిర్భవించు
నీ వినీలపు కనీనికల నెందుంచి
అభ్రమాలికలోన నైక్యమైపోవు
పురుహూతచాపంబు పోల్కి మాదృష్టి
కందనియే దివ్యసుందరస్థలికి
బంగరుతెక్కలం బరుగువారితివా!

నీ వినిర్మలచిత్త నీ శేజమెంత
మార్దవమహితమో మంజులగాత్రి!
"విధుకాంతపాషాణవేది కాష్ఠలుల
శిల్ప నైపుణ్యమ్ము జీవమ్ము దాల్ప
నా సమాధినిగట్ట నాన జెందకుడు
గడ్డిపువ్వులు నవ్వ కాంతారభూమి
నాతనూవల్లి కనంబడనట్టి
అజ్ఞాత ఖననమ్ము నభిలషించెదను
ఇదియె నావాంఛితం బితరంబువలదు"
అనెడు నీపలుకెంత యమృతసారితము
అభము శుభము లేక యాజీవితమ్ము
బ్రహ్మచర్యమ్మునే పాలించినావు,
నీ పితృభక్తికి నిశ్చలమతికి
సుందరీ! పదివేల జోహారు లివిగో!



# సౌరకుటుంబోత్పత్తి



శ్రీ వసంతరావు వెంకటరావు




చిత్రం 1. టోలెమీ ప్రతిపాదించిన గ్రహగమనవిధానాలను నిరూపించు చిత్రం.

[అక్టోబరు, 1952 "సయంటిఫిక్ అమెరికన్"లో సౌర మండలోత్పత్తి విషయమై నూతన వాదాన్ని విజ్ఞాని హెరాల్డ్. సి. యురే ప్రతిపాదించేరు. సూర్యుడు, సూర్యునిచుట్టు తిరుగుతూన్న గ్రహాలు ఎట్లు జనించేవో తెలిసికోడానికై విజ్ఞానులనేకులు ప్రయత్నించేరు. ఒకవాదంకంటె వేరొక వాదం కొంత మెరుగైనప్పటికీ, మనకి తెలిసిన విషయాలనన్నిటిని పూర్తిగా సమర్థించ గల వాద మింత వరకు బయలుపడలేదు. ఉపచితజ్ఞానం ఎక్కువౌతూన్న కొద్దీ తదనుగుణమైన వాదాలు ప్రతిపాదిత మౌతున్నాయి. కొన్ని నవీనభావాల నాధారంగా జేసికొని, క్రొత్త ప్రతిపాదనను యురే శాస్త్రజ్ఞుడు కావించేడు]

జీవపరిణామంలో బృహత్తమ శరీర పరిమాణం గల జీవులు శీతోష్ణ విపర్యయాలధాటి కాగలేక క్రమంగానశించేయి. శరీరపరిమాణంతగ్గి, మస్తిష్కము పెరిగి, మనసు వికసించిన మానవుడు జీవజాలంలో ఉన్నతస్థాన మాక్రమించడానికి అవకాశం కలిగింది. బుద్ధి బలసంపన్నుడైన మానవుడు జగద్విషయమై కొంత యోచించడాని కుపక్రమించేడు. భూమి ఎంత వరకు వ్యాప్తమైయుంది? దేనిపై భూమి ఆధారపడింది? సూర్య చంద్ర నక్షత్రాదుల స్వభావాలేమి? అవెట్లు జనించేయి? అనునవి కొన్ని ప్రాథమిక ప్రశ్నలు. ఈవిషయాలు మతగ్రంథాలలో హృదయంగమంగా చర్చించబడ్డాయి.

యస్యోన్మేష. నిమేషాభ్యాం
జగతః ప్రలయోదయౌ ।
తంశక్తి చక్రవిభవ
ప్రభవం శంకరం స్తుమః
దిక్కాలా ద్యనవ
చ్ఛిన్నానంత చిన్మాత్ర మూర్తయే ।
స్వానుభూత్యేక మానాయ
నమశ్శాంతాయ తేజసే

మొదలైన అభిప్రాయాలను మానసిక శక్తిసంపన్నులు వెలిబుచ్చేరు. అరుణంలో సూర్యునిగురించి కొన్ని నవీనాభిప్రాయాలవంటివే ఉన్నాయి. సూర్యగోళానికి వాయువ్యావరణ ముందని, సూర్యు డాత్మప్రదక్షిణం చేస్తాడని, సూర్యునిలో మచ్చలున్నాయని, మొదలైనవి ప్రాచీన ఋషీశ్వరు లేవిధంగా కనుగొన్నప్పటికీ వాటి యాథార్థ్యాన్ని అంగీకరింపక తప్పదు.

స్థిరంగానున్న సూర్యునిచుట్టూ భూమితోపాటు గ్రహాలన్నీ తిరుగుతున్నాయన్న భావాన్ని 2200 ఏండ్ల క్రిందటనే సేమాస్ దేశవాసియైన అరిస్టార్కస్ వెలిబుచ్చేడు. కాని నాటి శాస్త్రవేత్త లాభావాన్ని ఆమోదించలేదు. సూర్యనక్షత్రాదులు భూమిచుట్టూ తిరుగుతున్నట్లు స్పష్టంగా కనిపిస్తాండటంచేత, భూకేంద్రసిద్ధాంతమే వారికి సబబుగా తోచింది. భూమియొక్క ఆకార పరిమాణాలను అందాజాగా గ్రీకులు తెలిసికొన్నారు.

అరిస్టార్కస్‌కి 400 ఏండ్లతరువాత సౌరమండలం గురించి టోలెమీ అను విజ్ఞాని కొన్ని ప్రతిపాదనలు చేసేడు. స్థిరంగానున్న భూమిచుట్టూ వృత్తాకార కక్ష్యలలో చంద్రుడు సూర్యుడు తిరుగుతున్నారు.

మిగిలిన గ్రహాలు భూమిచుట్టూ "డిఫరెంట్" అను వృత్తాలలో చిన్న ఉపచక్రాల (ఎపిసైకిల్స్) మార్గాన్ని తిరుగుతున్నాయి. గ్రహగతుల పరిశీలనను ఈవిధంగా సమర్థించడానికి టోలెమీ ప్రయత్నించెను (చిత్రం 1.)

16 వ శతాబ్దంలో విజ్ఞాని కోపెర్నికస్ గ్రహగమనాలనుపరీక్షించి సూర్యుడే కేంద్రమందు స్థిరంగానున్నాడని, సూర్యునిచుట్టు వివిధకక్ష్యలలో గ్రహాలు తిరుగుచున్నాయనిభావిస్తే పరిశీలనలతో సమన్వయం కుదురుతుందని తెలియజేసెను. భూమి తిరుగుతున్నాదన్న భావం వెగటుగా తోచింది. కోపెర్నికస వాదనను త్రోసిపుచ్చి, టోలెమీభావాలనే కొంత సవరించి మరొకసిద్ధాంతాన్ని టైకోబ్రాహి అను శాస్త్రజ్ఞుడు ప్రతిపాదించెను. అతనిప్రకారం(చిత్రం. 2)- భూమిచుటూ సూర్యచంద్రులు వృత్తాకారమార్గాలను పరిభ్రమిస్తుండగా, బుధ శుక్ర కుజ గురు శనులు సూర్యునిచుట్టూ వృత్తాకార కక్ష్యలలో తిరుగుచున్నాయి. టైకో బ్రాహి నిశితపరిశీలకుడు. తన వేధశాలనుండి కుజగ్రహగమనాన్ని జాగ్రత్తగా పరిశీలించెను. అవి బ్రాహికి లాభించనప్పటికి వాటిని క్రోడీకరించి విమర్శించిన విజ్ఞాని కెప్లర్, సూర్యుని చుట్టూ దీర్ఘవృత్తాకారకక్ష్యలలో భూకుజాదిగ్రహాలు పరిభ్రమిస్తున్నాయని సహేతుకంగా సూచించెను. పతనవస్తువులగురించి గెలిలియో చేసిన ప్రయోగాలను, కెప్లర్ గ్రహగమనవిషయమై చేసిన సూచనలను కలిపి మహామేధావి న్యూటన్ సార్వత్రిక గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని, వస్తుగమననియమాలని ప్రతిపాదించెను. భూమిచుటూ చంద్రుడు తిరగడానికి కారణం భూచంద్రులమధ్యనున్న గురుత్వాకర్షణ బలమేనని గణించి నిరూపించెను. దానితో సౌరకుటుంబ స్వరూపాన్ని ఊహించుకోగల అవకాశం కలిగింది. అయితే సూర్యునికి గ్రహాలకు గల సంబంధమేమిటి అను ప్రశ్నకు సమాధానం రాలేదు. ఆ సంబంధాన్ని వివరించడానికి నాటినుండి గణితజ్ఞులు ప్రయత్నం చేస్తునే ఉన్నారు. తన్మూలంగా అనేకవాదాలు జనించేయి.




చిత్రం 2. టైకోబ్రాహి ప్రతిపాదించిన గ్రహచలనవిధానం.

కాని, సౌరకుటుంబం ఎట్లువ్యవించిందిఅన్నది ఇప్పటికివి గడ్డుప్రశ్నగానే ఉంది. సూర్యమండల జననంగురించి నిష్కర్షగా చెప్పలేకపోయినప్పటికి, సూర్యునిచుట్టూ పరిభ్రమణంచేయు గ్రహాలవిషయం చెప్పకోగలం. సూర్యునిలోను, గ్రహాలలోను ఇప్పుడున్న పదార్థాలు ఒకప్పుడు ప్రాథమికంగా వేరొకరూపంలో ఉండిఉండాలి. ఆ ప్రాథమిక పదార్థాలు ఏ ప్రక్రియవల్ల నేటిసూర్యగ్రహాలు గా రూపొందేయో తెలిసికోడానికి కొన్ని నవీనభావాలజ్ఞానం ముఖ్యావసరం. అవి వాయురచనాసూత్రాలు, రేడియోధార్మికత, ఉష్ణగతి శాస్త్రం, క్వాంటం సిద్ధాంతం మొదలైనవి. అందుచేత, ఈ శతాబ్దారంభంవరకు వీటిపై ఆధారపడినవాదం సరియైనరస్తాలో పెంపొందలేదంటే ఆశ్చర్యంకాదు.

భూమిఏర్పడినతరువాత,భూమినుండి చంద్రుడు విడివడ్డాడన్నవాదాన్ని 60 ఏండ్ల క్రిందట జార్జిడార్విన్ ప్రతిపాదించెను. పసిఫిక్ మహాసముద్రస్థానంలో ఒకప్పుడు చంద్రుడుండేవాడని ఆవాదం. తరువాతి విజ్ఞానులావాదాన్ని తీవ్రంగా విమర్శించి అది సత్యం కానేరదని నిర్ణయించేరు. ఆ భావాన్ని 1917 లో విజ్ఞాని హెరాల్డు జెఫ్రీస్ పరిశీలించి, భూమి ద్రవరూపంలోనున్న సమయంలో తరంగాల ఆటుపోటులవల్ల భూమినుండి చంద్రగోళం ఊడిపోయిందనడానికి అవకాశముందన్నాడు. 1931 లో మరొకసారి నూతన జ్ఞానరశ్మిలో ఆవాదాన్నే జెఫ్రీస్ విమర్శించి ఆవిధంగా సంభవించే అవకాశం లేదని నిర్ణయించేడు. అప్పటినుండి ఖగోళజ్ఞులలో చాలమంది జెఫ్రీస్ భావాన్నే అంగీకరించేరు.

భూమినుండి చంద్రుడు విడిపడడాని కవకాశం లేదన్న జెఫ్రీస్ మొల్టనులే సూర్యునినుండి భూకుజ శుక్రాదిగ్రహాలు విడివడ్డాయన్న గ్రహోద్భవ సిద్ధాంతాన్ని ప్రతిపాదించేరు. ఒక బృహత్తార సూర్యుని

సమీపించిందని, అప్పుడు గురుత్వాకర్షణబలానికి సూర్యద్రవ్యంలో కొంతభాగం పైకుబికి సూర్యునినుండి తెగిపోయిందని, అట్లూడిపడిన ద్రవ్యభాగమే క్రమేణ గ్రహాలుగా ఘనీభవించి సూర్యునిచుట్టు తిరుగుతున్నాదని, జేమ్సు జీన్సుతో సహా వారు ప్రతిపాదించేరు. నేటివరకా వాదమే సమంజసంగా కనిపిస్తూంది.

తారామండలాన్ని పెద్ద దూరదర్శినితో పరిశీలించగా చాల తారలు జంటలని, మూడేసి నాలుగేసి కూడ కలిసి కూటాలుగా నున్నాయని తెలియవచ్చింది. న్యూటన్ గమనసూత్రాలను, సార్వత్రిక గురుత్వాకర్షణనియమాన్ని వినియోగించి జంటతారల ద్రవ్యరాశిని కనిపెట్టేరు. దగ్గరగానున్న నక్షత్రాల గమనాలను కొలిచి, నక్షత్రకాంతియొక్క వర్ణపటా (*Spectrum*) లలో వాటిల్లు మార్పులను గమనించి వాటివేగాలనుకూడ గణించేరు. జంట చుక్కలలోనున్న రెండునక్షత్రాల ద్రవ్యరాశిలో, సాధారణంగా ఎక్కువ వ్యత్యాసముంది; వాటి ద్రవ్యరాశి నిష్పత్తి జంటనుండి జంటకు ఎక్కువగా మారుతుంది. ఒక ప్రత్యేకనిష్పత్తి గల జంటతారలు విశ్వంలో ఎక్కువగా నుండవచ్చునని చెప్పడానికైనా వీలులేదు. జంటచుక్కలలో ద్రవ్యనిష్పత్తి 1 కి 1000 గల జంటలెంత విస్తారంగానుండగలవో అంత విస్తారంగానే ద్రవ్యనిష్పత్తి 1 కి 1000000 గల జంటలును ఉండవచ్చునని విశేష పరిశోధన గావించిన కుయిపర్ విజ్ఞాని తెలియజేసేడు.

అయితే, ఒకదానికొకటి పెయ్యిరెట్లు భారమున్న జంటచుక్కలలో చిన్నచుక్కను చూడడం చాల కష్టం. అందులోను, దానికి సహజకాంతిలేక పరావర్తిత కాంతితోనే వెలుగొందుచుంటే, అట్టి చుక్కను కనిపెట్టడం మరీ కష్టమని చెప్ప నక్కరలేదు. మన సౌరమండలమే దానికి ఉదాహరణం. గురుగ్రహం బరువు సూర్యునిబరువులో సుమారు వెయ్యవవంతు. గురునికి సహజకాంతి లేదు. తనపై పడిన సూర్యరశ్మిని పరావర్తించడంవల్లనే గురుగ్రహం వెలుగొందుతూంది. అందుచేత సూర్య గురు సమ్మేళనాన్ని ఒకజంట చుక్కగా భావింపవచ్చును. కాని, మన సమీప తమ నక్షత్రంనుండి సౌరమండలాన్ని చూచినప్పటికి సూర్యుని ప్రక్కనున్న గురుగ్రహం కనిపించదు. సూర్య గురులవంటి జంట చుక్కలు మన గెలాక్సీలో సర్వసాధారణంగా నుండవచ్చుననడానికి నిదర్శనా లున్నాయి. వాటి దృష్ట్యా, మన సౌరమండలం అపురూపమైనదికాదని, మన గెలాక్సీలోనే లక్షలాది సౌరమండలాలుండవచ్చునని విజ్ఞాని యుం[illegible] అభిప్రాయపడుచున్నాడు.

మన గెలాక్సీలో వ్యాపించియున్న విరళ నెబ్యులా[illegible]లలో ఒకదానియందు కొన్ని నల్లటి మచ్చలను యెర్కీస్ వేధశాలనుండి పరిశీలనలను సాగిస్తున్న ఖగోళజ్ఞుడు ఇ. ఇ. బెర్నార్డ్ కొన్ని సంవత్సరాలక్రితం కనుగొన్నాడు. ధూళితోను, వాయువుతోను ఏర్పడిన ఈ నల్లటి ద్రవ్యఖండాలను హార్వర్డ్ విశ్వవిద్యాలయ విజ్ఞాని బార్ట్. జె. బాక్ నిశితంగా పరిశీలించి, వాటి ద్రవ్యరాశిని పరిమాణాన్ని స్థూలంగా నిర్ణయించేరు. సూర్యద్రవ్యరాశికి సమానమైన ద్రవ్యరాశి కలిగి, సూర్యునికి సూర్యసమీప తమ తారకుమధ్యనున్న అంతరాళమంత పరిమాణం గల వాయుసమూహాలవలె ఆ మచ్చలు కనిపిస్తున్నాయన్నాడు. అట్టి బృహత్పరిమాణం గల ధూళి వాయు సమ్మిళిత ద్రవ్యసంచయాలు ఆకాశంలోనున్నప్పుడు, చుట్టుప్రక్కలనున్న నక్షత్రాల కాంతిచే ఆ ద్రవ్యం పీడింపబడి సంకోచిస్తుందని ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగానున్న లైమన్ స్పిట్జర్ జూనియర్ వివరించేడు. అట్టి సంపీడనానికి లోనైన ద్రవ్యసంచయంలోని కణాలు దగ్గర దగ్గరగా చేరుచున్నప్పుడు గురుత్వాకర్షణబలంవల్ల ఆ ద్రవ్య మధికసంకోచమొందగా, దానిగర్భమందలి ఒత్తిడి తాపక్రమం వేగంగా ఎక్కువై, ఉష్ణకేంద్రక (*Thermo-nuber*) ప్రక్రియ ప్రారంభం కాగలస్థితిని చేరుకొంటుంది

ఇట్టి ప్రక్రియవల్లనే సూర్యునివంటి నక్షత్రమేర్పడినపక్షమందు, సూర్యు డేర్పడినతరువాత సౌరకుటుంబోద్భవానికి అవసరమైనంత ద్రవ్యం మిగిలిపోయిందని భావించడానికవకాశముంది. నక్షత్రోద్భవప్రక్రియ ఇంతకంటె కొంత సంకులమనుకొంటే, గ్రహసమూహంతో కూడిన నక్షత్రానికి బదులుగా రెండు నక్షత్రాలు జనించవచ్చును. రెండే కాదు; మూడు, నాలుగు నక్షత్రాలు సైతం ఒకే ఒక ద్రవ్యసంచయంనుండి ఉత్పన్నం కాగలవను సిద్ధాంతానికీనాడు ఆధారాలు కనిపిస్తున్నాయి. సూర్యు డేర్పడిన పిమ్మట ఏదోవిధంగా సూర్యునినుండి గ్రహాలూడిపడ్డాయన్న వాదానికి బలం తగ్గుతూంది. సూర్యగోళం ఎట్లు జనించిందన్న ప్రశ్నకు ప్రాధాన్య మివ్వక, సూర్యునినుండి గ్రహోద్భవం ఎట్లు జరిగిందో వివరించడానికిచేసిన ప్రయత్నమే ఇంతవరకున్న వాదాల లోపమని యురే అభిప్రాయం. కాని, సూర్యుడెట్లేర్పడ్డాడో నిర్ణయించడానికే ప్రయత్నించి

నప్పుడు గ్రహాలుగా ఏర్పడిన ద్రవ్యభాగం ఎట్లు మిగిలిపోయిందో ఊహించడానికి సులభమౌతుంది.

సౌర కుటుంబోత్పత్తిని సహేతుకంగా వివరించడానికి ప్రయత్నించే ఏ సిద్ధాంతంలోనైనా అంతర్భ్రమణం చేస్తున్న సూర్యునిలోను, సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్న గ్రహాలలోను నున్న భ్రమణ జన్యద్రవ్యవేగాన్ని (*Angular Momentum*) గమనించాలి. ఒక గ్రహంయొక్క ద్రవ్యరాశిని దానివేగంతోను, సూర్యునినుండి దానిదూరంతోను గుణించగా దాని భ్రమణజన్యద్రవ్యవేగం లభిస్తుంది. సౌరకుటుంబపు భ్రమణ జన్య ద్రవ్యవేగంలో నూటికి రెండు వంతులుమాత్రమే సూర్యునిలోనుంది; ఎక్కువభాగం గురుగ్రహంలో నుంది.

సూర్యవాతావరణంలోను, ఇతర నక్షత్రాల వాతావరణాలలోను గల మూలతత్వాల అనుపాత (*Proportion*)లకు విశిష్టసంబంధముందని అమెరికన్ విజ్ఞానవేత్తలు 15 సంవత్సరాల క్రితమే సూచించేరు. విద్యుద్వర్ణదీపాలలో వినియోగపడు నియాన్ అను మూలతత్వం భూవాతావరణంలో అత్యల్పంగాను, నక్షత్రవాతావరణాలలో సాపేక్షంగా అధికంగాను గలదనుట గమనింపదగ్గవిషయం. ఏ మూలతత్వంతోను నియాను సంయోగింపదు. అట్టి నియాను, భూవాతావరణమందలి ఇతర బాష్పశీల (*Volatile*) పదార్థాలతోసహా భూమి మహోజ్వలంగా మండుచుండిన ప్రాథమికదశలోనే భూమినుండి పలాయనమొందినదని వారునిర్ణయించేరు. భూగర్భంనుండి పలాయనమొందిన నత్రజని, కర్బనము, నీరుచేతనే నేటి వాతావరణమును సముద్రాలును ఏర్పడ్డాయని వారి వాదము. రేడియో ధార్మిక పొటాసియం విచ్ఛిన్నమైనప్పుడు కడచిన అత్యధికకాలంలో ఆర్గాను విడివడి భూగర్భంనుండి పైకి వచ్చినదని, అదే కొలది మాత్రం మన వాతావరణంలోనున్నదని జర్మన్ విజ్ఞాని వైజ్ సేకర్ భావిస్తున్నాడు. మిగిలిన మందవాయువులైన క్రిప్టాను క్సెనానులు భూమిలో పూర్తిగా లోపించాయి.

ఈవిధంగా కొన్ని మూలతత్వాలు లోపించడానికి కారణమేమౌతుందా అని యురే యోచించేరు. ఈ లోపించినపదార్థాలు భూమినుండి ఎప్పుడు ఏవిధంగా పలాయన మొందేయన్నదే పెద్ద ప్రశ్న. భూమి ఘనీభవించినతరువాత ఈ మూలతత్వాలు భూమినుండి పలాయనమొందడాని కవకాశం లేదు; భూచరిత్రలో తత్పూర్వమే అది సంభవించియుండాలి. ఏమంటే, భూమిగోళ ఆకారం ఏర్పడిన తరువాత దాని గురుత్వాకర్షణ బలం ఏవాయువుని పైకి పోనీయకుండా బంధించేటంత బలవత్తరమౌతుంది. లేకపోతే, భూమికి వాతావరణమే లేకపోయేది. అయితే భూగోళపు శైశవ ప్రాయంలోనే బాష్పశీల వాయువులు భూమినుండి ఎగిరిపోయియుంటే, ఇప్పటికింకా కొద్దిపరిమాణంలోనున్న వాయువు లెట్లు జనించెయి? మందవాయువైన నియానుతోపాటు నీటి ఆవిరి కూడా భూగోళాన్ని విడిచియుండవలసిందే! కాని, సముద్రరూపంలో నీరు భూతలాన్ని నాలింట మూడు వంతులు వ్యాప్తమై యుంది; మహాసముద్రాలుగా ఏర్పడింది. దీనికొక్క కారణం లేకపోలేదు. అది నీటియొక్క రాసాయనిక గుణం. అల్పతాపక్రమాలలో నీరు బాష్పశీలసంయోగాలు పొందదు. ఇప్పటికంటె పూర్వం ఒకప్పుడు చల్లగానుండినప్పటికీ క్రిందిపొరలలో కొంత నీరు బంధింపబడి యుండవచ్చును; తరువాత ఆనీరు పైకివచ్చి సముద్రాలుగా రూపొంది యుండవచ్చును. ఈవాదానికి విప్రతిపత్తి లేకపోలేదు. ఉల్కలలో గ్రాఫైటు, ఐరన్ కార్బైడు అధికంగా నున్నాయి. అవి ఏర్పడడానికి విశేష తాపక్రమ మవసరం. భూశుక్రాది గ్రహాలు చల్లగానుండిన పక్షంలో ఈ రాసాయనికయోగికా లెట్లేర్పడ్డాయి?

అయితే, గ్రహాలు ఏ ప్రక్రియ ఫలితంగా ఏర్పడ్డాయి? దానిని చూచినవా రెవ్వరు లేరు. ఊహించిమాత్రమే ఒకపథకాన్ని నిర్ణయించాలి. కాని, ప్రస్తుత భౌతికశాస్త్రాలకు, ఉపచితజ్ఞానానికి ఆ ఊహాపథకం వ్యతిరేకంగా నుండకూడదు. విరళమేఘంగా ప్రారంభమై గ్రహాలుగా పరిణామమొందిన ధూళిమేఘచరిత్రలో వివిధఘట్టాలను సునిశిత గణిత పద్ధతులచే నిర్ణయించగల అవకాశమింకా లేదని యురే భావిస్తున్నాడు. అది సాధ్యంకానప్పుడు గ్రహోద్భవ చరిత్రలో ఇది ఒప్పు ఇది తప్పు అని కచ్చితంగా చెప్పడానికికూడా వీలులేదు. అయితే, వివరణ క్రమంలో ఏది సంభవనీయం, ఏది అసంభవనీయం అన్నదిమాత్రం కొంత నికరంగా తేల్చవచ్చును.

ధూళిగాను వాయువులుగాను ఆదిలో విరళమేఘాకృతినున్న ద్రవ్యం రెండు భాగాలుగా విడిపోయిందని, అందొకదానినుండి సూర్యుడు, రెండవ దానినుండి ఎట్టకేలకు గ్రహాలు ఏర్పడ్డాయని విజ్ఞాని కుయిపర్ భావిస్తున్నాడు. భూ బుధ శుక్ర కుజ గ్రహాలు వాటి వాయువులను పోగొట్టుకొన్నాయి; బృహత్ గ్రహాలైన శని గురులను వాయువు లాశ్రయించే ఉన్నాయి. అతి బాష్పశీల వాయువులైన

ఉదజని హీలియములు సైతం వాటిలోనున్నాయి. యురేనసు నెప్ట్యూనులనుండి ఉదజని, హీలియం, మిథేను, నియానులు చాలవరకు పలాయన మొందగా, వాటిలో నీరు అమోనియావంటి పదార్థాలు కొన్ని మిగిలి ఉన్నాయి. గ్రహాల సాంద్రతలకు ఈ భావం అనుగుణంగానే ఉంది.

ఈ మూలభూత గ్రహాల (*Proto Planets*) లో నీరు, అమోనియా, మిథేను మొదలైనవి ద్రవ రూపంలోనో ఘనరూపంలోనో అక్కడక్కడ సాంద్రీకరించి యుండవచ్చును. ఇప్పటి గ్రహాంతరాళాలంత విశాలప్రదేశాలలో వ్యాపించియున్న ధూళి హిమఝంఝూరూపంలో ఘనీభవించి యుండవచ్చును. కొంత కాలం తరువాత, నీరు, అమోనియా, హైడ్రోకార్బనులు, ఇనుము కలిగిన పెద్ద ద్రవ్యఖండా లేర్పడ్డాయి అవే గ్రహశకలాలు (*Planetesimals*). వీటిలో కొన్ని చంద్రగోళమంత పరిమాణంగలవై యుండాలి; చంద్రగోళ మీ విధంగానే ఏర్పడియుండవచ్చును. చంద్రగోళమంత ద్రవ్యఖండ మేర్పడినప్పుడు దానిలో నున్న బాష్పశీల పదార్థాలన్నీ బాష్పీభవించే టంతటి వేడి జనిస్తుంది. అంతకంటె చిన్న గోళాలలో మాత్రం బాష్పీభవనం సంభవించదు. కాని, ఇట్లేర్పడిన చిన్న ఖండాలు పెద్ద గోళాలలో పడి వాటితో కలిసిపోతాయి. కుజుని చుట్టు తిరుగుచున్న ఉపగ్రహాలగు డైమాసు ఫోబాసులు రెండును ఇట్లేర్పడ్డ చిన్న ఖండాలే కావచ్చు; అవి ఏదో కారణంచేత కుజునితో పడకుండా, ఉపగ్రహాలై, కుజ ప్రదక్షిణాలు చేస్తున్నాయి.

ఈ ప్రక్రియలో బృహత్పరిమాణంగల ఇనప శకలా లేర్పడియుండాలి. చంద్రతలంపై "మేర్ ఇంబ్రియం" అను విశాల ప్రదేశముంది. అది పర్వతాలచే ఆవరింపబడింది. వాటినిండా పొడవైన నెరదలున్నాయి. ఈ భాగమంతా సుమారు 60 మైళ్ళ నిడివిగల వస్తువు మహావేగంతో చంద్రునిపై పడటం వల్ల ఏర్పడి యుండవచ్చునని కొందరు విజ్ఞాను లభిప్రాయ పడుచున్నారు. పతనవస్తువులో వాడి కొనలు దేరి దృఢమైన ఇనుము—నికెల్ లోహమిశ్రముండాలని, దానిమూలంగానే నెరదలేర్పడ్డాయని వారి ఉద్దేశం. గ్రహాంతరాళంలో ఇప్పటికిని ఇనుముతో కూడిన ద్రవ్యశకలాలు సంచరిస్తూంటాయి. అవి మన వాతావరణంలో జారబడినప్పుడు సామాన్యంగా భస్మమై మాయమౌతాయి. అవే ఉల్కలు. పెద్ద ఖండమైతే భస్మంకాగా మిగిలి భూతలాన్ని చేరుకొంటుంది. అది ఉల్కకం (*meteorite*).

ప్రాథమిక ధూళిమేఘపు సూక్ష్మకణాలతో ఇట్టి లోహఖండా లెట్లేర్పడ్డాయి? గ్రహశకలాలలో ధూళితోపాటు వాయువులు, ముఖ్యంగా ఉదజని, ఉండేవి. గ్రహశకలాలు సంకోచించినప్పుడు అందలి వాయువుల సంపీడనానికి తాపక్రమం బాగా హెచ్చి, సిలికేట్లు కరగిపోయేయి. ఆ అధిక తాపక్రమంలో ఐరన్ ఆక్సైడ్‌తో ఉదజని సంయోగించి, దానిని ఇనుముగా మార్చింది. ఇట్లేర్పడి ద్రవంగానున్న ఇనుము పై పొరలందలి సిలికేట్లలోనుండి భూగర్భంలోనికి క్రుంగింది.

గ్రహోద్భవ చరిత్రలో ఈఘట్టమందు గ్రహశకలాల నావరించిన వాయువులు పైకెగిరిపోయేయి. అది సూర్యకాంతి పీడనంచే వాటిల్లి యుండవచ్చునని కుయిపర్ అభిప్రాయం. వాయువులు పోగా మిగిలిన ద్రవ్యశకలాలలో ఇనుము అధికంగానుంది. అవే భూ శుక్రాది గ్రహాలయినాయి.

కొన్ని గ్రహాల సాంద్రతలను ఈ మధ్యనే యురే నికరంగా గణించేడు. వాటి విలువలు :

బుధుడు—5.0 ; శుక్రుడు—4.4;
భూమి—4.4 ; కుజుడు—3.96;
చంద్రుడు = 3.31

పై గ్రహాలలో నున్న ఇనుము పరిమాణంలోని భేదాలనుబట్టి ఈ వ్యత్యాసాలు కలిగియుండవచ్చునని చెప్పవచ్చును. గ్రహాలనుండి ఊర్ధ్వీకరించిన సిలికేట్ల వేర్వేరు పరిమాణాలు కూడా వీటికి కారణం కావచ్చును. ఏమంటే, సాపేక్షంగా ఎక్కువ సిలికేటు పోయిన గ్రహంలో ఎక్కువ ఇనుము మిగిలి ఉంటుంది.

భూమి జన్మించినప్పుడు సలసల మరుగుతున్న ద్రవంగా నుండేదనిన్ని, అది చల్లారినప్పుడు భూపటలంనుండి క్రింది పొరలలోనికి ఇనుము దిగబడిందనిన్ని కొందరు విజ్ఞాను లూహిస్తున్నారు. అయితే, ఈ భావంకూడా, సూర్యునినుండి భూమి విడివడిందని, భూమినుండి చంద్రుడు జన్మించేడని ప్రచారంలో నున్న అభిప్రాయాలవలె సబబైనవి కావు. జన్మించినప్పుడు భూమి ద్రవంగా లేదనడానికే నిదర్శనా లెక్కువ ఉన్నాయి. ఆదిని ద్రవరూపంలోనే భూమి ఉండినట్లయితే దానిపై పొరలలో సిలికేట్లు ఎక్కువగను, ఇనుము తక్కువగను ఉండడానికే అవకాశముంది.

ఇంకొక విశేషం. కొన్ని విషయాలలో భూమిని పోలియుండవలసిన కుజగ్రహంలో సుమారు

మూడవవంతు బరువుగల ఇనుము నికెలు లోహాలున్నాయి. కాని, ఖగోళశాస్త్ర పరిశోధనలవల్ల దాని రాసాయనిక రచన సమపాళంగా నున్నట్లు తెలియవచ్చింది. అదే నిజమైతే, కుజగ్రహం ఎన్నడూను ద్రవస్థితిలో ఉండిఉండలేదు. చంద్రగోళం ఘనీభవిస్తూన్న సమయంలో దానిపై నికెలు ఇనుము గల ద్రవ్యఖండాలు పడ్డాయి; అందుచేతనే చంద్రబింబంపై మచ్చలేర్పడ్డాయి. అట్టి నికెలు ఇనుముగల లోహఖండాలే భూతలంపై కూడ పడియుండవచ్చును. అందుచేత, భూమి ద్రవస్థితిలో లేనప్పటికి, పైవిధంగా కొంత ఇనుము నికెలు లోహఖండాలు భూ పటలంపై నుండడాని కవకాశముంది.

భూ పటలంలో ఇనుము ఉన్నట్లయితే అది భూ కేంద్రంవైపు జరుగుచుండ వచ్చును. అదట్లు జరుగుచున్న పక్షంలో దానిమూలంగా భూమియొక్క భ్రమణ భారం (*monent of inertia*) మారుతుంది. భూమిలో నున్న ప్రతికణపు ద్రవ్యరాశిని భ్రమణాక్షానికి గల దూరంయొక్క వర్గంచే గుణించి, అట్లు వచ్చిన ఫలితాలను మొత్తం చేయగా భూ భ్రమణ భారం సిద్ధిస్తుంది. భూమిలోని ఇనుము కేంద్రముఖంగా గమిస్తుంటే దానివలన భ్రమణ భారం తగ్గుతుంది. యంత్రశాస్త్ర నియమాలప్రకారం ఆత్మభ్రమణం చేస్తూన్న వస్తువుయొక్క భ్రమణభారం తగ్గినప్పుడు, దాని భ్రమణవేగం ఎక్కువకావాలి; అంటే, తన అక్షంపై భూమి ఎక్కువవేగంతో భ్రమించాలి. భూమియొక్క ఆత్మభ్రమణవేగం హెచ్చితే మన దిన ప్రమాణం—భూమి ఒక ఆత్మభ్రమణానికి పట్టు కాలం—తక్కువ కావాలి.

మన దిన ప్రమాణం మారుతూంది. కాని, తగ్గడానికి బదులు కొద్దిగా అధికమౌతూంది. 2500 సంవత్సరాల పూర్వం సంభవించిన గ్రహణాలకు సంబంధించిన నిర్దిష్టఖగోళ శాస్త్రపరిశోధనలు శతాబ్దానికి రోజుకి 1/2000 లేక 2/2000 సెకను చొప్పున దిన ప్రమాణం పెరుగుతూందని సూచిస్తున్నాయి. సూర్యచంద్రులవల్ల సముద్రాలలో కలుగు పెద్ద కెరటాల సంఘర్షణమూలంగా దిన ప్రమాణం హెచ్చుతూందేమో అను సందేహం కలుగకపోలేదు. కాని, చంద్రునియొక్క అభివ్యక్తస్థానంలో ఈ ఫలితమొక్క దానివల్ల కలుగు మార్పులను గణించగా, గణితానికి పరిశీలనలకు సమన్వయం కుదురలేదు. భూమిలోనికి ఇనుము క్రుంగుతూందని అంగీకరించి, దానిమూలంగా భూభ్రమణ భారంలో కలుగు మార్పువల్ల దినప్రమాణం సైతం మారుతుందన్న విషయాన్ని గమనించినట్లయితే, కెరటాల సంఘర్షణచే పెరిగే దిన ప్రమాణం, భ్రమణ భారం మారుటచే తరిగే దిన ప్రమాణం: ఈ రెండింటి సంయుక్త ఫలాన్ని గణించగా, అది పరిశీలిత ఫలంతో సరిపోయింది.

అయితే, ఇట్టి సమన్వయం కుదరాలంటే భూ పటలంలోనికి సెకనుకి 50,000 టన్నుల ఇనుము క్రుంగుచున్నట్లు భావించాలి. ఇది ఆశ్చర్యకరంగా కనిపించినప్పటికి, ఈవిధంగా లోహపటలం ఏర్పడడానికి 50 కోట్ల సంవత్సరాలౌతుంది. మరికొన్ని పద్ధతులచేత గణించగా 200 కోట్ల యేండ్లనికూడ ఫలితం వస్తుంది. భూమి వయస్సు 200 కోట్ల లేక 300 కోట్ల యేండ్లుంటుందని విజ్ఞానలోక మంగీకరిస్తూంది. పై వాదంవల్ల నిర్ణయమైన భూమి ప్రాయం అంగీకృత వయస్సునకు దగ్గరగానే ఉంది. పై వాదమే నిజమైతే తొలిసారిగా భూమి ఏర్పడినప్పుడు, దానిపై పొరలలో ఇనుముండేది. అంటే, లేబ్రాయంలో కూడ భూమి మరుగుతున్న స్థితిలోనుండి అనడాని కవకాశం లేదు.

సముద్రాలలో నీరు గ్రీన్‌లాండు, అంటార్కికాలలోని మంచుకొండలవైపు మెల్లమెల్లగా జరుగుతూందని, అందుచేత భూమియొక్క భ్రమణభారం తగ్గుతూందని కొందరు సముద్రశాస్త్రప్రవీణులు ప్రతిపాదించేరు. అది నిజమైతే, ఇనుము భూగర్భంలోనికి క్రుంగుతూందన్న వాదానికి స్థానంలేదు. ఈ రెండు



చిత్రం 3. సౌరమండలంగా పరిణామమొందిన ధూళిమేఘం ఈప్రకారంగా సంకులాకారం ధరించియుండవచ్చును. ప్రతి ఆవర్తంలోని ధూళి క్రమంగా గట్టిపడింది.

వాదాలలో ఏది యథార్థమో నిర్ణయించడానికి మరి కొన్ని ప్రయోగాలవసరమని యురే అభిప్రాయం.

గ్రహోత్పత్తి క్రమం ఎట్లుండి యుండవచ్చునో ఇప్పుడు సమీక్షిద్దాము. మన గెలాక్సీలో ఒక శూన్య ప్రదేశమందుండిన వాయు ధూళి సమ్మిళిత ద్రవ్య మేఘం పరిసర నక్షత్ర కాంతిచే సంపీడింపబడింది. సంపీడిత ద్రవ్యంలో గురుత్వాకర్షణ బలాలు ప్రబలి, సంపీడనాన్ని వేగీకరించేయి. ఇప్పటి కింకా సువ్యక్తంగాని ఒకానొక విధంగా సూర్యగోళ మేర్పడి కాంత్యుష్ణ ప్రసార మారంభించింది. ధూళి వాయు యుత ద్రవ్యమేఘం సూర్యునిచుట్టూ పరిభ్రమిస్తూ, కల్లోలిత ఆవర్తాలుగా కునియలై, ఆ వర్తాని కొక కేంద్రకం ఏర్పడింది (చిత్రం 3.) అవి గ్రహ శకలాలుగా నుండేవి. అట్టిస్థితిలో నీరు అమోనియా ద్రవీభవించడంచేత పెద్ద పెద్ద గ్రహ శకలాలేర్పడ్డాయి. వాటిలో నొకటి చంద్రగోళమయింది. అంతకంటె పెద్దవి చేరి భూగోళంగా ఏర్పడ్డాయి. అట్లే బుధ శుక్రాది గ్రహాలను జనించేయి. ఆదిని ఈ గ్రహ శకలాల తాపక్రమం తక్కువగా నుండేది; కొంతకాలాని కది హెచ్చి ఇనుము కరగేస్థితిని చేరుకొంది. అల్పతాపక్రమస్థితిలో వీటియందు నీరు పుష్కలంగా చేరింది; అధిక తాపక్రమావస్థలో ఐరన్ కార్బైడ్ గాను, గ్రాఫైటుగాను కర్బనం బంధింపబడింది. గ్రహ శకలాల నావరించియున్న వాయువులు సూర్య కాంతిపీడనంచే నెట్టివేయబడగా (చిత్రం 4,) శకలాలు సంఘాతమొంది గ్రహాలేర్పడ్డాయి— (చిత్రాలు 5, 6.) గ్రహోద్భవక్రమం ఈవిధంగా సాగియుండ వచ్చును.

అయితే, అప్పటినుండి ఏమిజరిగింది? ఎన్నెన్నో




చిత్రం 5, గ్రహ శకలాలనుండి వాయువు పూర్తిగా తీసి వేయ బడినది.

చిత్రం 6. గ్రహశకలాలు గ్రహాలు గా ఏర్పడినవి.

చిత్రం 4. ప్రాథమిక ధూళిమేఘం సూక్ష్మ గ్రహశకలాలుగా చేరినప్పుడు. వాటితో ఏర్పడిన వాయువులు సూర్యరశ్మి పీడనంచే నెట్టబడుట.

మార్పులు సంభవించేయి. కాని, వాటిలో ముఖ్యమైనది భూమియొక్క వాతావరణ పరిణామం. ఒక ఘనగోళంగా భూమి ఏర్పడినప్పుడు భూ వాతావరణంలో నీటి ఆవిరి, నత్రజని, మిథేను, ఉదజని, స్వల్పంగా మరికొన్ని వాయువులు ఉండియుండవచ్చును. భూమినుండి ఉదజని పలాయన మొందడం వల్ల వాతావరణానికి ఆమ్లీకరణగుణం లభించింది. మిథేను, అమోనియాలలోని ఉదజని మెల్లగా పైకి పోగా నత్రజని, ఆమ్లజని, నీరు, కర్బనద్వి ఆమ్లజని మిగిలిపోయేయి. కాని, ఆమ్లజని అణువులకు ముందుగానే ఉదజని, కర్బనము, నత్రజని, ఆమ్లజని గల అనేక పదార్థాలేర్పడి ఉండాలి. క్రమంగా జీవముద్భవించింది. కర్బనద్వి ఆమ్లజనిని నీటిని వృక్షసంతతి ఆహారపదార్థాలలోనికి మార్చు ప్రకాశ జన్యసంయోగ (*Photo synthesis*) మనే మూలప్రక్రియ ప్రారంభమైంది. ఉదజనిలో చాలభాగం ఆమ్లజనితో సంయోగించి నీరు ఏర్పడగా, నత్రజని మిక్కుటంగాను, కొద్దిపాటి ఆమ్లజని వాతావరణంలో మిగిలిపోయేయి. మన వాతావరణం నేటికీ భౌతికంగాను రాసాయనికంగాను పరిణామ మొందుతూనే ఉంది.





# 'స్వర్గాదపి-'



శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

వారంరోజులు అప్పృతమనసం అంతపని జరిగింది. నరంనరం, కీలుకీలూ, రక్తకణంకణం ప్రాణాలు తోడింది. తల సరేసరి. ఎట్టకేలకు — కాంతయ్య తల — చిట్లింది! విషం ముందుపుట్టి, అమృతం ఆపైని ఆవిర్భవించినట్లు — దుర్భరమైన యాతనవివాక, సహస్రారంనుంచి హంస లేచింది. కాంతయ్యకు ముక్తి కలిగింది.

రోదసీ అంతా నిండిన తైజసపరమాణువులలో కాంతయ్య ఒకడు: విజంఝా ప్రభంజనానికి అరిపోని, నివాతనిష్కంప ప్రదీపమువలె కాంతయ్య ఆత్మ మాపు లేని మాపులతో తన శరీరాన్ని చూచింది!

తనకోసం ఏడుస్తున్న దారాపుత్రాదులు "లాంధనాన్ని" నిర్వర్తిస్తుంటే — కాంతయ్య నవ్వు ఆపుకొన్నాడు! మనవాడు పాత అంగీను విడిచి సుఖపడబోతున్నాడు అని సంతోషించరేం? అని అనుకున్నాడు కాంతయ్య.

చైతన్యం, కదిలింది.

మబ్బులు, దల్లదనం పులకించేటి మబ్బులు, తన భ్రుకుటిదగ్గర మెరిసిన ఇంద్రధనుస్సును పుణికి పుచ్చుకున్నట్లున్న ఇంద్రధనుస్సు, తేజోమేఘాలు, తేజోమండలాలు, పాలవెల్లి, ఒక టేమిటి — తారలు గ్రహాలు ఒకటొకటే వస్తున్నై. జారుకుంటున్నై.

"ఓహూ! ఏం ఇదిగా వుందీ — అనుకుంది కాంతయ్య.

"మరేమిటనుకున్నావ్ —"

"ఎవరునాయనా నువ్వు" లీలగా కనిపిస్తున్నావ్. అంతకంటె తెలుస్తున్నావు!

"నీవంటివాణ్ణి."

"పాపం, కాంతం ఒంటరివాడౌతున్నాడని, దయతో తోడువస్తున్నావన్నమాట. కృతజ్ఞుణ్ణి."

"యింకా పాతవాసనలు పోలేదు కాబోలు!"

కాంతయ్య ఏదో చెప్పబోయి ఊరుకున్నాడు!

"ఏం అల్లా వున్నారు..."

"నీ అధీనుణ్ణి—"

ఆగంతుకుడు మందహాసం చేశాడు. కాంతయ్య డిల్లపోయాడు. బెజవాడలో, నడివేసంకాలం అర్ధరాత్రి — మేడమీద మంచుని సుబ్బులు నవ్వింది అలాగు. అంత హాంతికైన నవ్వు మళ్ళీ!!

"రండి. స్వర్గానికి పోతున్నాం—"

"నాలాంటి క్షుద్రులకు గూడానా బాబూ, స్వర్గం ...? ఎంత పుణ్యమో చేసుకొన్నవారికి గాని—"

ఆగంతుకుడు మాట్లాడలేదు.

"నాయనా! ఒక్కమాటచెప్పు ... చిన్నప్పటి నుంచీ వినివిని ఉన్న స్వర్గానికి పోతున్నానా ..., నిజం...??"

"ఆ"

"బాబూ. క్షమించు. అడగాలని అనుకునీ ఆగిపోతున్నాను. నీ పేరు?"

"ఒక ప్రాణిని ఎలా పిలిచినా పలుకుతాను"

"అవునవును. సముద్రాన్ని చేరాక, నదులకు వేరే పేరేముంటుందిలే—"

"వచ్చేశాము"

"వచ్చేశాం ఎంతకాలానికి! జారూ బరవా లేనిది; ఎండా వానా లేనిది; ఆకలీ దప్పికా లేనిది—"

"భయంలేనిది! భూమ్మీద భయమే. మరేమీ వుండదు. ఇక్కడ ఆ భయం అంటూ వుంటేనే వుండదు — ఇక్కడ మీకు యుద్ధేచ్ఛ, ఒకరు ఒకర్ని హింసిస్తారన్నది లేదు. పోటీలేదు. వివాదలేదు: సరి. అన్నీ మీకే తెలుస్తయ్. నేను పోతున్నాను"

అవునవును. మీకు ఎన్నో పన్లుంటై. నాకోసం చాలా శ్రమతీసుకొన్నారు. కృతజ్ఞుణ్ణి"

ఆగంతకుడు మరోసారి మందహాసంచేసి వెళ్ళిపోయాడు. మనస్సుకు వైకుంఠంతోపాటు భయమూ

వెన్నెలాటి సౌందర్యసీమలో తిరుగుతున్నాడు కాంతయ్య. అంతా కాంతి. అంతా అపురూపం. ఎటులో కాంతయ్య ఎన్నాళ్ళ ఓమాపు తెగిలింది.

"సౌధరీ! సౌధరీ!!"

ఆపిలుపులో, ఏంత ప్రశాంతమైన ఆర్తం!

"పునర్వసూ! వస్తున్నా!"

కాంతయ్య చెవులు మూసుకొన్నాడు. చెవుల్లో నినదించింది. పుష్పశయ్యలు, మధురకంఠాలు, చిత్రమైన మహోజ్జ్వల రూపాలు — ఎలుగెత్తి నానికుల్ని పిలిచిన పౌరాణిక ప్రకృతులు గుర్తుకొచ్చారు.

"పునర్వసూ! ఇక్కడ—ఇక్కడ—"

సౌధరి పిలుస్తోంది.

తన నాయికుల చెవులు మూసి, తనను గుంజకు కట్టేయించుకొన్నాడట యులిసెస్. అంత మహాయోధా గూడా, ఆ పౌరాణిక ప్రకృతుల గాంధర్వానికి, ఆగలేక గింజుకొన్నాడట!

ఆ పుష్పశయ్యలు గుర్తుకొచ్చినై, కాంతయ్యకు.

—పునర్వసు వచ్చాడు.

సౌధరిని కౌగలించాడు.

కాంతయ్య సిగ్గుపడి తల తిప్పుకొన్నాడు.

సౌధరీ పునర్వసూ అలా వెళిపోయారు.

కాంతయ్య గుండెలలో దేవినట్లు అయింది — అప్రయత్నంగా తనూ అటుగేసి కదిలాడు. నిగ్రహించుకొన్నాడు.

భుక్తరోగం అయినా, అదే కావాలని తపించే మనస్సు విసుస్తుంది. ఆ మారాముశిశ్వ తనకు తెలుసు!

యింతలో పునర్వసూ సౌధరీ యిటె వస్తున్నారు.

"నీవు మందాకినీతీరం అంటున్నావా సౌధరీ. నేను హాహాహూహూల గాంధర్వం విందాం అనుకున్నాను. ఏదైతే నేం—"

"మందాకినీ, శివశిరస్సుపైని నడివెన్నెల— పోనీ, నీయిష్టం పునర్వసూ!"

కాంతయ్య వాళ్ల వెంట పడ్డాడు. ఆకలికాని ఆకలి, తృష్ణకాని తృష్ణ. విదాహం వెంటాడుతోంది.

"జిజ్ఞాసమాపు వెంటాడుతోంది!" సౌధరి.

"కొత్తకాబోలు!"

కాంతయ్య ఆపుకోలేకపోయాడు. "సౌధరీ! సౌధరిగారూ!" సౌధరి ఆగింది. పునర్వసు ముందుకు వెళుతూనే వున్నాడు.

"సౌధరిగారూ మిమ్ము చూడాలని, సౌధరీ! నీతో మాట్లాడాలని నిన్ను తృప్తిగా చూడాలని— నిన్ను—నిన్ను—"

సౌధరి పకపకా నవ్వింది. "ప్రేమించావన్న మాట!" అంది.

కాంతయ్య గిలగిలలాడాడు.

సౌధరి కనుబొమల్ని దగ్గిరికిలాక్కుంది.

"నిన్ను చూస్తూంటే, నీతో మాట్లాడుతుంటే, నిన్ను సౌధరీ అని పిలుస్తూంటే — నీ పేరు నానోటి విందుగా వస్తూంటే — —"

"నేను కావాలి అంటావు!"

కాంతయ్య తెల్లబోయాడు.

"నాకు యిష్టం లేదు. కొత్తవాడివని ఓపికగా చెప్పాను"

సౌధరి వెళ్ళింది.

గిలగిలలాడి, తోకతెగాక, వల్లికళ్ళపాములాగ, కాంతయ్య నడకసాగించాడు మరోవైపు!!

* * *

కల్యాణ సింధువు మహారాజులబిడ్డ. సుకుమారి ఏదో లోకంనుంచి దిగివచ్చినవాడిలాగా వుంటాడు. అధికారం చేతిలోకి వచ్చింది. ఆత్మ వికసించింది.

పంకాకింద కూచునివున్నాడు కల్యాణం. చేత పుస్తకం.

"అ-బ్బ. ఏం దాహం!" అనుకున్నాడాయన.

చంపకం, చల్లనిపానీయం తెచ్చింది. కల్యాణం కన్నెత్తిచూచాడు. ఎన్నిసార్లు చూడలేదు? ప్రౌఢ శిల్పివాక్యవిన్యాసంలోని భావంలాగ మెరుస్తోంది చంపకం. తను ఇంకా పానీయం అని అనుకోనన్నా లేదే. చంపకం ఎలాగ అర్థం చేసుకుందీ? పానీయం తయారుచేసిందీ? తెచ్చిందీ. ప్రేమవుంటే అన్నీ తెలుస్తయ్.

"నుంచున్నావేం, కూచో—"

చంపకం అలాగే నుంచుంది.

"కూచో చంపకం!"

"నేను కూచోరాదు ప్రభూ. ఇలా వుండడమే నాకు శోభ"

దాసీదాన్నని చంపకం హస్తాలలోనే ఇమిడింది.

"ఎక్కువ తక్కువలు వృథావృథా చంపకం. కనీసం, నాదగ్గర అవి వృథా"

చంపకం దోహాను ఐమిలి మింగినట్టుంది.

"ఏమిటో అనబోయి ఆగావు. మనసులో మాట చెప్పడానికేం—! చెప్పు చంపకం!"

"దగ్గిరికి తీసేప్పుడు అందరూ అనేమాటేగదా అనుకుంటున్నా. పానీయం తాగండి ప్రభూ. ఎండ మండిపోతోంది."

"నువ్వు కూడా—"

"తప్పుతప్పు"

"తప్పు ఒప్పులతోటే బతుకు పండిపోతోందిలే. ఆ, రా. రా." చంపకం కొయ్యబొమ్మ.

"మర్మం విడిచి చెప్పు చంపకం! ఏంసుఖం చూచుకుని బ్రతకడం! నువ్వు అనుకొనేది చెప్పు చంపకం!"

"ఎప్పుడో ఒకప్పుడు చచ్చిపోతాం. ఆపైన ఏబరువూవుండదు. ఇంతకన్న మరేం సంతృప్తికావాలి ప్రభూ! చల్లనితల్లి—చావమ్మవారు. ఆ చల్లనితల్లి, ప్రశాంతమైన ముఖంతో తల్లి కూతుర్ని పుట్టింటికి తీసుకువెళ్లడానికి వచ్చినట్లు వస్తుంది. జాలిగా శిరస్సుపై చెయ్యివేస్తుంది. కళ్లనీళ్లు తుడుస్తుంది. మారాం పట్టేపిల్లలకు, తల్లి, తాయిలం పెట్టినట్టుగా, ముద్దుగా, 'రా' అని తన ఒడిలోకి తీసుకొంటుంది. చాలు. ఇంతకంటె వేరే ఏంకావాలి ప్రభూ!

"అ-బ్బ!"

"అందరూ బొడ్డున మాణిక్యం పెట్టుకొని పుట్టరు. కాలంవల్ల అవసరాలు పెరుగుతై. అసలే మనుషులు కోరికలపుట్టలు ఏదీ చాలదు. ప్రతిరోజూ ఓపాము కాటు."

"జీవితాన్ని మనం మార్చుకోలేమా, చంపకం" చంపకం నవ్వింది.

ఏడ్పే వేళలో నవ్వు!

కల్యాణం కళవళ పడ్డాడు.

"చంపకం! దా. ఒక్కరికైనా సుఖం కల్పిస్తాను. చాలు"

"వద్దు ప్రభూ. నేను మగనాలిని. సంరక్షించబోయి హింసించకండి ప్రభూ! మీకు పుణ్యంవుంటుంది. మీ కాళ్లకు మ్రొక్కుతాను.

"నిన్ను నేను పెళ్ళాడుతానుచంపకం"

"ప్రభూ. మీరు మాడవవారు, ఈమాట నాతో అన్నవారిలో. ప్రేమమిథ్య. కామం సత్యం. తిపుకు తింటూ బయల్దేరాలెందుకు గానీండి ప్రభూ — ఆ పానీయం, ఎండకు వెచ్చబడుతుం దేమో"

"శే. జీవితం, ఎంతచిత్రం!"

* * *

కాంతయ్యకు స్వర్గం అంతా చిత్రంగా వుంది. అలుపులేదు. పిలుపులేదు. దాపరికంలేదు. అలానే పడిపోతున్నారు. నిత్యశ్రీ ఎదురైంది. "ఏంచేస్తున్నావేమిటి?" అంది.

ఎంత చనువు. గొంతికలో మార్దవం వుంది. తనతో ఏంపనో? అడిగాడు.

"నా పేరు నువ్వు అంటూంటే వినాలని వుంది."

సరిగ్గా యిదే అంది, మాణిక్యం, చిన్నప్పుడు! సన్నగా వుండేది. ఇది చక్క నేను అని ఎవరో అన్నారు, మాణిక్యాన్ని. రాజపుతానా చిత్రాలలోని రేఖాసౌందర్యం, మాణిక్యం అనుకున్నాడు తను.

"అతిథీ. ఆలోచనలో పడ్డావా? నేను ఏంచేస్తున్నా, నన్నే గమనించే నిన్ను చూడాలని. నిన్ను, నీకళ్లను, నీప్రాణాలను, ఆ ప్రాణవాంఛను—"

"పాపం. కాదంటే, కారాడిపోతావు. నాకు తెలుసు అబ్బా"

"ఇంత స్వల్పమైన విషయాలకు బాధ ఎందుకు అతిథీ. ఏవీ దాచుకోకుండా చెప్పు!"

"నేను పొత్తిరిని వాంఛించాను. పొత్తి తృణీకరించింది. మయసభలో మహారాజు దుర్యోధనుడిలాగా అవుతున్నా"

"వాడెవడు? ఎవడో. మందాకినీతీరానికి రారాదూ, పోదాం"

"పద వస్తాను నిత్యశ్రీ! నిత్యశ్రీ, ఇది చెప్పు. మనను, మన సున్నితమైన రహస్యవాంఛను చులకన చేస్తే, గాయంకాదూ గుండె—"

"అనుకోవడంలో వుంది. ఆ వాంఛే మన సర్వస్వమూ అనుకుంటే ఆరాటంకదూ మరి!"

"ఏమిటేమిటి—?"

"ఆటలో ఓడిపోతాం. దిగులుపడతామా? కాలుజారి కిందపడితే పరాభవం అనుకొంటారా. అంతా అనుకోటంలోవుంది. మనసంగతే చూడు. నేను నీకు ఇష్టంలేకపోతే"

"అంటే, హృదయానికి గాఢత్వం లేదు అన్నమాట!" అని కాంతయ్య ఆగాడు. "నేను మీయింటి

"కొడకన్నా రా!" అని బుగ్గమీద కొట్టిన మాణిక్యం, నమ్మించిన మాణిక్యం, తనను కాదని, సత్యనారాయణతో "అజంతా"కు పోయింది కులుక్కుంటూ. తను ఆనాడు ఏడ్చినదంతా చాదస్తమేనా?

నిత్యశ్రీ అనుకుంది.

"సౌధరికి ప్రేమలేదు అనుకుంటున్నావు కదూ!"

కాంతయ్య ఉలకలేదు పలకలేదు.

"సౌధరికీ ప్రేమవుంది"

ఇద్దరూ నడుస్తున్నారు.

"ఆకంఠంలో కాఠిన్యంవుంది మరి?" అన్నాడు.

"యిష్టం వుంటేనే కాఠిన్యం. నీకు నామీద లేదూ—నాకు తెలియదూ"

"భూమిమీద యిట్లా బాహాటంగా మాట్లాడకోరు. తప్పు!"

"అందుకే అక్కడికి వాళ్లు ప్రతిదానికీ భయపడి ఛస్తారు చంపేస్తారు. దా. ఇదే మందాకిని. ఆ వెన్నెల కైలాసవాసి, పరమేశ్వరుని శిరశ్చంద్రిక!"

"ఏంఅద్భుతం. చీకటే అన్నమాటే లేదుమీకు"

"మనకుఅను. అదుగో, మీ సౌధరి వస్తోంది"

"అనవసరం"

సౌధరి దగ్గరికే వచ్చేసింది. అందం, ఆనందం, కోయిల రెట్టించి కూసినట్లుగా వుంది.

"నాకు కావాలి మీమాట. ఇందాక ఏదో చెప్పబోయారు!" అంది సౌధరి.

"ఏమీ లేదులెండి. నేను అనలేదు; మీరు వినలేదు!"

"మీరు అనుకున్నారుగదూ. చెప్పండి"

"చెప్పటానికి ఏమీ లేదు!"

"ఇంతేగద. వెళ్ళివస్తాను!"

సౌధరి కదిలింది.

నిత్యశ్రీగూడా కదిలింది. "నేనూ వస్తాను!"

కాంతయ్య "అలాగే" అన్నాడు.

"వుండు! అనలేకపోయావు. 'నాకోసం వుండవూ' అంటే ఎంతఇదిగావుండేది. 'నాకోసం—' అని మొగాడు అర్థిస్తాంటే, ఆడదిఅనుభవించేఆనందం ...హో. వస్తున్నా"

నిత్యశ్రీ వెళ్ళిపోయింది. కాంతయ్య ఏమీ జరగనంతగా, మందాకినికేసి వెళ్ళాడు. నిర్మలమైన మందాకిని. కదలిక లేని, గంగ. స్నానం చేద్దాం అనుకున్నాడు. ధనురాకారమైన గంగను కాశీలో చూచి కాంతయ్య ఎప్పుడెప్పుడు స్నానంచేద్దామా అని తహతహలాడాడు. ఇప్పుడదిలేదు. తీరా దగ్గరికిపోయి నీళ్ళుచూచి, నిర్లిప్తుడై చక్కా వచ్చాడు. హెచ్చని తగ్గని వెన్నెలలో కాంతయ్య నడుస్తూ పోతున్నాడు!

* * *

కల్యాణసింధువుకు మెలుకువ వచ్చేసరికి జోరవెన్నెల. చిరలాగా వుంది ఆకాశం. ఎండిన గోరింటాకు చేతులు కడుక్కుని, చల్లులుతిని, ఆడపిల్లలు ఊయాల లూగుతున్నారు!

పాటలు పాడుతున్నారు.

పడుచుదనం కీకలతోంది.

కల్యాణ సింధువు కళ్లు పెద్దవిచేసుకొని మరీ చూచాడు.

శివలోకం తన స్వర్గం తనకు ప్రత్యక్షమైంది.

గబగబా అక్కడకు వెళ్లాడు.

అతన్ని చూసి అందరూ జడిశారు. ఉయ్యాలలాలు దిగి, పొదిగి, పొదిగి, నుంచున్నారు. చల్లగా జారుతున్నారు. ఒక పిల్ల చేయిపట్టుకొన్నాడు. ఆ పిల్ల గిజగిజ లాడింది. ఇందాక నుంచి జంకిన సైరోతులు ఫక్కున పగలబడ్డారు.

"ఏం వెళ్ళిపోతారేం?"

నిర్జీవ ప్రతిమలాగైంది ఆ పిల్ల.

"కలి మెలిసి మీతోపాటు ఉయ్యాల లూగాలని వస్తే—"

వెర్రాణ్ణి చూచినట్లు చూచారు. చెదిరిక్కిన పావురం—చెయి జార్చుకుంది. చిటికెలో అంతా శూన్యం. ఎక్కిరిస్తూ ఉయ్యాలలూ, దిగాలు పడి తానూ.

"అంద చందాలు తెలీని పాడుదేశం. ఏ కర్తో కాలితే గానీ—యిక్కడ పుట్టరు" అనుకుంటూ కల్యాణ సింధువు వెళ్ళిపోయాడు.

* * *

తన గదిముందు వరండాలో, మఖమల్ పరుపులపైని కల్యాణం పడుకున్నాడు. పైన ఆకాశం మధురంగా వుంది. కలవ పూవులాగ చందమామ. కింద మెరుస్తూ శుక్రుడు. శుక్రలోకం బహు బాగుంటుంది. అక్కడ చెట్లు సంగీతం పాడి నృత్యం చేస్తయ్. కొలవలు కవిత్వం చెప్తయ్. గాలి చిత్రాలు రచి

స్తుంది. ఇంత దూరానికి గూడా విప్పారి వెలుగుతున్నది శుక్రలోకం. కింద గురువు. ఇంకా కింద ఆ ఎర్రని పీకుగు కుజుడు. గుత్తులు గుత్తులు లాగున విరిసిన నక్షత్రాలు! తనివితీరా చూస్తున్నాడు. వెళ్లాలని వెర్రిగా వుంది. ఏంచేస్తాడు? చూచి సంతోషిస్తున్నాడు.

"నిద్రపట్టలేదా ప్రభూ!"

మందారమాల. మందారమాల దివ్యమూర్తి. ప్రేమను పిండేసే ఆ కళ్లు, వెలిగిన విద్యుద్దీపంవంటి ఆ చెక్కిళ్లు, చెక్కిట చిన్నినవ్వు, వంకుల్ని పండితుల్ని చేయగల దివ్యాగ్నికమైన ఆ ఆత్మ—! ఆమె పలకరిస్తే చాలు, పదిమెట్లు పైకెక్కాలన్న మాటే.

"నిద్రపట్టనే లేదా ప్రభూ!"

కల్యాణ సింధువు నిట్టూర్చాడు. "బహు పరిచితాలయిన దేశాలను బహుదూరం నుంచి చూస్తున్నాను, మందారం."

"ఎప్పుడూ మీ కిదో ఘోష. ప్రాణాలన్నీ ఎక్కడో పెట్టుకునివుంటారు మర్చిపోండి ప్రభూ!"

"మరుపు లేదు నాకు. ఇదుగో, ఆ మెరుపు వంపు చూడు, అక్కడ, ఓసారి ఏంజరిగిం దనుకున్నావు!"

"మర్చిపోండి ప్రభూ. దైవం ఇచ్చిన ఒక్క వరాన్నీ కాదంటే ఎలాగ. మరపుపెట్టి, మనుష్యులను కాపాడాడు దైవం!"

"మందారం—"

తన బుజాన చెయ్యిపడుతున్న దనుకుంది మందారం. కల్యాణం విగ్రహించుకొన్నాడు. మందారమాలే. సరసకు జరిగింది. సంపెంగ పువ్వును తీసుకొన్నట్లు, కల్యాణం చేతిని తన అరిచేతిలోకి తీసుకుంది.

"కుజుడు, ఆపైన గురువు, చూశావా, ఆపైన శుక్రుడు, అందరికీ పైన చంద్రుడు, కలువ పువ్వు లాగ." కల్యాణం ఆపుకోలేక పోయాడు.

"నేనూ మీవాళ్లేన్రో, నే నిక్కడున్నా న్రో—ఇక్కడ, ఇక్కడ. నన్ను తీసుకుపోండ్రో!" అరిచాడు.

గబగబా నలుగురూ చేరారు.

మందారమాల. పక్కకు నక్కి చెప్పింది. వైద్యుణ్ణి పిలిచారు. వచ్చిచూచి, మందు ఇచ్చి వెళ్లాడు. కల్యాణ సింధువు భార్య చివరికి వచ్చి చూచింది. 'అయ్యగారు భద్రం' అని మందారమాల అప్పగించి ఆవిడా వెళ్ళింది.

* * *

వెళుతున్నారు వయ్యారంగా దేవవిమానాలు. కాంతయ్య గూడా వెళుతున్నాడు. సౌధరివచ్చి చేయిపుచ్చుకుంది.

కాంతయ్య తగ్గాడు.

సౌధకే దారితీసింది.

"నన్ను చూచి అలా గాతావేం?" కాంతయ్య చూని.

"ప్రేమ పరీక్షిస్తున్నావా?"

"................"

"ప్రేమ ఏమిటో తెలుసుకోవాలని ఇంకా ఏడుస్తావేం? భూలోకపు గుణం ఇంకా పోలేదన్న మాట!"

"................"

"నీకు ప్రేమ లేదు. కాముమూ లేదు. ఉన్నది ఆకలి. ఇందాక పలకరించలేదని, నీవెంట పడలేదని బిర్రబిగిశావు"

"నేను మీతో మాట్లాడలేను"

సౌధరి నవ్వింది.

"మాట్లాడను గూడాను"

"నిత్యశ్రీ గూడా నీతో ఇలా నవ్వుంటే—?"

"అర్థం వుంది. ముసుగులో గుద్దులాట ఎందుకు? మీరు, అదే, మీ స్త్రీలవైఖరి నాకు ఎబ్బెట్టుగా వుంది!"

"జరిగేపని చెప్పటం, ఎబ్బెట్టుగా వుంటుందా?"

"మీకు పిల్లలు లేరు అనుకుంటూ, మీకు అంటే, మీ దేశంలో"

"ఏం?"

"వుంటే తెలిసేది. ఏది గోప్యమో, ఏది కాదో? మీ చందం నాకు—"

"అందం?"

"మదపిచ్చివాళ్ళు గూడా యిలా మాట్లాడరు మా భూమిమీద"

"అక్కడ ఏం బాధో మనసును బైటపడేస్తే. నీతోమాట చెప్పాలనుకుంటున్నాను.

"................"

"నీ హృదయం మారలేదు ఇంకా, భూగత వాసనలు పోలేదు ఇంకా"

"మీ సువాసనల ఘాటు ఘోరంగా వుంది. ఏదో అందం అని, అనుకోడం మీ భ్రమ. వొచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. మందాకిని వుంది. మీరు స్నానం చెయ్యరు. దాహం తాగరు. ఆకలే లేదు. పంటలు పండించక్కరలేదు. వెన్నెలవుంది. హెచ్చదు, తగ్గదు. మీకు మార్పు అనేది లేదు"

"అనవసరం. అసలిది తేజోలోకం. మందాకినీ తేజస్సే. వెర్రివెర్రి భ్రమలు పెట్టుకోక. నలుగురితో కలిసిపో."

"ప్రయత్నిస్తాను. వినా, ఎవరితోనూ కలవక పోయినా ఇక్కడ నాకు ఏం లేదుగా. ఆ క్షోభ, మా భూమిమీద"

"హృదయం మార్చుకో, సుఖపడతావు"

"అత్తింటి కాపురంలాగుంది"

సౌధరి జల్లిపోతూ, పోతూ "శుక్రలోకంలోకి వస్తావా? అంతా కళా ప్రపంచం" అంది.

"పద, మీ మాట వినకపోతే బతకనియ్యరల్లే వుంది." అని కాంతయ్య అనుసరించాడు

* * *

ఉదయవేళ. పసుపు చల్లినట్లుగా వుంది. కుర్చీలో కల్యాణ సింధువు కూచుని ఉన్నాడు. దివాను, కళ్ళజోడు తుడుచుకొంటూనూ.

కొద్దిగా, దూరాన, రైతు; మాయామర్మమూ అమాయికమూ సమంగా కలిసిన ముఖంతో.

"నిజం దొరా—!"

గొంతికలో ఎంతో వేదన.

"దొంగవేషాలు!"

దివాను.

రైతు గిలగిల లాడాడు.

"ఈఏడు అసలే పండలేదు, దొరా. అసలే కాటకం. అందులో నా గంప సంసారం. మా ప్రాణాలన్నీ—పై పంటో పై పంటో అని నీసుస్తై, ఉన్న పంట ఊడ్చుకుపోతూంటే—కల్యాణసింధువు మనస్సు కరిగింది. చంపకం చెప్పినమాటలు గుర్తుకొచ్చినై.

దివాను అందుకున్నాడు. "చాలా పెద్ద సంసారమా ఏరా? వరసగా అరడజనుమంది పిల్లలూ, లేక లేక లేక లేక ఒక్కత్తై భార్యానా?"

రైతు నవ్వు దాచుకున్నాడు.

"ఎందుకురా అధికప్రసంగం? నిరుడూ ఈపాటే పాడితివి. ఈఏడూ అదే పాటా—?"

"నిజం దొరా. మడతకుసుములూ, రాక్షస పక్షులు కొంప తీస్తె, మరేముంది దొరా? మా ప్రాణాలకు??"

కల్యాణసింధువు కాళ్ళ ఆకలిని చంపకం చెప్పగా విన్నాడు.

"నీటి సప్లయి కాలేదా?"

అని అడిగాడు కల్యాణం.

వాళ్ళా అడుగుతారు! నేను మనవిచేస్తాగా. అన్నాడు దివాను.

"చెప్పవేం—"

కల్యాణం మళ్ళీ అడిగినా, రైతు, లేని నీళ్ళు నమిలాడు.

"నువ్వు భయపడుతున్నావు. భయం కంటె పాపిష్ఠిది మరొకటి లేదు. కనీసం, నా హయాంలో నన్నా భయపడద్దు చెప్పు—నీటి వసతి—"

"చెరువుల పడికలు తీయించలేదు దొరా. కాలవలు చాలవు. ఉన్నవాటికి మరామత్తు లేదు. జలాధారాలు పనిలేవు. నీటివసతీ లేక నరులబలిమీ లేక పోతే—ఎలా పంటలు పండేది దొరా?"

"తప్పు మాది. సరి. నీవు ఏమీ బాకీలేవు. దివాంజీ అతనికో వందరూపాయలు ఇవ్వండి. నాల్రోజులపాటు అన్నం తింటాడు!"

అన్నాడు కల్యాణం.

దివాన్ జీ కళ్ళు కణకణలాడినై.

"పోరా. నువ్వు, పో!"

రైతు చలించలేదు. దివాన్, కల్యాణంవైపు తిరిగాడు.

"ప్రభూ! మరి మేము కొలువు చాలించుకొంటున్నాము."

"ఏం?"

"మేం ఎందుకు ఇక్కడ చెప్పండి. మా మాట ఏమన్నా పోగేనా, పని జరిగేనా? దొరలు మీరూ వినరు. దొంగలు వాళ్ళా ఇక వినేది మా మాట?—ఎవరికీ ఏమీ చెప్పి పనిచేయించ లేకపోయాక మేం, ఎందుకు?? ఇప్పుడు మీరు ఏమీ బాకీ యివ్వక్కర్లేదన్నారు. యివ్వడు. రేపు అందరూ ఇవ్వరు. అందరికీ ఈమాటే పాటా, బాటాను. అందరూ ఎగేస్తే—మరి మేం ఎందుకు?"

కల్యాణం గుండె గొంతికలో కొట్లాడింది.

"పాపం వాడేం ఇచ్చుకోలేడు!"

"న్యాయశాస్త్రానికి పక్షపాతం లేదు ప్రభూ!"

"అయితే మామాటే తప్పుఅన్నమాట. తగ్గాం!"

దివాను, నౌకరుపనిని వాయిదా వేశాడు.

రైతు బయటికి పోతూడు. గలాటా.

"ఏమిటది?"

దివాను వెళ్ళి గలాటాను ఆపించి వచ్చి చెప్పాడు:

"వాడే, ఆ రైతు, దూసోక్కొ, దొరగారికి కుమ్ముల లోక్షీ వేశా. అన్నాట్ట, ఇకిలిస్తూ. మనవాళ్లు మన అన్నంతిన్న విశ్వాసాన, వాణ్ణి కొంత జాడించి, బుద్ధిచెప్పి పంపారు."

"దివాంజీ! రహస్యం తెలిసింది. దయచూడడం తప్పుఅన్న మాట"

"ఇంకా నెమ్మదిగా అంటారేమిటి ప్రభూ! మెత్తపడ్డామో, మన నడిస్తిన తీవ్ర ధరితనాట్యం ఆడి పోతారే!"

కల్యాణసింధువు లేచాడు:

"ఈ లోకం ప్రేమకు, ప్రేమలేదు. దయ చూపించగూడదు. సరదా సంతోషాలు లేవు. ఉత్త ఎడారి ఈ జీవితం!"

దివాన్ వినీ వినకుండా తన పనిలో నిమగ్నుడైనాడు. నిట్టూర్చి, "ఏదన్నా జల్సా ఏర్పాటు చేయిస్తే సరి!" అనుకున్నాడు!

* * *

సౌధరి కాంతయ్యను స్వర్గలోకంలోకి తీసుకొనిపోయింది. సూర్యచంద్రులు ఒకేసారి కనిపించి, ఒకేరీతిలో సమ్మిళితులై — వింతను వెదచల్లుతున్నారు. అడుగు పెట్టగానే మనస్సు తేలి తేలి ఆనందం నాట్యం చేస్తుం దక్కడ.

దేవమిథునాలు వస్తున్నారు పోతున్నారు.

బ్రహ్మాండమైన నిర్మాణం. సౌధరే చెప్పింది. "రతీదేవి గుడి!"

కాంతయ్య అన్నాడు. 'పోదామా'

సౌధరి మధురంగా మందహాసం చేసింది.

పాల్కడలిలో నుంచి, నిద్రలేచిన లక్ష్మీదేవిలా వుంది గుడి.

గాలిపిల్లలు, గాంధర్వం వినిపించి, మబ్బు

కన్నెలు మధుర చిత్రాలను రచించి, నోదని …
మైన కవనం చెప్పి, ఆత్మను ఆనందింపచేసే దివ్య…

అమృతం!

కాంతయ్య త్రాగాడు. కొద్దిగా చేదుగా … మధువు! లతల జ్యోతిష్కులు. ఉద్యానాలు, … మందిహాసాలు, వనాలు, నిధువనాలు!

కాంతయ్యకు మైకం కమ్మటం ప్రా… భించింది. సౌధరి బుజంమీద వాలాడు. సౌధరి … దేవికి నమస్కరించి, కాంతయ్యచేత నమస్కా… పెట్టించింది. అరకంట సరసాలతో, కాంతయ్య … దేవికి నమస్కరించాడు.

సౌధరి అతన్ని చల్లగా నడి పార్శ్వభాగా… కొంపోయింది!

అక్కడ నిత్యశ్రీ వువర్వసు!

ఒకరొక్కరు కన్నులతో తాగుతూ, మ… ముద్రలో వున్నారు.

కాంతయ్య సౌధరిని వదిలి నిత్యశ్రీని ఉ… సర్పించాడు.

సౌధరి ఎక్కడికో వెళ్ళింది.

నిత్యశ్రీ, అతి యౌవన, అమోఘంగా కాం… య్యను లాలించింది. కాంతయ్య నిద్రపోయాడు.

* * *

వ్యూఢోరస్కులు, పాల ప్రాంశులు ఆ జాను… జ్వల బాహులు రెక్కలున్నవారు. చల్లని కాంతుల్ని చిమ్మేవారు వచ్చారు, నృత్యం చేస్తున్నారు. కాంతయ్య చూస్తున్నాడు. నిద్రపోతూనూవున్నాడు. ఒకే సమయంలో రెండూ, మళ్ళా అది కలా అంటే కల కాదు!

నిండైన మహానది తానం వాయించినట్లు, అఖండ నాదం సాధించిన వైణికుడు రాగాలాపన చేసినట్లు, క్రొవ్వ కంఠ మేళ సామం గానం చేసినట్లు, లీలా తాండవ పండితుడు, కాలభూషణుడు దేవీ సన్నిధిని, తన శక్తిని తానే తగ్గించుకొని మధుర లాస్యం చేసినట్లు—అప్సరలు ఆడారు, పాడారు. ఆమోద ప్రమోదాలు ప్రమాదం అంతగా ప్రవహిల్లినవి.

దేవమిథునాల, వేదమిథునాలై తామూ నృత్యం సలిపినవి.

మధువు గ్రోలినవి మైమరచినవి. సభ అయింది.

నిత్యసువాసిని, పెద్ద ముత్తైదువ, ఊర్వశి, వచ్చింది, వుంది. వెళ్ళింది.

వేదాలలో సూక్తించ బడిన స్త్రీ, బ్రాహ్మణాలలో ప్రస్తుతింపబడిన స్త్రీ, పురాణాలలో వాగరుగరులు పుక్కిలించిన స్త్రీ—కావ్యాలలో గానం చేయబడిన స్త్రీ, ఊర్వశి, వచ్చింది. వెళ్లింది.

కాంతియ్య కళ్లు రంధి కోసం వెతికినై. అలిసినై.

అందరూ లేచారు.

కాంతియ్య లేచాడు.

నిత్యశ్రీ కాంతియ్యను పలకరించింది!

"ఎట్లావుంది?"

"బావుంది"

"నీకూ నృత్యం చేయాలనిపించ లేదా?"

ఇది సౌధరిమాట.

కాంతియ్య నుదురు వెలిగింది. "ఊఁ"

"మీ భూమిమీద ఇలాంటివి ఉంటాయా?"

"ఆఁ ? ?"

"ఇట్టి స్థలం—"

"ఆ. పారియాత్రం సరిగ్గా ఇలాంటిదే. పారియాత్ర పర్వతంమీద కూడా ఇంచు ఇదీ వుంటుంది. అక్కడిలతలు, పేరువిల్లంకులు, పత్రి, పుష్పఫలాలు అంతా ఇక్కడిలాగే. సీతాన్వేషణానికై తరలుతున్న వానరులకు సుగ్రీవుడు "కొన్ని జాగ్రత్తలుగూడా చెప్పాడు కూడాను!"

పునర్వసు ఫక్కున నవ్వాడు.

కాంతియ్య వాదానికి సిద్ధపడ్డట్టు తలఎత్తాడు.

"అయితే అన్నగారూ. మీకు మా స్వర్గం ఎలా వుందంటారు?"

"అద్భుతంగా వుంది"

"పునర్వసు ఆశ్చర్యపోయాడు."

కాంతియ్య చెప్పసాగాడు.

మా భూమిమీద ఇల్లూ, ఇల్లాలూ వుంటుంది. పిల్లలుంటారు పనివుంటుంది. నేర్చుకోవలసింది, నేర్పవలసింది వుంటుంది. ఆశాప్రతీక్షలు వుంటయ్. నిద్రా కలలూ వుంటై"

"భయం?"

"వుంటుంది. కాని, అది ఆత్మను ముందుకు నడిపిస్తుంది. భయాన్ని నిర్మూలించడం, కనీసం అందుకని ప్రయత్నించడం వుంది. పుట్టడం, పెరగడం, వుంటుంది. ఇక్కడ అలాగా కాదే. అగ్నిలాగా అంతా యవ్వనమే"

పునర్వసు, సౌధరి, నిత్యశ్రీ నవ్వారు.

కాంతియ్య ఆగలేదు. 'నేను' ఇది చేస్తున్నాను. అనేది ప్రతిచోటా వుందక్కడ. ఇక్కడ 'నేను' అనేదే కనిపించడం లేదు. నేను అనేదే లేకపోయాక ఏముందీ, నా బొంద!"

"అమృతం?"

"మా సాధనా మార్గంలో, ఎవరికి వారికి, తలలోంచి అమృతం స్రవిస్తుంది. ఆ తైత్తిరీయక రసం అనుభూతం కూడాను. ఆ అమృతంనుండు మరి మీ మధువు—"

కాంతియ్య చప్పరించి పారేశాడు.

నిత్యశ్రీ నివ్వెరపోయింది.

"నీతో వచ్చిన చిక్కు ఒక్కటే, నీ హృదయం ఏమీ మారలేదు." అంది సౌధరి.

కాంతియ్య మాట్లాడలేదు.

* * *

కల్యాణ సింధువు మనస్సు తాజా కావడం కోసం, దివాంజీ వారు తీర్థయాత్రలు చేయించారు. ఇండియా అంతా తిరిగివచ్చాడు కల్యాణం. యాత్రలో అనేక విశేషాలను తెలుసుకొన్నాడు. కల్యాణానికి దేశం బాగుంది. ప్రజలు నచ్చలేదు. శిల్పం బాగుంది. శిల్పులు తుమ్మయి జగ్గాయిగా కనిపించారు. రోగులు కనిపించారు. ఆడంబరంగా, రాజకీయ యోగులూ కనిపించారు. అహంకార తాండవం చూచా డక్కడ. వెన్నెల చీకటి, నాటి హానివృద్ధులు, ఎండా వానా వాటి పోకులు, నదీ నదాలు నగాలు, వాటి జీవ గాంభీర్యం. గాంధర్వం ఆ గాంధర్వంలో వినోదం కంటె వికాసానికైన సంజాటన అన్నీ తిరిగి తెలుసుకున్నాడు.

కల్యాణంగారు ఊరికి తిరిగివచ్చిన సందర్భంలో విందులూ జల్సాలూ.

వెల్లాట కత్తెలు పక్కసమయ్యేట్టు నృత్యం చేశారు.

"రంభ?"

కల్యాణ సింధువు ఏదో అనబోతున్నాడు.

"తైలుస్టేష సేనా?" అని అందుకున్నాడు విదూషకుడు.

కల్యాణసింధువు నవ్వాడు గాని, ఆ నవ్వులో చిరాకును మించి కోపం ఉంది.

విదూషకుడు, రంభసంగతి మాకేం తెలుస్తుంది కానీండీ, రవీంద్రులు ఊర్వశిని గురించి వ్రాశారూ ......?" అని లొట్టలు వేశాడు.

జల్సాలు వాటిదారిన ఎలాపోతున్నా, ఊర్వశిని గురించి కల్యాణం గుర్తున్నంత దాకా విదూషకుడికి చెప్పాడు.

విదూషకుడు, తన 'ఊరి ఊర్వశి'ని తలచుకొని గుక్కిళ్ళు మింగుతూ, దొరమాటలకు తల ఎగరేశాడు.

జల్సాలు ఐనై.

ఆపాడు, కల్యాణసింగువు భార్యతో కొంత కాలం గడిపాడు.

ఆమెగూడా అతన్ని అతని వివాహాన్నీ ఏమీ ఎరగనట్టుగా, నమ్రతగా నటించారు.

తన డ్రాయింగురూములో, ప్రపంచ శిల్పాలు అనుభవించి మరీ ఆకలిని పెంచుకొని, తనివితీరా చిత్రించిన చిత్రాలు చూచిచూచి మైమరచాడు.

కల్యాణానికి సుస్తీ.

ఫలానాఅని తేలలేదు. వైద్యులు వస్తారు, పోతారు. దివాన్జీ ఆకాశానికీ నేలకూ తాళం వేసేస్తున్నట్టు వుంటాడు.

తను ఏమీ చెయ్యడు. చెయ్యలేడు. మనస్సు, మాట మార్దవాన్ని అతిగా పెంచింది. అందువల్ల ఏచంపకానికో తప్ప అతను అయోమయం.

"నేనేం చెయ్యాలి?" అన్న స్వంత ప్రశ్న. 'నేనిక్కడ అనవసరం' అన్నంతదాకా తెచ్చింది కల్యాణాన్ని అగాధమైన రహస్యాన్ని, ఎవరికివారు అనుభవించే ఈ ప్రపంచంలో తను ఎందుకు, అనవసరం, ఇదీ ఘోష.

* * *

"నిత్యశ్రీ! మాట!"

కాంతియ్య సరసకు నిత్యశ్రీ వచ్చింది.

"ఒకసందేహం!"

"రహస్యం కాదుగద" అని సౌధరి అందుకుంది.

"మీకు రహస్యాలు లేవుగా" అని కాంతియ్య అన్నాడు. సౌధరి నవ్వింది.

"నిత్యశ్రీ! పగ, ఓర్పు, వెరపు, అబ్బురం, నగటు, నగవు. మగటిమి, హొయలు, అలుక, ఈభావాలు, రసాలు ఏమీ లేకుండా రోల్లా యిక్కడ కాలం వెళ్లబుచ్చడం?"

"కాలం అంటూవుంటేగద!" సౌధరి!

"ఊఁహూ, నిన్ను అడిగి తెలుసుకోవా లనుకుంటున్నానూ..."

"ఈ తెలుసుకోవడం అనేదే అసలు ఓతప్పు. తెలిసేది తెలుస్తుంది. నువ్వు వొచ్చినప్పటినుంచీ చూస్తున్నా, ప్రతిదీ తెలుసుకోవాలనుకుంటావు!" అంది సౌధరి.

"అప్పుడప్పుడు జిజ్ఞాసే లేకపోతే జీవితం వృథా" సౌధరి చెప్పినా, నాకా జిజ్ఞాస పావసం లేదు పైగా పెరుగుతోంది. నేనిక్కడ ఏం చెయ్యాలి? ఏం చేస్కోవాలి?"

అందరూ నవ్వారు.

"ఇది క్రీడాలోకం. విశ్రాంతి క్షేత్రం. అంతే!"

పునర్వసు అందుకున్నాడు "అతిథీ! పాపం, నీ స్వర్గతి అయిపోతున్నట్టుంది. నేనేంచెయ్యాలీ అన్న వూహ ఊరికే వస్తుందా మరి?"

"అమ్మయ్య, చెర విరగడ అవుతోందన్న మాట. బ్రతికిపోతాను. "నేను" అనేది గాఢంగా లేని చోట. ఏపనీ చెయ్యనక్కరలేనిచోట, పడివుండడం. ఘోరం. పోతా."

నిత్యశ్రీ, సౌధరీ స్తబ్ధులు.

పునర్వసువు కాంతయ్యను కౌగిలించుకొన్నాడు. ముద్దులు పెట్టుకొన్నాడు. తనబిడ్డ అత్తారింటికిపోతూంటే కన్నతల్లి వున్నట్టుగా ఉన్నాడు.

* * *

తేజో మేఘాలు దివ్యచకోరంగా వున్నై. కాంతయ్య భూమిమీదికి అవతరిస్తున్నాడు. కల్యాణసింగువు పైకి ఆరోహిస్తున్నాడు.

అహోహో, అదుగో భూసుగంధం. ఏం ఘుమఘుమ. పొగలోంచి నిప్పు వచ్చినట్లు, చెట్లలోంచి జీవంకళ!

"ఎవరునాయనా, చుక్క తెగిపడి పోతున్నట్టు పోతూగూడా — భూమో భూమో అని అఘోరిస్తున్నావు!"

"నిజం. మీరేం స్వర్గంకోసం కాదుగద?"

"ఏం? స్వర్గానికి!"

"తిరగడం దివ్యం. మార్పులేని సుఖాలేని, విశ్రాంతి గృహం ఆ స్వర్గం! నేను అనేది సమృద్ధిగా వుండి ఏదో సాధించడానికి వీలైనస్థలం కోదులు తావు, ఎంత పిచ్చాడివయ్యా నాయనా!"

కల్యాణం నివ్వెరపోయాడు. కాంతయ్య కల్యాణం చేయి పుచ్చుకొన్నాడు: "కావలసినంత అహంవుంది నిజమేగానీ—ప్రతిదీ ప్రతిదానికీ అడ్డం కేస్తే—?"

"కవకనే అహం వినియోగపడుతుంది. అడ్డంకులు తొలగించి దివ్యం చేసుకోడం మన ప్రజ్ఞ. పద పోదాం. సాధిద్దాం"

"భూమే దివ్యం అంటావు."

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ!"

"పద పోదాం!"

ఇద్దరూ, భూమిమీదికే! అవతరించారు!

# వలపు పిలుపు ★ శ్రీ బొడ్డు బాపిరాజు

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్ పర్యుత్సుకో భవతి"

నీలగిరి హృదయ శయ్యల
ప్రాలిన వెలిమబ్బు లేమి వక్కాణించున్?
లోలాక్షి, వాలు జడముడి
ప్రేలెడు సిరిమల్లె సరుల పిలుపో! వలపో!

గుసగుస లోవ్రా? ప్రణయగూఢ చిరంతన గాథ, లీహిమో
ల్లస దనుకూల మందమధురానిల, ముత్సవరమ్యమూర్తి ప్రే
యసీయువ లెన్; కపోలముల నాదృతి మీటుచు, చూర్ణకుంతల
గ్రసిత లలాటరేఖ సవిలాస కరావృతి ముద్దులాడుచున్.
వగలిన సన్నమబ్బు వలిపమ్ముల మాటున దోచు నీల భూ
ధరు శిఖరాగ్రసానువుల దారుల ధారలు ధారలై కల
స్వరముల జాలువారు తెలివాకలు—చూపు; ప్రయాణ వేళలం
దరుణకపోల బాష్ప సరిదాకులమా కులపాలికాస్యమున్!
మలకలు వోవు నీలగిరిమాలలు, పచ్చలలోయ, లందముల్
మలచిన వేయిస్తంభముల మండపముల్ నునుపోక చెట్ల చా
లులు, రవ జల్లుతోడి యలలున్, సెలలున్ హృదయాంతరాంతర
మ్ముల నతి తియ్యనైన వలపుం జిరు మంట లెవో రగుల్పునే?
లలితలతాగృహాంతర విరాజిత నీలవితర్దికల్, మరు
చ్చలిత సరస్సరోజ పథచారిత సాంధ్య విహారనౌక, లు
త్పులకిత యామినీ మధురముల్ కృతకాచల కందరమ్ములున్
కిల కిల నవ్వునో ప్రియసఖి పరిదూరుని పల్కరించుచున్!
కమ్మని పూలరేకుల, నొకానొక జాగరణారుణాక్షి యు
గ్మమ్మును; మంచు జిల్కు వలిగాలులలో, నొక వేడియూర్పు; శ్రా
వ్యమ్ములు పక్షికూజితములం, దొక ముగ్ధ విషాద కంఠనా
దమ్మును తోచునో ప్రకృతి తాన వియోగవతీ ప్రతికృతిన్!

వీచిన గాలులు, వనముల
పూచిన పూవులును, పోకబోదెలు, మిన్నుల్
రాచిన యద్రులు, ఎడదకు
వేచిన ఒకయెడద పిలుపు వెస వినిపించున్!

---

# దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము



శ్రీ నేలటూరి వేంకటరమణయ్య

నాయక రాజులనాటి దాక్షిణాత్యాంధ్ర సాహిత్యమును వివరించుటకు ముందు తొలుదొల్త చెప్పదగిన యంశములు రెండు మూడు గలవు. తంజావూరు సరస్వతీ మహాలు పుస్తక భాండాగారమున నిక్షిప్తములై యుండు నాంధ్ర గ్రంథము లన్నియు గొంద ఱనుకొనునట్లు దాక్షిణాత్య ఆంధ్ర కవి విరచితములు గావు. ఆంధ్రదేశమునం దుద్భవిల్లిన గ్రంథము లనేకము లందు కలవు. మఱియు నాయక రాజుల మన్ననకు పాత్రులైన కవు లందఱును దాక్షిణాత్యులని యెంచుటయు సరికాదు. శ్రీ విజ్ఞవోలు వెంకట్రావు పంతులుగారు క్షేత్రయ తంజావూరు రాస్థాన విద్వాంసు డని సూచించియున్నారు. "దాక్షిణాత్య సంగీత ప్రపంచమున మూర్తిత్రయ మని చెప్పదగిన వారు ముగ్గురు. అన్నమయ్య, క్షేత్రయ, త్యాగయ్య. ఇందు కడపటివా రిరువురు తంజావూరికి సంబంధించినవారే. క్షేత్రయ రఘునాథ నాయకుని కాలమున తంజావూరు రాస్థానమునకు వచ్చి, యీ ననుక విజయరాఘవునిపై వేయి పదములను జెప్పియున్నాడు" అని వక్కాణించిరి. త్యాగయ్యవలె క్షేత్రయ దాక్షిణాత్యుడు కాడు, అతని జన్మదేశము గుంటూరు మండలము. సంగీతవిద్యయం దభిరుచిగల రాజుల సంస్థానములకెల్ల బోయి తన విద్యాకౌశలమును జూపి బహుమానములను బొందెను. ఇతనిచే పదములు చెప్పించుకొనినది విజయరాఘవు డొక్కడే కాదు, మధురాపురీశుడు — చొక్కనాథు డేమో ? — తుపాకుల వేంకటకృష్ణుడు, గోలకొండ తబక్పృశాహు మున్నగు వా రెందఱో కలరు. గోలకొండ పాదుశాహు నాలుగు వేల పదములు చెప్పించుకొనెనట. శెవ్వంది లింగడు, తిల్ల గోవిందరాజు, కంచి కరిగిరి వరదరాజు, తిరువళ్ళూరి వీరరాఘవుడు, కడప వేంకటేశుడు, పాలగిరి చెన్నుడు మున్నగు దైవములను బ్రశంసించియున్నాడు. కావున క్షేత్రయ్య దేశద్రిమ్మరి. ఆంధ్రభాష వ్యవహారమునందుండిన దేశమంతటియు నతనికి గీర్వాణియొసగిన యమరమాగాణము. తంజావూరివాడనుట పొరపాటు. కావున క్షేత్రయపదములు గాని మఱి యిట్లే నాయక రాజుల సంస్థానముల కాగంతుకులైవచ్చి బహూకృతులై చన్న కవుల రచనలనుగాని ఇచట ప్రస్తావింప దలపెట్టలేదు.

మఱియు ద్రావిడదేశమున ఆంధ్రవాఙ్మయమును ప్రవేశపెట్టి పెంపొందించిన వారు మధుర తంజావూరాంధ్ర నాయకరాజులని వాఙ్మయ పరిశోధక పండితులు చెప్పెదురు, కాని వాస్తవమును విచారించిన పై జెప్పబడిన నాయక రాజ్యముల స్థాపనకు ముందే యరవదేశమునం దాంధ్రకావ్య రచన ప్రారంభమైనది. మధుర నాయకరాజ్యము క్రీ. శ. 1564-5 సంవత్సరమున నడచిన రక్కసి తంగడి యుద్ధానంతరమున ప్రభవించినది. తంజావూరు రాజ్యము దానికించుక పూర్వము క్రీ. శ. 1550 వ సంవత్సర ప్రాంతమున సంస్థాపిత మాయెనని నవీన చరిత్ర పరిశోధనవల్ల దెలియవచ్చుచున్నది; కాని ద్రావిడభూమియందు ఆంధ్ర కావ్యరచన దాని కిరువది ముప్పదియేండ్లకు ముందె ప్రారంభమైనది. క్రీ. శ. 1529 మొదలు 1542 వఱకును విజయనగర సామ్రాజ్యమును పాలించిన యచ్యుతదేవ మహారాయ లాంధ్రభాషాభిమాని, ప్రతి సంవత్సరంబు శ్రీ వెంకటేశ్వరునకు సత్కావ్య ప్రబంధపుష్పాంజలి సమర్పించువాడు. ఏలినవాని మార్గము ననుసరించి మంత్రులును నాయకులును జక్కం దాంధ్రభాషను బోషించి కవులను గావ్య రచనకు బ్రోత్సహించి భాషాసేవ యొనర్చిరి. వారిలో గోళ్ళ బసవేంద్రుని కుమారులు పెద రామప్ప చిన రామప్ప యనువార లీసందర్భమున జెప్పదగినవారు, చిన రామప్ప దన యన్న యగు పెద రామప్ప పేర చొక్కనాథ చరిత్రయను ద్విపద కావ్యమును పచ్చికప్పురపు తిరువెంగళ కవిచే జెప్పించెను. ఈ పెద రామప్పనాయకుడు వాకిటి చిన్నప్ప నాయకుని మిత్రుడు, వ్యాస తీర్థులశిష్యుడు. ఇతడు క్రీ. శ. 1531 మొదలు 1538 9 వఱకును అచ్యుతరాయల పక్షమున రామనాథపురం జిల్లా తిరుపత్తూరు తాలూకాలోని శివపురిప్రాంతమును పాలించుచుం

డెను. ఇతడు మధుర చొక్కనాథస్వామి భక్తుడు, కావుననే చొక్కనాథుని లీలలను వర్ణించు చొక్కనాథ చరిత్రను చెప్పించుకొనెను. ఇందువలన నాంధ్ర వాఙ్మయమును ద్రావిడ దేశమున బ్రథమమున బ్రవేశ పెట్టినవారు మధుర తంజావూరు రాంధ్రనాయకులు గారనుట తెల్లమగుచున్నది. ఆ కీర్తి గోళ్ళవారికి చెందవలసియున్నది.

గోళ్ళ నాయకుల యాశ్రయమున నాంధ్ర భారతి ద్రావిడదేశమును బ్రవేశించినను, నది యచట సుస్థిరముగ నెలకొనినది మధుర తంజావూరు రాంధ్ర నాయక రాజుల యాదరణము వల్లనే. దక్షిణదేశమున తెలుగుభాష స్థిరముగ నెక్కొనుటకును గ్రంథ రచన యభివృద్ధి నందుటకును ముఖ్య కారణము రక్కసి—తంగడి యుద్ధమని చెప్పవచ్చును. ఈ యంశమును విశదపఱచుటకొఱ కిచట విజయనగర సామ్రాజ్య పాలన విధానము నించుక దెలుపవలసియున్నది. రాయ సామ్రాజ్యము వర్ధిల్లిన మూడు వందల యేబదియేండ్లను తురకలతో నెడతెగని పోరాటము సాగించుట యావశ్యకమాయెను. మొదట బహమనీ సుల్తానులతోడను, పిమ్మట అహమదు నగర, బిజాపుర గోలకొండ సుల్తానులతోడను విజయనగరసామ్రాజ్యాధిపతులు హిందూ ధర్మమును గాపాడుటకొఱకు యుద్ధము జేయవలసి వచ్చెను. ఈ కార్యమును నెఱవేర్చుటకు రాయలు గొప్ప సైన్యములను గూర్చి భరింపవలసియుండెను, ధనములేనిది సైన్యములను భరించుట సాధ్యము గాదు. సర్వవిధములైన సంపదలకును ఆకాలమున భూమియే మూలాధారము కావున సామ్రాజ్యసంరక్షణ భూమిపై నాధారపడియుండినది. ఇది మనము దృక్పథమున నిలుపుకొనవలసిన ప్రథానాంశము. రెండవది భూస్వామ్యము. రాయ సామ్రాజ్యములోని రాష్ట్రమున కంతటికిని రాయలు ఒడయుడు. భూమినుండి వచ్చు వరుంబడిని సైన్యపోషణకొఱకు వినియోగించుటకై రాయలొక పద్ధతి నవలంబించెను. దేవదేయ, బ్రహ్మదేయములు గాక మిగిలిన గ్రామము లన్నియు రెండు తరగతులుగ విభజింపబడెను. అందొక తరగతి గ్రామములు నగరికి చెల్లెడివి. వీని నుండి వచ్చు నాదాయమునుండి రాయలు నగరి ఖర్చులకై జీత దళముల జీవితములు మొదలగు పరిజన పోషణఖర్చులను భరింపవలసియుండెను. ఆ శ్రవణపు లెక్కలలో నీ తరగతి గ్రామములను భండారవాడ గ్రామములని పేర్కొనువారు. రెండవతరగతి గ్రామములకు అమరగ్రామములని పేరు. అమర మనగా, "అగత్యమైనప్పుడు కొంత దండును తీసుకొని రావలసినదనే నిబంధనమీద—చిన్నరాజులకు విడువబడ్డ సీమ" అని బ్రౌన్ దొరగారర్థ నిర్ణయము గావించిరి. ఈ యర్థమునే పేరు చెప్పక సంగ్రహించినారు, సూర్యరాయాంధ్ర నిఘంటు కర్తలు. అమరము అరబుమాట, పార్సీనుండి స్వీకరింపబడినది. అమ్ర్ అనగా ఉత్తరువు, ఆజ్ఞ యని యర్థము. దళనాయకులకు రాజు కొన్ని నిబంధనలమీద నిచ్చు భూమికి కారణమున అమర మనియు నమరమాగాణ మనియు పేరు వచ్చినది. అమరభూములను గొన్నవారికి అమర నాయకులని పేరు, ఇట్లు రాజు రాష్ట్రమును నాయకులకు అమరనిబంధనల ప్రకారము బంచిపెట్టు పద్ధతికి అమర నాయంకరపద్ధతి యని గాని లేక నాయంకరపద్ధతి యనిగాని పేరు. అమర నిబంధనలు ముఖ్యమైనవి రెండు. ఒకటి బ్రౌనుగారు చెప్పినట్లు వలసినప్పుడు నిర్ణీత సంఖ్యగల గజాశ్వపదాతి బలములతో గూడ యుద్ధకార్యమునకు వచ్చుట, రెండవది నిర్ణీతమైన ధన సంచయమును వర్షవర్షమున కప్పముగ చెల్లించుట, అమరగ్రామముల నాయకులకిచ్చునప్పుడు రాజు మితిమీఱి యీరాదని కృష్ణరాయలు శాసించియున్నాడు. మఱియు నమరనాయకులను స్థిరముగ నొకస్థలమున నుంచనీరాదు. వారి యమర మాగాణములు తఱచుగ మారుచుండెడివి. కావున వంశపారంపర్యముగ నమరనాయకులకొక సీమ నేలుటకు గాని యందు దమ యధికారమును స్థిరముగ నెలకొల్పుటకు గాని సాధ్యమయ్యెడిది కాదు. ఇందువలన రాయ సామ్రాజ్యము నందమర నాయకులు చిరకాలము ప్రబలుటకు వీలులేకపోయినది. కాని రక్కసి-తంగడి యుద్ధానంతరము రాయసామ్రాజ్య పరిస్థితులు మారిపోయినవి. రాయలకై జీతము బలములన్నియు సమసెను. క్రొత్త దళములను గూర్చుటకు వలసిన ధనము రాయభండారమున లేకపోయెను, కావున రాయలకు అమర నాయకులను దన యాజ్ఞానిబద్ధులను సేయజాలు శక్తి లేకపోయెను. తత్కారణమున అమర నాయకులు పెచ్చుపెరిగి తయమర సీమలయందు నెలకొని నూతన సంస్థానములను స్థాపించిరి. ఇట్లు వెలువడిన నూతన సంస్థానములలో బ్రబలమైనవి మధుర తంజావూర జింజి నాయక రాజ్యములు.

ఈ రాజ్యస్థాపకులు తొలుదొల్త తక్కిన అమర నాయకులవలె రాయలకడనుండి కొన్ని గ్రామములను నాయంకరముగ బడసినవారలె. రక్కసి - తంగడి యుద్ధానంతరము రాయ సామ్రాజ్యమున వఱలుచుండిన యరాజక స్థితిని సందర్భపఱచుకొని తమ శక్తి సామర్థ్యములవలన జుట్టుపట్లనుండిన యమర నాయ

కులకు జయించి విస్తారమగు రాష్ట్రములు నాక్రమిం
చుకొని రాయలవారికి మ్రింగరాని కరుడైరి. జీర్ణ
కర్ణాటసామ్రాజ్యమును బునరుద్ధరింప సంకణము కట్టు
కొన్న తిరుమలదేవరాయలకు వారిని దన యధికారము
క్రిందికి దెచ్చుకొనుటకు శక్తి చాలకపోయెను. ఒక
ప్రక్క తురకల దండయాత్రలు, మఱియొకప్రక్క
సామ్రాజ్యాధిపత్యమునకై అళియ రామరాజు పుత్రుడు
తిమ్మరాజు కుట్రలు. ఈ పరిస్థితులందు విజయనగరము
నుండుట శ్రేయస్కరము గాదని రాజధానిని పెను
గొండకు మార్చి రాయలను వెంట నిడుకొని యచటికి
బోయెను. మఱియు నధుర నాయకుల నండఅను దన
కనుకూలురుగ జేసికొనుటకు ఎవ్వరాక్రమించిన సీమ
లకు వారే స్థిరమైన ప్రభువులని యొప్పుకొనెను.
అంతట అమరనాయకులై యుండిన మధుర తంజా
పురాది నాయక రాజ్య స్థాపకులు సామంతులై సామంత
రాజచిహ్నములను ధరించి తమ తమ సీమల నేల
నడగిరి. రాయసామ్రాజ్యముపై నెత్తి వచ్చు శత్రువు
లెల్ల నుత్తర దిగ్భాగమునుండియే వచ్చుటచేత వారి
తోడ సాక్షాత్తుగ రాయల యేలుబడి క్రింది దేశమునకె
దిగిలెడిది. ఆత్మసంరక్షణార్థము వారితో దన యావచ్ఛ
క్తిని వినియోగించి పోరాడవలసి వచ్చుట
చేత యుద్ధభారమంతయు రాయలమీదనే బడు
చుండెడిది. దాక్షిణాత్య నాయకరాజులకు యుద్ధము
జేయవలసిన యావశ్యకతయు శ్రద్ధయును లేక
పోయెను. సారవంతములైన రాష్ట్రములనుండి వచ్చు
నాయమును యథేష్టముగ వెచ్చపెట్టుచు నానావిధ
భోగముల ననుభవింపుచు నిరంతరము సుఖ సంకథా
వినోదంబుల గాలము గడపుట కవకాశము గల్గెను.

తురకల యుపద్రవము రానురాను ఆంధ్రదేశ
మున దుర్భరమైపోయెను. తిరుమలదేవ శ్రీరంగదేవ
రాయలకాలమున విజాపుర సుల్తాను పెనుగొండపై
నేకు పర్యాయములెత్తివచ్చెను. గోల్కొండ సుల్తాను
కొండవీటి రాజ్యము నాక్రమించుకొనుటయే కాక
యుదయగిరి కందనవోలు రాజ్యముపై బలుమారు దండ
యాత్రలు సేయ నారంభించెను. కోటలు కొల్లలు
మితిమీరెను. దేవాలయాలు దోపిడి పోయెను,
పెక్కు నాశమందెను, దేశమున దిక్కులేకాండ్రు
ప్రబలిరి, గ్రామములు పరశురామప్రీతి యాయెను,
రైతులు సర్వస్వములు గోలుపోయిరి. సేద్యవాద్యము
సేయు జనసంఖ్య సన్నగిల్లెను, పైరపచ్చలు బగ్గియై
పోయె. ఈ పరిస్థితులలో జనులు దమ జన్మస్థానముల
నుండిలేక దేశత్యాగము జేసి దక్షిణమందలి నాయక
రాజ్యములకు వలసలు పోయిరి. ఇట్లు వలసపోయిన
వారిలో రాయదత్త అగ్రహారాదికముల ననుభవి
చుచు వేదాధ్యయన పరులై యజ్ఞాది వైదిక కర్మ
యందును శాస్త్రపరిశోధన యందును కాలము గడ
చుండిన శ్రోత్రియులను రాయ సంస్థానము నా
యించుకొని యుండిన విద్వత్కవి గాయకనర్తకా
కళావిశారదులు ముఖ్యముగ నెన్నదగినవారు. వీరికెల్ల
నాయకరాజు లాశ్రయమిచ్చి జీవనాధారములు గల్పిం
చిరి. తత్కారణమున వారి యాస్థానములు సరస్వతీ
పీఠములై యాంధ్రగీర్వాణ సాహిత్యములకే కాక లలిత
కళలకును దానకములై విలసిల్లినది.

... ... ... ...

## 2

దాక్షిణాత్య వాఙ్మయమంతయు దంజావూరు
మధుర సంస్థానములయందే యుత్పత్తిలైనని వాఙ్మయ
చరిత్రకారులు జెప్పుదురు. ఇది సరికాదు. తంజా
వూరు మధుర సంస్థానములు గాక ఆంధ్రవాఙ్మయ
మభివృద్ధినందిన తావులు ద్రావిడదేశమున మఱికొన్ని
కలవు. అందు పుదుక్కోట యొకటి. ఈ సంస్థానాధి
పతులాంధ్రులు గారు; శుద్ధ ద్రావిడులు; కాని గ్రంథ
రచన మూలముననుకవి పోషణవల్లను వీరు చేసిన
యాంధ్రభాషాసేవ సంస్మరణీయము. విజయ రఘు
నాథుడు, ఆంధ్రకవికల్పభూజము; రాయరఘు
నాథుడు గొప్ప కవి, రసిక శిఖామణి. పార్వతీ పరిణ
యమును చక్కని కబ్బమును విరచించెను. ఆంధ్ర
భాషార్ణవాది బహుళ గ్రంథకర్తయైన నుదురుపాటి
వెంకన ఇతని యాస్థానము నలంకరించెను. చెంజి
రాజధానిగ తుండీర మండలమును పాలించిన యాంధ్ర
నాయకరాజులను మాతృభాషాభివృద్ధికి దోడ్పడిన
వారలై, నాయకయుగమున వెలసిన కవుల నేకులు
తుండీర ప్రభువులచే సత్కారమును బడసినట్లు
తెలియవచ్చుచున్నది. "కర్ణాట తుండీర చోళపాండ్య
ప్రముఖాఖిల మండల మండలాఖండల దత్తమత్త
సింధుర...రత్నాంబరాది వస్తు...విభవ శుభ లక్ష్మ
ణాండ"ని గణపవరపు వెంకట కవియు; "శాకశాసన
చిహ్నభాసుర ప్రథ చెంజి పరదేంద్రు నాస్థాన వసుధ
యందు, మంకుకెక్కిన" తిరువేంగళార్య కవి
శిష్యుండనని బుగ్వెద కవి వేంకటాచలపతియు
జెప్పుకొని యున్నారు. ఈ తిరువేంగళార్య కవి చెంజి
వరదప్పనాయకుని యాస్థానకవి యని తోచు
చున్నది. ఇట్లు తుండీర మండలాధిపతులచే సత్కార
ములను బడసితిమని చెప్పుకొను కవులు మఱి కొందఱు
గూడ గలరు. కావున తంజావుర మధురాధిపతులవలె

చెంజిదొరలును ఆంధ్రభాషను పోషించిరనుట తెల్లము. కాని చెంజి సంస్థానమున రచియింపబడిన గ్రంథము లెవ్వియు నింకను బయల్వడలేదు. కువలయాశ్వచరిత్రను రచించిన పవరము చిన నారాయణ రాజు చెంజి రాజు కుటుంబమునకు సంబంధించిన వాడని యెంచుటకు గొంత యవకాశముగలదు.*

దాక్షిణాత్య ప్రభువులెల్లను ద్రావిడ దేశమునం దాంధ్రభాషను బెంపొందించినను, 'మధుర తంజాపుర నాయకుల భాషా సేవ సంస్తవనీయము. మధుర నాయకులకంటె దంజాపుర ప్రభువులు వాసికెక్కిరి. తొలుదొల్త భాషాభిమానము మధుర నాయకులకు స్వాభావికమైనట్లగపడదు. తంజాపురాధిపులతో పోటిసేయ నలవఱచుకొనిన గుణవిశేషముగ దోచెడిని. మధుర నాయకులలో భాషాపోషకులని పేరందినవారు ముగ్గురు. మొదటివాడు క్రీ. శ. 1623 మొదలు 1659 వఱకును ప్రజాపాలన మొనర్చిన తిరుమల నాయకుడు, ఇతడు లింగనమఖి కామేశ్వర కవికి స్వచ్ఛముక్తా గుళుచ్ఛ సితచ్ఛత్ర చామరశిబికాకనకాందోళికాది రాజోపచారముల జేసి సత్కరించెను; సంగీతసార్వభౌముడని ఖ్యాతికెక్కిన సుప్రసిద్ధపదకర్త క్షేత్రయచే దన పేర బదములు చెప్పించుకొని బహూకరించెను. ఇతనివలెనె ఇతని తమ్ముని పుత్రులు చొక్కనాథ నరపతియు ముద్దళ

---

*పవరము చిన నారాయణ నాయకుడు కువలయాశ్వ చరిత్రను దన పితృవ్యుడైన పవరము నారాయణరాజున కంకితమొసగెను. ఈ నారాయణరాజు "మణి నాగనగర కాంతు"డని పద్యాంతములలోను, "మణి నాగపట్టన విస్రుత ప్రభుతోద్యజ్వలు"డని ప్రథమాశ్వాసాంతమునను జెప్పియున్నాడు. ఇందువల్ల పవరము నారాయణరాజునకు మణి నాగపుర వరాధీశ్వరుడను బిరుదుండెనని తోచుచున్నది. ఈ మణి నాగపురముతోటి సంబంధము చెంజి నాయకులకును గలదు. శకాబ్దము 1593 నకు సరియగు క్రీ. శ. 1670-71 సం. న చెంజి వరదప్పనాయకుడు రామేశ్వరమునుండి మఱలివచ్చుచు మధుర జిల్లాలోని తిరుప్పరన్ కున్రమను గ్రామమున వ్రాయించిన శిలాశాసనములలో దమ పూర్వికు లిరువదియైదు తరములకు ముందు ఆర్యావర్తములోని మణినాగపురమునుండి విజయనగరమునకు వలసవచ్చిరని చెప్పియున్నాడు. (*ARE. 860,861 of 1917*) చెంజి నాయకులకును పవరము వారికిని దప్ప మణినాగపురముతోటి సంబంధ మాంధ్రుల కెవ్వరికిని లేదు. కావున పవరము వారును చెంజి నాయకులు నేక కుటుంబమునకు జెందినవారు కావచ్చును. అగునేని, కువలయాశ్వ చరిత్ర చెంజినాయక రాజ్యమం దుద్భవిల్లిన కావ్యమని చెప్పవచ్చును.

ఈ సందర్భమున చెంజి వరదేంద్రుని చరిత్రను గొంచెము చెప్పవలసియున్నది. ఇతడు చెంజి వెంకటప్పనాయని తమ్ముడు. వెంకటప్పనాయనికి పుత్రసంతానములేదు, కావున క్రీ. శ 1645 మార్చి తే 13 వాడితడు దివంగతుడైన పిమ్మట వరదప్ప నాయకుడు గద్దెనెక్కెను, క్రీ. శ. 1649 జనవరినెల యందు బిజాపుర దండనాయకునకు చెంజిని కైవసము గావించెను. (*N. Macleod: De Oost Inbische Compaghie alls see mogen dhied, Vol II, pp 186, 407*). ఇంతటితో చెంజి నాయక రాజ్య చరిత్ర సమాప్తమాయెను. కావున తిరువెంగళార్యకవి చెంజి వరదేంద్రుసభ నుండు కెక్కినది క్రీ. శ. 1635 39 మధ్య కాలమున నైయుండవలయును. పై నుదాహృతములైన తిరుప్పరన్ కున్ర శాసనముల నాధారపరచుకొని జయంతి రామయ్యపంతులుగారు వరదప్పనాయకుడును తిరువెంగళార్యుడును క్రీ. శ. 1670 ప్రాంతము నుండిరని చంపూరామాయణ పీఠికయందు వ్రాసియున్నారు. వరదప్పనాయకుడు రాజ్యభ్రష్టుడైన పిమ్మట మధురనాయకుల నాశ్రయించి తిరుచినాపల్లి యందుండెను. చొక్కనాథ నాయకు డితని నిజ రాజ్యమున బునః ప్రతిష్ఠితుని జేయుటకు ప్రయత్నించెను కాని సాధ్య పడదాయెను. (*See History of the Nayaks of Madurs, pp. 155-6*) ప్రవాసకాలమందు వరదప్ప నాయకుడు దన యాస్థానమున కవులను పోషించెననుటకంటె రాజ్యకాలముననె కవుల కాశ్రయ మొసగెనని తలంచుట సమంజసము. కావున తిరువెంగళార్యకవి 17 వ శతాబ్ద మధ్యమున నితని శిష్యుడు బుచ్చేద కవి వేంకటాచలపతి యా శతాబ్దోత్తరార్ధమునను వెలసిరని యెంచుట యుక్తము.

పవరము నారాయణరాజు వరదప్పనాయకునకు సమకాలికుడే. క్రీ. శ. 1630 మొదలు 1642 పర్యంతము కర్ణాట సామ్రాజ్యమును పాలించిన ముమ్మడి వేంకటపతి రాయల కితడాశ్రితుడు. 1633 వ సంవత్సరమున తంజావూరు సింహాసనము నెక్కిన విజయరాఘవ నాయకునిచే వందవల్లూరు యుద్ధమున నితడు బరాజితుడాయెను. కువలయాశ్వ చరిత్ర రచయించిన నారాయణ నాయకుడును నప్పటివాడె కావలయును.

..............................................

గిరియు భాషాపోషకులు. చొక్కనాథుడు కామేశ్వర కవికాశ్రయ మొసగెనే కాని గ్రంథరచనకు బురికొల్పినట్లగపడదు. తిమ్మనికి ముద్దళగిరి కుండిన యభిరుచి యతనికి లేదు. ముద్దళగిరి కామేశ్వరకవిని గ్రంథ రచనకు ప్రోత్సహించి యతనిచే సత్యభామా సాంత్వనమును వ్రాయించి యంకితము గొనెను. చొక్కనాథ నాయకుని రాణి మంగమ్మయు గ్రంథ రచనకు గారణభూతురాలైనది. ఆమెకు భాషాభిమానము లేదు; కవులకాశ్రయమిచ్చి వారిని కావ్య రచనకు బురికొల్పలేదు; స్వయముగ గవయిత్రియు గాదు. కాని యామె పేర రెండు గ్రంథములు విరచింపబడెను. మంగమ్మచే నపకృతి నందిన చినవెంగనయను కవి యొక్కడామెను బూతులు దిట్టుచు మధురమంగా పుంశ్చలీవిలాసము, మంగమ్మదండకమను రెండు గ్రంథములను రచించెను. ఎట్లైన నేమి? వాఙ్మయప్రపంచమున తావు సంపాదించుకొన్నది; ధన్యురాలు మహారాణి మంగమ్మ. భాషాపోషకులైన మధుర నాయకులలో నగ్రగణ్యుడు మహారాణి మంగమ్మ మనుమడు విజయరంగ చొక్కనాథ నాయకుడు. ఇతడు కవిజనప్రియుడు. సుప్రసిద్ధులైన కవులకనేకాశ్రయ మొసగి వారిచే సుకావ్యములను రచియింపుచు విద్యావినోదముల విద్వాంసుల గోష్ఠిని కాలము గడపువాడు. విద్వత్సభల కితని కాప్తుడను సాంబ దండినాయకుని తనయుడును, సంగీత సాహిత్య సంస్కృతాంధ్ర కవిత్వపరిజ్ఞుడును విద్యాధికారియునైన గోవిందయామాత్య ప్రగాసవాధిపత్యము వహించువాడు. విజయ రంగ చొక్కనాథ నాయకుని యాస్థానమున వెలసిన కవులలో సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు, శేషము వెంకటపతి, వెలగపూడి కృష్ణయ్య, కుంకుర్తి వేంకటాచలకవి ప్రముఖులు. వీరుగాక వెంకటాద్రి సుతుడు తిరుమల కవియను యక్షగాన కర్తయొక్కడు విజయ రంగ చొక్కనాథుని మన్ననకు పాత్రుడాయెను. విద్యాభిమానియై విద్వాంసులను గవీశ్వరులను, నాటక కర్తలను జేరదీసి వాఙ్మయమును బెంపొందించిన దాక్షిణాత్యాంధ్రనాయక రాజులలో విజయరంగ చొక్కనాథ భూపతి కడపటివాడు.

వాఙ్మయ పోషణయం దేమి గ్రంథరచన యందేమి యొక దాక్షిణాత్యాంధ్రనాయక రాజులనే కాక ఆంధ్రదేశ విద్వత్ప్రభువులనెల్ల నతిశయించిన వారు తంజాపురాంధ్ర నృపాలురు. రఘునాథనాయకుడు తిలకమెత్తువరకును దంజాపూరు సంస్థానమునందాంధ్రభాషకు ప్రాముఖ్యము గలుగలేదు. సెవ్వప్ప నాయకుడుగాని యచ్యుతప్ప నాయకుడు విద్యాభిమానముగల దొరలుగ గన్పింపరు. రఘునాథ నాయక దాక్షిణాత్య భోజుని చెప్పవచ్చును. ఇక్క విద్వాంసుడు, సంగీత సాహిత్య విశారదుడు, ఆం గీర్వాణములు రెంటి యందును, సమాన చాతు ముతో గవిత్వముల్ల జెప్పగల ప్రతిభావంతు కవిజనాశ్రయుడు, వదాన్యుడు, కళాపోషకు శూరుడు. సీతారామ భట్టాచార్యులవారన్నట్లు "రఘునాథుడా — తంజాపుర నాయకరాజ— త్రయమునకు నాయకమణి. ఆయన యెంత వీరుడో యంత రసికుడు. అనేకశాస్త్రాది రాజ్యతంత్రము నెంత సమర్థుడో, సంగీత సాహిత్యములయందం ప్రజ్ఞా ధురంధరుడు.. సంగీత సుధాగ్రంథమును ర యించునంతటి గాయకశేఖరుడు, గొబ్బూరి జగ్గ యాది సమూహము నెంత యవలీలగ నోడించెనో యంత ప్రజ్ఞతో "జయంతసేన" "రామానందము" లను రాగములను కల్పించెను. విజయనగర సామ్రాజ్యమునకు కృష్ణరాయలెట్టివాడో ఈయన తంజాపూరు రాజ్యమున కట్టివాడని చెప్పవచ్చును.—(మా. కొందరు తంజాపూరు కవులు, పండితులు, హైదరాబాదు, 1943, పుట. 138)—రఘునాథ నాయకుని యాస్థానమున ఆంధ్రకవులును గవయిత్రులును ననేకులు వర్ధిల్లిరి. వీరియందు చేమకూర వేంకట కవియు కృష్ణాధ్వరియు ముఖ్యులు. మధురవాణి రామభద్రాంబలను కవయిత్రులిరువురు సంస్కృత ప్రాకృతాంధ్రముల గవనము చెప్పగలవారు రఘునాథుని యాస్థానము నలంకరించియుండిరి; కాని వీరు తెనుగునందు గ్రంథములను రచించినట్లు కానరాదు. రఘునాథనాయకునకు సంస్కృతాంధ్రములు రెంటిలోపలను సంస్కృతము ప్రియతరము, కావున నతని యాస్థానమున సంస్కృత రచయితల కుండిన ప్రాధాన్య మాంధ్రకవులకు లేకపోయినది. విజయరాఘవుని యాగమనముతో నీ స్థితి మారెను.

తండ్రికి దగిన కుమారుడు విజయరాఘవుడు, ఆంధ్రసాహిత్యమునె దృష్టియందుంచుకొని చూచిన తండ్రిని మించినవాడని చెప్పక తప్పదు. విజయరాఘవు డష్టభాషాధురీణుడు, ఆంధ్ర గీర్వాణములు రెంటియందును ఆరితేరిన విద్వాంసుడు, చతుర్విధ కవితానిర్వాహక సార్వభౌమ బిరుదాంగద విరాజమాన చరణాంభోజుడు, గానకళా విశారదుడు, రసజ్ఞుడు, వదాన్యుడు, విద్వత్ప్రియుడు, కవిజన కల్పభూజము. గీర్వాణభాషా విశారదుడైనను సంస్కృతగ్రంథ రచనకు బూనుకొనలేదు. చాలమివలన గాదు, ఆంధ్రమందలి మాలిమివలన. రాజ్య మేలిన నలువది యేండ్లును నిరంతరముగ భాషాసేవయందు కాలము గడిపెను.

కావ్యములు, నాటకములు, కీర్తనలు, పాటలు, పదములు లెక్కకుమించి రచించెను. అతని యంఘ్రి నమరియుండిన సాహిత్యరాయపెండార మతని విద్యావైశారద్యమును ప్రకటించుచుండెడిది, కొలువుకూటము వాణీవిలాసమందిరమె. అందు:—

"భరత సంగీత సాహితీ ప్రముఖ విద్య
లాకృతులు గన్న చందాన సభ్యముఖులు
సరస ముక్తాతపత్ర చామరము లమర
వివిధ బిరుదాంక వాద్యముల్ వెలయనిల్వ"

కొలువుదీరి, విద్యావినోదముల ప్రొద్దుపుచ్చువాడు. నాట్య గాంధర్వ విద్యలయందు ప్రౌఢలైన చంద్రరేఖ, రూపవతి, చంపక, మూర్తి, కోమలవల్లి, లోకనాయిక, శశిరేఖ, రత్నగిరి, భాగీరథి మున్నగు విలాసినీమణులు దమ విద్యాకౌశలము ప్రదర్శించి యానందాంబుధి నోలలాడించువారు. విజయరాఘవుని కొలువుకూటమునకు ప్రధానాంగము శారదాధ్వజము.

సోమశేఖర శర్మగారు వచించినట్లు "విజయరాఘవుని కాలమున తంజావూరిరాజ కొలువుకూటము నిజముగా గనులపండువు సేయు శారదా నాట్యమందిరమే. సంగీతనాట్యములందు సయితము విజయరాఘవుని దండ జేసిన చేయి. అతడు నవరసికులకెల్ల నాయకుడు"—(శ్రీ. రఘునాథ నాయకాభ్యుదయము, రఘునాథాభ్యుదయము. పీఠిక, పుట. 39.)—కావున కవి పండిత జనమును బోలి, సంగీతనాట్య విద్యలలో గడితేఱిన కళావిశారదులెల్ల దమ విద్యాకౌశల్యమును జూపి "సాహిత్యరాయ"ని మెప్పించి సత్కారమును బడయుటకై కొలువుకూటమునకు మూగువారు. విజయరాఘవుని కాలమున తంజావూరాస్థానమున వెలసిన కవులలో వెంగల్వ కాళకవి ముఖ్యుడు, ఇతఁడు కవిమాత్రుడు గాడు. కవిత్వమందువలె గాంధర్వ నాట్య విద్యలయందు నిపుణుడు. రఘునాథుని కాలమునుండియు సంస్థానము నలంకరించియుండిన రామభద్రాంబ, కృష్ణాజీ మొదలగు కవయిత్రులకు విద్యాగురువై విజయరాఘవుని మన్ననకు పాత్రుడైనవాడు. కాళకవిగాక విజయరాఘవునిపుత్రుడు మన్నారుదేవుడును కోనేటి దీక్షిత, పురుషోత్తమ దీక్షిత వేంకట సోమయాజులును యక్షగాన కృతులను రచించి వాసికెక్కిరి. సంగీత సాహిత్య విద్యలందు చతురులై విజయరాఘవుని యాస్థానమునకు పేరు తెచ్చిన కవయిత్రులలో చంద్రరేఖ, కృష్ణాజీ రంగాజులు ప్రముఖులు. మొదటివారిద్దరి కవితాకౌశలమును కాళకవి విశేషముగ ప్రశంసించియున్నాడు. చంద్రరేఖ సామాన్యురాలు గాదు.

కాని చంద్రరేఖయు కృష్ణాజియు దాత్కాలికముగ దమ విద్యాచాతుర్యమును ప్రకటించి సమకాలికుల మన్ననలచే దృప్తులైరే కాని శాశ్వతకీర్తిని గోరి గ్రంథ రచనకు గడగిన ట్లగపడదు. వాగ్గేయకారుని శారీరమువలె వీరి విద్యా వైశారద్యమంతయు వసివాడ లేక మాసిపోయినది. రంగాజి వీరియంతటి జాణ గాకపోయినను పాండిత్యమునను కవిత్వనైపుణ్యమునను వీరికి దీసిపోయినది కాదు. తన సామర్థ్యము నంతటిని కావ్యనిర్మాణమందె వినియోగించి, బహుగ్రంథకర్త్రియై యాంధ్ర కవయిత్రులలో నత్యున్నతస్థానము నాక్రమించినది. రంగాజి విజయరాఘవునికి గరము ప్రియురాలు. ఈమె కాతడు కనకాభిషేకము జేసెనట. 'అచ్యుతవిజయరాఘవసార్వభౌము ధర్మపత్నియై రంగుమీఱు రంగాజమ్మ" యని ప్రకటించుకొనినది. ఇది సంశయాస్పదము. రఘునాథనాయకుని భార్యలమని చెప్పుకొనిన మధురవాణీ, రామభద్రాంబలవలె నీమెయు వారవనిత యగునేమొ! ఎవ్వతెయైన నేమి? శారదా కటాక్షములకు గురియై పవిత్రురాలై నుతికెక్కినది.



# స్త్రీల గేయ కథలు



'కృష్ణశ్రీ'

శ్రీ సీతామ్మవారి అలక, సీత ఘడియవంటివి వినోద కథాగేయాలు, మన జీవితాలలోని సుందర సన్నివేశాలలో పురాణవ్యక్తుల్ని ప్రవేశపెట్టి రచించి నట్టుంటాయి. వీటిలో చెప్పుకోదగినంత కథ గానీ, గుర్తించగలిగినంత రచన గానీ కనపడవు. కాని పురాణ కథల్నీ, చారిత్రిక గాథల్నీ, అనుశ్రుతిగా వచ్చే గాథల్నీ వస్తువుగా పెట్టుకుని రచించిన గేయ కథలు చాలా ఉన్నాయి స్త్రీలపాటలలో. వీటిలో రచనా, సందేశమూ ప్రత్యేకంగానూ కనపడతాయీ, కలిసీ కనపడతాయి. రచనాభాగము గౌణమూ సందేశమే ప్రధానమూ అయిన గేయాలు.

## వ్రతాల పాటలు

ఇవి కేవలము ప్రభుసమ్మితంగా వ్రతాలు చేయడమువల్ల కలిగే ఫలితాల్ని బోధపరుస్తాయి. శ్రీ లాంత్రపు వెంకటరావుగారు 'స్త్రీల వ్రత కథలు' అని నూరింటిని సంపుటీకరించి ప్రచురించారు. అందులో పదింటికి పాట లున్నాయి. కామేశ్వరి వ్రతానికీ శ్రావణ శుక్రవారానికీ కూడా పాట లున్నాయి. ఇవన్నీ తక్కిన స్త్రీల పాటలవలెనే 'తకిటతక'లు నాలుగుగాని ఎనిమిదిగాని ఉన్న పాదాలతోనో, 'కిటతక'లు నాలుగో ఎనిమిదో వున్న పాదాలతోనో, ద్విపదల్లోనో వున్నాయి. ఆవృతాలు నాలుగున్నా ఎనిమిదున్నా చివ్వరి ఆవృతములో మట్టుకు సాహిత్యాక్షరాలు నిండుగా వుండక శ్రావణ మంగళవారము పాటలోలాగ ఒకే దీర్ఘాక్షరముతోనో, చిట్టిబొట్టులోవలె రెండు హ్రస్వాక్షరాలతోనో, చిల్లచిత్తి నోములోవలె రెండు దీర్ఘాక్షరాలతోనో ఉంటాయి. ద్విపదలలో వున్న పాటల్లోవిమాత్రము నిండుపాదాలే. అయితే ఒకొక్కప్పుడు ఈ ద్విపదలలో మామూలు ద్విపదిపాదాలకి మారు నాలుగు 'కిటతకి'టలు గల పాదాలుకూడా ప్రవేశిస్తుంటాయి. (అన్నము ముట్టని ఆదివారాలకథ, లింగదాన కథ చూడండి) కాని ఏపాదాని కాపాదము వేరు. జంట పాదాలుంటే రెండోపాదము చివ్వరి ఆవృతము నిండు అక్షరాలతో వుండదు. ఒక్క పెండ్లిగుమ్మడి గౌరి నోములో మాత్రము

> పెండ్లిగుమ్మడిగౌరి చేరక్కపట్టింది
> ఇండ్లవాకిండ్లలో నెప్పుడు కల్యాణాలె

అని ఎనిమిది నిండు 'తకిటతక' ఆవృతాలు కనబడుతున్నాయి. ఇలా వుండడము చాలా అరుదు.

వీటిలో యతులూ ప్రాసలూ తప్పకుండా పడతాయి. వచనములోనున్న వ్రతకథల్లోకూడా అడపాదడపా యతులూ ప్రాసలూ పడుతూనే వుంటాయి. కడుపు చెవరని గౌరిదేవినోము కథలో ముసలి ముత్తైదువగా వచ్చిన పార్వతిదేవి

> 'బుద్ధిమంతురాలైన పుణ్యకాలిని వేగాని .
> భక్తిశ్రద్ధలున్న భాగ్యశాలిని వేగాని
> అన్నిశుభములు గల యదృష్టశాలిని వేగాని
> గర్భదోషమున్న ట్లగపడుచున్నావు కాంతా,

అంటుంది. అంగరాగాల నోము కథనిండా యతులూ, ప్రాసలూ, విరివిగా వున్నాయి. ఇంతకు మించిన రచన కనబడదు వీటిలో. 'సోచేటి పద్మము'లో ఒక్క దానిలోమాత్రము సాయంకాల వర్ణన

> సోచేటి పద్మముకు పట్టేటివేళ
> వెుగ్గల తామర్లు పూసేటివేళ
> కాకరాపువ్వుల్లు పూసేటివేళ
> కడవలతో నుదకమ్ము తెచ్చేటివేళ.
> ..........................

అని చక్కని స్వభావోక్తితో కనబడుతోంది. శ్రావణ మంగళవారపుపాటలోని

'ఈశ్వరపుత్రునీ గజావతారునీ
పార్వతీతనయునీ భక్తితోనూ'

అనే పాదాల్ని గణవిభజన చేసి, సీసపద్యము దిగివచ్చిన పాటల సోపానాల్లో ఈపాట కడపటి దన్నారు. కీ॥ శే॥ తేకుమళ్లరాజగోపాలరావుగారు. అంటే ఇది నన్నయకు పూర్వపు పాట అని వారి అభిప్రాయము. ఈపాటలు 'కిటతకిట' అనే అయిదక్షరాల ఎనిమిది ఆవృతాల పాదాలతో వుంటాయనీ, చివ్వరి ఆవృతము, సాగదీతకీ రెండోపాదపు పాట వరసతో అందుకోడానికీ వీలుగా ఒక దీర్ఘాక్షరముతోనో, రెండు హ్రస్వాక్షరాలతోనో, రెండు దీర్ఘాక్షరాలతోనో ముగుస్తుందనీ గ్రహిస్తే, ఈ చివ్వరి ఆవృతానికుండే తక్కువ సాహిత్యాక్షరాలమీద ఆధారపడి గణవిభజన చెయ్యడము సరికాదని బోధపడుతుంది. అయితే, నన్నయకాలంలో వాడుకలో నుండిన (వేములవాడ కవి 'మీనమాసము' వంటి) సౌరమానపుమాసాల పేర్లుకాక చాంద్రమానపు శ్రావణ, ఇత్యాది మాసాలే వీటిలో కనబడుతూండడాన్ని బట్టీ, బసవేశ్వరుని వీరశైవమత విజృంభణము తర్వాతే వెలిసిన 'జంగమావతారాలు' వీటిలో గోచరించడాన్ని బట్టీ, ఈ పాటలు మహా అయితే 13, 14 శతాబ్దాలకంటె పూర్వపువి అయివుండవనిపిస్తోంది. ఈపాటలన్నిటా కనబడే ద్విపదవరసలూ, వీటి శైవ వాతావరణమూ, వీటిలోని బ్రాహ్మణపూజలూ చూస్తే ఇవి కన్నడదేశపు వీరశైవములోకాక, పండితారాధ్యులూ, పాల్కురికి సోమనాథులూ వేదసమ్మత వీరశైవంతో, స్త్రీలకు అంతవరకూ లేని ప్రత్యేక పూజాధికారం కలిగించడానికి అవతరించాయేమో అనిపిస్తోంది. ఈ వ్రతాలు నాలుగుజాతులవారూ పట్టడానికి వీలుండడమూ, 'చాకలిపోలి' వంటి (మడివేలు మాచయ్య వర్గము) వారికి ప్రత్యేక గౌరవాలు ఇవ్వడమూ గమనించినా వీటి శైవబాంధవ్యము కనబడుతుంది. "నోచిన నోములకు గౌరియే కర్త" అన్న గంగాగౌరీ సంవాదంలోని శివవాక్యముకూడా ఈ అభిప్రాయానికి మద్దత్తు.

వ్రతాల పాటలు చెప్పిన తర్వాత గోవిందనామాలు చెప్పాలేమో. వీటిలో కిటతకిట అనే రెండు ఆవృతాలతర్వాత 'గోవిందారాము' అనో, గోవిందా అనో వచ్చితీరాలి కనక కల్పనకి అంతగా ఊపిరి తిరగదు. కేవలము రామాయణకథల్ని నెమరు వేయించడమే గోవిందనామముల ఉద్దేశం. శాంత గోవిందనామాలు శాంతాదేవి కథనీ, శ్రీ గోవిందనామాలు రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల వివాహమునూ, పెండ్లిగోవిందనామాలు బాలకాండమునూ, అడవి గోవిందనామాలు అయోధ్యకాండము మొదలు యుద్ధకాండమువరకూనూ, సేతుగోవిందనామాలు సీతారాముల అయోధ్యాప్రయాణాన్నీ వర్ణిస్తాయి. వీటిలో అక్కడక్కడ మెరిసే తళుకు లేవో కొద్దిగా వున్నా మొత్తమంతా సాధారణ కథనమే. ఘటనలన్నీ మన పెళ్ళిళ్లలో జరిగేవే. బుగ్గపోట్లదగ్గిర్నుంచీ, యుక్తాయుక్తాల బాధలేకుండా జరిపించేస్తారు రచయితలీపాటల్లో. 'శ్రీ గోవిందనామాలలోనూ, పెండ్లి గోవిందనామాలలోనూ, దశరథుడు 'లంకాపురి' బాణసంచా కాల్పించాడట! సుషేణుడు (ఏదో) సూత్రధారం పోసేడట! సుగ్రీవుడువచ్చి లాజలుపోని లాజకట్నము పుచ్చుకున్నాడట రాముడి పెళ్ళిలో! ఈ రామాయణగాథలన్నీ వినోదార్థమే. ఇవి స్త్రీలే రచించివుండినా వుండవచ్చు. వీటిలో సంధులకీ, మాటలసవారీకీ, ఆటవిడుపు ... ఇవేకాక రామాయణాన్నే రకరకాలుగా చెప్పే పాటలూ, శ్రీరామదండకములూ, శ్రీ రామస్తుతీ, చిట్టిరామాయణమూ వంటివి చాలా వున్నాయి. 'రామాయణము పుణ్యకథ, అది వింటే పాపాలుపోతాయి; శ్రీరాముల కరుణ మన మీద ప్రసరిస్తుంది, అనే నమ్మకమే ఈ పాటల రచనకీ వర్ధింపుకీ ముఖ్యకారణము. స్త్రీలపాట లన్నిటిలోనూ 'పాడినవారికి బ్రహ్మలోకము, విన్నవారికి విష్ణులోకము' ఫలశ్రుతిలో వాగ్దానము చేస్తారు రచయితలు. ఈ అలవాటు దేశసారస్వతమంతటా వ్యాపించి చివరకు పండిత వాఙ్మయంలోకి కూడా ప్రవేశించింది.

కల్పన వీటికంటే కొంత మేలుగావున్న పురాణగాథల పాటలు పారుజాతపల్లవి, గజేంద్రమోక్షణ కథాగీతమూ, వామనచరిత్రమూ తులసీదళమూ అన్నవి నాలుగున్నాయి. వీటిలో గజేంద్రమోక్షము పోతనగారి రచనని "వినవే పల్లవ మృదుచరణా, కరుణాభరణా" అన్న అధ్యాత్మరామాయణపు ఆనందభైరవి కీర్తన వరుసలో తిప్పి రాసినట్టు కనబడుతుంది. ఉపక్రమణిక మొదలు, ఫలశ్రుతివరకూ మూలములోని పదాలూ, సమాసాలూ కూడా దింపేస్తూ రచించడము ఎంతో కష్టపడితేనేకాని సాధ్యము కాదు. పారుజాతపల్లవిలో నంది తిమ్మనగారి పారిజాతాపహరణగాథనే చెప్పి, "మగవీల నగజాలు తెగగీటు కొనువాలు కనుగవకోకవింత కాంతిమొదవ" నన్న పద్యభావమూ, "కనకపంజరశారికలకు బువ్వము పెట్టి, చదివింప కేలకో సకియలిపుడు" అన్న పద్యభావమూ, ఇంకా అక్కడక్కడి పాదాలూ ఇమిడ్చి రచించినప్పటికీ,

కథ మొత్తమ్మీద రచయితే నడిపినట్లున్నది. అలిగిన సత్యభామపర్యంకము పక్కకి కృష్ణుడు వచ్చి పన్నీరు చల్లి సురటితో విసిరినప్పుడు చెలికత్తెలు సత్యభామని ఊరడించడము మొదలు పెడతారు. ఆమె 'నాతులారా మీరు నగధరునివారు గాదా, ఈ నగ లెక్కడ నేర్చిరో'ని వారిని తిట్టుతుంది. కృష్ణుడికి ఇక్కడ అటూ ఇటూ మొత్తని దెబ్బలు తగుల్తాయి. కాని ఆయనగారి గడుసుదనము చూడండి: కమలాక్షులమాటలు విని నాపయి కరుణదప్పచేశా అంటాడు. సత్యభామకి మద్దత్తు వచ్చిన చెలికత్తెలమీద ఆమే, కృష్ణుడూ కూడా దెబ్బ తీశారు. ఇప్పటిరంగము కృష్ణుడు వచ్చినప్పటికంటె నయమైందీ, సత్యభామ మాట్లాడుతోంది! ఇంక ఆమెని అలకతీర్చడ మెంతసేపూ? ఈపాట...

శ్రీకృష్ణుం, డొకనాడూ,
శృంగారా, హారుండై,
కిటతక కిటతక, కిటతక కిటతక,
కిటతక కిటతక, కిటతక కిటతక
శ్రీ కాంతామణి, నగరుకు, వచ్చెను,
కిటతక కిటతక, కిటతక కిటతక
చెలువముతో, దుతినా......॥
కిటతక కిటతక, కిటతక కిటతక

అని ఎనిమిదక్షరాల ఆవృతాలు నాలుగూ నాలుగూ ఎనిమిదింటితో నడుస్తోంది. మొదటిభాగానికి సాహిత్యాక్షరాలు తగ్గించడమువల్ల నడక నిరంతరాయమై పాటగా పరిణమించింది.

వామన చరిత్రము ద్విపదలలో ఉన్నది. ఇది కూడా పోతనగారి వామనచరిత్ర సీసాలలోనే శైలుజేరి నట్లు రసఘట్టాలలోని 'వారులు నాకూ గారు నే నోరుల కగుదు' 'ధామములు పురములూ కనకసౌధములూ, సింహాసనంబులూ గజఅశ్వములునూ, యిన్ని సంపత్తులూ యిట నిండియుండ, కోరితి వకవెజ్జ దానంబు యిపుడు' 'నారాయణుడు క్రిందు నేను మీదాయె' అన్న పాదాలు చక్కగా సాక్ష్యమిస్తూన్నా, రచయిత సొంతకల్పనలుకూడా చేసినట్లు అంతా చదివితే తెలుస్తుంది. వామనుడు 'బ్రహ్మేంద్ర రుద్రులు బ్రస్తుతిచేయ, తుంబురు నారదులు గానంబుసేయ, రంభ పూర్వసి మేనకలు నాట్యమాడ, దశ దిక్కులా కాంతిదీప్తితో వెలుగ, కోటిసూర్యుల కాంతి తేజంబు గనగ, ముక్కోటి దేవతల్ మురియుచూజూడ' అదితి కుదయించినాడట. అతని ఉపనయనవేళ, 'సావిత్రి తాయిచ్చె మరల భిక్షంబు, గాయత్రి తాయిచ్చె మూడవసారి, శ్రీలక్ష్మి తాయిచ్చె సిరిసంపదాలు, సరస్వతి తాయిచ్చె సకలవిద్యలునూ, శివుడు పార్వతి యిచ్చె తేజస్సు బలము, బ్రహ్మేంద్ర రుద్రులును సురులును మునులు, భక్తి తమ తేజస్సు' నిచ్చారట అందరూ! బలిని ఏమిదాన మడిగమంటావయ్యా అని వామనుడు కశ్యపప్రజాపతి నడిగితే, "కటకట కార్యంబుకర్తయయితాను మాయకలనగాను నన్నడుగుచుండె'నని మనసులో అనుకుని 'పృథ్వీ మూడడుగులడుగుమీ' అని చెప్పినాడట...'తులసీదళము' తులాభారగాథ. ఎన్నడో ద్వాపరయుగవృత్తులగాథలాగ కాక, నేడు జరుగుతూన్నట్టుగా వర్ణించాడు రచయిత. ఈకథలోని పాత్రములన్నీ సజీవములు. నారదుడు ద్వారకాపురమంతా తిరిగి ఒక ఊహచేసి, సత్యభామఇంటికి వెళ్ళి 'తులసిపూజచేసితేను తోయజాక్షీ నీకు వేగ వైకుంఠపదవి వచ్చు'నని చెప్పినాడట. ముందు జన్మములోకూడా కృష్ణుడే భర్త కావడానికి వ్రతము చెప్పమంటే పుణ్యవ్రతము చెప్పేడు. 'ఇంతకన్న గొప్పైనదానమున్న దెల్పుమనగ దీని మించినట్టి వ్రతము నేను యెరుగన'న్నాడు. అప్పుడు సత్యభామ 'నానాథు కృష్ణమూర్తి యెచటనున్న గాని మీరు యిచటదెచ్చి నిల్పరమ్మ' అని చెలికత్తెల్ని పంపింది. తాను గబగబా వ్రతానికి తయారయిపోతూ, నారదుడితో 'పతిని దానమిచ్చినట్టి వనితబ్రదుకు దారి జెప్పు' మన్నది. తపసి నవ్వి, 'దానమిచ్చినట్టి భర్తను అతనియెత్తు కనకమిస్తే తిరిగి యిత్తు'రన్నాడు. అయితే సరే నన్నది. తీరా దానమివ్వబోతే 'దానమందు కెవరు నతడు దైవమనుచునూ' నారదుడే దానము పట్టేడు. 'కృష్ణునెత్తు కనకమిత్తు నాదుపతిని నాకు యిమ్మ'ని తూచింది. కోటలోనువున్న వరహాలు, మొహరీలు, యింటనున్న పలకసరులూ, పతకములూ, యిరుగు పొరుగుసొమ్ములు, సత్రజిత్తు డిచ్చిన ముత్యసరులూ, యింద్రలోకమునుంచి తెచ్చిన కనకమూ, నరకాసురుని మూలధనమూ, అష్టభార్యలెల్ల దాచుకున్న ధనమూ, (ఇవన్నీ సత్యభామయింట్లో వున్నవి!) పదహారు వేల గోపికాకాంతల సొమ్ములూ, ద్వారకాపురవాసుల కనకమంతానూ, 'కొండపొడవు ధనములెల్ల కుప్పబోసి తూచగాను తూగడాయె కృష్ణమూర్తి దుడుకుచేతనూ' అప్పుడు సత్యభామ చింతనొందితే, 'పట్టంపుదేవియయిన భామ రుక్మిణీదేవిచెంత కేరి చెప్పు' కొమ్మన్నాడు. ఆమె 'కోటిపంతములవల్ల మాట లేక పోయెగాని వ్రాలుతప్ప నలదికా దిజునికైననూ' అనుకొని రుక్మిణిని చేరి మొక్కినది. జరిగినది చెప్పి, 'కొండపొడవు కనకరాశి గొప్పముత్యసరములెల్ల నిండు

గాను వేసినాను తూగడాయెను । నావల్ల కాకపోయి సిగ్గుచేత మోమువంచి మిమ్ము చేరి మొక్కినాను చిన్న దానను॥' అన్నది సత్యభామ. ఈమె రుక్మిణీదేవిని 'మీరు' అని మన్నిస్తుంది. రుక్మిణీదేవి ఈమెని మందలిస్తూ, 'పట్టంపుదేవినయిన నేను యిదట నుండగాను నీకు యింతిసాహసం బె వేశ్యకాంతరో' అంది. సత్యభామని 'వేశ్యకాంతరో' అనడము వింతగా కనబడుతోంది. 'పారిజాత పల్లవి'లో పారిజాతానికి పూచిన పూవులన్నీ తుమ్మెదలయి రుక్మిణిపయి వ్రాలినవట. అప్పుడు కృష్ణుడు 'వేశ్యకాంతవు గనుక నీవు పువ్వులన్నీ ముట్టరాదు' అంటాడు. వేశ్యకాంతా సత్యభామ? 'సుభద్రసారె'లో కృష్ణుడిచ్చిన కోకచీరలూ, పట్టుచీరలూ, గుండుగిన్నెలూ, పతకాల పేర్లూ, వారాల సొమ్ములూ పుచ్చుకుని అత్తవారింటికి వెళ్లుతూ సుభద్ర అందరితోనూ చెప్పినట్లే సత్యభామతో గాబోలు 'పోన్నారి మా వదిన పోయి వచ్చెదను' అని చెప్పగా ఆమె ఆక్కసుతో 'యిల్లూ విరుచుకుపొమ్మరో ముద్దుగుమ్మ, యెంతే ధాన్యంబు యెత్తుకొని పొమ్మ, వండీ వంటకము యెత్తుకొని పొమ్మ, కాళ్ల మట్టెలజోడు దీసికొనిపొమ్మ, కట్టుకొనుబట్ట వకటి యుంచకుము' అన్నది. ఈమాటలు సుభద్రమ్మవల్ల విని, 'కొన్నమానివియంటె కొదువేమి మనకు' అని కృష్ణుడు చెల్లెల్ని సముదాయించాడు. రుక్మిణీదేవి సీమంతానికి సత్యభామ రాలేదు. ఆమె అలిగిందీ, అలకలు తీర్చమని తన మెడలోని నక్షత్ర కంఠమాల తీసి 'పంకజాక్షీ రుక్మిణి తన సతిచేతికి నందిచ్చి'నదట. కృష్ణుడు దాన్ని పట్టుకెళ్ళి 'పచ్చలపతకము దక్షిని పంకజాక్షిరో జూడవే' అని సత్యాంగన కిచ్చాడు. ఈ ఆఖరి రెండింటిలోనూ సత్యభామ ధనాశా, అలంకార ప్రియత్వమూ మాత్రమే కనబడుతూన్నా, మొదటి రెండింటిలోనూ 'వేశ్యాంగన' అని వుండడము చిత్రమే.

వస్తుకల్పనా, భావకల్పనా కూడా వున్న కథ కావ్యాలు స్త్రీలసారస్వతములో చాలా వున్నాయి. ఇవి రామాయణగాథలో, కృష్ణగాథలో, భారత గాథలో, ఇతర పురాణగాథలో అవుతాయి సామాన్యంగా. వెంకటేశ్వర్లవారి వేట, సవతుల కయ్యమూ అనే వైష్ణవగాథలూ; వశిష్ఠవాక్యములూ, వేదాంత కుచ్చెల కథావంటి తత్వాలూ; తిరుమంత్రమూ, ధర్మాంగదా, సారంగధరావంటి చారిత్రిక గాథలూ కూడా వీటిలో కొన్ని కలవు. క్లిష్టమైన భారత గాథల్లో స్త్రీలకి సరదా తక్కువ. ఆకథల్లో రాజ్యం కోసము రాజులు పడేపాట్లూ, పెట్టే హింసలూ, వాటికి ప్రతీకారాలూ, చూస్తే స్త్రీలకి విసుగూ అసహ్యమూ వేస్తాయి. మానవసామాన్యమైన కష్టసుఖాలే వారి సరళ మనస్సులకు పట్టగలవు. అందువల్లనే అంత భారతగాథకీ, ధర్మరాజు జూదమూ, ద్రౌపదీ మానసంరక్షణమూ, కీచకవధా అనే మూడుగాథలే వారికి వచ్చాయి. 'ధర్మరాజు జూదము'లో కథాకల్పన చక్కగా ఉంది. తెలిసి అధఃపతనము పొందేవారి కర్మముమీద ఈ రచయిత్రులకు జాలి లేదు. పరులు జూదానికి పిలిస్తే వెళ్ళితీరాలి అనే రాజకీయ సమయాల మీద ఈకవులకు గౌరవము లేదు. అందుకే 'ధర్మరాజు జూదము'లో ఓంప్రథమములోనే 'చావు పుట్టుక తెలియు సహదేవుడి' చేత ధర్మరాజుకి 'అడకుమీ జూదములు ఓపిలోకయ్య, ఓయన్న యెట్లయిన నామాట వినుమా, పకులు చూపెగ మన సతి చెరలు బడునూ' అని చెప్పించాడు కవి. జూదములో మొదట ధర్మరాజుకే చిక్కిందట కనకము. అప్పుడు రారాజు పాచికలు శకునికిచ్చి తానువెళ్ళి పెద్దమ్మకి ప్రార్థియపడ్డాడట. పెద్దమ్మ భీమునితో తనకు గల పాతకోపము తీర్చుకుందామని సంకల్పించి, మహాలక్ష్మిని చేరి, ధర్మరాజుని విడచి రారాజును పొందమని అడిగింది. లక్ష్మి 'అలికి విడిచిన గడప దాటనే రాజు, దివ్వెలేని గృహము చూడనే రాజు' అని ధర్మరాజు చేయని అమంగళ కార్యాలన్నిటినీ ఏకరువు పెట్టింది. జ్యేష్ఠాదేవికి కోపమువచ్చి ఎఱ్ఱగా చూచింది. లక్ష్మికి రారాజును పొందక తప్పిందికాదు. 'తప్పక ధర్మజులు తమ కోడిరపుకు! గాంధారుడు ద్రౌపదిని తీసుకు రాలేకపోతే దుశ్శాసనుడు వెళ్ళి జుట్టుపట్టి ఈడ్చుకువచ్చాడు. దుర్యోధనుడు 'మేడలను మహలులు మల్లె సాలెలు, సరి మంచమెక్కవే సకియ నాతోడ, నాయొక్క తొడలపై ద్రౌపదీ యెక్క' మన్నాడు. ద్రౌపది 'నీయొక్క తొడలపై నత్తమ్మ యెక్క, నీమంచ మెక్క నీతల్లి గాంధారి' అని చెప్పుతో కొట్టినట్లు జవాబిచ్చి 'గాడిద యిది యెంత గజమానవోరి, ధర్మరాజుతో సరియగున సకలరాజులు' అన్నది. మానభంగము చెయ్యమన్నాడు రారాజు. కృష్ణుణ్ణి వేడుకుని అక్షయవలువలు పొందింది. 'ఏమినోము నోచితివే పాంచాలి నీవు' అని స్త్రీలడుగగా 'విష్ణుక్రాంత నోచితి'ని అని చెప్పింది. ద్రౌపదిమీద రచయిత్రికి అభిమానము హెచ్చింది. అందరూ విన్న భారత గాథని తోక్కేసి నడిచి పోయాడు. 'ధర్మరాజుతో జూదమ్ము ఆడలేదిగాని తెవతోటి జూదమ్ము ఆడుమని' పలికింది ద్రౌపది. సింహాసనముమీద రాజూ, కూర్మాసనముమీద పాంచాలీ కూర్చున్నారట. పాపకర్ముని

ముఖము తా జూపనని మధ్య తెర వేయించిందట ద్రౌపది. రారాజు తన చేత పాచికలు వేస్తే పాంచాలి కాళ్ళతో వేసిందట పాచికలు. ధర్మరాజు ఓడిపోయినవన్నీ గెలుచుకున్నది పాంచాలి. శకుని వచ్చి వద్దని ప్రతి దూలితే 'ఆట చాలించవే రాజులరాజు.' తర్వాత ధృతరాష్ట్రునికడ ఏవురుపతులనూ కోరుకొని వనములకు పోయెనట పాంచాలి. ఇక్కడ మళ్ళీ అసలు కథతో అతుకు కలిపేడు కవి. కోపమూ, జాలీ వచ్చినచోట్ల 'గాజు మెరసి లేను పుష్యరాగ మునునా, కాలువ లెన్నయిన కలసి పారితే గంగానదితోటి సాటియగు నటరా' అంటూ నిదర్శనపరంపర ఇవ్వడంలోనూ, 'అడి విడిచిన జలములాడెడె రాజు, నే ధర్మనందనుని యెడబాయ లేనె - కట్టి విడిచిన వస్త్రములు కట్టడే రాజు నే ధర్మనందనుని యెడబాయలేనె' అని మళ్ళీ మళ్ళీ ఉటంకించడములోనూ కనబడుతుంది గాని, కవి, కల్పన అలంకారాలజోలికి పోడు. 'ద్రౌపది వల్వలు' అనే పాటకికూడా ద్రౌపదీమానసంరక్షణమే వస్తువు. ఈ రచయిత భారతగాథ నే క్లుప్తముగా చెప్పి, కృష్ణస్తవమునుమాత్రము పొడిగించినాడు. ఈతడెవరో వైష్ణవుడో యేమో, 'భోగేంద్రుమీదను నిద్రించినావా, వటపత్ర మీమపయి శయనించినావా, శబరి యెంగిలిపండ్లు దవిజూచి మోక్షమిచ్చిన భూరిప్రేమ' అంటూ ప్రపన్నలభావాల్ని దంపగుచ్చి, తాను కథ చెప్పడానికి ఉపయోగించిన ద్విపద ఛందము నతిక్రమించి,

'మెరవినము శ్రీకృష్ణ మెరవినము లోకేశ
మెరవినము కమలనాభా'

అనీ,

'ఈరీతి మెర పెట్టి వింతిపయి కరుణించి
యిచ్చె నక్షయ వల్వలూ'

అనీ పాటలలోకి గెంతేడు. 'లక్ష్మీదేవి సొగటాలాట' కూడా ద్రౌపదికి వలువలిచ్చే కథనే ద్వారకనించి చూచి వల్లె వర్ణిస్తుంది.

'పండు పాట' అనే పాట ద్రౌపదియొక్క అరవ పతికొంతుని చెప్పే మిషతో స్త్రీలను దిగదిసే ఛండాలపు పాట. ద్రౌపది పురుషుడూ, పాండవులు భార్యలూ అయివుంటే ఈపాట సిసలైన సత్యమై యుండేది. దీని ఛందస్సుకూడా దీని ఒక్కదానిదే.

ఇక భారతగాథలలో మిగిలినది 'కీచకవధ.' ఇది ధర్మరాజు జూదము ప్రారంభించిన పంక్తులతోనే ప్రారంభిస్తుంది. ధర్మరాజు జూదములో కడ పంక్తి 'విరటు పట్నముజొచ్చె వీరశేఖరులు' అన్నది 'విరటుని గొలిచిరే వీరశేఖరులు' అని ఈ కీచకవధలో వినబడుతోంది. రెండింటి ఛందమూ ఒక్కటే. ఆవేశము వచ్చినపట్ల రెండింటిలోనూ ఆ మ్రేడితాలు కనబడుతున్నాయి. 'కృష్ణ శే కృష్ణ శే కృష్ణమ్మ శేశే' అన్న ప్రార్థనా, మరికొన్ని పంక్తులూ రెండింటిలోనూ వున్నాయి. కనక ఈ రెండు పాటలూ రచించిన రచయిత ఒక్కడే అనిపిస్తోంది.

శ్రీ కృష్ణుని గాథలు స్త్రీల కథా కావ్యాల్లో చాలావున్నాయి. వీటన్నిటిలోనూ శ్రీ కృష్ణుడు అతిలోక వ్యక్తి. శిరమున చింతామణి, నాలుకను నక్షత్రమూ, పండ్ల పరుసవేదీ, భుజమందు శంఖు చక్రములూ, వీపున వింజామరా, బొడ్డున పారిజాతం, అరికాళ్ళ తామరపద్మమూతో జన్మించాడు. తలతో కాక యెదురు కాళ్ళను బుట్టినాడు. పుట్టినవెంటనే "నన్నేల యెత్తుకొనవే నా తల్లి దేవకీ వందనంబు" అన్నాడు. ఆమె గంగను ప్రార్థించి స్నానముచేసి రెండుహస్తములతో యెత్తుకొని 'నీరూపు నీచక్కనా ఆ బ్రహ్మ యెన్నాళ్లి వ్రాసె తండ్రి' అని దుఃఖిస్తే ఆమెను ఊరుకోబెట్టడానికి పెద్దబొబ్బలు పెట్టి ఏడ్చేడు. 'అల్లదుగో బూచివాడు' అన్నది. 'బూచేమి చేయునమ్మ నా తల్లి బూచి నన్నేమగునమ్మ' అన్నాడు. మూడు గుక్కలతో పూతకి ప్రాణాల్ని హరించాడు. శకటాసురుణ్ణి ఒక్క తాపుతో ముక్కలుచేశాడు. పాలూ వెన్నా తిస్కరిస్తూ పట్టువడి, గోపికలచే కట్టువడి, వారు యశోదతో చెప్పడానికివస్తే అక్కడ తయారయాడు.[1] వ్రేపల్లెలో అల్లరి ఎక్కువయిందని బృందావనములో గోవులు కాయమన్నారు. 'కుంతలములు దువ్వి పాపటదీసి, చామంతులు, చంపకములు, చెంగల్వలు ముడిచి, చందనము పూసుకుని, పాదాలకి గండు కడియమ్ములు బెట్టి, ఘనమైన తొడుగులు తొడిగి, మేలైన సొమ్ములు బెట్టి, వైడూర్య రత్నఖచిత పతకము మెడలో ధరించి, వేణువూ, చేగోలలూ చేతబట్టుకొని బయల్దేరాడు. కోవిలలు కూసేమోతా, కోడిపుంజులు గూసెటి మోతా, గోవులను తరమే మోతా. కొంతలూ పాడే మోతా, చిలుకలు పలికే మోతా, గోవుల కొమ్ముల మ్రోతా, నెమళ్లు అర్చేటి మోతా వింటూ ప్రొద్దెక్కగా, తల్లి 'దధి చాలా తోంతివేసి మృదువుగా కలిపి ఇచ్చిన చల్ది, అల్లమూ ఆవాకాయా (!) వాక్కాయ పచ్చడీ, ఉసిరికాయలూ నంచుకుంటూ,

1. శ్రీకృష్ణుని జననము.

బాలచంద్రుని చుట్టు పరివేషములవలె కూడిన గోప కుమారులకు పంచియిస్తూ ప్రభువు ఆరగించేవాడు.[2]

ఒకనాడు శ్రీకృష్ణుడు పశువులతో కాళింగ మడుగు చేరాడు. గోపకులు వారించినా వినక పశువుల కా నీళ్లు త్రాగనిచ్చాడు. త్రాగి నిముషము తడవు భరియించలేక కాళింగుని విషము తలకెక్కి యవని పైబడ్డారు. కామధేనువును పిలచి అమృతము కురియించి అందరినీ లేపి తీసుకుపోయాడు. మర్నాడుదయము ప్రత్యేకోపదేశము ఆయనకు కాళింగమడుగు దగ్గరకు పోవద్దని! జడిసిపోయినట్లు 'యిక దుష్టతనములూ చెయ్యనెన్నటికీ, పాము చేతికి నన్ను పట్టివ్వకమ్మా, అని తలుపులు వేసుకుని దాగి' నాడట! నాడు తిన్నగా కాళింగమడుగుకే దారితీశాడు. ఒడ్డున ఉన్న కదంబ వృక్షమెక్కి 'ముంచు నున్నగ దువ్వి, హారాలు సర్దుకొని, పందటి దండలు రొంగసన దోచి, పీతాంబరము విప్పి బిగువుగాకట్టి, అంకించి ఆ మడుగు నడుమునే దుమికె. వ్రేపల్లెవాడ అంతా మడుగుచుట్టూ చేరింది. అదృష్టవంతులు! ఆరనై నాలుగు తాళగతులతో బాలకృష్ణుడాడే తాండవము చూడనోచారు. కాళింగుని భార్యలు "అబల ప్రాయము నాటి పది పెండ్లిగాదు, నీవు చేయుము పెండ్లి నిక్కముగ మాకు" అని వేడుకున్నారు.[3]

బాలక్రీడలనీ, గోపికాస్త్రీల జలక్రీడలనీ, పాటలున్నాయి. శ్రీకృష్ణుడు యువకు డైనప్పటి కథ చిలుక రాయబారము! రుక్మిణీదేవి పంచవన్నెల చిలకతో కృష్ణునితోడి తెమ్మనిచెప్పి, "ఘనమైన వజ్రాల యందెలు కాళ్ళకు గట్టినా | ఎఱ్ఱన్ని ముక్కుకి పెండె ధమిడి పోదిగేనా|పచ్చని రెక్కలకు హెచ్చైన ముత్యాలు గుచ్చేనా" అని ఆశపెట్టి, 'ఇంకొక్క జన్మాన రాజాధిరాజులా పట్టేవి. | కోడుకూలు కోడళ్లు అల్లుళ్ళు ఆడబిడ్డాలూ | మనమాలు సకలా సంపదలు కలుగా కోరావే" అన్నది. తాను ఆదిలక్ష్మి ఆయెను. సిరిసంపదలకేమి కొదవ? చిలక అవి కోరలేదు. 'పుట్టేగ వైకుంఠ పురమందు తన కిల్లా గట్టావే | ఎన్నాడు తన్నె డాబాయకూ | అని కోరి గోపుర మెక్కింది. ద్వారకవెళ్ళి రాయబారము నడిపి, తిరిగివచ్చి కృష్ణుడి అందము వర్ణించింది. 'చిలుకా పలకగ రుక్మిణి తన మాటి మరచేను | కన్నులు మూయూచు మెల్లిగా మూర్ఛాలు బోందెను | రుక్మిణీని జూచి చిలుకా కిలకిల నవ్వేనా | అక్కారో యిటువంటి మాటలకెవరైనా భ్రమసేరా | చెలికత్తెలందరూ గుంపులుగూడుక నవ్వారా | నను గన్న తల్లి యిది నీకు బుద్ధిగాదమ్మా యనో |' అని ప్రబోధించింది. 'చెంచీత కథ' కృష్ణుడు వేటకువెళ్లి చెంచెతను వరించి తెచ్చిన కథ. సత్యభామాదులు తమ సౌందర్యమునకు గర్విస్తే వారిని మించిన సుందరిని తెస్తానని ప్రతిజ్ఞచేసి వేటకువెళ్ళి 'కనె నొక్క పాదలోన కమలముఖినీ.' నెలతోలు నెమ్మోము తెలుకన్ను చెక్కుళ్ళ కులుకు గుబ్బల చెంచు వెలది గాంచి' చెంచువేషము బూని పొంచి పొంచి దాని మంచి మాటల దాన్ని చేరదీసి, 'పచ్చనారీటింట్ల పొరుటాకుల చీర పాహి యేవూరుదానావే' అన్నాడు. 'ఏవూరు ఐతేను మాకోలి మీకేల వేట కొచ్చినాను పోవోయి' అన్నది. 'వేట కొచ్చే తేవు యేమూరో చెంచీత | మాటలాడితేను కోపామా ముద్దు టాడితేను కోపామా | పలుక్క పల్కితేను కోపామా' అన్నాడు. "మాటల్ మచ్చికాలు మాకేమి సరిపడను మరి యేమిరా దగ్గరొచ్చేవు | మగవాడ యేమిరా వొచ్చేవు | అది యేమిరా దగ్గరొచ్చేవు" అని దులిపింది. 'శ్రీకృష్ణమూర్తి నే చెంచీత | లోకాల కర్తనే చెంచీత | నిన్ను దరిస్తాను చెంచీత | నిన్ను పెండ్లాడెదను చెంచీత | రాని రుక్మిణికన్న చెంచీత | చక్కని దానవని చెంచీత | కోరివచ్చితినేను చెంచీత | నీ ముక్కుకు బడ్డాను చెంచీత | ...మొక్కెదను మొక్కెదను చెంచీత | మొక్కు చెల్లించవే చెంచీత | నీపుణ్య ముంటుంది చెంచీత |' అని మోహనాస్త్రము వేశాడు. మెత్తబడింది గాని టెక్కులు మొదలుపెట్టింది. 'మా అన్న లొచ్చేరు కృష్ణుడా | అంబులే తెచ్చారు నాసామి | అలుగులే వేసేరు నాసామి |' అన్నది. చేతి సరసము చేసినాడు కొబోలు 'గుండె లిప్పుడు తెగనైతునురా' అన్నది. ముక్కు కోస్తే నెత్తురు తొగరకం! 'గుండె ల్వేసిన గుజ్జుచెటులాకు | కమ్మల్ కడియా లిచ్చేనే | నన్ను పెళ్ళాడవే చెంచీత||' అన్నాడు. 'ఏకు గూడెములాలో యున్నికా కొలదైన రోలుపోతూ రెడ్డి కూతుర్ని' అని గొప్పచెప్పుకుంది. 'గొలుపోతురెడ్డి నాకు మేనమామ గావలె' నన్నాడు. ఎన్ని చెప్పినా అన్నిటికీ అన్ని జవాబులూ చెప్తున్నాడు. కోపంవచ్చి 'పాన్పుపై బవళింప కృష్ణుడా నిన్ను పామైన చెర కదా నాసామి | నిన్ను తేలైన కరకదా నాసామి |' అని తిట్టింది. 'తిట్టకే తిట్టకే చెంచీత | నీవు తిట్టినా తిట్టిల్ల చెంచీత | అంబులై నాటేను చెంచీత, బహు పుణ్య ముంటుంది చెంచీత నన్ను పెండ్లాడవే

2. శ్రీకృష్ణుని చల్దులు.
3. కాళింగ మడుగు.

చెంచీత' అన్నాడు. ఆపని చెయ్యగలవా ఈపని చెయ్యగలవా అని ప్రశ్నలు వేసింది. అన్నీ చెయ్యగలనని! 'మనసు నీరుగా కరగించి వేర్పుమీరా' ఆమెను తీసుకువెళ్ళాడు. పాండిత్యపు వెలుగులో అలంకారిక భావతో ప్రేమకలాపము నడిపే ప్రబంధ ప్రేయసులీ జంటనుండు కొయ్యబొమ్మలే; కాదూ?

శైవగేయాలు కొద్దిగా వున్నాయి స్త్రీల పాటలలో. ఈ పాటలన్నిటికీ శైవవిజృంభణమే ఆది అనిపిస్తున్నది. అంటే వీరశైవము తెలుగుదేశంలో వ్యాపించకముందు పాటలన్నవే లేవని కాదు. శాసనాల లోని తరువోజలూ, నన్నెచోడ కవి 'దేశి కవితా' ప్రశంసా, పాల్కురికి సోమనాథుని 'ప్రభాత—, తుమ్మెద—, వెన్నెల—ఆది పదములూ' దేశికవిత పురాతనకాలమునుంచీ ఉన్నట్లు సాక్ష్యమిస్తాయి. కాని, అంతవరకూ సంస్కృత భావలోనున్న మత ప్రబోధాన్ని తేట కన్నడ వచనములో రచించిన బసవేశ్వరుని అనుకరించి "ఉరుతర గద్యపద్యోక్తుల కంటె, సరసమై పరగిన జానుతెనుంగున నూర్చెద ద్విపదలు" అని కృతకృత్యులైన పాల్కురికి సోమనాథుని పద్ధతి బాగా ప్రచారములోకి వచ్చియుండాలి వీరశైవమతంతో. మన ఆడపిల్లలు నోచే నోములలో నూటికి తొంభయి 'గౌరి' నోములే. 'నోచిన నోములకు గౌరి తాకర్త'ట. ఈ నోములూ, కథల పాటలూ వీరశైవంతో కుప్పలు కుప్పలుగా బయలుదేరి ఉంటాయని నా ఊహ. ఇప్పటిదాకా అవి అన్నీ నిలిచి రాలేదు గాని, శ్రావణ మంగళవారపు పాటా 'గంగా గౌరీ సంవాద'మూ సారంగధరపాటా, మార్కండేయ జననమూ, త్రిపుర సంహారమూ, ఈశ్వరభృంగి సంవాదమూ, భ్రమరాంబికాష్టకమూ చూస్తే, 'నిజలింగ చిక్కయ్య కథ' 'దక్షుని యజ్ఞమూ' 'సిరియాళ చరిత్రా,' 'వల్లరాజు యుద్ధమూ' వంటి జానపద గేయగాథల సుగంధము స్త్రీలపాటలలోకి కూడా వ్యాపించినదని తెలియవచ్చును. ఈ పాటలు మంగు వెంకట రంగనాథరావుకు దొరికినదాకా ఆ నోటా ఈ నోటా మాత్రమే వినబడుతూండి, పాడిన వారి పాండిత్య బలము నొక్కిన నొక్కులతో రూపము చాలా మారి, కొన్ని మాయమే అయిపోయి, క్షీణించి పోయాయి. కనక ఇప్పటికి మిగిలిన పాటలలో శైవ సంప్రదాయానికి చెందినవి తక్కువగా ఉన్నాయి. శ్రావణ మంగళవారపు పాటలో "పరమేశ్వరుడు తా నొక్క జంగమాకారమై 'సురుసర్మ ఘోరాండి' యనుచు వచ్చె" నట! జంగములు శైవసన్యాసులు. వర్ణాశ్రమ ధర్మముల కతీతులై శైవధర్మప్రచారము కోసమే సంచరిస్తూ, 'పాహ్యాస్తూ శివుడే' అని శైవులు పూజించేవారు జంగములు. బసవేశ్వరుని కాలములో ఈ జంగములు అసంఖ్యాకులుగా నుండేవారు. ఇప్పటికీ శివరాత్రినాడు తీర్థాలలో గంటలు మోగించుకొంటూ వచ్చే 'జంగాలు' ఈ జంగముల వంశము వారమే నని నటించేవారే. 'సురుసర్మ ఘోరాండి' మంటే ఏమిటో తెలియలేదు. బసవ పురాణమూ, పండితారాధ్య చరిత్రా, భాషానిఘంటువులూ దీని విషయమేమీ చెప్పినట్లు లేదు. 'వల్లరాజు యుద్ధము' అనే గేయకథలో 'సురుకృప కోరంజమని వచ్చినావు' అని వుంది. ఇది శైవసన్యాసుల భిక్షావాదము కాబోలు. గంగా గౌరీ సంవాదము "శివశరణు మాం పాహి" అని ప్రారంభిస్తుంది. హరిదాసులూ, శివశరణులూ అని, జీవితమంతా భగవత్కైంకర్యము చేసిన భక్తులు బసవ—, మధ్వ—ఆచార్యుల పిమ్మట బయలుదేరినారు. నరహరి తీర్థులూ, వ్యాసరాయలూ, పురందరదాసూ, కనకదాసూ హరిదాసులు. శివభక్తులు 'శివశరణు'లు. ఈ సంప్రదాయము కన్నడదేశమునుంచి వ్యాపించినది. గంగా గౌరీ సంవాదము ఇంపైన కథ. గౌరమ్మ యెలనంటి నెక్కు పువ్వులన్నీ తానే కోసేసుకుని, మంచి పూలన్నీ తాను ముడుచుకుని వాడిన పూలు గంగకి పంపింది. చాలకుండా 'వాడిన పూబంపిన వనిత యెవరమ్మ,' చాలకుంటే' తనవద్దనున్న పూలు సరిసమానముగా పంపమన్నది గంగ. 'సరికొల్లలాడను సరిదాన వటవే' 'సరిదాన్ని కాకుంటె శివుడేలదెచ్చు! శివుడేల తెచ్చును జగమేల మెచ్చు! శివునికి చిన్నారిని నీకు చెల్లెలను!!' వాదము వదలిపెట్టి గౌరి 'తన్నెను తన సవతి గుండెల్లు పసుల.' 'అక్క మీ పాదాల రాలిన మన్ను పందుల్ని గట్టిస్తు గొందుల్ని గడుదు! కొడుకు వీరన్నకు కోటగట్టిస్తు! కోడలకు భద్రాద్రికి మేడగట్టిస్తు! బసవన్న పనుకు నే పంద టగు సేస్తు! శివునికి శివపూజ గద్దెగట్టిస్తు!...' అని పలికె గంగమ్మ జవెను మేనకు!! అంతట గౌరమ్మకు చెంగు తామాసె, ఉదకాల జాడలు కానరావాయె!!. గౌరి పంపున వీరన్న చిలుకసముద్రమూ, పాలసముద్రమూ (?) పిథూదిగుండమూ, మల్లయ్య (శ్రీశైల) గుండమూ, నవతుల గుండమూ చూశాడు. 'ఉదకాల జాడలు కానరావాయె.' దక్షుణ్ణి కోరి పదివేల పాలకావిళ్ళు, పదివేల నేతికావిళ్ళూ పట్టించుకుని వచ్చాడు. 'పాలతో నే గౌరి స్నానంబు చేసె! నేతితో నే గౌరి శివపూజ చేసె.' పూజలు సాగినవి సరే. 'చీమలు దోమలు చెప కుట్టసాగె!' వీరన్న తల్లి పంపున తండ్రి మేనలకు వెళ్ళి 'శివపూజ

మా తల్లి చేసుకోలేదు! ఉదకొాల జాడలు మిమ్మడుగ మానెను' అన్నాడు. "మీ అమ్మ తక్క వేమి నా యొక్క వేమి! యీ ప్రొద్దు గంగకు తే మొక్క మనము! గంగ సమ్మతిచేత ఘన ఉదకమెచ్చు' నన్నాడు శివుడు. ఈ మాటలు విని గంగ అతిశయము చేత 'జాలారి దానితో పొత్తేల నాకు, నీవైన పోయిరా ముద్దువీరన్నా' అన్నది. వీరన్నతో గంగ, 'మీ అమ్మ తక్కు వేమి నా యొక్క వేమి! ఉదకొాల జాడలు నే నెరుగననెను.' అది విని ఉమాదేవి 'యెందుకీ వైరమ్మ యేమి పాపమ్మ! దైవవిధి గడుపను తరమె యెవ్వరికి!' అనుకొని బయల్దేరి 'ముందరను వీరన్న వెనుక గణపన్న' నడవగా యిద్దరి నడుమను గౌరి తా నడచె 'యెన్నడూ నా మేడ యెరుగవూ అప్ప! ఏమిపనికో నిపుడు నీవు గవరప్ప' అన్నది గంగ. 'నా కొడుకు వీరన్న నీకిస్తుగాని, ఉదకొాల జాడలు చెప్పవే గంగ' 'నీ కొడుకు వీరన్న నా కొడుకు గాడా, ఉదకొాల జాడలు నే నెరుగనక్కా' ఇలాగే కోడలు భద్రగిరీ, రవికెలూ, చీరెలూ, సొమ్ములూ ఆశ పెట్టి చూసింది. లాభము కనపడలేదు. విధిలేక, నా పక్క శివుని నీ కిస్తుగాని, ఉదకొాల జాడలు చెప్పవే గంగా' అన్నది. గంగకి మాటమాత్రము చాలలేదు. 'యీ మాటకు సాక్షి యెవరు' నీ బలికె, 'భూమి ఆకాశము అవి రెండు సాక్షి, మద్దిలూ మారేళ్లు అవి రెండు సాక్షి, సకల దేవతలు వారెల్ల సాక్షి.' అనగ సంతోషించి గంగప్ప తాను, గుప్పుగుప్పున గంగను ప్పొంగుదు, గౌరమ్మను స్నానము చేయించింది. ఈ కథనే పసగాడ సన్యాసి కవి గంగా వివాహమునే పదముగా రచించెను. పండితుల ప్రబంధాలలో ఉండే అనవసరపు వర్ణనలు స్త్రీల గేయకథలలో ఉండవు. అవి నవల లనుకుంటే ఇది కథానిక లనుకోవచ్చును. కథకి కావలసిన మాటలే ఉంటాయి వీటిలో. ఈ పాటలో 'అందరిని రక్షించ విష్ణుకర్తగుడు' అన్న పాదము తప్పితే—అంతా శైవవాతావరణమే కనబడుతోంది. 'అప్ప, బోవోయి, గవరప్ప, గంగప్ప, చిల్క సముద్రము' అన్నమాటలు కవి విశాఖపట్టణ మండలమువాడై యుండునని సూచిస్తున్నాయి. మార్కండేయ జననము చదివిచూస్తే మార్కండేయ విజయమే. దీని వర్ణనలూ, ద్విపదలూ చూస్తే దీనిని ఎవరో పండిత కవి రచించి యుండునని పిస్తోంది. సురా భాండేశ్వరముకూడా వర్ణనలూ మాటలూ బట్టి చూస్తే పాండిత్య వాసనే వేస్తున్నది. ఇది మిండజంగ మార్పువల్ల సమకూడే ఫలమును వివరిస్తుంది. త్రిపురాసుర సంహారమును 'వినయముగా సుదతులకు విన్నవింతు' నన్నాడు కవి. ఈమాట, స్త్రీల వాఙ్మయపు సత్తను నిరూపిస్తోంది. పూరి రామచంద్రరాజు 'కాపుల' కోసము రచించాడు కుశీలాయకమును. స్త్రీలపాట, జానపదుల కథ, కీర్తనల గాథ, నాటకమూ (లేదా యక్షగానమూ) అనే రూపాలన్నిటిలోనూ కనపడతాయి కొన్ని గాథలు. త్రిపురాసుర సంహారము స్త్రీలపాటలలో తప్ప మరొక రూపంలో నాకు దొరకలేదు. ఈ పాటలో చివ్వర 'మేలలు పాడుచు నడచిరి' అన్న పాదాన్ని బట్టి నాటకాలూ యక్షగానాలు రచించిన కవి ఎవరో ఈ పాటని రచించి ఉండవచ్చునని ఊహించవచ్చు. స్త్రీలపాటలలో 'మేలలు' కనపడవు.

భ్రమరాంబికాష్టకమూ, ఈశ్వర భృంగి సంవాదమూ పాటల దశ దాటి కీర్తనలలోకి తొంగిచూస్తున్నాయి. "అక్షయంబుగ కాశిలోపల అన్నపూర్ణ భవానినై, సాక్షి గణపతి కన్నతల్లిని సద్గుణావతి శాంభవి" అన్న పాట భోజనకాలే 'గోవింద' నామ స్మరణలో వింటాము. 'ఈశ్వరభృంగివాదము' 'తలుపుదగ్గర పాట' లో చక్కని మార్పు తెచ్చిన నమోనా. శివుడికీ పార్వతికీ నడుము భృంగిగాడు పుల్లలు పెడతాడు. ఇది కీర్తనే అనడానికి దీని చివ్వరగల 'నాసిగా శ్రీ గౌరిరామ, దాసరావిది జేసినాడట' అన్న చరణమే తార్కాణము.



# ఎందుకు విడిపోయారు?



శ్రీ యస్. ఆర్. చందూర్

"వాళ్లు ఎందుకు విడిపోయారు?"

ఈ ప్రశ్న నన్ను కనీసం పదిమంది అయినా అడిగివుంటారు. వాళ్లు ఎందుకు విడిపోయారని చెప్పేది? కలిసివుండటంలోని ఘనత విడిపోవటంలో ఎలా వుంటుంది? ఇద్దరు విడిపోయారనగానే ఆ విడిపోవడానికి వెనకనున్న కారణాలేమిటో తెలుసుకోవాలని ఉండటం సహజమే గా!

ఎవరైనా విడిపోతారు గాని వాళ్ళ స్నేహం మట్టుకు కలకాలం నిలుస్తుందనుకున్నారు చాలామంది. నేను వాళ్ళది మృత్యువులో కూడా విడిపోని స్నేహబాంధవమనుకున్నాను. అంత ఘట్టిగా నమ్మకం నాకు వుండటంవల్లనే కాబోలు, పదిమందీ నన్ను అడుగుతూ వచ్చారు. వాళ్ళు ఎందుకు విడిపోయారని.

మన స్నేహసంపర్కాలు బహు తమాషాగా ఉంటాయి. మనకి స్నేహం అనుకున్న వారి విషయంలో, ఒక్కొక్కప్పుడు నానా శ్రమాపడి, వారికోసం మన ప్రాణాలుకూడా వొడ్డుతాము. అలాటి స్నేహితులు కొంతికాలమైనాక జనసామాన్యంలో కలిసిపోతారు. కాలం గడిచి, అంతా ఒకటే అని రుజువయినమీదట, ఆ స్నేహితుడికోసం అరనిముషం కూడా ఆలోచించము. ఒకనాడు ప్రాణప్రదంగా తోచిన వ్యక్తి, ఈనాడు జనబాహుళ్యంలో ఒకడుగా ఎందుకు అయిపోతున్నాడంటే, అందుకు కారణం ఒక్కటే. కాలం ఎలా మారుతుంటో స్నేహితాలు కూడా అలాగే మారుతాయి ఈ కాలం మార్పు కలిమిలేములతో ప్రమేయం లేనిది.

ప్రియంవదని మొట్టమొదట రాజమండ్రి ఆర్యాపురంలో మిట్టమధ్యాహ్నం వేళ చూశాను. ముందు టెండలో రిక్షాలో రావటంవల్ల నాకది వేసవికాలమని అనిపించింది గాని, ప్రియంవద యింట్లో పాదం పెట్టేటప్పటికి అది ఏ కాలమో మర్చిపోయాను. కిటికీలకీ ద్వారబంధాలకీ, కట్టిన వట్టివేళ్ళ తడికెలు గదిని అమితంగా చల్లబరుస్తున్నాయి. వాటికితోడు పైన, శబ్దం చెయ్యకుండా మెల్లగా తిరుగుతున్న ఫాన్. చాపమీద తెల్లటి పరుపు పరుచుకుని, బాకాసు గోడ కానించి కూచున్నాడు ఉమాపతి. పక్కగా చాపమీద చతికిలబడింది ప్రియంవద. నన్ను అక్కడవున్న కుర్చీలో కూచోమన్నారు. కుర్చీ వద్దని, నేనుకూడా ఉమాపతి పక్కగా పరుపుమీద కూచున్నాను.

"ఏమిరాయ్ కులాసాగా వున్నావా, మీ నాన్నగారు బావున్నారా?" అని కుశల ప్రశ్న వేశాడు ఉమాపతి.

"ఎండలోనుంచి వచ్చారు. కాసిని మంచినీళ్లు పుచ్చుకుంటారా?" అని ప్రియంవద కోకిలకంఠంతో అడిగింది.

మంచినీళ్లు కావాలన్నాను. మూలగా కుర్చీపీటమీదవున్న కూజాలోనుంచి నీళ్ళు గాజు గ్లాసులోకి వొంపి, తీసుకువచ్చి యిచ్చింది ప్రియంవద.

ప్రియంవదది నిజంగా దివ్యసుందర విగ్రహం. విశాలమైన కళ్ళు, చక్కటి కనురెప్పలు, వెన్నెల జార్చే చెక్కిళ్ళు, మొహానికి తగిన ముక్కు, నవ్వుకి అందమిచ్చే పలువరుసా, శంఖంలాటి మెడా మొత్తానికి ఆమెది పరిపూర్ణమైన విగ్రహం. స్త్రీలయినా పురుషులయినా ఆమెని మరొకసారి రెప్ప వాల్చక చూస్తారు. అంతటి అందగత్తె ప్రియంవద.

ఉమాపతి గ్రంథసాంగుడు. ఆయనకి ఈ ప్రియంవద ఏడో ప్రియురాలో ఎనిమిదో ప్రియురాలో అయివుండాలి. ఉమాపతి అప్పటికి నలభైఏళ్ళవాడు. ఉద్యోగరీత్యా అతను లాయర్. ఆయన గ్రంథసాంగుడవటంవల్ల గానీ, లేకపోతే, ఏనాడో డిప్టీకలెక్టర్ అయివుండవలసినవాడు.

ఉమాపతి తండ్రి యింకా బతికివున్నాడు. ముసిలాయన కలప వ్యాపారం చేసి అరవై డెబ్భయి వేలదాకా సంపాయించాడు. ఈ ఉమాపతి ఆయనకి

అయింది. ఏరోజు కారోజు వర్షాముకు సేవాడినిః పని లేనివాడికి తీరికవుండదు కనక ఈ పదిరోజులబట్టే రావడం పడలేదు. ఏమయితే నేం, కమలపండువగా ప్రియంవదని చూశాను. ఒక్క స్త్రీ క్రీగంటి చూపు కోసం పురుషులు సమస్తం ఎందుకు వొదులుకుంటారో ఆమెని చూసినమీదట యిట్టే అర్థమవుతుంది.

"ప్రియా, యిది సెలవో తెలుసా?"

"నా కేం తెలుస్తుంది మీరు పరిచయం చెయ్యకుండా?" గం, గువ్వల గానం ఆగాక వుండి వుంటుంది.

పరిచయాలు అయినమీదట ప్రియంవద అంది. "ఈ యిల్లు చాలా యిరుకుగా ఉందండి. మీ ప్రాంతాల ఏదైనా మంచియిల్లు వుంటే చూసి పెట్టండి."

"ఓ" అన్నాను.

"మీ పేటలో మాత్రం వొద్దుసుమా! నేను రెండో పెళ్లి చేసుకుంటానన్న పిల్ల ఈమెకాదని ప్రియంవదని గుమ్మాల్లోకుంటే! మీ నాన్నగారు అసాధ్యులు," అన్నాడు ఉమాపతి.

"ఎవరు? ఆ కేనాటి నాటాల పిల్లా?" అంది ప్రియంవద మహా వెటకారంగా. ఈమెకి ఉమాపతి గురించి యేమైనా తెలుసునా ఏమిటి?—అని సంశయం కలిగింది నాకు.

"అవును" అన్నాడు ఉమాపతి చాలా తేలికగా.

ఆ మధ్యాహ్నం ప్రియంవద ఐస్‌డ్ టీ యిచ్చింది. వేడి వేడి టీ తాగడమే గాని చాలిక జివ్వు మనే టీ తాగడం నాకు తెలీదు. ఆ టీమీద తేలిన నిమ్మడిప్పా, పొదీనా ఆకూ రమ్యాతి రమ్యంగా కనిపించాయి.

"ఇంతకంటె చెరుకుపానకం బావుంటుంది కదూ!" అన్నాను.

అలా అని వుండకూడదు. ఆతిథ్య మర్యాద, అందులో ప్రియంవదలాంటి జాణయిచ్చే ఆతిథ్య మర్యాద, తెలియనివాడనవసరం వల్లనే, అంత తేలికగా, మాటలలోతు గ్రహించక, టుపుక్కున అనేశాను.

"చెరుకు పానకమనే దేమిటి? యింతకంటె ఎన్నో బావుంటాయి," అని ప్రియంవద అంటున్నప్పుడు, ఆమె కనుబొమలమీద, పెదవి కొంపులోనూ కనిపించిన నిర్లక్ష్యం నన్ను కొశ్చేసింది. నా మాటకి మాట వొప్పచెప్పిందిగాని, కటువుగా ఏమీ అనలేదు. అయినప్పటికీ, ఆమె ఆ అరక్షణంలో చూపిన నిరసన ఏనాటిమణీ చూపలేదు.

ఎంత తెలియనివాణ్ణయినా, ప్రియంవదతో మాట్లాడటం కత్తిమీది సాము అని తెలుసుకున్నాను. తూచి తూచి మాటలు వాడాలి. సంభాషణలో నిపుణత చూపాలి. చాతుర్యం కనబరచాలి. నోటికివచ్చినట్లు మాట్లాడటం ఆమెకి యిష్టం ఉండదు. ఊకదంపుగా సాగకూడదు. పదాల లాలిత్యం, సౌకుమార్యం, తీక్ష్ణత, ప్రభావం తెలుసుకు వాటిని బాణాల్లా వాడాలి. ఒక మాట పువ్వులా తగిలితే, మరొకమాట బల్లెంలా గుచ్చుకోవాలి. పూజకి పువ్వులెంత అవసరమో, పొడుచుకు చేందుకు బల్లెములు కూడా అంతే అవసరం.

"పాపం. అతను కుర్రాడు. నీ నేర్పరితనం అతనిమీదనా! చల్లటి టీ తాగుతున్నప్పుడు, చల్లటి చెరుకుపానకం జ్ఞాపకంవచ్చిందికాబోలు. అదీ తప్పే!" అని నన్ను వెనకేసుకొచ్చాడు ఉమాపతి.

"అబ్బో—ఫ్రెండుని కాపాడుకుంటున్నారు! ఏమండీ, మిమ్మల్ని నే నేమయినా అన్నానా!" సంగనాచిగా అడిగింది ప్రియంవద, "ఉమాపతి మాటేమిటి"— అన్నట్టు మొహం పెడుతూ.

ఈ మహానాటకంలో నేను అర్భకుణ్ణి. అది ఆమె స్వభావమో, నటనో నాకేం తెలుసు! అసలు మనం ఎంతవరకూ స్వభావసైజాన్ని ప్రదర్శిస్తామో, ఎంతవరకూ నటిస్తామో చెప్పడం మాటలా? ఆమె విసిరేమాటని మధ్యలో తెంపగలవాడు ఉమాపతి ఒక్కడే!

వాక్చాతుర్యంమాత్రమే ఆరాధించేమనిషి కాదు ప్రియంవద. ఆమెది నవనీతంతో పోల్చదగినహృదయం. చమత్కారధోరణి రానప్పుడు ఆమె చూపే ఆప్యాయత మధురాతి మధురమైనది.

నేనూ ఉమాపతీ గోదావరిగట్టుకి షికారుకని వెళ్తాంటేగా ఆమె అంది: "రాత్రికి అయననికూడా తీసుకురండి—మనింటికి భోజనానికి."

"మరి అతను.........?"

"ఈపూట కాయగూరలే వండుతానులెండి," అంది ప్రియంవద.

అయితే వీరిద్దరూ మత్స్యమాంసాదులు తింటా రన్నమాట. రానంటే ప్రియంవదకి ఎక్కడ కోపం వస్తుందోనని, వచ్చేందుకు వొప్పుకున్నాను. అదీగాక, అందమైన స్త్రీలకి కోపం తెప్పించడం ఏ మొగవాడికి హితవుగా ఉంటుంది?

గోదావరిగట్టున చీడీలమీద నేనూ ఉమాపతీ కూచున్నాం. వెలుగు ఉందిగాని ఎండ పోయింది. గోదావరివంతెనమీదనుంచి ఏదో రైలు జెర్రిపోతులా జారిపోతోంది. రేవులలోని పడవలూ లాంచీలూ సాయంత్రపు చిరుగాలికి అల్లల్లాడుతున్నాయి. ఉమాపతి కథనం మొదలెట్టాడు.

"ఆమెకి ఎన్నేళ్ళు ఉంటాయో చెప్పు?"

"పాతిక," అన్నాను.

"ముప్ఫయ్యారు. పంథొమ్మిదేళ్ళ కూతురుంం దామెకి; ఆకూతురికి పెళ్ళి అయింది; ఒక ఆడపిల్ల కూడాను. పెద్దకూతురికి పంధొమ్మిదేళ్ళు; కొడుక్కి పదహారేళ్ళు; రెండో కూతురికి పధ్నాలుగేళ్ళు. ముగ్గురూ వాళ్ళఊళ్లో వున్నారు."

"మరి—ఈమె మీతో వచ్చేస్తూవుంటే, వాళ్లు వాళ్లందరూ వూరుకున్నారా?"

"ఆడది తెగించి వీధినపడితే వూరుకోక వురి పెట్టుకుంటారా? అందరూ నోరుమూసుకు వూరు కున్నారు. అసలు నేను ప్రియంవదనే పెళ్లి చేసుకుని వుండవలసింది."

"అప్పుడు మరొక అరుంధతిని నెత్తిని పెట్టుకు వుందురు మీరు?" ఇలాంటి జోకులు ఉమాపతికి కష్టం కలిగించవు గనక ధయిర్యంతో అనేశాను.

"చూడు. ఒక స్త్రీ నీకోసం యిరవైరెండేళ్ళు పరితపించిందంటే, నీ కెంత గర్వంగా ఉంటుంది? ఈ నౌకర్లు, జీతాలు, డబ్బు, కుల గౌరవాలు, సంఘ మర్యాదలు, తాసిల్దార్ హోదా—యివన్నీ ఆ ఆత్మ సంతుష్టి ముందు దిగదుడుపు. ప్రియంవదని నా పది హేడో యేట చూశాను; అప్పుడామె పైటలు వేసు కుంటూవుండేది. భద్రాచలంలో మాయింటికెదురుగా వుండేది వారియిల్లు. సందు దొరికితే యిద్దరం పారి పోయి, ఏవో అల్లీబిల్లీ కబుర్లు చెప్పుకునేవాళ్ళం. "నేను నిన్ను ప్రేమిస్తున్నాను"—అంటే—'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అని చెప్పుకునేవాళ్ళం. చూస్తూ చూస్తూవుండగా ప్రియంవదకి పెళ్లిముహూర్తం నిశ్చయంచేశారు. ఆవొచ్చే పెళ్లికొడుక్కి 'మనం ప్రేమించుకుంటున్నట్లు చెబుదాం' అన్నాను ప్రియం వదతో. అలాంటి తప్పుడుపని చెయ్యవద్దనీ, పెళ్ళికొడు కుని తను పెళ్ళిచేసుకుంటున్నప్పటికీ, ప్రేమించడం మట్టుకు నన్నేననీ, నాచెంపలని తన చేతులలో నిమురుతూ చెప్పింది. ప్రియంవద మంగళసూత్రం కట్టించు కుంటున్నప్పుడు నాకు ఏడుపు వచ్చింది; తలిదండ్రు లని ధిక్కరించక, చేతకానివాడిలాగా వొడంబడుతున్నందుకు, ఆమెమీదకూడా పళ్ళు పటపట కొరికాను."

"ఆమె ఏమిచేస్తుంది—చిన్నపిల్ల! ఒక వేళ ఎదిరించింకే అనుకోండి—మీకామెని పెళ్లిచేసుకో గల శక్తి యేది అనాడు?"

"అదంతా నిజమే. కాని నా మనస్థితి చెబు తున్నా. కాలక్రమేణా ప్రియంవదని మర్చిపోయాను. ఎందరో వింతావనితలు నన్ను పలకరించి, వారిదారిని వారు వెళ్ళిపోయారు. రెండునెలలక్రితం ప్రియంవద విధివశాత్తూ కాకినాడ టవున్ రైలుస్టేషన్‌లో తటస్థ పడింది. ఇట్టే నన్ను గుర్తించి 'ఉమాపతీ—ఉమాపతీ' అని పిల్చింది."

"ఊఁ, తరవాత ఏమయింది?"

"ఆమెభర్త చనిపోయి ఆరునెలలయిందట. నన్ను ఎలా కలుసుకోవడమా అని ఆలోచిస్తోందట. పది హేడోయేట నేను తీయించుకున్న ఫోటో, యిప్ప టికీ ఆమె పెట్లో ఉంది. స్టేషనునుంచి తిన్నగా యింటికి వెళ్ళిపోయాము. ఆ ఉండటం ఉండటం ఒక వారంరోజులపాటు కాకినాడలో నాదగ్గిర ఉండి పోయింది."

ప్రేమ! ఎన్నో కావ్యాలురాసి, కథలల్లుతారు ఆ రెండక్షరాలమీద. తెలిసీ తెలియని వయసులో వలచిన యువకునికోసం యిరవైరెండేళ్ళు కనిపెట్టు కునివుంది ఒక స్త్రీ. ఈలోగా ఆమెకి వివాహమైంది; ముగ్గురు పిల్లలు కలిగారు; పెద్దకూతురికి వివాహమవ డమే కాకుండా ఒక ఆడపిల్లకూడా కలిగింది; యిరవై రెండేళ్ళదాంపత్యజీవనం సాగించింది; తర్వాత భర్త మరణించాడు. తదనంతరం ఆమె తన ప్రియుణ్ణి వెతు క్కుంటూ వచ్చింది. ఉమాపతి నిజంగా ధన్యుడు; ఎంత గొన్ని అనుకున్నా, అతను అదృష్టశాలి. ఇరవై రెండేళ్ళనిరీక్షణ ప్రియంవద ప్రేమలోని ఔన్న త్యానికి తార్కాణం. ఆ పారిశుద్ధ్యంలో ఎలాంటి మాలి న్యమూ కరిగిపోతుంది.

ముగ్గురుపిల్లలతల్లియైన ప్రియంవద పాతికేళ్ళ మని షిలా ఎలా కనిపించగలిగింది? ఆమె తలలో తెల్ల

వెంట్రుక మచ్చుకికూడా లేదు; కాని ఉమాపతికి ఈ పెడా, ఆపెడా నెరిసిపోయింది. అనుభవాలతో ఉమాపతి విసుగు చెందితే, ఏకాగ్రతవల్ల హృదయంలోనియవ్వనాన్ని నిలుపుకోగలిగిందేమో ప్రియంవద. ఇంటికి వెళ్ళినతర్వాత ఆమె చేతులు రెండూ కళ్ళకి అద్దుకోవాలనిపించింది. స్వార్థం, మోహం మినహా ప్రేమ లేదనే నిరాశావాదులకి ప్రియంవద జీవిత మొక గుణపాఠం. ఒకవ్యక్తికోసం యిరవై రెండేళ్ళు కనిపెట్టుకు ఉండటం ప్రేమ గాకపోతే మరింకేమిటి ప్రేమ?

ఆరాత్రి భోజనాలవేళ ప్రియంవదమీద నాకు వున్న గౌరవాన్ని ఎలా వ్యక్తపరచాలో తెలియక తికమకపడ్డాను. ఆరోజు మొదలుకొని, నా భార్య పుట్టింటినుంచి వెంకటరమణదాసుని ఎత్తుకొచ్చేదాకా ప్రతిసాయంత్రం ప్రియంవదగారింట్లో ప్రజెంట్ వేయించుకుంటూనే వుండేవాణ్ణి.

"మీ శకుంతలకి మొన్ననే గాదుటండీ పధ్నాలుగూ వెళ్ళింది. అప్పుడే పెళ్ళిప్రయత్నా లేమిటి?" అంది ప్రియంవద.

"తాతగారియింట్లో పెరిగారు. వాళ్ళయిష్టం," అన్నాడు ఉమాపతి.

"మా మాధవికి మళ్ళీ బడికి పంపించమనండి. ఆపైన వాళ్ళే యిష్టమయినవాణ్ణి చేసుకుంటారు" అంది ప్రియంవద. మాధవి అతని రెండోకూతురు.

"మనకెందుకు పోనిద్దూ—వాళ్ళే గంగలో దిగితే మనకేం!"

ప్రియంవద మర్మంలేకుండా మాట్లాడుతోంది, కాని, ఉమాపతి బాస్తున్నాడు. నాకు ఆసంగతి అంతకుక్రితం చెప్పనేచెప్పాడు. ప్రియంవదవల్ల మనమరాలికి పెళ్ళి కావదని, అక్కడ గుంటూరునుంచి ఉమాపతి తండ్రి ఉత్తరంమీద ఉత్తరం దించుతున్నాడు.

ఒకరోజు సాయంత్రం నేను వెళ్ళేటప్పటికి యిద్దరూ ఘర్షణపడుతున్నారు. కీచులాటలు వెల్లాళ్ళబట్టే వింటున్నానుగాని అంత పెద్దగా మాట లనుకోవడం అదే మొదటిసారి.

"నాకోబండి కేకేసిపెట్టండి" అంది ప్రియంవద నన్ను చూసీచూడగానే.

"వెళ్లు. బెదిరిస్తావేమిటి?" అన్నాడు ఉమాపతి.

"మీపిల్లలకి పెళ్ళి కాకపోవడం, మీకు డిప్టీ కలెక్టరీ కాకపోవడం, మీ యిల్లు గుల్లచేసుకుతిందామని నేను రావడం—యివన్నీ ఎందుకు చెప్పండి? అమర్యాదగా బతుకుతున్న ఆడదాన్ని నేను, ఘరానాగా తిరిగే ఉద్యోగస్తులు మీరు!"

"ఆమాటలు నేను అనలేదు. ఎవరో అన్నారని నామీద విరుచుకుపడితే ఏం లాభం?" అన్నాడు ఉమాపతి.

"పోన్లెద్దురూ, మీదారి మీది, నాదారి నాది. కాస్త బండి పిలుచుకొస్తారూ?" అంది ప్రియంవద నా వంకగా తిరిగి.

"గతిలేక మీపంచకి రాలేదు, నేనూ రక్తమాంసాలు వున్నమనిషిని; నాకూ పిల్లా జెల్లా ఉన్నారు," ప్రియంవద సివంగిలా ఉంది. ఆమె కణతలమీది నరాలు ఉబ్బాయి.

"ప్రియా, నీకు యిష్టంగా వుంటే వుండు, కష్టంగావుంటే వెళ్లు. అంతేగాని ఎందుకీ రభస?"

"అవేమిమాటలు, ఉమాపతి గారూ! ప్రియంవద వెళ్ళడమేమిటి? ఆమె ఎక్కడికి వెళ్తుంది? ఇక్కడ వుండవలసిందే!" అన్నాను నేను.

"దిక్కులేనిపక్షిని గాను దయాధర్మభిక్షంమీద బతికేందుకు!" ప్రియంవదకి యాభైవేల రూపాయిల ఆస్తిఉంది.

ఆమె ఛ్రరున వీధివాకిట్లోకి వచ్చింది. నేను వెంటవెళ్ళి, బతిమాలి, లోపలికి తీసుకువచ్చాను. ఎన్నేళ్లొచ్చినా ప్రేమలోపడ్డ మనుషులు చిన్నపిల్లల మాదిరి దెబ్బలాడుకుంటారు. ఆనాటికి వారిక్రోధాగ్ని ఉపశమనవాక్యాలలో తగ్గింది.

కాని వారం తిరక్కుండా మళ్ళీ కజ్జా వేసుకున్నారు. కొడుకు రాజమండ్రి కాలేజిలో యింటర్‌లో చేరుతానంది ప్రియంవద. తనదగ్గిర వుండకపోవడం యిష్టం లేకపోతే హాస్టల్లో అట్టే

[illegible]మండి. అసలు ఆ కుర్రాడు రాజమండ్రిలో చేరడమే పనికిరాదన్నాడు ఉమాపతి.

"నా పెద్దల్లుడికీ, పదిహేడేళ్ళ కొడుక్కీ లేని అభిమానం మీకు వచ్చిందా?" అని ప్రియంవద ఉమాపతిని వొదిలి వెళ్ళిపోయింది.

తలిదండ్రుల యిష్ట ప్రకారం వారికి వచ్చినపిల్లని పెళ్ళిచేసుకుని, భారత[illegible]లలోవలె కూచుని [illegible] నామకరణమహోత్సవమూ తిరుపతి [illegible] నోము వ్రతమూ జరిపిన వాళ్ళక్కడా, ఉమాపతి ఏదో కోహినూర్ వజ్రంలాటిది పోగొట్టుకున్నా డనిపించింది.

ప్రియంవద లేనిపిమ్మట దీప్తికళాశక్తిమాత్రం బావుకునేదేమిటి?

ఇరవైరెండేళ్ళు ప్రేమించిన ప్రియంవదకి అన్యాయం జరిగించింటారా? ప్రేమని నమ్ముకున్న ఏ స్త్రీ సుఖపడింది గనక ఈమె సుఖపడేందుకు? అసలు నన్ను అడిగితే ప్రేమ ఏమిటి?

దీప్తికశేఖర్ ఉమాపతిబుద్ధికుదిరి భార్యాపిల్లల్ని తెచ్చుకున్నాడు. ప్రియంవదకి యిరవైరెండేళ్ళ సుందర స్వప్నం కరిగిపోయింది. అందుకనే వాళ్ళు విడిపోయారు. తెలిసిందా?



# భూతాల పుట్టిల్లు



శ్రీ బలివాడ కాంతారావు

(రైలు పోతున్న శబ్దం ... విజిల్ వినిపిస్తుంది. కొద్దిసేపట్లో రైలు ఆగుతుంది. మనుష్యులు ఎక్కి దిగుతున్న శబ్దం)

(ఇంతలో అడుక్కొనే వాని పాట వినిపిస్తుంది)

అ: జీవులెనుబదినాల్గులక్షల
చావుపుట్టుక లెక్కడా
ఎవరు చేసిన పాపకర్మం
బనుభవించే దక్కడా?

(రాను రాను శబ్దం దగ్గరౌతుంది)

బాబయ్యా కాళ్లు లేని
అనాథుడ్ని బాబయ్యా
కష్టపడి పనిచేసుకోలేని
దీనుడ్ని బాబయ్యా
మీరే తల్లి దండ్రీ బాబయ్యా
ఈ దిక్కు లేనివాడ్ని చూచి
కనికరించండి బాబయ్యా......

(భర్త దగ్గరగా వచ్చి) బాబయ్యా...

భ: చిల్లరలేదు వెళ్లిపోయ్.

అ: బాబూ దిక్కులేని పచ్చిని బాబయ్యా...

భ: వెళ్ళమని చెప్పలేదూ?

అ: అమ్మా తల్లీ మీలాంటి తల్లులు యీ పొట్ట వాడ్ని పోషించాలమ్మా...

భా: ఇదిగో...

అ: చిల్లరలేదు తల్లీ...

భా: అక్కర్లేదు తీసుకో.

అ: లచ్చిమీ తల్లీ...(రాను రాను బాబయ్యా తల్లీ అమ్మా అన్న మాటలు దూరమైపోతాయ్)

భ: ఈరోజుల్లో నీలా అణాలే ధర్మం చేయాలి. లేదంటే వాళ్ళు పొగడరు.

భా: అదేంటండీ ఆమాట ? వాడిదగ్గర తిరిగి ఎలా తీసుకుంటాం...

(రైలు నడుస్తూనే వుంటుంది)

తాత: [కొద్దిగా దగ్గరగా వచ్చి కూర్చుంటూ పొడుంపట్టు పీల్చి] ఏవూరెళ్తారు బాబూ?

భ: విజయవాడండీ?

తా: అత్తవారింటికా?

భ: పట్నంపిల్లలా కనిపిస్తోందండీ మీకంటికి?

తా: అమ్మాయి కేంలోటు బాబూ?

భ: వద్దు వద్దంటే మేనరికమని కట్టిపెట్టారండీ? చాకలిపద్దు తప్పులేకుండా వేస్తే యికనేం?

తా: గుణం ప్రధానంగానీ...

భ: తాతగారూ మీరూ పల్లెటూరు మనిషిలా ఉన్నారు...

తా: అవును. అయితే...

భ: పల్లెటూరు వాళ్ళను పొగడకుండా వుంటారూ?

తాత: నాయనా వయసుమళ్లినవాడ్ని. ఈనాడు నీతో చెప్తున్నాను. భార్య నలా తూలనాడకూడదు. ఆ మంగళసూత్రం కట్టాక యిద్దరూ ఒకరినొకరు అన్యోన్యంగా...

భ: దానిమాటకేంలెండి.

తాత: అమ్మాయికేం కొదవ ముఖంలో లాలిత్య మైన పసుపు కుంకుమ కళవుంది నాయనా...(భార్య వైపు తిరిగి) అమ్మాయ్ చిన్న బుచ్చుకోక ... ఏదో కాలక్షేపానికి అంటుంటారు...(మళ్లీ భర్త సిగరెట్ వెలిగిస్తాడు)

తా: విజయవాడ వుద్యోగ ధర్మం మీదేనా వెళ్లేది?

భ: అవునండీ ఏలూరులో వుండేవాడ్ని విజయ వాడలో ఒక స్నేహితుడున్నాడు. ఇల్లు చూడ మన్నా...కుటుంబంతో వచ్చేయమని వ్రాశాడు... అంచేత...

తా: మంచిచోటుకే బదిలీ అయ్యింది.

(రైలు విజిలు వినిపిస్తుంది)

తా: పేపరుభోగట్టా లేమిటి నాయనా?

భ: ఏం వున్నాయ్ తాతగారూ! ప్రపంచం యింకా ఎన్నాళ్లో ఉండేటట్లు లేదు.

తాత: అంత భయపడటానికి యేం ప్రళయం వచ్చేసింది బాబూ?

భ: తాతగారూ! ప్రపంచం బాగా మారి పోయిందండీ. అనూయ అనుమానాలతో నిండిపోయిన వాళ్ళు ఎంతకాలం యీ ప్రపంచాన్ని వుద్ధరిస్తా రండీ?

తా: దుష్టసంహారణ శిష్టరక్షణ అనాదినుంచీ వచ్చేదేను. అది దేవునిపని.

భ: అవేవి మనం కళ్ళతో చూటలేదు. కళ్లతో చూసిందే నిజం. ఆ కాలం వేరు యీకాలం వేరు లెండి.

తా: పొరపాటు నాయనా. అశక్తి బ్రహ్మాండ మంతా వ్యాపించివుంది ఆ దైవశక్తికి మించిం దేమీ లేదు...

భ: ఆఁ మీరన్న దేవుడు ఆకాలంలో బాణాలూ, కర్రలతో పోట్లాడుకున్నారు, కాబట్టి లొంగదీశాడు. యీకాలంలోనో?

తా: ఈ కాలానికే తగ్గ అవతారం యెత్తు తాడు... ప్రపంచంలో పాపపుణ్యాలు రెండూ ఉంటాయి. పాపం ఎప్పుడు హెచ్చయిందో నరునికి అణచేశక్తి వుండదు. అప్పుడే దైవబలం అవసరం వస్తుంది...

భ: మనమంతా పాతమెదడుతో కొత్తయుగాన్ని అర్థంచేసుకోబోతామండీ. గడచిన యుగాలన్నీ ఒక ప్రక్కను, క్రిందటియేభైయేళ్లూ ఇంకొకప్రక్క వేసి తూస్తే యీ ఏభైయేళ్ళ వేపే బరువుగా వుంటుంది. ఈ అటం యుగంలో దేవుడని పట్టుక్కూర్చో కండీ......

తా: అదీ అవకండా వుండలేదు. చూడు నాయనా. పాపస్వరూపుడైనసోమకుడు సముద్రంలో దాగుంటే మత్స్యావతారం యెత్తలేదా? రాక్షసుల పాపం హెచ్చిపోయి మానవకోటి బాధ పడుతుంటే మనిషిజన్మయెత్తి రాక్షససంహారంచేసి రామరాజ్యం స్థాపించలేదా? సిద్ధయజ్ఞయాగాలుచేస్తేగానీ దేవుడు కరుణించడని సామాన్యుడ్ని దేవుడికి దూరంచేశారు ఆనాడు బ్రాహ్మణులు. అప్పుడు రాచకుటుంబంలో బుద్ధుడై అవతరించి యీనాటికీ నిలిచే కర్మసిద్ధాం తాన్ని ప్రసాదించలేదా? అలానే యీ యుగానికి పరిపక్వరూపులో ఆశక్తి అవతరిస్తుంది ... (రైలు ఆగు తుంది)

తా: (లేచిపోతూ) మావూరు వచ్చింది వస్తాను నాయనా...(రైలు దిగి) మీకింకా రెండుస్టేషన్లేగా మన్యను...

భ: ఆఁ.

తా: వస్తాను అమ్మాయ్.

(గంటలు, విజిలు; రైలు కదులుతుంది)

భా: తాతగారు యెంతబాగా చెప్పారండీ? బాగా చదువుకున్నఆయనలా వున్నారు.

భ: నీ మొహం పల్లెటూర్లో కళ్ళు మూసుకొని కూర్చున్నాడేమో ప్రపంచంగూర్చి యేం తెలుసు?

భా: ఏం తెలియకపోతే అంతగా చెప్తా రండీ?

భ: ఈ పెద్ద ప్రపంచం చిన్నదైపోయిం దని ఆ ముసలాడి కేం తెలుసు? మరో నిమిషానికి యీచిన్నది కూలిపోదనిమాత్రం చెప్పలేం?

భా: వెళ్లండీ ఇళ్లు కూలిపోతాయిగానీ ప్రపంచం కూలిపోతుందా?

భ: ఏ పీక్వకాలంలో పొరపాటున పుట్టేశా వులే...

భా: అవునండి...(సిగరెట్ వెలిగిస్తాడు)

భ: ఈమాటల్లోపడి — చూశావా? వాడెలా మన సామాన్లవేపు పరీక్షించి చూస్తున్నాడో... మనిషివాటంచూస్తే దొంగలా ఉన్నాడు—సామాన్లవేపు చూస్తాండు... నేను చదువుకుంటున్నాగా...

భా: చాలా అమాయకుడిలా వున్నాడండీ...

భ: దొంగ లలానే వుంటారులే...

భా: ఎందుకండీ రామరామ...

భ: భలేవేదాంతం నేర్చావులేగానీ ... అటు చూస్తుండు...

(పేపరుమీద దృష్టి పోనిస్తాడు...రైలు కదులుతూనే వుంటుంది. రైలు ఆగుతుంది ... విజయవాడ విజయవాడ అన్నశబ్దం కోలాహలం వినిపిస్తుంది)

భ: కూలీ! ఏయ్ కూలీ ఇంకో యిద్దర్ని తీసుకురా అదిగో అటువేపున్న సామాన్లు దించేయ్ ... నడు...సామాన్లన్నీ వున్నట్టేనా?

భా: ఆఁ.

భ: పోదాం మరి...(నడుస్తారు)

బాబూ! ఓబాబూ! (కేకలు వినిపిస్తయ్...)

(ఆ కేక వేసిన మనిషి రైలు పెట్టెమంచి పరుగెత్తుకువచ్చి)

ఆమనిషి: ఈ సిన్న పెట్టె మీదివాగే వుంది బాబూ?

భ: మాదే...

ఆ మనిషి: మీ సామాన్లున్న కాసే అమూలవుంది బాబూ...మీదే అయ్యుండాలనీ...(పెట్టె అందిచ్చి) వస్తానుబాబూ...(వెళిపోతాడు)

భా: పాపం వాడిని దొంగ అన్నారండీ...

భ: చూడు ఇంకేం మరచిపోలేదేమో?

భా: ఇంకేం లేదులెండి...

(విరామం ... ఇంట్లో అంగటి వరండాలో కుర్చీవేసుకొని భర్త కూర్చొని వుంటాడు. రాత్రి పదిగంటలైంది...పదిగంటలు వినిపిస్తాయ్)

భా: (లోనుంచివస్తూ) ఏమండి పది దాటినా యింకా బయట కూర్చున్నారేం.

భ: (జవాబులేదు)

భా: అంతా యిప్పటికి తెమిలింది ... ఇల్లు చాలా బాగుందిసుమండీ...

భ: (మెల్లగా) బావుంది ... (దూరంనుండి రేడియోసంగీతం వినిపిస్తుంది)

భా: విన్నారా? ఆ పాట ఎంత హాయిగా వుంది.

భ: ఊఁ ఊఁ వుంటుంది...

భా: నాకు మంగళహారతి తప్పించి ఇంకేం రాదుగా—వెక్కిరించినా పడ్తాను...

భ: చూశావా వాడింటివేపు?

భా: ఏం వుంది?

భ: నీకేం కనిపిస్తుందిలే...

భా: అదేంటండీ నాకు కళ్ళు లేవంటారా?

భ: చూడు ఆ మేడ, ఆ రేడియో, కారుషెడ్ ఇవన్నీ కష్టపడే గడించాడంటావా?

భా: గడించకపోతే వూరకే అవన్నీ వస్తాయండీ?

భ: కష్టపడేవాడు యివన్నీ యెప్పుడూ గడించలేడనుకో...వాళ్ళకదుపే సముద్రంలావుంటుంది... మనలా...

భా: మనకేం? అయినా ఒకరి అదృష్టం ఒకరికెలా వస్తుందండీ?

భ: అలా అనుకొని కూర్చోవటమే నీకు తెలుసు...

భా: కాదండీ అదృష్టవుంటే మీరు శ్రేప్రొద్దున్న పెద్ద జీతగాళ్ళు కాకూడదూ?

భ: ఈ వేదాంతంలో పడే పిచ్చివాళ్లమై పోయాం?

భా: నే మాటాడితే సరి వేదాంతం అంటారు మీరూ కష్టపడుతున్నారు. మీకంటే హెచ్చు నేను ఇంట్లో కష్టపడుతున్నాను. అయితే మీలా నాకు జీతం ఇస్తున్నారా?

భ: బలేప్రశ్నలే తెలివితేటలు హెచ్చిపోతున్నాయిగానీ...

భా: అవునండి ... బడలికగావుంది నే పడుకుంటాను...

(కొద్దిగా విరామం) గడియారం పదకొండు కొట్టుంది.

భ: (లేచి తలుపులు వేసినచప్పుడు. తనలో) పాపం దెయ్యాలకొంపనితెలిస్తే యిలా పడుకోనేది కాదేమో? ...ఆఁ ఇది దెయ్యాల కొంపా? ఛా... దెయ్యాలేమిటి దెయ్యాలు? మానవత్వంలేని మనుషులే దెయ్యాలు...

(మంచంమీద వాలపడి) దెయ్యాలా? ఉంటాయా? లేకపోతే ఆఁ దెయ్యాలుండటవేమిటి?

మనలో విధవ అనుమానాలుగానీ...(మంచం పందిరి కదిలిన చప్పుడు)

ఆఁ! ఛీఛీ పిరికివాడిలా అవుతున్నానే, నేనేం పిరికివాణ్ణి? జడుపే దెయ్యాలని తెచ్చిపెట్టుందిగానీ ...చాలా ధైర్యంగావుంటే వాడికేం దెయ్యాలు? ఇంతకీ దెయ్యాలంటూ వున్నాయా అని? (పెద్ద నిట్టూర్పు) ఉండకపోతే ఆపదం ఎందుకు పుట్టింది? ఇంగ్లీషులోకూడా వుందే? వాళ్లలో యీనమ్మకాలు లేవేమో? లేకపోవటమేమిటి...హేమ్లెట్‌లో రాజు దెయ్యం కాలేదూ?

(మళ్ళీ సర్దుకొని పడుకొని)

ఇంతమందీ తెలివి తక్కువవాళ్ళా? ఏవరూ యీ కొంపలో దిగలేదంటే కొంతలో కొంతైనా నిజంవుంటుందీ? ఆఁ, ధైర్యం వుంటే ఏ దెయ్యాలేం చేస్తాయ్...అందులో నాది రాక్షసగణం — మొగాళ్ళని దెయ్యాలేంచేస్తాయి?

(కొద్దిగా విరామం)

ఛాఛా...నేనేంటి ఇలా తలచుకున్నా? ఆ దెయ్యాల సత్తువెంతో నేనూ చూస్తాను? ఈ దెబ్బతో ఈ దెయ్యాలు పారిపోవాలి!...హో హో హో (నవ్వు) దెయ్యాలంటూ వుంటే...బలే చెత్త ఆలోచనలో పడ్డానే...హో హో హో మనసా...వెర్రి ఆలోచనలు మాని పడుకో (కొద్ది విరామం)

ఉన్నా దెయ్యాలు మనుషులని చంపేస్తాయా? ఛా ఛా దెయ్యాలేవిఁటి దెయ్యాలు? ఇంత తెలివి మాలినవాడి నయ్యానే...

(పండ్రెండు గంటలు వినిపిస్తాయి—పండ్రెండింటే పడుకుంటాను...నిద్రపోతాడు...మంచిరాత్రి మీద కలవస్తుంది)

భ: (నిద్దల్లో) హు హూ హూ దెయ్యం! దెయ్యం! ఛా ఛా ఛా దెయ్యంయేంటి దెయ్యం... నాది రాక్షసగణం ... హు హూ ... దెయ్యవేఁ దెయ్యవేఁ...ఏయ్ ఎవరు నివ్వు...నివ్వు...

దెయ్యం: (ఏడుస్తూ) నీకుంది నాకులేదు... నీకుంది నాకులేదు...

భ: నా నాకు భయములేదు...ఉఁ చెప్పు నీ పేరు?

దె: నీకుంది నాకులేదు...నీకుంది నాకులేదు...

భ: పేరు చెప్పు...లేదంటే నిన్నేంచేస్తానో చూడు...అబ్బబ్బే...ఇంకొకటి వచ్చిందే...హు హు హూ...

దె: నీకుంది నాకులేదు...నీకుంది నాకులేదు...

భ: నీ పేరేమిటి చెప్పు...కామినివా మోహినివా?

రెండో దె: (బొంగురు గొంతుకతో) నేను గొప్పవాణ్ణి...నేను గొప్పవాణ్ణి...

భ: గొప్పవాడివా? గొప్పవాడివైతే దెయ్యం యెలా అయ్యావ్?

రెం. దె: నేను గొప్పవాణ్ణి...నేను గొప్ప వాణ్ణి...నేను...

భ: (కోపంగా) ఆగు ... నీపేరు చెప్పు ... చెప్తావా లేదా? నా కిప్పుడు భయంలేదు...అయ్యో? యింకో దెయ్యం వచ్చిందే? వందలు కాదు వేలు దెయ్యాలు రానీ...నాకు భయంలేదు...నీ పేరేమిటి? ...పోలమ్మ నీలమ్మ...

మూ. దె: (అనుమానంగా) నివ్వు దొంగ... నివ్వే దొంగ...నివ్వే నివ్వే...

భ: ఏమన్నావ్? నేనా...నేనా దొంగని... ఒళ్ళు దగ్గరవుంచుకొని మాట్లాడు...

మూ. దె: నీవ్వే దొంగ నివ్వే నివ్వే...

భ: పేల్చేస్తాను జాగ్రత్త...నాకు దెయ్యా లంటే భయంలేదు...ఉహు...హూ తెలిసిందా? అమ్మో యింకో దెయ్యం వచ్చిందే...ఏయ్ ఏయ్...

నా: దె: (సంతోషంగా) ఇది నాకు...ఇది నాకు...ఇదీ నాకే...ఇదీ నాకే...

భ: అబ్బో...నవ్వుతున్నావే...మీ నలుగురిని యిలా విడిచిపెట్టను పేర్లు చెప్పండి...

నా: దె: (ఒక్కసారిగా) (ఏడుస్తూ) నీకుంది నాకులేదు నీకుంది నాకులేదు...(బొంగురుగా) నేను గొప్పవాణ్ణి...నేనుగొప్పవాణ్ణి...(అనుమానంగా) నివ్వే దొంగ...నివ్వే దొంగ...(సంతోషంగా) ఇదీ నాకే...ఇదీ నాకే...

భ: (వెక్కిరిస్తూ) చెప్పకపోతే పేల్చేస్తాను... దెయ్యాలంటే నాకు భయంలేదు...ఫాం ఫాం ఇంకా ఉంటాయా? హో...హో హో ఇంకేం దెయ్యాలు? హో హో...హో నేనెంత పిచ్చివాడిన్ని? దెయ్యా లేమిటి? దెయ్యాలు? దెయ్యా లెక్కడున్నాయ్...

నా: దె: (సహజ స్వరాలతో) నీలో నే నీలో నే...

భ: ఆఁ నాలోనా? నాలో దెయ్యాలా? ఛీ ఛీ నాలో దెయ్యాలేవిఁటి?

నా: దె: నీలో నే...నీ నీలో నే...

భ: నాలో దెయ్యాలుండటానికి వీల్లేదు... దెయ్యాలంటే నాకు భయం లేదు...ఉంటే మీ పేర్లు చెప్పండి...మిమ్మల్ని యేం చెస్తానో?

నా: దె: (సహజ స్వరాలు వినిపిస్తాయి)

భ: ఎవరు మీరు నాలో ఉండటానికి మీకేం అధికారం వుంది? మీ పేర్లు చెప్తారా? లేదా?... కామినీయా...మోహినియా? ఎవరు?

నా: దె: అ అ అ...(అ...అని అరుస్తాయ్)

భ: (కటువుగా) పేర్లు చెప్తారా లేదా?

నా: దె: ఆ ఆ అ...

భ: (వెక్కిరిస్తూ) అ అ అ పిరికి పిరికి మిమ్మల్ని యిలా విడిచిపెట్టను. ఆటంబాంబులలో వేసేస్తాను ...మీ శవాల్ని కాకుల గద్దలకు వేస్తాను...

నా: దె: (సహజ సర్వాలు వినిపిస్తాయి)

భ: (అరుస్తాడు) చంపేస్తాన్...హు హు భ చంపేస్తాన్...హు హు.

భార్య: ఏవండోయ్ ఏవండోయ్ అలా అరుస్తున్నారేం? లేవండి లేవండి తెల్లారింది...

భ: (ఒళ్ళు విరుచుకుంటూంటే)

భా: కలగాని కన్నారా?

భ: (ఆవులింతలు తీసుకుంటూ) అబ్బే...యేమీ లేదు...

భా: (చెంబుతో నీరు తెచ్చి) లేవండి వేగం పళ్లుతోముకుంటే వేడినీరు పెట్టాను స్నానం చేద్దురు గానీ...ఏదీ అగ్గిపెట్టె ఒకసారి యివ్వండి...

భ: (సిగరెట్ వెలిగించి) ఊఁ (అంటూ అగ్గిపెట్టె అందిస్తాడు...భార్య పెరటికి వెళ్తుంది)

(కొద్ది విరామం)

భ: (తనలో) కల...చాలా వింతగావుందే... దెయ్యాలు ఎంత భయంకరంగా వున్నాయ్...నిజంగా అవి దెయ్యాలే? అయితే వీటికి...యేదుపు సంతోషం ...ఇవన్నీ ఎలావచ్చాయ్? మాయమయిపోయి... నాలో ఉన్నాయన్నాయి...నాలోనా? దెయ్యాలా? భా పేర్లడిగితే...అన్నీ అ అన్నాయే. అ అన్న పేరుతో ఏ మైనా దెయ్యాలున్నాయా? యేం ఉన్నాయ్ ఒకటి నివ్వుదొంగ నివ్వే దొంగ అంటే ...నేను దొంగనా? అలా అందుకంది? దాని మనస్తత్వం ఒకరిని అనుమానించడమా? దెయ్యాలు అనుమానిస్తాయా? ఓ రౌస్ పేరడిగితే అ అందిగా ...అ దెయ్యం అనుమానం అనే దెయ్యమేమో? అయ్యుండాలి? అనుమానం పెనుభూతమని పెద్దలన్నారుగా? అయితే...నాలో యీ భూతంవుందా? నాలోనా?

అంతరాత్మ: ఉంది...నీలో వుంది...రైల్లో ఒక అమాయకుడ్ని దొంగని అనుమానించావ్ చూడు నీ భార్య...

భ. (తనలో) అవును...అది అనుమానించలేదే ...యింకో దెయ్యం నీకుంది నాకులేదంది అయితే అది...అసూయ నాలో యేం అసూయలేదే...

అం: ఉంది నీలో ఉంది ఎదురింటాయనకు రేడియో కారు ఉందని నిజం తెలుసుకోకుండా దోచాడన్నావ్...నీలో ఆ అసూయవుంది...చూడు నీ పెళ్ళాం...

భ: (తనలో) అవునవును...అది అలా అనవద్దంది...ఇంకో దెయ్యం ఇది నాకే...ఇది నాకే అంది ...అత్యాశ...అబ్బబ్బే నాలో ఎక్కడుంది?

అం: ఉంది...నీలో వుంది...రెండు కేప్స్టన్ సిగరెట్ పెట్టెలు కొన్నావ్...కానీ చాట్టవాడికి కానీ లేదని పొమ్మన్నావ్...నీదగ్గర ఉన్న అణా యిస్తే నీకు పోయేదేమీ లేదుగా...కానీ చూడు నివ్వు తూలవాడే నీ పెళ్లం...

భ: (తనలో) అవును...అది అణా యిస్తే వెటకారంగా మాశాను...ఇంకో దెయ్యం...బొంగురుగొంతుకది...అహంభావం...నాలో అహంభావం లేనే లేదే?

అం: ఉంది...నీలో వుంది...తాతగారికన్నా బాగా బదువుకున్నానని అహంభావం చూపించావ్ ...చూడు నువ్వు మొద్దుఅని నలుగురితో చాటేవ భార్య...

భ: (తనలో) ఉఫ్...ఈ దెయ్యాలన్నీ నిజంగా నాలో వున్నాయా? నమ్మలేను...నమ్మలేను...

అం: నమ్మూ నమ్మకపో...నీలో వున్నాయ్ ...లేవనుకుంటే నిన్ను నివ్వే మోసం చేసుకుంటున్నావ్?

భ: (తనలో) ఉన్నాయా? వుంటే నాలో ఏ కొద్దిగానో ఉంటాయి. నాయీ అసూయ అహంభావం అత్యాశ, అనుమానాలా ఈ ప్రపంచాన్ని పాడుచేసే వర్తకులు రాజకీయవాదులుకున్న దాంట్లో ఎన్నోవంతు? ఒక కోటి వంతుల్లో ఒక్కటైనా కాదేమో? అలాంటప్పుడు ఈ దెయ్యాలు వాళ్ళందరిలో వుండాలి గానీ...నాలో వుండడమేమిటి?

అం: ఉన్నాయి...నీలో తక్కువగా వాళ్లలో హెచ్చుగా ఈ దెయ్యాలు ఎప్పుడూ ఉండవు...

వాళ్లలో యెలావున్నాయో నీలోను అలానే వున్నాయి.

భ: (తనలో) అదెలా? భా భా...

అం: నివ్వు భా అనూ భీ అనూ ఉంటే అందరి లోనూ ఒక్కలానే ఉంటాయి. నీ తిక్కవహోదా బట్టి...దీనివల్ల హెచ్చుమందికి అపకారం జరుగ లేదు. రాజ్యాలు నడిపేవాళ్ళలో యీ అనూయ అహంభావం అత్యాశ, అనుమానమనే దెయ్యాలు వుంటే ప్రపంచమంతా అపకారంతోనే నిండి పోతుంది...నిన్నే రేపు ప్రొద్దున్న ప్రధానమంత్రిని చేస్తే దేశప్రజలంతా నీయీ దెయ్యాలవల్ల బాధపడ తారు...ఇక నివ్వుపడిన ఆరాటంగూర్చి ఆలో చించు...

భ: (పెద్ద నిట్టూర్పు విడుస్తాడు)

బిచ్చగాడు: (బయట కేక వినిపిస్తుంది) అమ్మ తల్లీ...యీ అవాదోడికి బిచ్చమెయ్యండమ్మ...

భార్య: (పెరటనుంచి వస్తూ) అదేంటండీ... యింకా అలానే కూర్చున్నారు. నీరు కాగిపోయాయ్...వేగంగా లేవండి...

(అంగటికి నడిచి బిక్ష వేస్తుంది)

బిచ్చ: పొరుగమ్మ అప్పుడే తెల్లారిందా అని పొమ్మందమ్మ...మా తల్లి ... లచ్చిమీ దేవమ్మ... దోసెడు బియ్యం యేసిన యేతల్లినీ సూడలేదు...

భా: యేదో నాకు కలిగింది తాతా...

బిచ్చ: అలా గనుకున్న తల్లులుంటే మాభోం టోలికి బుక్కెడు గంజి...మంచితల్లివి...బాబుతో సెప్పి భూతవైద్దుగుడిదగ్గిర తావేజు కట్టించుకో తల్లీ...

భా. తావేజు నాకెందుకు?ఇదేమిటి తాతా...

బిచ్చ: దిక్కుమాలిన కొలమమ్మ...ఇల్లా కరువైతే...

భా: నాకేం అర్థంకాలేదు...ఏమిటి తాతా? సరిగ్గా చెప్తూ...

బిచ్చ: (వెళ్ళిపోతూ) దెయ్యాల కొంపమ్మ యిదీ...

భా: హాఁ ఇది దెయ్యాలకొంపా? (లోనికి పోతూ) ఏవండోయ్? దెయ్యాలకొంపలోనా నన్ను తెచ్చిపెట్టారు? నేనొక్క నిమిషం వుండలే నండో...

భ: (జవాబు లేదు)

భా: వూరుకుంటారేవండీ? పెంకుటిల్లు దొరక్క పోతే పోయింది? ఎక్కడైనా ఒకపాకైనా చూడండి. నేనీ దెయ్యాలకొంపలో వుండనంటే వుండను.

భ: (వుదాసీనంగా) ఎందుకలా భయపడ్తావ్? ఎవరుమాత్రం ఎక్కడున్నారు?

భా: ఇదేంటండీ, ఎవరైనా యిలా అనుకు న్నారూ? అందరూ దెయ్యాలకొంపల్లోనే వుంటు న్నారా?

భ: అందరూ దెయ్యాలకొంపల్లోనే వుంటు న్నారు? ఉండక యెక్కడికి వెళ్తారు?

భా: ఎంత మీ ఇంగ్లీషు నాకు రాకపోయినా నన్నలా ఆడిస్తారేంవండీ? మీకేం? మీరు ఆఫీసుకు పోతారు? ఈ దెయ్యాలకొంపలో వుండేది నే నొక్కర్తినేగా...

భ: పిచ్చిదానా ... ఈ ప్రపంచమే ఒక దెయ్యాలకొంప...అలా అని యీ లోకం విడిచి ఇంకే లోకానికి పోతాం...దెయ్యాల బాధపడుతూ బ్రతకవలసిందే...

భా: (కళ్లు కప్పుకొని) ఎప్పుడూ యిలానే నన్ను దెయ్యంపట్టిన మనిషిలా చూసి మాట్లాడు తారు...

భ: (లేచి ఓదారుస్తూ) అచ్చే నీకే దెయ్యాలు పట్టలేదు...ఎప్పుడూ పట్టలేవు...నివ్వెంత...గొప్ప దానవే?

భా. ఇదేంటండోయ్ యెన్నడూ లేనిది...

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)



# విషనాడి లేక త్యాజ్యకాలము



శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

మూడువందల అరువదిభాగల పరిమితిగల జ్యోతిశ్చక్రమును మన ప్రాచీన మహర్షులు ఇరువదియేడు సమభాగములుగా విభజించినారు. ఒక్కొక్క నక్షత్రపు పరిమితి 13 భాగలు, 20 కలలు. ఈ నక్షత్ర ప్రదేశములు ఆయా ప్రాంతములలో ఖగోళమునందుండు తారా సమూహములనుండి అందాజుగా గుర్తింపబడుచున్నవి. ఇవే అశ్విని మొదలగు 27 నక్షత్రములు. ఒక్కొక్క నక్షత్రప్రదేశము దాటుటకు చంద్రునికి, కొంచెము హెచ్చు తక్కువగా, సరాసరి ఒకదినము పట్టును. చంద్రుని దినగతి రమారమి 11 భాగలు 47 కలలనుండి 15 భాగలు, 14 కలల వరకు మారుచుండుటచే, కొన్ని నక్షత్రములలో వేగముగా, మరి కొన్నింటిలో నెమ్మదిగా, చంద్రుడు చరించుచున్నాడు. మొత్తముమీద, జ్యోతిశ్చక్రములోని 27 నక్షత్రములలో తన సంచారమును 27 2/5 దినములలో చంద్రుడు ముగింపగలడు.

ఇట్టి చంద్ర సంచారమునందు ఒక్కొకనక్షత్ర ప్రదేశములో ఒక్కొక్క నిర్ణీతభాగమున చంద్రుడు సంచరించుకాలము మహా దోషయుక్తమైనదనియు, అది వివాహము మొదలగు శుభకార్యములు జరుపుటకు కాని, ప్రయాణాదులు ఆరంభించుటకు కాని, యోగ్యముకాదనియు, మన ప్రాచీనమహర్షులు చాటి చెప్పిరి. అట్టి దుష్టప్రదేశము ప్రతి నక్షత్రములో 15 పాళ్ళలో ఒక వంతుగా నుండును. అనగా, నక్షత్రపు 13 భాగల, 20 కలల పట్టు సంచరించుటకు చంద్రుడికి 60 గడియలు (24 గంటలు) పట్టు ననుకున్నచో, అందలి దుష్టప్రదేశములలో చంద్రుడు నాల్గుగడియలు (ఒక గంట 36 నిమిషములు) సంచరించుచుండుననుట. ఇది జ్యోతిశ్చక్రములలో 53 1/3 కలల ప్రదేశమగును. దీనినే మన ప్రాచీన మహర్షులు 'విషనాడి' అనిరి. చంద్రుడు ఈ 'విషనాడి'లో సంచరించు గడియలను 'త్యాజ్య' కాలమని సామాన్యముగా వ్యవహరించుట సంప్రదాయము.

అరవవారు ఈ త్యాజ్యకాలమును పాటించరట! వారు గమనించనంతమాత్రాన దోషమును దోషము కాదనజాలము. వారు గురు, శుక్రుల మౌఢ్యమును సహా దోషములుగా గణింపరు. అట్లని, అది దోషము కాదనగలమా ? మన ఆంధ్రదేశములో మాత్రము ఈ విషనాడీదోషమును ముఖ్యముగా గమనించుట ప్రాచీనకాలమునుండి వచ్చిన సదాచారము. కర్ణాటకులు సయితము దీనిని గమనించెదరు. మన దేశములో వాడుకలోనున్న పంచాంగములలో ఈ త్యాజ్యకాలము సాధారణముగా సూర్యోదయాదిగా ఇన్ని గడియ విగడియలకని చూపబడుచున్నది. ఇటీవల కొందరు పంచాంగకర్తలు తమ పంచాంగములలో ఈ త్యాజ్యకాలమును గంటలు, నిమిషములలో సయితము చూపుచున్నారు.

ఏయే నక్షత్రములలో చంద్రుడు సంచరించునపుడు ఆయా నక్షత్రారంభ క్షణమునుండి ఎన్ని గడియలకు 'విషనాడి' ఆరంభమగునో, ఎన్ని గడియల కాలము అది వ్యాప్తిలో నుండగలదో, ఈ క్రింది జాబితా చూపగలదు:—

| నక్షత్రము | | గడియలు | | | |
|---|---|---|---|---|---|
| 1. అశ్విని | ... | 50 | మొదలుకొని | 54 | వరకు |
| 2. భరణి | ... | 24 | ,, | 28 | ,, |
| 3. కృత్తిక | ... | 30 | ,, | 34 | ,, |
| 4. రోహిణి | ... | 40 | ,, | 44 | ,, |
| 5. మృగశిర | ... | 14 | ,, | 18 | ,, |
| 6. ఆర్ద్ర | ... | 21 | ,, | 25 | ,, |
| 7. పునర్వసు | ... | 30 | ,, | 34 | ,, |
| 8. పుష్యమి | ... | 20 | ,, | 24 | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 9. ఆశ్లేష | ... | 32 | ,, | 36 ,, |
| 10. మఖ | ... | 30 | ,, | 34 ,, |
| 11. పూర్వ ఫల్గుని... | | 20 | ,, | 24 ,, |
| 12. ఉత్తర ఫల్గుని... | | 18 | ,, | 22 ,, |
| 13. హస్త | ... | 21 | ,, | 25 ,, |
| 14. చిత్ర | ... | 20 | ,, | 24 ,, |
| 15. స్వాతి | ... | 14 | ,, | 14 ,, |
| 16. విశాఖ | ... | 14 | ,, | 18 ,, |
| 17. అనూరాధ | ... | 10 | ,, | 14 ,, |
| 18. జ్యేష్ఠ | ... | 14 | ,, | 18 ,, |
| 19. మూల | ... | 56 | ,, | 60 ,, |
| 20. పూర్వాషాఢ ... | | 24 | ,, | 28 ,, |
| 21. ఉత్తరాషాఢ ... | | 20 | ,, | 24 ,, |
| 22. శ్రవణము | ... | 10 | ,, | 13 ,, |
| 23. ధనిష్ఠ | ... | 10 | ,, | 14 ,, |
| 24. శతభిషము | ... | 18 | ,, | 22 ,, |
| 25. పూర్వాభాద్ర... | | 16 | ,, | 20 ,, |
| 26. ఉత్తరాభాద్ర... | | 24 | ,, | 28 ,, |
| 27. రేవతి | ... | 30 | ,, | 34 ,, |

ఒక్కొక్క నక్షత్రప్రదేశములో చంద్రుడు 60 గడియలకాలము మాత్రమే నికరముగా సంచరించు ననుకొన్నచో, ఏర్పడగల వ్యవస్థ ఇది. కాని, ఏనక్షత్రమునందైనా, చంద్రుని సంచారకాలము స్పష్టముగా 60 గడియలుగానే ఉండుట అరుదు. రమారమి 53 గడియలు మొదలుకొని 67 గడియలు దాక ఆకాలము మార్పుచెందుచుండును. ఇష్టనక్షత్రపు ఆద్యంతకాలము 60 గడియలకు భిన్నముగా నున్నప్పుడు, త్రైరాశికపద్ధతిలో త్యాజ్యారంభకాలమును, అట్లే త్యాజ్యావసానకాలమును సహా, సాధించవలసియుండును. ఇష్టనక్షత్రపు త్యాజ్యాదిధ్రువ సంఖ్యను (పైపట్టికను చూడుడు.) ఆ నక్షత్రపు చంద్రసంచారకాలపు గడియలతో (బుక్తాద్యంతముతో) గుణించి, అంతో భాగించగా, ఆ నక్షత్రారంభమునుండి త్యాజ్యారంభ స్పష్టకాలము వచ్చును. అదే బుక్తాద్యంతమును 4 తో గుణించి అంతో భాగించగా, త్యాజ్యకాలము స్పష్టము కాగలదు.

మన పంచాంగములలో చూపబడుచున్న త్యాజ్యకాలములు పైరీతిగా స్పష్టపరచబడినవనియే మనము భావించవచ్చును. కాని, ఒక చిక్కు సమస్య మనల నెదుర్కొనుచున్నది. నేటి మన పంచాంగములు నానాముఖములు. కొన్ని వాక్యపద్ధతి అని, కొన్ని ప్రాచీనసిద్ధాంతమని, మరికొన్ని దృగ్గణితమని, వేరు వేరు పద్ధతులతో మనవారు పంచాంగములను గుణించుచున్నారు. అగుటచే, వానికి ఐకకంఠ్యము లేదనుట అనుభవములోని విషయము. ఇతర విషయము లట్లుండగా, నక్షత్రముల ఆద్యంతకాలము ఒక పంచాంగము చూపు గడియ విగడియలతో మరియొక పంచాంగము చూపు గడియ విగడియలు సరిపోవుచుండుటలేదు. ఆకారణమున, త్యాజ్యకాల విషయమున సహా వేరు వేరు పంచాంగములు వేరు వేరు కాలములను సూచించుచున్నవి. సూర్యోదయకాలమునకు దేశాంతర సంస్కారమువలన రాదగిన కించిచ్ఛేదముకంటే, ఈ వ్యత్యాసము అనేక సందర్భములలో, అధికముగానుండి అవ్యవస్థ ఏర్పడుచుండుట విచారకరము.

ఒక ఉదాహరణము నిత్తును. ఈ జరిగిన నందనసంవత్సర భాద్రపదమాస శుక్ల పంచమి (25-8-1952) నాటి త్యాజ్యకాలమును గూర్చి మన పంచాంగము లేమనుచున్నవో చూతము. మచ్చునకు, ఆంధ్రదేశపు పంచాంగమొకటి, కన్నడదేశపు పంచాంగమొకటి, అరవదేశపు పంచాంగ మొకటి, ఈమూడింటిని ఉపయోగింతము : వానియందలి సామగ్రి ఇది:—

| వివరము | ఆంధ్ర | కన్నడ | అరవ |
|---|---|---|---|
| | గ వి | గ వి | గ వి |
| 24-8-1952 వ తేదీన హస్తానక్షత్రము ముగిసినకాలము... | 36-55... | 34-64... | 41.37 |
| 25-8-1952 వ తేదీన చిత్తానక్షత్రము ముగిసినకాలము | 39-58... | 37-52... | 45-53 |
| కనుక, చిత్తానక్షత్రపు ఆద్యంతము... | 63-3... | 62-58... | 64-16 |
| చిత్తానక్షత్రారంభము నుండి త్యాజ్యారంభ కాలము... | 21-1... | 20-59... | 21-25 |

| అగుటచే, 24-8-1952 తేదీన ఉదయాదిగా త్యాజ్యారంభ కాలము... | 57-56...55-53...లేదు |
| --- | --- |
| ,, 25 8.1952 వ తేదీన... | లేదు ... లేదు ... 3-2 |
| స్పష్టత్యాజ్యకాలము... | 4-12...4-12 ... 4.17 |
| 25-8-1952 వ తేదీన త్యాజ్యాంతకాలము ...(ఉదయాదిగా) | 2.8 ... 0-5 ... 7-19 |
| దీనికి సరిఅయిన ఇండియన్ స్టాండర్డు కాలము... | 6-41 ... 5-17...9-2 A. m. A. m. A. m. |

ఇది అవ్యవస్థ కాక మరియేమి? ప్రశంసాదినమున చిత్తానక్షత్రపు 13 భాగల, 20 కలల జ్యోతిశ్చక్ర ప్రదేశములో చంద్రుడు సంచరించగల కాలము (ఋక్షాద్యంతము) పంచాంగము ఏ గ్రామమునకు గుణించినా, సమానముగనే గణితములో రావలెను గదా? పంచాంగకర్తలు గణితములో భిన్నపద్ధతులను ఉపయోగించిన మాత్రమున, చంద్రుడు ఖగోళములో తన గతిని మార్చుకొనగలడా? సిద్ధాంతవేత్తలు సూర్యోదయకాలమును తమ గ్రామములకు స్పష్టపరచుకొనుటచేత, సూర్యోదయాదిగా చూపబడు నక్షత్రాంత్యపు గడియలు పంచాంగములలో వ్యత్యస్తము కావచ్చును. కాని, ఋక్షాద్యంత కాలములో భేదము వచ్చుట అవ్యవస్థ కాదనక తీరదు. కనుక, దీనిపైననే ఆధారపడిన త్యాజ్యకాలము విషయములో సయితము విశ్వాసార్హమైన వ్యవస్థ ఎట్లు వచ్చును.

జ్యోతిశ్శాస్త్రముపైన విశ్వాసములేనివారి కథ మనకు అక్కరలేదు. కాని, నమ్మకముగలవారికి మాత్రము ఇది గొప్ప చిక్కు. విషనాడీ కాలములో శుభకార్యములుకాని, ప్రయాణములుకాని, జరుప కూడదను శ్రద్ధగలవారు ఈ పంచాంగములను చూచి చేయగలిగినదేమి? ఏ పంచాంగము చేతికి దొరకునో, దానియందలి త్యాజ్యకాలమును పరమ ప్రమాణమని స్వీకరించవలసినదేనా? లేక, ఏ పంచాంగమందు చూపబడిన కాలము తమకు సౌకర్యముగ నుండునో, దానిపై ఆధారపడవలెనా?

ఇప్పటి పరిస్థితులలో ముహూర్తములు, లగ్నములు, నిర్ణయించి ఇచ్చువారు సామాన్యముగా సిద్ధాంతమును అభ్యసించినవారు కారు. సిద్ధాంతులు దొరకుట కష్టము. ఏ పురోహితులో ఇప్పుడు ముహూర్తములను నిశ్చయించి ఇచ్చువారు. పౌరోహిత్య విషయములో వారి పాండిత్యమెంత యుండినా, ముహూర్తదర్పణమందలి మూడు ముక్కలకంటె హెచ్చు తెలియనివారే వారిలో అనేకులు. లగ్నములకు గ్రహస్ఫుటముకాని, భావస్ఫుటముకాని, చేయు పద్ధతి వారికి సామాన్యముగా తెలియదు. తెలిసినవారుండినా, సంప్రదాయము లేదను కారణమున వారాపనికి పూనుకొనరు. ఇట్టి పరిస్థితులలో, త్యాజ్యకాలమును స్పష్టముచేసి చూచువారెవరు? దొరకిన పంచాంగములో కనిపించు త్యాజ్యకాలము శరణము!

పరిస్థితు లిట్లుండగా, అనేక సందర్భములలో, త్యాజ్యకాలములోనే వివాహము సయితము జరుగుట అసంభవమనరాదు. ఇతరులమాట ఎట్లుండినా, అట్టి వధూవరుల విషయములో మాత్రము ఇది అన్యాయ్యము.

అది యట్లుండె. విషనాడీ కాలమును 'ఇండియన్ స్టాండర్డు కాలము'లో స్పష్టపరచినయెడల, ఇన్ని చిక్కులురావు. 1906 వ సంవత్సరమునుండి రాజకీయ శాసనమూలముగా మన భారతదేశమందు ఈ స్టాండర్డుకాలము వాడుకలో నున్నది. ఇంగ్లండు దేశమునందలి గ్రీనిచ్ పట్టణములోనున్న నక్షత్ర పరిశోధనాలయమున స్పష్టపరచబడిన గడియారము చూపగల కాలమునకు మన దేశమందలి ఏ ప్రదేశములోనున్న గడియారమైనా నికరముగా 5 గంటలు, 30 నిమిషములు హెచ్చుగా చూపవలెననుట ఈ శాసనపు ఫలము. గ్రీనిచ్ గడియారము మధ్యాహ్నము 12 గంటలు చూపు సమయములో, మన గడియారములు సాయంకాలము 5 గంటలు, 30 నిమిషములు చూపుచుండును. మన గడియారములను రేడియో వార్తలద్వారా ఎప్పటికప్పుడు స్టాండర్డు కాలమునే చూపునట్లుగా చక్కదిద్దుకొనుటకు మన కిపుడు అనుకూలము లున్నవికదా? ఆధునిక ఖగోళ గణిత

శాస్త్రానుసారముగా రాశిచక్రములో (అనగా, సాయనముగా ననుట) చంద్రుని దైనికచారమును కలా వికలలతో, సర్వ సంస్కార సంస్కృతముగా, ఏదినమున, ఏ నిమిషమునకైనా, గుణించుటకు వీలగునట్టి పత్రిక గ్రంథములు మనకిపుడు సులభముగా లభించుచున్నవి. "ర్యాఫెల్సు ఎఫెమెరిస్" (*Raphaels' Ephemeris*) మొదలగు గ్రంథములు ఈ జాతికిచేరినవి. ఇవి మన పంచాంగములవలె ప్రతిసంవత్సరము మునుముందుగా ప్రకటింపబడును. వీని సహాయమున రాశి చక్రములోని విషనాడీ ప్రదేశములలో చంద్రుడు ఏయే కాలములలో సంచరించుచుండగలడో, ఆకాలమును నిష్కర్షగా గ్రీనిచ్ మధ్యమ మానముతో సాధించవచ్చును. ఆకాలమునకు 5 గంటలు, 30 నిమిషములు చేర్చితిమేని, మనగడియారములలో త్యాజ్య కాలమును సులభముగా మనము గుర్తించగల్గుదుము. ఈకాలము మనదేశములో ఏ గ్రామమునకైనా సమానమే. కనుక అవ్యవస్థకు అవకాశము లేదు.

పై పద్ధతిలో సాధించినచో, ప్రశంసాదినమునాడు త్యాజ్యకాల మెప్పుడు వచ్చునో, చూతము గాక.

| | భాగ-కల-వికల. |
|---|---|
| జ్యోతిశ్చక్రములో చిత్తా నక్షత్రపు ప్రారంభస్థానము:- నిరయనకన్యారాశిలో :— | 23—20—0 |
| విషనాడ్యారంభమునకు చిత్తా నక్షత్రములో చెల్లవలసిన భుక్తి:- (నక్షత్రములో 60 లో 20 వ వంతు) చేర్చగా | 4—26—40 |
| చిత్తా నక్షత్రములోని విషనాడ్యారంభము:- నిరయన కన్యారాశిలో | 27—46—40 |
| కేతక్కే 'జ్యోతిర్గణిత' రీత్యా 1952 వ సంవత్సరమునకు అయనాంశలు చేర్చగా | 23—10—30 |
| విషనాడ్యారంభము:-సాయన తులారాశిలో | 20—57—10 |
| చిత్తలో విషనాడీ ప్రదేశము:- (నక్షత్రములో 60 లో 4వ వంతు) చేర్చగా | 0—53—20 |
| విషనాడ్యంతము:- సాయన తులారాశిలో | 21—51—30 |

| | భా కల |
|---|---|
| 24-8-1952 వ తేదీన గ్రీనిచ్ మధ్యాహ్న కాలమునకు చంద్ర స్థితి సాయన తులారాశిలో | 13—52 |
| ఆ దినమున చంద్రుని దినగతి | 12—56 |
| | గం ని |
| అగుటచే, సాయన తులారాశిలో 20 భా, 57 కలలకు చంద్రుడు రాగల కాలము:-(గ్రీనిచ్ మధ్యమ మానము) | 1—46 *Am* (*G.M.T.*) |
| 'స్టాండర్డు' చేర్చగా, | 5—30 |
| 25-8-1952 వ తేదీన, త్యాజ్యారంభ కాలము, ఇండియన్ స్టాండర్డు కాలము | 7—16 *Am* (*I.S.T*) |
| సాయన తులారాశిలో 21 భా 51 కలలకు చంద్రుడు రాగలకాలము(గ్రీ.మ.మా.) | 3—30 *Am* (*G.M.T*) |
| 'స్టాండర్డు' చేర్చగా, | 5—30 |
| 25-8-1952 వ తేదీన త్యాజ్యాంత కాలము (ఇన్. స్టా. కా) | 9—0 *A m* (*I.S.T*) |

ఇప్పుడు తేలిన దేమనగా, ప్రశంసలోనున్న దినమున ఉదయము 7-16 *A. m.* (*I. S. T*) నుండి 9.0 *A. m.* (*I. S. T*) వరకు త్యాజ్యకాలము వ్యాప్తిలో నుండెననుట. అఖిలభారత దేశములో ఏ గ్రామమునకైనా ఈ నిర్ణయము పనికివచ్చును. మార్పు ఉండదు. త్యాజ్యకాలమునకై ఇప్పటి మన పంచాంగములపైన ఆధారపడినచో మన కట్టిఫలము కలుగగలదో, పాఠక మహాశయులే ఊహించుకోగలరు.

వాస్తవస్థితిలో, ప్రశంసాదినమున వివాహమొకటి జరిగినది. నాడు ఋషిపంచమి! వ్రతదినము. దాంపత్య ధర్మమునుండి విరమించుకోవలసిన వయస్సు చెల్లిన స్త్రీలు వ్రతదీక్షతో ప్రమాణస్వీకారము చేయు దినమది! ఇట్టి దినమా వివాహమునకు? మరి, ఆనాడు చంద్రుడు చిత్తానక్షత్రములో నుండుట. వివాహమునకు చిత్త యోగ్యముకాదని శాస్త్రము ఘోషించుచున్నది. ఇట్టి దినమున ముహూర్తము

నెవ్వరో మహానుభావులు నిర్ణయించి ఇచ్చినారు! ఆనాడు ఉదయము 9—10 (*A. m IST*) గంటకు శుభముహూర్తమట !

అప్పటి గ్రహస్థితి ఇట్లుండును:—

| | | | |
|---|---|---|---|
| | | గు 20-35 | |
| రా 20-54 | (సాయనము) | | X 1'-0<br>వ 17-0 |
| | వివాహ లగ్నము | | బు 15-18<br>కే 20-54 |
| | కు 28-27 | శ 12-30<br>I 16-0<br>ఇ 19-45<br>చ 21-57 | ర 1-52<br>శు 18-41 |

ఈ లగ్నము కొంత శ్లాఘ్యముగా నున్నచో, చిత్తగింపుడు. ముహూర్తము పెట్టించు కొనుటకై శ్రమపడకుండ, బుద్ధికి తోచినదిన మున, వీలుపడిన క్షణములో, "తదేవ లగ్నం సుదినం తదేవ" అని వివాహము జరుపువారి పద్ధతి నయమేమో అనిపించుచున్నది.

చూడుడు ! లగ్నములోనే చంద్రుడున్నాడు. నిలుకడలేని జడమూర్తి చంద్రుడు. ఇట్టి చంద్రుని అస్థైర్యములో వివాహమా ? ఇది మహాదోషములలో నొకటిగా పరిగణింపబడునట్టిది. చాలక, ఈ చంద్రునికి సగ్రహదోషమొకటి పట్టినది. మరియు, మాయల మారి ఇంద్రగ్రహము లగ్నమందే సాక్షాత్కరించి పొంచుకొని యున్నాడు. ఇతనికి శని యొక్కడు తోడు ! నికరముగా, ఈ రెండు గ్రహముల నది మధ్య మందున్నది లగ్నము ! శుభగ్రహమగు బృహస్పతి అష్టమ భావమును చేరుకొని రాహుకేతువుల నడుమ గిజగిజలాడుచున్నాడు. లగ్నాధిపతి శుక్రుడు నీచపడి వ్యయభావమందుండుట లోపమనక తీరదు. కర్మస్థానములోనున్న వియోగకారియగు వరుణునితో అర్ధకేంద్ర శత్రుదృష్టినే రవి అభిలషించుచుండుట. సప్తమాధిపతి గండసంధిలో నున్నాడు. 'వివాహ సహమను' అష్టమభావమునే చేరుకొన్నది.

ఇవన్నియు నిట్లుండగా, తులారాశిలో భా. 21-57 క. లో చంద్రుడుండుట చదువరులు గమనించియేయుందురు. ఆ రాశిలో భా. 21-51 క. వరకు విషనాడియని కనుగొంటిమి కదా ? అనగా, ముహూర్తకాలమునకు పదినిముషముల వెనుక త్యాజ్య కాలము వ్యాప్తిలోనుండి నడచుట ! కన్యాదానము నకై సంకల్పము త్యాజ్యకాలములోనే ప్రారంభించ బడియుండుట అసంభవము కాదు. ముహూర్తమునకు ఎన్నియోదోషములు పట్టియుండగా, దీనిని మన మాక్షేపించ నేల? అన్నచో, అది వేరుమాట.

పెండ్లి అత్యంత శోభాయమానముగా జరిగిన దట. కట్నములు, కానుకలు, సత్కారములు, సమారాధనములు, సమృద్ధిగా చూపట్టినవి. వధూవరుల అనురూప్యమును, పైగావారి ఉత్కంఠను, గమనించి ఆనందించని వారే ఉండరు. సమయములో ఏదో దుశ్శకునము కానవచ్చెనని ఎవరో అనుకొనిరి. కాని అది సరకు చేసినవారు లేరు. ఇట్టివి గమనించుటకు పెండ్లి పెద్దలకు అవకాశము తక్కువ. వధూవరుల లక్ష్యము వేరు. వివాహకాలపు శకునాదులపై కాదు. సమావేశ ముహూర్తముపైననే వారి దృష్టి. సర్వము సమీచీనముగా శుభకార్యము జరిగినది.

లగ్నము దోషయుక్తమైనచో, ఇట్లు జరుగ గలదాయని శంకించువారుందురు. వ్యక్తిజాతకముల లోని గ్రహవాస్థానము ననుసరించి యీ ముహూర్త ఫలము చెల్లిరావలసియుండును. ఆ సామగ్రి మనకిపుడు లభించినది కాదు. ఇదికాక, ఏ ఫలమైనా, తగిన దశాకాలమునకై కాచియుండక తప్పదు కదా ? పోనిండు. ఎవరి అజాగరూకతవలననైనా, నిర్ణయించిన ముహూర్తకాలము అతిక్రమించి వివాహము జరిగియుండుననియు, వీరిజీవితము రమ్యముగా నడువ గలదనియు, ఆశింతము గాక !

చెప్పవచ్చినదేమన, ఇప్పటి నవనాగరక వివాహాలలో లగ్నకాలముపై శ్రద్ధగలవారే అరుదు. కంకణములు కట్టినా, కటకపోయినా, వధూవరులకు వెలగల చేతిగడియారములు కట్టుట సంప్రదాయమైనది. సామాన్యముగా, చేతిగడియారములేని పురోహితుడే ఉండడు. లగ్నకాలమును నికరముగా సాధించుటకు సౌకర్యములున్నవి. కాని శ్రద్ధ మాత్రమే మృగ్యమగుచున్నది. ఏదో, లగ్నపత్రికలలో అచ్చువేయించుటకు మాత్రము, శాస్త్రార్థమొక కాలము కావలెనంతే.

కాని, మహర్షిప్రోక్తములైన జ్యోతిశ్శాస్త్ర సూత్రములపై విశ్వాసముగల సనాతనాచారపరులు మనలో ఇంకా కొందరు లేకపోలేదు. ఆ నియమముల ననుసరించి ప్రవర్తించుట ప్రాపంచికముగా హితమని నమ్మినట్టి ఆధునిక విజ్ఞానసంపన్నులు సయితము కలరు. అట్టివారి ఉపయోగము కొరకైనా, త్యాజ్యాదులను మన పంచాంగములు స్పష్టముగా చూపవలసి యున్నది. ఇవన్నియు మూఢవిశ్వాసమని హేళనము చేయువారిని చూచి మనము నవ్వుకొందముగాక. వారిని తృప్తిపరచుట కానిపని.

ఒక్కొక్క నక్షత్రములో ఒక్కొక్క విశిష్ట భాగమును దుష్టమని నిర్ణయించుటకు హేతువేమి? అని విమర్శించువారుందురు. హేతువు సయుక్తికముగా నుండదేని, శాస్త్రసూత్రములపై భక్తి కుదురుట సహజమే. కాని ఈ విషనాడీ ప్రదేశములు ఏ కారణముచే విషముఫలమును ఈయగలిగినవో, కారణము తెలియదు. అందుబాటులోనున్న గ్రంథములలో ఈ విషయమైన ఉపపత్తి కానరాదు. ఆ ప్రదేశములకు నక్షత్రమండలమందలి ఏ దుష్టతారనుండి అయినా, వేధ కలదేమో? పరిశోధకులు శోధించవలసిన విషయమిది. కాని, తగిన ఉపపత్తి కానరాదను కారణమున, ఈవిధిని నిరాదరించుటమాత్రము హితము కాదు. కార్యకారణసమన్వయము చేయలేని విషయము లనేకములు మనల నెదుర్కొనుచున్నవి. అట్లని, వానిని మనము నిరాదరించలేము. నిరాదరించరాదుకూడ.

ఒక్కమాట. విషమునకు ప్రాణమును హరించు గుణము ఏ కారణము వలన కల్గినది? మన రక్తములో ప్రవేశించి దానిని చెరిచి వేయగలదని-జవాబు రావచ్చును. రక్తమును చెరచు శక్తి విషమునకు వచ్చుట కేమి హేతువో? ఆవిషములో నున్న ఏదో రాసాయనిక ద్రవ్యకార్యమని కారణము చెప్పుట సాధ్యము. ఆద్రవ్యమునకు ఆగుణమేల వచ్చినది? స్వభావ మనవలసినదేనా? ఈసమాధానములతో మన కెంత తృప్తి అయినదో, చదువరులే ప్రమాణము. కాని కారణము తృప్తికరముగా లేదని, విషమును గూర్చి అజాగరూకత యుక్తమా? విషములో ప్రాణమును హరించు ధర్మ మున్నదనుట సామాన్యానుభవము. మనకు అంత చాలును.

అట్లే, విషనాడిలో ఆరంభించిన కార్యముల వలన కష్టప్రాప్తి అనుభవములో కానవచ్చునేని, దాని విషయమై మనము జాగరూకత వహించుట ధర్మము. అనేక శతాబ్దముల అనుభవముతో మన ప్రాచీనులు కనుగొన్న ప్రకృతి రహస్యములలో ఇది యొక్కటి.

ప్రయాణారంభకాలము నిష్కర్షగా తెలుసుకొనగల్గితిమేని, ప్రమాదకరములుగా పరిణమించిన ప్రయాణములలో అనేకములకు విషనాడీదోషము సోకినదని చూపుట సాధ్యము. ఈవిషనాడీదోషమును గూర్చి—

"విషనాడ్యాం విపాద్భీతిః, అపమృత్యురథాపివా."
(జ్యోతిర్నిబంధము)

అని ప్రాచీన సూత్రము.

ఇందులో, ఇంకొక్క సూక్ష్మవిచారమున్నది. చంద్రునికి ఏయే స్థానములు దోషభూయిష్ఠములని చెప్పబడినవో, వానిలో లగ్నము ఉదయించుట సయితము దోషముగా పరిగణించుట శాస్త్రమర్యాద.

"విలగ్నస్థోపి నక్షత్రో, వివాహే కథిత స్సుధీః;
అన్యేచ నవభాః; సర్వేచంద్రనక్షత్రవచ్ఛుభాః"

అను ఉపలక్షణసూత్రము ఈ రహస్యములను చక్కగా బోధించుచున్నది. ఇంతే కాదు.

"జ్యోతిశ్శాస్త్రఫలం సర్వం,
లగ్నాధీనం బుధైః స్మృతం."

అని పితామహవాక్యము. చంద్రఫలముకంటె లగ్నఫలము ఎన్నియోరెట్లు బలవత్తరమైనదని, వరాహ

మిహిరాదులు స్పష్టముగా చాటి చెప్పినారు. జన్మ లగ్నము తెలియని సందర్భములలో, విధిలేక, చంద్ర రాశితోనే వ్యవహారము జరుపుట వాడుక అయినది. అంతేకాని, శాస్త్రములో లగ్నమునకే ప్రాధాన్యము చెప్పబడియున్నది.

"ప్రాయేణ సర్వత్ర విలోకయంతి
చాంద్రం బలం గోచరతో విశుద్ధం।
లోకేషు యచ్చంద్ర బలం ప్రధానం
శాస్త్రేషు ముఖ్యం ఖలు లగ్నమేవ."

(సంహితా ప్రదీపము)

కనుక, విషనాడీ దోషమును లగ్నమునకు సయితము అంటనీయకుండుట యుక్తము.

ఈ సంప్రదాయము ననుసరించి, చంద్రచారమునకు ఏ నక్షత్రములో ఏ ప్రదేశము విషనాడిగా ఏర్పడినదో, అదే ప్రదేశము లగ్నములో ఉండగల కాలమును 'సూక్ష్మ త్యాజ కాలము'గా భావించవలసియున్నది. ఈ కాలము రమారమి నాల్గునిమిషము లగును. ఒక్కొక్క నక్షత్రము లగ్నములో ఉండగల కాలము సరాసరి 53 నిమిషము లగుచున్నది. కాని, ఆయా ప్రదేశముల అక్షాంశలనుబట్టి ఈకాలము కొంత హెచ్చో, తక్కువయో, కావచ్చును. దీనిలో, ఆయా నక్షత్రమందలి త్యాజ్యభాగమున కనుగుణముగా, ఏదో యొక్క 'నాల్గునిమిషముల' కాలము పరిత్యాజ్యముగా ఏర్పడుచుండును. లగ్నపట్టిక గ్రంథముల (*Tables of Houses*) నుండి లగ్నమును శోధించు వాడుక కలవారికి ఈ సూక్ష్మత్యాజ్య కాలము సాధించుట కష్టముకాదు.

ఈపద్ధతి వాడుకలో ఉపయోగించువారు అరుదనుట సత్యము. 'కేవల' రాశికుండలులతోనే వ్యవహరించు అభ్యాసము వచ్చినందున, ఇట్టి సూక్ష్మపద్ధతులెన్నో మాయము కావలసివచ్చినది. నాల్గు గడియల కాలము అనుభవించియుండగల చంద్రత్యాజ్యమును గూర్చియే ఇంత అవ్యవస్థయున్నప్పుడు, నాల్గు నిమిషములలో చెల్లిపోవు సూక్ష్మత్యాజ్యకాలమును విచారించువారెవరు ?

"యవాగ్వామపి సందేహః,
కోసందస్యతు, కా కథా ?"

అను సుభాషితము స్మరింతము.

రాశిచక్రములో, ఏయే సాయనరాశిలో, ఏ ప్రదేశము విషనాడియగుచున్నదో, తెలుపు పట్టిక యొకటి, చదువరులు సౌకర్యార్థమై, ఈ వ్యాసమునకు అనుబంధముగా చేర్చబడియున్నది. స్పష్టచంద్ర స్థానమును, స్పష్టలగ్నమును సహా, సాయనపద్ధతితో గుణించు వాడుకగలవారు, ఈ పట్టికవు సాయమున చంద్ర త్యాజ్యకాలమునుమాత్రమే కాక, సూక్ష్మమగు లగ్న త్యాజ్యకాలమును సయితము, ఇండియన్ స్టాండర్డు కాలములో, సులభముగా సాధించగలరు.

"వేదస్య చక్షుః కిల శాస్త్రమేతత్."

# అనుబంధము

## విషనాడీ ప్రదేశ పథకము.

| సంఖ్య | జ్యోతిశ్చక్రములో (నిరయనము) విషనాడీ ప్రదేశము | | | రాశిచక్రములో (సాయనము) విషనాడీ ప్రదేశము (1940 వ సంవత్సరములో) | | |
|---|---|---|---|---|---|---|
| | రాశి | మొదలు కొని | వరకు | రాశి | మొదలు కొని | వరకు |
| | | భా. క. | భా. క. | | భా. క. | భా. క. |
| 1 | మేషము | 11-6 | 12- 0 | వృషభము | 4- 6 | 5- 0 |
| 2 | | 18-40 | 19-33 | | 11-40 | 12-33 |
| 3 | వృషభము | 3-20 | 4-14 | | 26-20 | 27-14 |
| 4 | | 18-53 | 19-47 | మిథునము | 11-53 | 12-47 |
| 5 | | 29-46 | ... | | 22-46 | — |
| | మిథునము | | 0-40 | | | 23-40 |
| 6 | | 11-20 | 12-13 | కటకము | 4-20 | 5-13 |
| 7 | | 26-40 | 27-33 | | 19-40 | 20-33 |
| 8 | కటకము | 7-47 | 8-40 | సింహము | 0-47 | 1-40 |
| 9 | | 23-47 | 24-40 | | 16-47 | 17-40 |
| 10 | సింహము | 6-40 | 7-33 | | 29-40 | — |
| | | | | కన్య | — | 0-33 |
| 11 | | 17-47 | 18-40 | | 10-47 | 11-40 |
| 12 | కన్య | 0-40 | 1-33 | | 23-40 | 24-33 |
| 13 | | 14-40 | 15-33 | తుల | 7-40 | 8-33 |
| 14 | | 27-47 | 28-40 | | 20-47 | 21-40 |
| 15 | తుల | 9-46 | 10-40 | వృశ్చికము | 2-46 | 3-40 |
| 16 | | 23- 6 | 24- 0 | | 16- 6 | 17- 0 |
| 17 | వృశ్చికము | 5-33 | 6-26 | | 28-33 | 29-26 |
| 18 | | 19-46 | 20-40 | ధనుస్సు | 12-46 | 13-40 |
| 19 | ధనుస్సు | 12-27 | 13-20 | మకరము | 5-27 | 6-20 |
| 20 | | 18-40 | 19-13 | | 11-40 | 12-13 |
| 21 | మకరము | 1- 7 | 2- 0 | | 24- 7 | 25- 0 |
| 22 | | 12-13 | 13- 6 | కుంభము | 5-13 | 6- 6 |
| 23 | | 25-33 | 26-26 | | 18-33 | 19-26 |
| 24 | కుంభము | 10-40 | 11-33 | మీనము | 3-40 | 4-33 |
| 25 | | 23-33 | 24-27 | | 16-33 | 17-27 |
| 26 | మీనము | 8-40 | 9-33 | మేషము | 1-40 | 2-33 |
| 27 | | 23-20 | 24-13 | | 16-20 | 17-13 |

**సూచన.**

కేతకీ 'జ్యోతిర్గణిత' రీత్యా 1940 వ సంవత్సరమునకు అయనాంశలు భా. 23-0 కలలు అగును.

ఈ పథకమందలి సాయనస్థానములు (6, 7 కలములు) 1940 (క్రీ. శ) సంవత్సరమునకు గుణించబడినవి. అయన చలనపు వర్షగతి 50¼ వికలలు. దీనిని అనుసరించి ఇష్ట సంవత్సరమునకు చేయవలసిన ఋణ ధన సంస్కారములు ఈ పథకమందలి సాయన స్థానములకు చేయవలసియుండును.

చదువరులు దీనిని గమనింతురని నమ్మిక.

# పావులూరి గణితము



శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

## ప్రకీర్ణ గణితము

శ్లో॥ 1యస్మాత్సముచ్ఛ్వసతి విశ్వ మభావ(భాతి?)
యత్ర స్థితిం చ లయ మేతి పునశ్చ యత్ర
తం సర్వహేతు నిఖిలామరవేదవేద్యం
బ్రహ్మస్వ(రూపి?)ణ మహం ప్రణమామి భక్త్యా.

వ. అందు ద్వితీయ భిన్నగణితంబుఁ జెప్పిన తదనంతరంబ తృతీయ ప్రకీర్ణ గణితంబుఁ జెప్పెదు (నందుఁ)2 ప్రథమ భాగజాతి కరణ సూత్రం బెట్టి దనిన

గీ. 3ఒకటిలోపల నంశంబు లూన మైన
దాన దృశ్యంబుఁ బాల్గొనఁ దత్ఫలంబు
హారముల వచ్చుదాని నంశములఁ బెంచి
భాగములఁ గొన్నఁ బ్రత్యేకఫలము లయ్యె.

క. 4నానాత్వంబున భిన్నం
బై సెఱసిన దృశ్యములుగ నన్నియ దృశ్య
స్థానమున నిల్పి యొక్కఁడు
...మాత్రమువఁ దెచ్చునది తత్ఫలముల్.

---

1. జైనుఁ డయిన మహావీరాచార్యుఁడు తన గణిత సారసంగ్రహమునఁ బ్రతియధ్యాయ ప్రారంభమునను జినదేవస్తుతి గావింపఁగా శైవుఁ డయిన పావులూరి మల్లన తనగణితమునఁ బ్రతియధ్యాయ ప్రారంభమునందును శివస్తుతి గావించినాఁడు. 'శ్రీకంఠం సగుణం' అని పరికర్మ గణితాధ్యాయమును, 'శ్రీకాంత నిర్మల మనోర్చిత' అని భిన్న గణితాధ్యాయమును సంస్కృత శ్లోకములతోఁ బ్రారంభించిన. మల్లన యీ యధ్యాయమును గూడ సంస్కృతశ్లోకముతోఁ బ్రారంభించుట గమనార్హము.

2. మూలమున నిట భాగజాతి కరణ సూత్రముఁ జెప్పుటకు ముందు ప్రకీర్ణ గణితమునందలి దశవిధ భేదములు పేర్కొనఁబడినవి. అం దిట్లు కలదు.

భాగ శ్శేషో మూలకం శేషమూలం
స్యాతాం జాతీ ద్వే ద్విరగ్రాంశమూలే
భాగాభ్యాసో ఽతోంఽశ వర్గోఽథ మూల
మిశ్రం తస్మాద్భిన్నదృశ్యం దశామూః.

1. భాగజాతి 2. శేషజాతి 3. మూలజాతి 4. శేషమూలజాతి 5. ద్విరగ్రశేషమూలజాతి 6. అంశమూలజాతి 7. భాగాభ్యాసజాతి 8. అంశవర్గజాతి 9. మూలమిశ్రజాతి 10. భిన్నదృశ్యజాతి అని పది విధము లయినజాతులు మూలమునఁ జేర్కొనఁబడినవి. తెలుఁగున నీ జాతి విభాగక్రమ మీతీరున నున్నది. 1. భాగజాతి 2. భాగమూలజాతి 3. శేషమూలజాతి 4. శేషమూల భాగజాతి 5. శేషభాగజాతి 6. ద్విరగ్రశేషమూలజాతి 7. అంశమూలజాతి 8. భాగసంవర్గ జాతి 9. హీనజాతి 10. భిన్నదృశ్యజాతి.

3. భాగోనరూపభక్తం దృశ్యం ఫల మత్ర భాగజాతివిధౌ—అని మూలము.

4 ఇది యమూలకము. అర్థము కుదురుట లేదు.

గీ. 1అంశ లన్యోన్యహత మైనయట్టిరాశి
నంశలను వేఱ పాలొన నవియుఁ గూడి
రాశిలోఁ బుచ్చి శేషము దృశ్యరాశిఁ
గొనుచు నాలబ్ధమున రాశిఁ గొనఁగ ఫలము.

గీ. 2అష్టమాంశ మవని వడఁగెఁ; ద్రిభాగంబు
గజము మాటుపడియెఁ; గళము త్రాటఁ
గట్టువడియెఁ బాద; మిట్టి యేనికఱంబ
మెంత చెప్ప మూర లేడు తోఁచె

౧/౮ ౧/౩ ౧/౪ దృశ్యం ౭ లబ్ధహస్తాలు ౨౪ ఇందుకు గుణించే క్రమం.

అంశలు ౮ పెట్టి అన్యోన్యహతం అనగా తర్వాతి అంశ మూడు చేతను గుణించగా ౨౪, యిది ఆతర్వాతి అంశ ౪ చేత గుణించగా ౯౬, ఈ రాశి నంశముల పాలుగొని అనగా అంశలు ప్రత్యేకం ప్రత్యేకం పాలుగొనడం—మొదటి అంశ ౮ పెట్టి పాలుగొన ౧౨, రెండో అంశ ౩ పెట్టి పాలుగొన ౩౨, మూడో అంశ ౪ పెట్టి పాలుగొన ౨౪, యీ మూడు ప్రతులు ఒక్కటి చేయను ౬౮, ఆ రాశిలో ద్రుచ్చి అనగా మొదటిరాశి ౯౬ లో తీసివేయగా శేషం ౨౮ ని—దృశ్యమునను గొనుచు—అనగా ఈ శేషం ౨౮ ని ౭ చేతను పాలుగొన ౪, ఆ లబ్ధమున రాశిఁ గొనఁగ ఫలము—అనగా ఈ ౪ చేతను అసలు రాశి ౯౬ ను పాలుగొన వచ్చినది ౨౪ న్ని నిజ మైనయొత్తు అని తెలిసేది.

మ. 3అలిబృందంబు త్రిభాగ మా (మ్లా)నులఁ,
బాదాంశంబు పున్నాగశా
ఖులఁ, బంచాంశము పుష్పవద్వ
కుళశాఖాపంక్తి, షష్ఠాంశముల్
నలినీసంహతిఁ, ద్రింశదంశము
లసమ్యక్కందముం జేరుచో
నలి యొక్కొ నొక టాడుచున్నది
తదీయాయంబు తా నెంతియో.

౧/౩ ౧/౪ ౧/౫ ౧/౬ ౧/౩౦ దృశ్యము ౧ లబ్ధ భ్రమరాలు ౬౦

గీ. పాటలములఁ ద్రిభాగంబు, పంకజముల
సప్తమద్విక, ముత్పలసమితియందు
నేకవింశతిపంచక మేఁగె నళులు
కానఁబడియెఁ దొమ్మిది దీని గణన మెంత?

౧/౩ ౨/౭ ౫/౨౧ దృశ్యము ౯ లబ్ధభ్రమరాలు ౬౩

మ. 4కమలానీకములం ద్రిభాగము
శివుం, గౌరిం దశష్టాదశాం
శము, హేరంబుఁ దదర్ధముం,
గుహు (నవాంశంబుం, దదీయత్రికాం)
శమున న్నంది, (నిజాంశ) మర్కునకు
నిద్భక్తి భక్తిఁ బూజించె శే
షము త్రింశత్సహితాష్టకంబు తగఁ
బూజం జేసెఁ దా నెంతయా.

౧/౩ ౧/౧౮ ౧/౩౬ ౧/౯ ౩/౩౬ ౧/౧౨ దృశ్యము ౩౮ లబ్ధకమలాలు ౧౦౮.

---

1. మూలమున శేషజాతి కరణసూత్రమున కిది యాంధ్రీకరణము. మూలమున భాగశేషజాతి కరణ సూత్రములు తదుద్దేశకములుఁ దెలుఁగున భాగజాతివి గానే చేర్చఁబడినవి.

అంశోనితరూపాహతి హృతే మగ్రం శేష మూలవిధౌ—అని మూలము. బీజగణిత ప్రకారము భాగజాతి కరణ సూత్రము $X = \frac{a}{1-b}$ శేషజాతి కరణ

సూత్రము $X = \frac{a}{(1-b_1)(1-b_2)(1\ b_3)\times etc}$

ఇందు $a$ దృశ్యము, $b$ అంశము, $X$ ఉద్దిష్టఫలము.

మూఁడవపాదమునందు – రాశిలోఁ బుచ్చి శేషము దృశ్యరాశి అనుచో యతి గమనార్హము.

2. మూలమునందలి 'దృష్టోఽష్టమం' అను శ్లోకమున కాంధ్రీకరణము. లెక్క యొక్కటే కాని విషయము భిన్నము.

3. మూలమునందలి 'షడ్భాగః పాటలీషు' అను శ్లోకమున కాంధ్రీకరణము. లెక్క యొక్కటే కాని పుష్పనామములు వేఱుగా నున్నవి. ఇందలి యంశముల నొక యారోహణక్రమములో నుంచుట యాంధ్రీకరణమునందలి విశేషము. పుష్పనామము లనువాదసౌకర్యమునకై మార్పఁబడినవి.

4. మూలమున 'అరాయామ్భోరుహాణాం' అను శ్లోకమున కిది యాంధ్రీకరణము. ఆంధ్రీకరణమున జిన ప్రశస్తికి బదులు శివప్రశస్తి యుండుట విశేషము. లెక్క యొకటే యయినను విషయము భిన్నము.

౧/౩, ౧/౫, ౧/౧౫, ౧/౧౫, ౧/౬, ౧/౩౬ అని మూలములో భిన్నము లొక క్రమములోఁ గలవు. ఆంధ్రీకరణమున నా క్రమము నిర్వహింపఁబడలేదు.

చ. 1సురతమునం జెనంగు చెడ
సుందరిహారము (త్రెస్సి ముత్యముల్
పరువడి శయ్యతూర్పునఁ
ద్రిభాగము దానికి నర్ధ మర్ధమై
నెరసెఁ దదష్టదిక్కులను
నిర్మలమై నగనాగలోకముల్
తిరమున నుండె సూత్రమునఁ
దెల్పుము మా కవి యెన్ని యేర్పడన్.

౧/౩, ౧/౪, ౧/౧౦, ౩/౪, ౪/౫, ౫/౬, ౧౧/౧౨, ౩/౪ దృశ్యము ౩౮౭ లబ్ధముత్యాలు ౧౧౫౨.

2సీ. ఖర్జూరఫలములు గణకుండు కొని తెచ్చి
సగపాలు మోహంపుసతికి నిచ్చె
నందు నాలవపాలు ననుఁగుఁదమ్మునికిచ్చె
నష్టభాగం బిచ్చె ననుజుసతికిఁ
దగఁ దొమ్మిదవపాలుఁ దనయున కిచ్చెను
దనచేత నాల్గున్నఁ దల్లి కిచ్చె
మొదలఁ దెచ్చిన వెన్ని మోహంపుసతి కెన్ని
యనుఁగుఁదమ్మున కెన్ని యతనిసతికి

గీ. యెన్ని యిచ్చె సుతున కెన్ని చ్చె మఱియును
దల్లి కెన్ని యిచ్చెఁ దగ వచింప
గణిత మెఱుఁగినట్టికరణాలఁ బిలిపించి
యడుగవలయు దేవ! యవధరింపు.

౩/౪ ౧/౪ ౧/౫ ౧౧/౧౫ దృశ్యము ౮ లబ్ధఫలములు ౨౮౦.

ఇది ప్రకీర్ణగణితంబునందు భాగజాతి సమాప్తము.

వ. అందు ద్వితీయ3 భాగమూలజాతి కరణసూత్రం బెట్టి దనిన

గీ. 4పరఁగ మూలార్ధదృశ్యము భాగరహిత
రూపమునఁ బాలుగొనఁగ నారూపవర్గ
మగ్రమును గూడి కృతిమూల మైన మూల
సంయుతము చేసి వర్గింప సార మయ్యె.

మ. కనర వింధ్యాటవియందు మత్త
గజయూథం బర్థిఁ గ్రీడింపుచుం
జరణాంశం బరిగెం గరేణు
వశమై చాలించి మూలద్వయం
బరిగె న్నిర్మలనర్మదా
సలిలగాహోత్సుకమై నిల్చె నం
దరయంగాఁ బదునైదు తద్గజ
సమూహం బెంత యూహింపఁగన్.

భాగము ౧/౪ మూలము ౨ దృశ్యము ౧౫ లబ్ధం గజాలు ౩౬.

గీ. మేఘనాదంబు విని కొంచమీఁదఁ బురులు
విచ్చి సప్తమాంశద్వయ మెచ్చ నాడె

---

1. మూలమున ౧౪ నుండి ౨౨ వఱకుఁ గల శ్లోకముల కిది తెలిఁగింపు. ఆంధ్రీకరణమున సంఖ్యలు సమానములే యయ్యు దృశ్యము భిన్నముగా నున్నది. మూలమున దృశ్యసంఖ్య యగు ౧౧౬౧ (ఏకాగ్రషష్టి శతయుత సహస్రము) మిక్కిలి పెద్ద సంఖ్య యని, లెక్క చేయుటకుఁ గష్ట మని తలఁచి యందు మూఁడవపా లగు ౩౮౭ (నగ నాగలోకములు) మాత్రమే మల్లన గైకొని యుండును.

2. ఇది యమూలకము. పెద్దబాలశిక్షలోఁ గూడ నిది పావులూరి గణితములోనిదిగా నుదాహరింపఁబడి యున్నది.

3. మూలమున నిది కేవలము మూలజాతి యని పేర్కొనఁబడినది.

4. 'మూలార్ధాగ్ర' అను శ్లోకమున కిది యాంధ్రీకరణము.

బీజగణితము ప్రకార మీ సూత్ర మీ క్రింది తీరున నుండును.

$$X = \left\{ \frac{\frac{c}{2}}{1-b} + \sqrt{\frac{a}{1-b} + \left( \frac{\frac{c}{2}}{1-b} \right)^2} \right\}^2$$

ఈ క్రింది సమీకరణము ప్రకార మిది సులభముగాఁ బొందనగును.

$$X - (b X + c\sqrt{X} + a) = 0$$

ఇందు $c$ మూలము.

వివరణము—రూపము అనఁగా ఒకటి. ఒకటి నుండి యంశభాగమును దీసివేయగా వచ్చిన మొత్తముచే మూలార్ధమును, దృశ్యమును వేర్వేరుగా రెండు ప్రతులుగా భాగింపవలయును. మూలార్ధ ప్రతిని వర్గించి దానిని దృశ్యప్రతితోఁ గూడి కృతిమూలము కనుఁగొనవలయును. అట్లు చేయఁగా వచ్చిన మొత్తమును తిరిగి మూలార్ధప్రతితోఁ గూడి వర్గించినచో నుద్దిష్టఫలము వచ్చును.

5. 'దృష్టోఽటవ్యాం' అను శ్లోకమునకు భాషాంతరముగా నీయఁబడినశ్లోకమున కిది తెలిఁగింపు.

మూలములు రెండు క్రీడించి క్రోల నిలిచె
నిరువదొక్క మయూరంబు లెన్ని చెపుమ.

భాగము ౨/౭ మూలము ౨ దృశ్యము ౨౧ లబ్ధ మయూరములు ౪౯.

గీ. పద్మషండంబులోనఁ ద్రిభాగ ముండె
మూలములు మూఁడు తీరముల వసించె
నెదుర నిరువదియే డుండె ముదముతోడ
నెన్ని హంసంబు లవి మాకు నెఱుఁగఁ జెపుమ.

భాగము ౧/౩ మూలము ౩ దృశ్యము ౨౭ లబ్ధ హంసలు ౮౧.

గీ. సింహచయముఁ గనుంగొని చెదరిహరిణ
గణము నాల్వపాలు దుర్గముల కరిగె
గిరికి నెనిమిదిమూలంబు లరిగెఁ గలయఁ
బఱచె నఱువదినాలు గేర్పులుపు దీని.

భాగము ౧/౪ మూలము ౮ దృశ్యము ౬౪ లబ్ధ హరిణములు ౨౫౬.

క. కమలాకరమునఁ బంచాం
శము మూలచతుష్టయంబు సారసములు తీ
రమున విహరించె నాకా
శమునకు నన్నూఱు చనిరె సరి యెన్ని యగున్.

భాగము ౧/౫ మూలము ౪ దృశ్యము ౪౦౦ లబ్ధ సారసాలు ౬౨౫.

గీ. సౌధతలమున విహరించె సప్తమాంశ
మష్టమూలంబు శయనగృహాంతరమునఁ
జనఁగ నేఁబదియా ఉండె జాలకముల
గృహకపోతకగణ మెంత మహితకీర్తి!

భాగము ౧/౭ మూలము ౮ దృశ్యము ౫౬ లబ్ధకపోతాలు ౧౯౬.

క. అళిగణ మర్ధము పొన్నల
నలయక క్రీడించె ద్విష్ట మష్టాదశపై
విలసిల్లె మూల మేమియుఁ
దలఁపఁగ నే దిలులసంఖ్య తా నెంత యగున్.1

భాగము ౧/౨. మూలము (౦) దృశ్యము ౧౮ లబ్ధ మధుకరాలు ౩౬.

గీ. కొలనిలోపలఁ గచ్ఛపకులమునందు
భాగశూన్యంబు మూలంబు పదఁగ నొకఁడు
దృశ్య మేర్పడ ముప్పది తేలఁబడియెఁ
గచ్ఛపంబులు దా మెన్ని గణక! చెపుమ.

భాగము (౦) మూలము ౧ దృశ్యము ౩౦ లబ్ధ కచ్ఛపాలు ౩౬.

ఇది ప్రకీర్ణగణితంబునందు ద్వితీయభాగమూల జాతి సమాప్తము.

అందుఁ దృతీయ శేషమూలజాతి కరణసూత్రం బెట్టి దనిన

గీ. చనఁ జతుర్గుణదృశ్య మూ పన్నమైన
మూలకృతిఁ గూడి యది వర్గమూల మైన
మూలయుక్తార్ధకృతులను మొదలిదాఁక
నోలిఁ జేసిన నగు శేషమూలజాతి.2

గీ. ఒకవనమ్మున నలికుల ముండి యందు
నలువదెనిమిదిమూలముల్ నళిని కేఁగె
శేషమూలము లినసంఖ్య చేరెఁ గలువ
లందుఁ దచ్ఛేషమూలంబు లర్క సంఖ్య.

బీజగణితపద్ధతి నీసూత్ర మిట్లుండును.

$$X - bX = \left\{ \frac{c + \sqrt{c^2 + 4a}}{2} \right\}^2$$

మూలమునందలి సూత్ర మిట్లున్నది.

$$X - bX = \left\{ \frac{c}{2} + \sqrt{\left(\frac{c}{2}\right)^2 + a} \right\}^2$$

$X - bX$ యొక్క విలువ నీ క్రింది సమీకరణము వలన సులభముగాఁ బసయఁదగును.

$$X - bX + \left( c\sqrt{X - bX} + a \right) = 0$$

---

1. 'కలకంఠానా మర్ధం' అనుశ్లోకమున కిది తెలిఁగింపు. కలకంఠములకు బదులు తెలిఁగింపులో నళిగణమువిషయము చెప్పఁబడినది.

ఈ యధ్యాయమునఁ జేర్పఁబడినవానికిఁ దప్పఁ దక్కినవానికి మూలశ్లోకములు కానరావు. ఆ పద్యములును, లెక్కలును మల్లనవే.

2 'పదదళవర్గయుతాగ్రా న్మూలం
సప్రాక్పదార్ధ మస్య కృతిః
దృశ్యే మూలం ప్రాప్తే ఫల
మిహ భాగం తు భాగజాతివిధిః'

అని మూలము. మూల సూత్రమునకుఁ గొంత భిన్నముగా నిందు సూత్ర రచనము కలదు. అయితే ఫలితార్థము సమము.

మెల్లలం దేఁగ శేషమణ్యూలములను
దొలఁగ శేషత్రిమూలముల్ తిలకములను
శేషమూల మొక్కండు వసించెఁ గ్రోవు
లందు రెండుండె నీయలిబృంద మెంత?

మూలము ౪౮ శేషమూలము ౨౪ శేషమూలము ౧౨ శేషమూలము ౬ శేషమూలము ౩ శేషమూలము ౧ దృశ్యము ౨ లబ్ధము భ్రమరాలు ౪౦౯౬.

(ఇందుకు గుణించే క్రమం)

దృశ్యము ౨న్ను ([1]కృతిసేయ ౪ పెట్టి మెండటి రెంటిచేత గుణించగా) ౮. ఆ తర్వాతి మూలము ౧ కృతిసేయ ౧ యిది ౮ లో కలియగూడిన ౯, ఇది వర్గమూలము సేయగాను ౩, మూలము ౧ కలియగూడిన ౪, అది యర్ధించిన ౨ వర్గించిన ౪, ఇది చతుర్గుణము సేయ ౧౬, తర్వాతి మూలము ౩ వర్గించగా ౯ యిది ౧౬ తో కలియ గూడితే ౨౫ అందుకు మూలము ౫ ఈమూలము ౩ కలియగూడిన ౮ అర్ధించిన ౪ వర్గించిన ౧౬, ఇది చతుర్గుణము సేయగా ౬౪ తర్వాతి మూలము ౬ వర్గించగా ౩౬ ఇది కలియగూడితే ౧౦౦ ఇందుకు మూలము ౧౦ ఈ మూలము ౬ కలియగూడిన ౧౬ అర్ధించిన ౮ వర్గించిన ౬౪, ఇది చతుర్గుణము సేయగా ౨౫౬, తర్వాతి మూలము ౧౨ కృతిసేయ ౧౪౪ అవి కలియగూడిన ౪౦౦ ఇందుకు మూలము ౨౦ మూలయుక్తము ౧౨ కలియగూడిన ౩౨ అర్ధించిన ౧౬ కృతిసేయ ౨౫౬ ఇది చతుర్గుణము సేయ ౧౦౨౪ తర్వాతి మూలము ౨౪ కృతిసేయ ౫౭౬ ఇది కలియగూడిన ౧౬౦౦, ఇందుకు మూలము ౪౦ మూలయుక్తము ౨౪ కలియగూడిన ౬౪ అర్ధించిన ౩౨ ఇది కృతిసేయను ౧౦౨౪ చతుర్గుణము సేయ ౪౦౯౬ తర్వాతిమూలము ౪౮ కృతిసేయ ౨౩౦౪ ఇవి కలియగూడిన ౬౪౦౦ ఇందుకుమూలము ౮౦ మూలయుక్తము ౪౮ కలియగూడిన ౧౨౮ అర్ధించిన ౬౪ వర్గించిన ౪౦౯౬.

సీ. అవని నొక్కరుఁడు ద్రాక్షారామభీమేశు
శిరమున రత్నాభిషేక మర్థిఁ
జేయుచుఁ దన్మణిశ్రేణి పూర్వాదిగా
నెనిమిదిదిక్కులందును దదీయ
మూలముల్ క్రమమున మున్నూటరెనుబది
నాలుగు తచ్ఛేషమూలములును
దన్మూలమునకు నర్ధము తదర్ధము నయ్యె
నంత నెనిమిదిపర్యంతములుగ

గీ. నెలసె ని[2]ల్పటఁ దన్మణినికర మెల్ల
మస్తకంబున నాలుగుమణులు నిలిచె
లాలితం బైనతచ్ఛేషమూలజాతి
నెలుఁగు జేసియుఁ దత్సంఖ్య దెలుఁగఁ జెప్పు.

మూలము ౩౮౪ శేషమూలములు ౧౯౨, ౯౬, ౪౮, ౨౪, ౧౨, ౬, ౩ దృశ్యము ౪ లబ్ధరత్నములు ౨౬౨౧౪౪.

గీ. పంచమూలంబు 2 పసువలఁ బంకనూడె
శేషమూలపవార్ధంబు చేల కరిగ
నొక్కమూలంబు మస్తల నొల్చి తినియె
నాలు చెలలాడె నీవరాహంబు లెన్ని?

ఈ యధ్యాయమునందలి లెక్కలన్నియు మల్లనవే. సంస్కృతశ్లోకానువాదములు కావు.

మూలము ౫ శేషమూలము ౯ శేషమూలము ౧ దృశ్యము ౬ లబ్ధవరాహాలు ౮౪. 3

ఇది ప్రకీర్ణగణితంబునందుఁ దృతీయ శేషమూలజాతి సమాప్తము.

(పావులూరి మల్లన గణితము అముద్రిత ప్రతి నుండి)

---

1. చతుర్గుణము సేయ ౮ అని యుండఁదగును.

2. వలుపల?

3 ఈ లెక్క కుదురుట లేదు. తప్పుగా నున్నట్లున్నది.

# తడకమళ్ల వేంకటకృష్ణారావు

## (1825 - 1890)



శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఆంధ్ర విజ్ఞానసర్వస్వము ప్రథమ సంపుటములో 'అంకగణితము' అను శీర్షికయం దిట్లు గలదు. (పుట 42)

### ఆంధ్ర గణితశాస్త్రజ్ఞులు - గణితములు

"తడమళ్ళ కృష్ణారావు ఇటీవల గణిత శాస్త్రమును తెనిగించినవారిలో తడకమళ్ల కృష్ణరావుగారు ముఖ్యులు. ఈయన చెన్నపురి వాస్తవ్యుఁడు. గోలు కొండవ్యాపారి. నలుబది సంవత్సరముల క్రిందటి వాఁడు. ఈయన లీలావతిని భాషాంతరీకరించి రేఖా గణితమును బీజగణితమును నవీనపద్ధతుల ననుసరించి వ్రాసెను."

కృష్ణారావుగారు ప్రధానముగ గణితశాస్త్రజ్ఞులే యైనను, కావ్య నాటకాలంకారాది సమస్త సాహితీ విజ్ఞాన సంపన్నులు - దివ్యదృష్టి కళా విశారదులు - బహుముఖప్రజ్ఞాన ధురీణులు బహుభాషావేత్తలు - బహుమహోరాజాస్థాన సంభావితులు - పందొమ్మిదవ శతాబ్దిని విలసిల్లిన ప్రసిద్ధాంధ్ర రచయితలలో ప్రథమ శ్రేణికిఁ జెందిన విద్వాంసులు - చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమున, వీరిరచనలనెన్నియో స్వహస్తలిఖితమైనవి కలవు. వీరి గ్రంథములు ముద్రితములైనవని క్రీ. శ. 1860-80 ప్రాంతముల ముద్రితము లగుటచేతను, వీరు జమీనుదారులగు సంపన్న గృహస్థులగుటచేతను, నితర పత్రికల మూలమున వీరి ప్రతిభాదికములు లోకమునకు వెల్లడి కాలేదు. ఉపలబ్ధములగు సాధన సామగ్రినిబట్టి వారి చరిత్రమును వివరింతును.

వేంకట కృష్ణారావుగారి పూర్వులు తెలింగానా ప్రాంతమున దేశముఖి దేశపాండ్యా పదవులను నిర్వహించి నల్లగొండతాలూకా యందలి తడకమళ్ళ యను ముప్పదిరెండువేల్లసీమను జాగీరుగా బడసి యా గ్రామనామమే గృహనామముగా విలసిల్లినవారు. వారి గ్రంథములలో నొకటి యగు దృగ్గణితకావ్యమున వంశక్రమ మిట్లు గలదు.

హారీతసగోత్రము - డబ్బు సింగమరాజు

గోపన్న

అప్పకొండ

రాజగోపాలము లేక వేణుగోపాలరావు

శ్రీనివాసరావు



వేంకటకృష్ణరావుగారు వేంకన కుమారుఁడైనను పినతండ్రికి దత్తుఁడగుటచే పాలక పితనామమే యన్నిచోట్ల చెప్పినారు.

## వంశ వివరణము :

## శ్రీమదాంధ్ర దృగ్గణిత కావ్య ప్రారంభము

శా. శ్రీవైదర్భియు, సాంబ పార్వతికి
బలుల్ చిత్తోద్భవోపాపతుల్
సేవింపందరతో త్రివేత్రి నరుఁడై
శ్వేతాశ్వ గీతాళిచే
భావారూఢములైన సంశయములన్
భంగంబు నొందించి స
ద్భావంబొప్పఁగ బృందకానన
నికేతస్థున్ హరింగొల్చెదన్.

శా. శ్రీభాషేములు వతుఁవాక్తనువులన్
చెల్వొంది సౌభాగ్య వి
ద్యాభాగుల్ మిథునాళికియ్య
జగదాధార క్రియా సంహృతుల్
మేభావింతును విష్వక్సేన
త్రిగుణావిర్భూతికిన్ హేతువై
దాభాసిల్లెడు నాదితేజము
మదింభావింతు నిష్టాప్తికై.

## గ్రంథకర్త వంశావతరణము :

## గోలుకొండ వ్యాపారుల యుత్పత్తి

సీ. శ్రీరమేశునియాజ్ఞ సృష్ట్యాదికాలంబు
నందు చతుర్ముఖుం డతులమహిమ
వదన బాహూరు పత్పదములఁ గ్రమముగా
విప్రాదుల సృజించి వితతమగున
క్రియచే జగద్వృద్ధి కిరవగునట్లుగ
మనుశతరూపల గని సమస్త
భువనకార్యాదులఁ బోసగించు మనువుఁడు
నలేఁడు లోకవ్యవహారమునకు
తనమాలుగా నన్ని పనులు నిర్వర్తింప
వ్యాపారులను కులంబేర్పరిచి
సృజియించి సచివత్వ విప్రత్వ రాజత్వ
రాయత్వసంజ్ఞల రహినొసంగి
రాజకార్యంబులు పూజితంబుగఁ గొంచు
విప్రార్థ రాజార్థ వివిధ వేద
శాస్త్రోక్తకర్మముల్ సలుపంగ నధికారు
లని ప్రాడ్వివాకాదులను సుధర్మ
వ్యవహారములు దీర్ప వలఁతుల నొనరింప
నది యాదిగా యజనాదికర్మ
ములు రాజకార్యముల్ సలుపుచు కలియందు
గోలుకొండను చేరి గోలకొండ
వ్యాపారులనబడువారిలో మేటియౌ

## డబ్బు సింగమ రాజు

హారీతసగోత్రుఁడై యలరుచుండు
కృష్ణయజుశ్శాఖి వైష్ణవభక్తుఁడా
పస్తంభసూ(త్రు)డు రుద్రప్రతాప
రుద్రుని మంత్రియౌ భద్రయసుం డైన
యట్టియుగంధరు నట్టి మేటి
కార్యఖడ్గంబుల ఘనుఁడు నాగులపాటి
పరగణాకును దేశపాండ్య దేశ
ముఖియు కానూను గోముఖ్యాధికారియై
రహిడబ్బు సింగమరాజు తనదు
కార్యనిర్వాహాతి ఖడ్గధురీణత
నధిపులనలరించి యధిపతి కృప
తడకమళ్లాఖ్యచేఁ దనరినపురములో
ముప్పదిరెండూళ్లు మెప్పుఁగఁగొని
సర్వాధికారంబు నిర్వహించుటచేత
తడక మళ్ళాహ్వయ మెసుమి తనదు
వంశనామము భూమివర్తిల నొనరించె
నతనికి పుత్రాన్వయంబు వరుస

## గోపన్న

గోపన్న యను మేటి భూపకార్యధురీణుఁ
డౌయవ్వరుద్దీను నాలుకాటి
మాఘానబాబయి సొంపొందవచ్చుచో
సామంతతవహించి సకలకార్య
దక్షుఁడై తిరుపతిరక్షించు పనిఁబూని
రామచంద్రపురంబు రహినొసర్చె

## అప్పకొండ; రాజగోపాలము

నతనికి నప్పకొండాహ్వయుఁ డతనికి
రాజగోపాలుండు రహిసుతుండు

## శ్రీనివాసరావు

జనియించె నతనికి మనుయసుండౌ శ్రీని
వాసరాయం డుద్భవంబునొంద
అతనికి నెవురు సుతులందు వేంకట
రామన్న పంతులు రమ్యగుణుఁడు
వెంకన్న మంత్రియు విపుల యశస్కుండు
రంగారాయ ప్రధాన్య భంగకీర్తి
కొండనమంత్రియు కొండికయగునట్టి
కృష్ణరాయుండను భూష్టదాత
వారలలో పెద్దవాఁడనపత్యుఁడై
మొదలిటేవియగున ముక్తినొంద

రెండవపుత్రుఁడై గండుమీాలేవయట్టి
బ్రహ్మర్షి వెంకన్న పండితుండు

## వెంకన పండితునికి కృష్ణారావు జననము

నిజధర్మసతియయి వెగడు కుట్టెమయందు
బుధు కాల షోడశ వితతనిరీని
స్వాతిబిందూపమస్వామోహవీర్యంబు
చేర్చిన ముక్తియుఁ జెలఁగు జలధి
వీఁకజనించిన వేకుమారునిగని
తనవంశవృద్ధికై తన్ను వీడు

## రంగారావు

నిజసోదరుండును నిఖిలధరాధీశ
కార్యనిర్వాహణధుర్యమతియు
అవజాహమ్మదు కోస్థానమంత్రియు
తతోన్నదరోన్నత ధన్యతయుఁగు
సాహుంకారిత్వంబు జమిదారు నామంబు
సంసారపోషణ ఘనుఁడౌనడు
వదలు రంగారాయవరుని కాత్మజునిగా

## వేంకటకృష్ణారావు దత్తుఁడగుట

నిచ్చట నాతండు నింపుతోడ
గొని నిజగృహరాణిరై కనకాంబకునొసంగి
పీని పెంపువల పీడు వితతయసుఁడు
వివిధవిద్యాఢ్యుడై వలయువాఁడెనుటయు
నాయమ రెండవజాయయయ్యె
అప్పుడె బెండిలి నందినదయ్యును
తప్పక గొని తన తనయుకన్న
నధికంబుగాఁ బెంచ నదిమొద లిరువురు
తల్లులు దండ్రులు తనకు సకల
విభవంబు లొనఁగూర్ప వెలయుచు
ధనధాన్య రాజ్యగోష్ఠాగార రత్నసమితి

## వేంకటకృష్ణారావు
## విద్యాప్రతిభా విశేషములు

గొని శ్రీత్రనంతరమున నశేంచాబహా
ద్దరుమన్ననయు బొమ్మసరణిపు కృప
నరయానశాయి, రత్నాంగదాదులనంది
శ్రీరంగసేత్వాది భూరితీర్థ
యాత్ర మాత్రాజ్ఞచే పాత్ర దానంబుల
ధనము నెచ్చించుచు ననుపమాన
శక్తిసుత్రూషల పరమగురుండగు
వేంకటాచార్యుచే వివిధయోగ
విద్యారహస్యముల్ వేదవేదాంగము
లుపనిషదితిహాసములు పురాణ
ములు చతుష్షష్టికళలును, కౌతుండకంబు
నసాధ్యనంద కారణంబు
రెట్టమతంబును గట్టికధూముల
సంప్రాప్తవిధియును సకలవృక్ష
వల్లీకరణ పుష్పవర్ణ భేదక్రియాదోహద
వేదంబు, దుస్తరమగు
ద్రావిడసంస్కృతాంధ్ర మరాటకర్ణాట
పారసీప్రాకృత ప్రభృతిగణిత
ములు, బీజగణితంబు మొదలగువనియును
ధర్మశాస్త్రంబుల మర్మములును
రాగతాళ స్వరప్రస్తార మంత్రార్థ
సంఖ్యాన్యస్వనీర్యాది సకలవృత్త
శాస్త్రంబులు రతంబు సాలగ్రామాదిక
రత్నపరీక్షయు రాగవిధియు,
కాలక్రియా గణిత సంహితలందు
భూఖగోళాదిక బోధక యగు
సిద్ధాంతతజ్ఞతఁ జెలఁగి ప్రాచీనమా
సౌరబ్రాహ్మమరీచి శౌనకాదు
లగు ముఖ్య లెవమంత్రి లలిత సిద్ధాంతముల్
బ్రహ్మగుప్త వరాహ భాస్కరార్య
ధట మంజులాచార్య పారసీకప్రకా
శలలార్య గణితముల్ లాఘవాది
కరణముల్ తంత్రముల్ కరణపద్ధత్యాదు
లగణిత పాదచారాదులెల్ల
యూరపుఖండాది హూణాంగ్లీకు బ్రిటిషు
ప్రాంసు తురుష్కాది బహుళగణక
కృతగోళ గణదైత్య దృక్ సిద్ధతంత్రముల్
లక్ష్యలక్షణరూఢిలలి నెఱింగి
పక్షపాతములేక ప్రకటింపఁగాఁ జేయు
నభ్యసింపఁగఁగోరు సభ్యులకును
హృద్యగద్యప్రబంధచిత్రాసు సోష్ఠ్య
నిరోష్ఠ్య విరచనాశక్తి గలిగి
నిజకులదీపమై వెగడు వేంకటకృష్ణన
రావు గనుంగొని దైవశాస్త్ర
వేది పూర్ణాదిశర్మాది విప్రవరులు
ప్రియమును వయస్వభావంబు నయముకులుకు
లలిత ఫణితుల నొకనాడు సలలితముగ
నిట్టులని యానతిచ్చిరి వెవరుగులుక

## కవికులాభివర్ణనము
## గోలుకొండ వ్యాపారుల వర్ణనము

విహితాచారముకా, విజృంభణముకా,
విద్యాప్రసంగంబుకా

సహవాసంబునకా, విలాసమునకా,
  సత్యాభిమానానికా
బహుదాతృత్వముకా, మదిన్
  సొగసుగా ప్రఖ్యాతికా, యుక్తికా
సహి! వేపారులకన్న వేసరుల
  సెన్నగ్ రాయచూడామణీ!
శాపానుగ్రహశక్తి సంపద
  సదాచారంబు దాతృత్వముల్
రూపాది కృతకీర్తి విద్యగుణముల్
  రోషంబు గాంభీర్యముల్
నైపుణ్యంబును సత్యముల్ కరుణ
  శాంతవ్యానుకూలంబులన్
వ్యాపారింప్లను చెల్లుగాక
  పుడమిన్ వైఘాంసకోశంబునన్.

ఉ॥ శ్రీరమణీకుమారులు నృసింహ
  కిశోరులు వీరవైష్ణవా
చారులు సుందరీమదన
  సంగరశూరులు దివ్యపంచ సం
స్కారులు రాజకార్యసహకారులు
  సన్మణిపుంజ మాలికా
హారులు నిర్వికారులు
  సురాలయధీరులు నిత్యమందిర
ద్వారసవాదశేరులు సదా
  ఫలకారులు బంధుమిత్రమం
దారులు ఘోరపాప కవితా
  నవిదూరులు దుష్టశత్రుసం
హారులు శాస్త్రభాష్యల విహారులు
  వైభవ భోగభాగ్యజం
భారులు సత్యచారులు
  బలాఢ్యశరీరులు వార్ధితుల్య గం
భీరులు రూపనిర్జితకుబేర
  కుమారులు గోలకొండ వ్యా
పారు లుదారసాహసులు
  బ్రహ్మకులోద్భవు లుత్తమోత్తముల్
ధారుణివారికన్న వరదాతలు
  లేరిక యెందుచూచినన్.

ఈ ప్రత్యేక బ్రాహ్మణ శాఖాప్రశంస మనోహరముగా నున్నది. ఇది దాసు శ్రీరామకవీంద్రుని 'తెలుఁగునాడు'లోని వర్ణనకన్న యిరువదిరెండేండ్లు ముందు వెలసినది.

పైవంశేయులలో వేణుగోపాలరాయ డిట్లు వర్ణితుం డైనాఁడు.

సీ. ఏరాయమణిభోజు దారుఁడై మునుఢిల్లి
  పాదుషాచే మెప్పు బడయఁగాంచె
నేమంత్రిబంగాళ సీమ జమాబంది
  గావించి తద్రాజు కరుణఁగాంచె
నేప్రధాని నిజాముచే పారితోషికం
  బంది తద్రిపుసేన పారఁద్రోలె
నేనీతి నిధి ప్రీతి నెల్లదానంబుల
  ధరణీసురావళిఁ దనియఁజేసె
నతఁడు సామాన్యుఁడే జగత్త్రితయవినుత
వితత సత్కీర్తిశాలియై వెలయుతడక
మళ్లకులకలశాబ్ధి హిమాంకుఁడనఁగ
రాజిలును వేణుగోపాల రాయమౌళి.

పాలకపేటయను రంగారావును, కార్వేటి నగర రాజైన మాకరాజుచే సన్మానితుఁడయ్యెనని, అతని సభాంగణమున కార్యకర్తగా వెలసినవాఁడని కృష్ణారావుగారే యిట్లు చెప్పినారు.

క. ఆయనపుత్రుఁడు రంగా
  రాయఁడు కడుచెప్పె మాకరాజాదిమహీ
  నాయక సభాంగణస్తవ
  దాయక నీతిజ్ఞ దావ ధారేయుండై.

వేంకటకృష్ణరావు పైని చెప్పుకొనిన విషయములలో నతిశయోక్తులు లేవు. వారి కాంగ్లేయభాషయందేగాక సంస్కృత ద్రావిడాంధ్ర కర్ణాట మహారాష్ట్రి ప్రాకృతభాషయందు పాండిత్యము గలదు. మఱియు గణితశాస్త్రమున భాషాంతరీకరణ గ్రంథముల తెలియుంగుటకు అరబ్బీ, పారసీ భాషలయందు ప్రావీణ్యమును సంపాదించినారు. పైని చెప్పిన గ్రంథములలో సస్యానందమును[1] వారే క్రీ. శ. 1889 లో ప్రకటించిరి. రెట్టమతము మొదలగు గ్రంథములను మొదట ముద్రించినది వీరే. ఇట్లు పండఁబారిన వయసున నేకాక వేంకట కృష్ణరావుగారు బాల్యము నుండియు ప్రతిభాసంపన్నులై వెలసినారు. లీలా[illegible] కృత్యాదిలో నీతని గురుపోదరుడు కృష్ణకవి చె[illegible] యీ క్రింది పద్యమాలిని ప్రతిభ వ్యక్తము సే[illegible]చున్నది.

సీ. వినినయంతనె సర్వ వేదవేదాంగముల్
  చిరతరాభ్యస్తమై తెలువుగాంచె
చదివినయంతనె సకల పురాణ
  కథాప్రపంచంబు హృద్యతరహించె
యాలించినంతనె యఖిలశాస్త్రరీతి
  హాసములు వల్లించిన సరణినించె

1. 'దీని ననుసరించియే నేను దోనయామాత్యుఁడు సస్యానందము' అను వ్యాసమును వ్రాసితిని. (మా. భారతి 1946.)

సూచించినంతనె సురుచిర నాటకా
లంకార కావ్యంబు లటు గ్రహించె
గీ. పలికినంతనె చాటు ప్రబంధరచన
తలఁచినంతనె యితర విద్యాప్రపంచ
సంగ్రహాతమించె నలవియే సన్నుతింప
రమ్యగుణఖని నీ కృష్ణరాయ ఘనుని.
సీ. వేదజ్ఞులకు చతుర్వేద వేదాంత
తదంగ శిక్షావిధుల్ దగరచింప
శాస్త్రజ్ఞులకు శాస్త్ర షట్క ప్రసంగ
సంగతుల మార్గస్థితి గైకొనంగ
గోళజ్ఞులకు ఖగోళ భూగోళ
భేదములెఱుంగఁ సమర్థతవహింపఁ
గావ్యజ్ఞులకు నాటకాలం క్రియా
భాణ చంపూప్రబంధవాక్సరణి దెలుప
గీ. బహుపురాణజ్ఞులకుఁ బదుపాత్త సకల
మర్మము లెఱింగి నాక్రమవ్య మఱియు పెక్కు
విద్యలను నీవ మిన్నవై వెలసి తౌర
కృతిజనవిధేయ! వేంకట కృష్ణరాయ.

వీరు చెన్నపురియందు పార్థసారథిస్వామి దేవాలయసమీపమున - కైరవిణీప్రతినామక మగు తిరువల్లిక్కేణియందు స్థిరనివాస మేర్పఱచుకొని, విద్వద్గోష్ఠులోను, వివిధవిజ్ఞాన ప్రచారక గ్రంథ రచనలోను కాలము గడిపిరి. అధునాత నాంధ్రవాఙ్మయమున, శాస్త్రీయవాఙ్మయశాఖకును, కథావాఙ్మయ శాఖకును వీరొనర్చిన సేవ నిరుపమానము; నిరవధికము. ఆధునిక వాఙ్మయ చరిత్రలయందు వీరి నామము విస్మరింపబడుట విషాదకరము. ఇక వారి గ్రంథములనుగూర్చి ప్రత్యేకముగ వివరించుచున్నాము.

## శాస్త్రీయ గ్రంథములు

### ౧. లీలావతి గణితము

సుప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త యగు భాస్కరాచార్యులవారి సిద్ధాంత శిరోమణిలోని లీలావతీ గణిత భాగమును తడకమళ్ల కృష్ణారావు గారు పద్యరూపముగ ంచి, వివరణమును కూడ వ్రాసి యుండిరి. ఈ ంథము క్రీ. శ. 1861 సంవత్సరమున వ్రాసినసంగతి ని యాది సరస్వతీనిలయముద్రాక్షరశాలాధ్యక్షు లగు శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారీ గ్రంథమును తాము ముద్రించెదమని కవిగారికి వ్రాతమూలకముగాఁ దెల్పిరి. వేంకట కృష్ణరావుగారు శ్రీ శాస్త్రులవారికి గ్రంథస్వాతంత్ర్యము నిచ్చిరి. ఈ రెండు జాబులను క్రీ. శ. 1863 వ సంవత్సరమున ప్రకటితమైన ప్రథమ ముద్రణమునం దున్నవి.

ఇందు లీలావతిమూలమున గల పదమూఁడధ్యాయములకు సరియగు భాషాంతరీకరణము గలదు. ప్రాచీన సంప్రదాయానుసారముగ గ్రంథావతారిక, అధ్యాయాంతగద్యగలవు. మంగళాచరణము ఇష్టదేవతాస్తుతిగైన వెనుక గురువగు ముడుంబ వేంకటాచార్యుని స్తుతించెను. సుకవిస్తుతి, యావెనుక కుకవి నింద గావించి, కృతిప్రశంసలో పూర్వాచారమననుసరించి స్వప్నవృత్తాంతమును జెప్పెను.

ఈతని గురువర్యుఁ డగు వేంకటాచార్యుఁడు స్వప్నమున గాన్పించి యిట్లు చెప్పెనట:—

(1) "అర్కాదిగ్రహసంచరగ్రహణ
కాలాన్వేషణోపాయముల్
తర్కవ్యాకరణాగమాది బహు
శాస్త్రప్రోక్త నానార్థసం
పర్కాభివ్యవహారముల్ భువన
రూపద్వీప విస్తారముల్
దర్కింపన్ గణితప్రవృత్తి
వెలిగాఁ దక్కొం డెఱింగించునే.

(2) సీ. భాసురసంజ్ఞా ప్రపంచాది వేదిత
సకలార్థపరికర్మ జలసమృద్ధి
భిన్నాంతరాళ గంభీరాంతరాళంబు
గాఢప్రకీర్ణక గ్రాహవితతి
త్రైరాశికోర్మి సంతానంబు మిశ్రిత
మాత్రమణి ప్రభాశోభితంబు
వర్గిత క్షేత్ర విస్తీర్ణ ప్రభావంబు
లాలిత ఖాత పాతాళతలము
గీ. కరుణసంశ్రిత ఛాయాధికార వేల
గణక కవి గణ కలకల ఘనవంబు
గణితవారిధిసంఖ్యాన మణిగణంబు
లుద్ధరింపగ నజానకు నోపనగునె!"
క. అని వత్సా! లీలావతి
యనఁబరఁగిన గణితశాస్త్ర మంగ్రథము గానీ
వొనరించిమద్గురు బదరీ
వన నిలయున్నాథుఁ జేయు వాంఛిత మొదవన్."

గురుని యాదేశానుసార మీకృతి బదరీ నారాయణుని కంకితము. భాస్కరాచార్యులవారు రచించిన సిద్ధాంత శిరోమణియందు మూడు ఖండములు గలవు. అందు ప్రథమఖండము లీలావతీ గణితము; ద్వితీయఖండము బీజ గణితము; తృతీయ ఖండము జ్యోతిర్గణితము లేక దృగ్గణితము. సిద్ధాంతశిరోమణిలో లీలావతీగణితమే మన తెలుగునాటిలో వ్యాప్తినంది

(1) (2) ఇవి పావులూరి మల్లన గణితములోనిది.

నది. దీనిని కృష్ణరాయలకాలమున కవి దేవేంద్రుఁడని పేరుగన్న కోదూరి వల్లభాచార్యులను కవి తెనిగించి యున్నాఁడు. అది యముద్రితము. ఈ తరువాత బ్రహ్మశ్రీ పిడుపర్తి కృష్ణమూర్తిశాస్త్రులవారును దీనిని తెలిగించి ప్రకటించిరి.

గద్యలో

ఇతి శ్రీమద్భద్రికా నిలయ నిత్యనివాస, శ్రీమన్నరనారాయణ గురుచరణ సేవాపరాయణ శ్రీమద్వేంకటాచార్య సద్గురు కృపాలబ్ధ వివిధ విద్యాచాతురీ ధురీణాపస్తంభసూత్ర హారితసగోత్ర శ్రీమద్గోలకొండవ్యాపారి సత్కులోద్భవ శ్రీమత్తడకమళ్లవంశ పవిత్ర శ్రీరంగరాయ గర్భరత్నాకర సంపూర్ణ నిశాకర సకల సుజన సంస్తవనీయ గుణరత్నరత్నాకర, శ్రీమద్వేంకట కృష్ణరాయ ప్రపంచితంబగు నభినవ లీలావతీగణిత శాస్త్రరత్నంబునందు పరిభాషా ప్రకరణము సంపూర్ణము.

అభినవ లీలావతిలో సంస్కృతమున గల పదమూఁడధ్యాయములకు సరియగు నాంధ్రీకరణము గలదు. 1. పరిభాషా, 2. పరికర్మాష్టక, 3. ప్రకీర్ణక, 4. మిశ్రవ్యవహార, 5. శ్రేఢీవ్యవహార, 6. క్షేత్ర వ్యవహార, 7. ఖాతవ్యవహార, 8. చితివ్యవహార, 9. క్రకచవ్యవహార, 10. రాశివ్యవహార, 11. ఛాయా వ్యవహార, 12. కుట్టకవ్యవహార, 13. అంకపాశ వ్యవహారము అనునివి పదుమూఁడధ్యాయముల పేర్లు. సాధారణముగా శాస్త్రీయ గ్రంథములలో కవితా విశేషములు చూపుట పరిపాటి గాదు. వేంకట కృష్ణరాయడు ప్రౌఢ కవియైనను నీ శాస్త్రీయ గ్రంథమును ధారాళముగను సులభము నగురీతిని రచించినాడు.

మచ్చునకు—

ఉ. నాలుగుజానులన్ పురుష
నాగరకుల్ శరసంఖ్యలెట్టిదా
మేలిమి పుష్పబంధముల
మేకొని చేయుదురట్టి పుష్పముల్
బాలలు దెచ్చి జాములను
పంక్తులు సేయ సమత్వమందుచో
బాలలు నల్వురున్నరులు
బాహులుగూర్చిన జాములెన్నియో.

మిశ్రవ్యవహార చతుర్థాధ్యాయము ఈ గ్రంథమును క్రీ. శ. 1863 లో శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారును ప్రచురించియున్నారు. క్రీ. శ. 1934 లో వారి పుత్రకులు శ్రీ వేంకటేశ్వర శాస్త్రులవారు విద్వద్వరులును, గణితశాస్త్రవేత్తలును నగు వేదము లక్ష్మీనారాయణశాస్త్రులవారి యనువాదముతోఁగూడ ప్రకటించిరి. ఇందులో కృష్ణరావుగారి యనువాదముకూడ కలదు.

## ౨. ఆంధ్రబీజ గణితము

### ఇది లీలావతీ గణితమునందలి ద్వితీయఖండము

క. హారితసగోత్రసముద్భవ
వర రంగారాయ కృష్ణవరగణకునిచే
నరోపైక వర్ణమవ్యము
మారణము పోదాహృతికత నాంధ్రంబయ్యెన్.

ఇందును, వివరణములు పూర్తిగా గలవు. గ్రంథము ముద్రితము.

## 3. ఆంధ్ర దృగ్గణితము

### ఇది లీలావతి గణితమునందలి తృతీయ ఖండము

పద్యకృతి. ఇందు ప్రపంచ భూగోళశాస్త్రమంతయు పద్యరూపముగ నున్నది. వేంకట కృష్ణరావు గారే యీ గ్రంథమునుగూర్చి యిట్లు వ్రాసియున్నారు. ఇది యముద్రితము. ముందు నేనిందుండి యుదాహరించియే యున్నాను.

సీ. శ్రీలకు వసతియై చెలువొందు శ్రీగోల
కొండ వ్యాపారుల కండయైన
శ్రీనల్లగొండతో జేరిన తడకమళ్లా
హ్వయ దేశపాండ్యాధికార
వియదొందుహారితస వరగోత్రజనితుఁడై
యాజుషామ్నాయుఁడై యాపస్తంబ
సూత్రియునైనట్టి ధాత్రిసురుండగు
రంగనాయనికి నర్ధాంగలక్ష్మి
యగు కనకాంబయనఁగువరు
నందనుండైన వేంకటకృష్ణరాయగణకుఁ
డిల కైరవిణీతీరనిలయుఁడౌ
శ్రీ పార్థసారథి సన్నిధి సవిధవాసి
నే త్రేతతార రచించె నెగడిన కలియుగ
గజగుణ నందభూ ౧౯౩౮ గణుతిరైన
విక్రమశకమును వియదిభాగజ చంద్ర
౧౯౯౫ మగు నింగిలీషును మఱియు రామ
పూర్ణేభచంద్రు ౧౮౬౦ వై పొల్చు శాలిశక
మటుల శరాంగాక్షిమహి ౧౩౫౭ హిజరియు
నగు విక్రమసమంబునందు త్రిరాయగ
మాసాంత మధుమాసవలక్షపక్ష
నవమీయుతంబగు నాదివారముఁ బుష్యమును
ధృతియోగంబ గనుదినమున

ఇంగ్లీషు జాగ్రఫీసెల్ల నాంధ్రమునందు
  నిర్వచనంబుగా సర్వసులభ
మగునటుల గోళభస్థాది మానయుక్త
ఖండములు ద్వీపపర్వత కంధిశాఖ
లును నదీనదములను వాదులును క్రమముగ
తెలుగగనుచుండ బుద్ధికి కరముభృద్ధి.

ఈ గ్రంథము వ్రాయుటకుఁ గల కారణమును కృష్ణరావుగారే యిట్లు చెప్పియున్నారు.

ఇట్లు లన్ని దేశంబుల నిది ప్రసిద్ధి
మగుచు నుండియు దీనికి తగిన
సూత్రశాస్త్ర మెవ్వరు సేయక జాగుసేయు
క తన దీని యథామతిగానుపింతు.
అన్ని దేశంబు లందును వారిభాష
కబ్బములబోలె తమ తమ కావ్యములను
ప్రచురమగుచుండ మన తెన్గు భాషయందలి
నట్లు లేకుండ కొఱఁతగ నాకుఁదోచు
సంస్కృతముకన్న తెమగువ సర్వమగురు
మానలంకార గద్యపద్యాది ఛంద
సంపదు పపత్తి యుండియు సంస్కృతంబు
నందు గల గౌరవంబును డించి నోర్క
ఇతరులు హరిపూజాది క
వి తతులగు సమయములను వేదపురాణ
ప్రతికులతో భాషా కా
వ్యతతులు ప్రచురింపమనను వదలుటతగవే.

ఇవికాక గణిత శాస్త్రమునకు సంబంధించిన గ్రంథము లనేకములు వేంకట కృష్ణారావు గారు రచించిరి. పైవానిలోఁ జేరనివాని నిచ్చుచున్నాను.

1. అనేకవర్ణ మధ్యమాహరణ జము.
2. అనేకవర్ణ సమీకరణము.
3. కరణి సంకలన పథకము.
4. గణితప్రకాశిక - లీలావతి టీక.
5. దృక్సిద్ధాంత గణితోదాహరణము.
6. పంచాంగ గణితము. 7 ప్రతులు.
7. బీజగణితము - నూతనపద్ధతి.
8. సిద్ధాంత సంగ్రహము.
9. సిద్ధాంతసారము.

10. రామావతార కాలనిర్ణయసూచి. ఇది నవీన చారిత్రకులకు మిగుల నుపయుక్తము. ఇవి యన్నియు నముద్రితములు.

11. గ్రహతప్రకాశిక.

12. ఖచరదర్పణము టీక.

## ౮. జంత్రీ పంచాంగము

ప్రప్రథమమున నింగ్లీషు తెలుగు తేదిలకు జంత్రీలు తయారుచేసినవారు వేంకట కృష్ణారావుగారే. ఇవి నాలుగు భాగములుగా నున్నవి.

సంఖ్య

(2325) 1825 జూలై తే 14 ది 1840 జూలై తే 14 ది
(2326) 1840 జూలై తే 14 ది 1851 జూలై తే 13 ది
(2327) 1853 జూలై తే 14 ది 1866 డిసెం తే 31 ది
(2328) 1866 డిసెం తే 31 ది 1870 డిసెం తే 31 ది
(2339) 1870 డిసెం తే 31 ది 1884 డిసెం తే 31 ది

ఈ గ్రంథమున వారియింటి వృత్తాంతము లేవో ఆయా సమయములు జరిగినవి డైరి వ్రాఁతగా నిందు గలవు.

## ౯. పంచపక్షీ శకున శాస్త్రము

ఇది సంస్కృతమున నున్న పంచపక్షీ శాస్త్రమునకు తెలుగు పద్యరచనము. ఇది జ్యోతిషమునందలి ప్రశ్న భాగమునకు సంబంధించినది. ఇది మునివాహి శ్రేష్ఠి యను నాతనికొఱకు రచించినట్లు కృష్ణారావు చెప్పియున్నారు. గ్రంథరచనాకాలము.

'వృషవత్సర వైశాఖపు
వృషమాసపుఁ బూర్ణిమమున వేంకట కృష్ణం
డిషికాగ్ర మతులకొఱకై
వృషవాహను కరుణ దీనివివరించెఁజూఁడీ.

## ౬. కామందకము

ప్రసిద్ధ రాజనీతిశాస్త్ర మగు నీగ్రంథమునకు, పద్యరూపమున పంద్రెండవ శతాబ్దిని వెలువడిన రచన మడికి సింగన 'సకలనీతి సమ్మతమునఁ' జేర్కొనఁ బడినది. అది లభ్యముకాలేదు. క్రీ. శ. 1584 లో జక్కరాజు వేంకటకవి రచించిన వేయిశ్లోక పద్యకృతి గలదు. అది కీర్తిశేషులు ప్రభాకర శాస్త్రిగారి పీఠికతో తంజావూరి పుస్తక భాండాగారమునుండి వెలువడినది.

దీనిని వచనరూపముగ వ్రాసినవారు వేంకట కృష్ణారావుగారె. ఇందు ప్రతి శ్లోకమునకు చక్కని వివరణము కలదు. ఇరువది యధ్యాయములు. 304 పుటలు. గ్రంథరచనా కాలము. క్రీ. శ. 1860. నేటికి నీ ప్రశస్త గ్రంథమునకు వేఱొక తెలుఁగు వచన రచన లేదు. ప్రాచీన రాజకీయ విధాన పరిజ్ఞానమును నలవఱచుకొను నావశ్యకత గల నవీన కాల

మున నీ తడకమళ్ల వారి రచన పునర్ముద్రితము కాఁదగినది.

## 2. బ్రహ్మసూత్ర టీకాసంగ్రహము

వ్యాసమహర్షి ప్రణీతమగు నుత్తర మీమాంసా దర్శనమునకు సంగ్రహరూపమైన తెలుఁగు టీకను వేంకట కృష్ణారావుగారు క్రీ. శ. 1864 (రక్తాక్షి) రచించిరి. ఇందు నొక్కొక్క పాదము తుదను, నద్వైతమతమునకును విశిష్టాద్వైత మతమునకును నధికరణభేదములతో ననుకూలపడెడు సూత్రములు కొన్ని పేర్కొనఁబడినవి.

గ్రంథాదిని పద్యరచన గలదు.

శా. శ్రీనారాయణ మానివర్యుఁ
గరుణాసింధు న్మదింగొల్చి య
మ్మౌనీంద్రాంశజుఁడైన వ్యాస
మునిచే మహోత్కృష్టతం దెల్పునా
నానార్థ ప్రతిపాదిసూత్రములకు
న్నాంధ్రంబునం డీకఁ జే
యన్నేఁబూనితి శీఘ్రబోధమునకై
యార్యాతి దేశంబునన్.

క. అతిగహనమగుటఁ గొంచెపు
మతిగలవారలకు శీఘ్రమననముకొఱకై
వితతార్థంబుల నెల్లను
నతిసంగ్రహరీతిఁ దెలుప నలవడెనిందున్.

క. శుభమను వత్సరసంఖ్యను
(545)
శుభమతి నీసూత్రవితతి సుఖబోధముగన్
శుభమతిఁ జదివెడివారికి
శుభములు చేకూరుఁగాత శుంభల్లీలన్.

క. రక్తాక్ష్యబ్దాషాఢిని
ముక్తిదమగు బ్రహ్మసూత్ర ముఖ్యార్థములన్
భక్తిని సంగ్రహముగనను
రక్తిఁదడకమళ్ల కృష్ణరాయుఁడు పలికెన్.

క. ఇందలి గుణదోషంబుల
నిందుగరశములను దాల్చు నీశ్వరుపగిదిన్
సందియములున్న దిద్దుచు
విందొనరింపంగవలయు విబుధులు కరుణన్.

టీకా సంగ్రహః.

### అథాతో బ్రహ్మజిజ్ఞాసా

ఇంక బ్రహ్మవిచారము చేయఁబడుచున్నది. ఇంక నను శబ్దమువలన నింతకుమునుపు కర్మ మీమాంసా ప్రశంస చేయంబడెననియు నందు ప్రతిపాదింపఁ బడిన కర్మ మీమాంసఫలము, అల్పంబయ్యును నస్థిర ఫలంబును నగుట తదనంతరము బ్రహ్మజిజ్ఞాస చేయం బడియెడునని యభిప్రాయము. ఇచ్చట మతభేదములు — అద్వైతమతమునందు మీమాంసాశాస్త్రము వేఱనియు వేదాంత శాస్త్రము వేరనియు, పూర్వోక్త శాస్త్రక్రమంబున నడుపంబడిన నలుబదిరెనిమిది సంస్కారములచే సంస్కృతుండగు పురుషుడే బ్రహ్మవిచారాధికారియగుననియు, నా సిద్ధ బ్రహ్మవిచారము చేయవలయుననియు విశిష్టాద్వైతులచే పూర్వ మీమాంస కర్మవాదం బగుటయు దానివలన తెలియఁబడిన కర్మంబుల ఫలంబులు (ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా, కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాత్ మాంగలి కావుభౌ అని గ్రంథారంభంబున మంగళార్థముగా నథ శబ్ద ప్రయోగము) అల్పంబులు నస్థిరంబులుం గావునను ఈపరిభాగంబునం బలుకఁబడిన బ్రహ్మజ్ఞానం బనంతంబును నక్షయ ఫలంబును గావున బ్రహ్మ జ్ఞానముం దెలిసి బ్రహ్మవిచారము చేయబడుచున్నదని సంగ్రహము. ఈ విషయమున విస్తార ముపన్యాసము కలిగియుండుటయు నది శాస్త్రముచేతనే తెలియదగి నది యగుట నిట సంక్షేపింపబడెను.

చివర.

'పర్యాయతశ్శైవం ప్రత్యక్షానుమానే' జగన్నియామకులు బ్రహ్మకర్తృకములుగానే శ్రుతిస్మృతులు పలుకుచుండుటవలన జీవుఁడు భోగమాత్రమున కర్హుడు గాని అధికము లేదనుట.

భోగమాత్ర సామ్యలింగాచ్చ — సోఽశ్నుతే సర్వాన్ కామాన్ 'సహ బ్రహ్మణా విపశ్చితేతి— అను నడియాలంబువలన జీవునకు భోగమాత్రమందే బ్రహ్మతుల్యత్వ మనుట. అనావృత్తిశ్శబ్దా అనావృత్తిశ్శబ్దాత్. అట్టి ముక్తుఁడు మరల వెన్నటికి రాడనుట. రెండుమాఱులు పలుకుట శాస్త్రము ముగియుటను తెలుపుచున్నది.

ఈ గ్రంథమును తక్కిన గ్రంథములవలె శిథిలమైనది. శైథిల్యముచే గ్రంథపాతము లేర్పడినవి.

మొట్టమొదట బ్రహ్మసూత్రములకు తెలుగున టీక వ్రాసినవారు కృష్ణారావుగారే — ఆ వెనుక ఆంధ్ర శారీరక మను పేరున వచనముగా కీర్తిశేషులు వల్లూరి జగన్నాథరావు పంతులుగారు క్రీ. శ. 1886 లో రచించియున్నారు. ఆంధ్ర సూత్ర భాష్యమను పేర నాలుగు సంపుటములలో పురాణ పండమల్లయ శాస్త్రులవారి యనువాదముతో శ్రీ టీకా పురాధీశ్వరులు 1913 లో ప్రకటించియున్నారు. శ్రీ వావిలాల శివావధానులుగారు క్రీ. శ. 1916 లో బ్రహ్మ సూత్రార్థ సంగ్రహమును పేర చక్కని వచన రీతిని

రచించి యుందలి విషయములను సులభ గ్రాహ్యము
లొనర్చిరి. వావిళ్ళవారు, శ్రీ వెన్నెలకంటి సుందర
రామశర్మగారిచే నొక తెలుగు వ్యాఖ్యానము
రచింపఁజేసి ప్రకటించిరి.

## కథా వాఙ్మయము.

నవీన కాలమున ప్రసిద్ధ కథకులలో శ్రీ కృష్ణా
రావుగారిది యొక విశిష్టస్థానము. వీరి కథలలో
నీ క్రింది కథ మాత్రము ముద్రితమైనది. తక్కినవి
యముద్రితములు. తొలుత ముద్రితమైన దానిఁ గూర్చి
తెలిపి యా వెనుక తక్కిన వానిఁ గూర్చి తెల్పెదను.

తెలుగు వెలుగు ముగుద కత

అను

శ్రీసురాంధ్ర కవితా వేదినీ విలాసము

ఇది తిరువలిక్కేణి నిలయుండైన తిరుకొవళ్ళ
వేంకట కృష్ణరాయచేత రచింపంబడి పిల్లలమఱ్ఱి
పూర్ణయ్య సిద్ధాంతి గారిచే

పరిష్కృతమై,

చెన్నపురి

శ్రీ నిధి ముద్రాక్షరశాలయందు ముద్రింపంబడియె.

1879

*Registered copy right.* పుటలు 102.

గ్రంథము చివర నీ క్రింది పద్యము గలదు.

సీ. శ్రీగోలుకొండాఖ్యఁ జెన్నొందు
వ్యాపారికులమున హారీత సగోత్రమునను
యజుసువతిపక మహాన్వయ
జాతుండు శ్రీకైరవిణీ పరిస్థిరవాసి
కనకమ్మ గర్భసంజనితుండు
వేంకటకృష్ణరాయ సమాఖ్య వెలసుసుకవి
రసిక ప్రీత్యర్థమై రచియించె
తెనుగున నీ చంపుకావ్యంబు నింపుమీఱ
గీ. పిల్లలమఱి పూర్ణయ్యయన్ పితికాపు
రాధి సైత్య సమ్మానితుండగుచు వెలయు
దైవవిదుని సహాయము దనకు గలుగ
ముద్రితము చేసి వెలయించె ముదముమీఱ.

పైని పేర్కొనిన పిల్లలమఱ్ఱి పూర్ణయ్య సిద్ధాంతి
గారు, పెదపూర్ణయ్య సిద్ధాంతిగా రాంధ్రలోక
మునకుఁ జిరపరిచితులు. క్రీ. శ. 1846 లో జన్మించి
1924 లో కీర్తిశేషులైరి. వీరి జీవితమును శ్రీ అడవి
శంకరరావు పంతులుగారు భారతిలో ప్రకటించి
యున్నారు.

ఇది యొక చిత్రమైన కథ. ఆమోద పురరాజగు
మందారునకు సుధారామయను రాణికిని, శృంగార
లతికయను కన్య జనించెను. ఆమె విధి ప్రేరితయై
యొక కుష్ఠరోగిని కూడి ప్రాణములు వీడి వేశ్యయై
జన్మించెను. ఆమె యీ జన్మమున రూపరేఖా విలా
సములచేత నే గాక విద్యచేతను విశేషప్రజ్ఞావంతు
రాలని పేరెక్కెను. మఱియు తన దగ్గఱకువచ్చు
విటుఁడు, కవితాపాటవము గలిగి విద్యావంతుఁడై
యుండవలెననియు నాతడు రాత్రి యొక్కంటికి
వేయి వరహాలు చెల్లింపవలయుననియు నామె నియ
మించెను. తానొక పద్యమును వ్రాసి యా విటునివద్దకు
పంపి, యాతని యర్థము వ్రాయుమని కోరును.
అతడు వ్రాయలేనియెడల వానిని తన దాసీజనంబుల
చేత పేడనీళ్లు పోయించి యవమానించి సాగనంపును.
అంత తుంగసేన రాజకుమారుడు విధి ప్రేరితుడై,
రాజ్యమును బోసి కష్టములపాలై కొనుచు చింబోతు రాయు
డను పేర వ్యవహరించుచు నామెనుకూడ దలచి
వేయి వరాలు చెల్లించెను గాని నిరక్షర కుక్షియగుట
చేత, నవమానము పొందెను. అంత నాతడు ఆపె
గొండికి పోయి తెనాలి రామలింగని సాహాయ్యమున,
తెలుగు వెలుగు గృహమున నా వెలది యిచ్చు పద్య
ప్రశ్నల కన్నిటికి పద్యములలోనే ప్రత్యుత్తరము
లిచ్చి దానిని పొందెను. ఇందు, దీని భావమేమి
తిరుమలేశ అను పద్యములు భావములు పూర్తిగా వివ
రింపబడినవి. 'నానార్థగాంభీర్య చమత్కారిక'లోని
పద్యము లిందు గలవు. తెలుఁగు కవితా ప్రభావము,
ప్రాచీన సంప్రదాయము లిందు తేటపడును. పుస్త
కము జేబులో నిముడునంత యున్నది. పునర్ముద్ర
ణము చేసిన విద్వల్లోక మానందించును.

## కంబుకంధర చరిత్రము.

ఇది కళాపూర్ణోదయమువలె కవికల్పిత కథనము
హెచ్చుగాగల వచన రచన. దీనిని వచన ప్రబంధముని
యనవచ్చును. ఇందులో నగరము మొదలగు వాని
వర్ణింపవలసి వచ్చినప్పుడు నిఘంటువుల యందలి
పదములన్నియును ప్రయుక్తములయినవి. ఇం దెని
మిది యధ్యాయములు కలవు. ఇందలి కథా ప్రణాళికను
కవి యే గ్రంథాంతమున నిట్లు చెప్పియున్నాఁడు.

సీ. కంబుకంధరుఁడు జగత్ప్రకాశినిఁ గూడి
క్రీడించుచున్నట్టి వేడుకలును
చంద్రకాంతిని గూడి చరియించి సుఖియించు
దేవరేఖని యట్టి తెలివితోడ
సూర్య సజ్యోత్స్నతో సుఖములందెడు నట్టి
మంత్రాంగ భూపాలు మహిమతోడ
వ్యోమయాన గతియు భూమండలాఢ్యత
పుత్రత్వమును గల్గి భూతిమెఱయ

గీ. సిద్ధ వచనుతపము, సిద్ధ సుజ్ఞానిసు
జ్ఞాని గరిమ లోకమానితుఁడగు
వృత్తివేది తెలివి వెలయఁగ నిక్కథఁ
జదువు వారు గంద్రు సకలహితము.
క. వారల కోరిక నే క్రియఁ
గూరిచెనో దేవుఁ డిట్లు గూరుచు దీనిన్
వారని భక్తినిఁ జదివెడు
వారికి నిహపరసుఖంబు వరదుఁడు పేర్మిన్.

కవి దీని నిరువది రెండు దినములలో రచించి నట్లు గ్రంథాంతమున నిట్లు చెప్పినాఁడు.

సీ. వసునాగగిరి చంద్ర మనసంఖ్య శకయుక్త
క్రోధనాబ్దమ్మున నాసమున
పూషయుం డెడు నలపుష్య కృష్ణాష్టమీ
సౌమ్య వాసరమున బహు విచిత్ర
పద్యగద్యములచే భాసిల్లు నిక్కంబు
కంధర చరితంబు కవులవునన
కైరవిణీ పురపార వాస్తవ్యుఁడౌ
తడకమల్లాన్వయ తరణిరంగ
గీ. రాయపుత్రుండు శ్రీ కృష్ణరాయఁ డనెడు
కన్నమాంబా తనూజుండు ఘనమనీష
నిర్వదియు రెండు దినముల నిర్వహించె
లేఖక ప్రౌఢులౌనన లిఖితమెలమి.

గ్రంథాంతమున కవి విజ్ఞాపనము.

శ్రీమదఖండ.........శ్రీ పార్థసారథి నిత్య నివాసస్థానంబును శ్రీ మద్రాస నగరేశ్వర ప్రధాన రాజధానియునగు శ్రీమ చ్చెన్నపురీ రాజధానీ నికటస్థంబగు శ్రీమత్కైరవిణీ నగర ప్రతి నామక తిరువల్లిక్కేణీ నామక శాఖానగర వాస్తవ్యుండును, శ్రీమద్భరితప గోత్రాపస్తంభ సూత్ర తడకమళ్లవంశపయఃపారావార రాకాసుధాకరుండును నాకరాజా ద్యనేక మహా రాజాధిరాజ దత్తబిరుద సన్మానితుండును, వల్లము జమీందారు సమ్మానితుండును నగు రంగరాయ సత్పుత్రుండును, కనకమాంబా గర్భశుక్తి ముక్తాయమానుండును, సఖిల సంస్కృతాంధ్ర ద్రవిడ మహారాష్ట్రి హిందూస్థానీయావనీ ప్రాకృతాది భాషాధురంధరుండును.........సుకీజన శిఖామణు లంగీకరింపవలయునని ప్రార్థించెద—దీని రచన క్రీ. శ. 866 అని స్పష్టము.

ఇదియును నీతని యితర రచనలవలె జిలుగు వ్రాతలో నున్నది. మొదటి మూడధ్యాయము లొక సంపుటమునను (431) రెండునుండి యెనిమిదివఱకు మఱియొక సంపుటమున (432) గలవు. మొదటిది చాల శిథిలమైనది రెండవది కొంత మేలు.



## కామరూప కథ.

కంబుకంధర చరిత్రవలె నిదియును నొక విచిత్రమైన కథా ఘట్టములు గలిగిన పెద్ద వచన గ్రంథము. ఆర్యావర్తమున కిమ్మీర నగరాధీశుఁడగు రాజరాజ ప్రభుని కుమారుఁడగు కామరూపుని యుదంతమును తెలుపునది. ఇదియును కంబుకంధర చరిత్రవలె పలుచని కాగితములపై జిలుగుగా వ్రాయబడియున్నది. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో 3 ప్రతులు గలవు [1]

[1]. సంఖ్యలు 1401, 1402, 1403.

వచనకావ్యములు.

ప్రారంభము.

లోకంబునం గల వింత వింతలగు వృత్తాంతముల నుగ్గడించు వారును జనుల బుద్ధి వివేకంబులను సుజ్ఞానవచనంబులకు దోహదం బొనర్చు వనపాలకుల నంపగువారును, ఆదుంబరితములగు పూర్వవృత్తాంతము లన్నిటిని నిజమనీ పాసుకురంబునం బ్రతిఫలించుటం జేసి, దద్వృత్తాంతంబుల నాధునిక భావిజనంబులకుం దెలిపి వారల బుద్ధిశాలిత్వంబునుం జెంపొందు నుపకారులును, మనీషయను నంగనను స్వీయ వాక్సైస్వధురులను భూషణంబులచే నలంకరించెడు వారును నగు పూర్వకథకులచె నిట్లు వివరింపఁబడియె.

తొల్లి యార్యావర్త దేశంబునం గల ప్రసిద్ధ నగరంబులలోన నతి ప్రసిద్ధి వహించినది కిమ్మీర నగరంబుగలదు. అందు......రాజప్రవరుండను సార్వభౌముండు గలండు.

................................

అట్టి కుమారోదయంబువలన జన్మరాజ్యాదులగు సప్తాంగంబులను నప్పుడె యొసియించిన కరణి నతి కుతూహలియగు నా రాజన్యమాన్యుం డట్టి సుపుత్రుని దయచే నొసంగిన సర్వశక్తి యుక్తుండగు జగదీశ్వరు ననేక విధంబులం బొగడుచు నిట్టి యభ్యుదయమునకుం బ్రధాన కారణభూతుండగు సంకల్ప సిద్ధుం బహువిధంబుల నెన్నుచుం దదను రూపలోక దిగ్రాణ మంగళవాద్య శ్రవణ పుణ్యాహఘోషణాది క్రియా విశేషంబుల నా పురిటిదినంబులన్నియుం గడపుచుండె.

అంత......కామదేవుం డనం దగియుంటను కామరూపుడను నన్వర్థ నామంబిడిరి.

అంత్యభాగము.

...దేవర కేకపుత్రుండును, కర్మప్రధానుండును శూరుండును, రాజ్యార్హుండు నగుట నితని

సమయించుట యనుచితంబని యూహించి యితని కొలివరంబులం దొలంగించి యిందు గొనివచ్చితి ననియు నితని యిట్టుల యుంటనునిచి యన్నపానంబు లరయుచు నితని కితరులతోడం గూటమి లేమియట్లు జతనముగా నుంచియుండిన వలయు సమయంబున నరంబుల యొక్క తెఱుంగు మఱల నితనికి సంచరించు నట్లు చేయవలనగునవియు నిప్పుడితనిపై దేవరకెంత కోపము గలిగినను, జంపం దగదనియు పుత్ర జన్మ మరణంబుకన్న నొండు సుఖదుఃఖమ్ము లధికంబులు గావనియు ననేకవిధంబులం దెలిపి యతని సము యించు తలంపునుండి యా జాని యభిప్రాయంబు మఱలిచెను......

## చిత్రకథా వివరణము.

ఇది ముందు వివరింపబడిన కామరూప కథకు సంబంధించినదే. ఆ కథలో నిరువదినాలుగు దినములు జరిగిన వృత్తాంతములను దెలుపునది. ఇది రెండు భాగములు— మొదటిభాగము ప్రారంభము.

"శ్రీమద్ద్వారకా ద్వీపమునందు కామరూపుం డను నెపవయస్యులు వినిపించుచుండెడు చిత్ర కథా వివరణము.

మంత్రి యిట్లనిరె. వినుమో మహారాజా! ఒక పట్టణమునం దొక రాజును నతని మంత్రియు ననోన్యన్య ప్రియులగుచు, రాజ్యము సేయుచుండె న య్యిరువుర కును, నేకదివసంబుననే కళాచతుర బుద్ధిచతురులను కుమారయుగ్మము గలిగి......

ఇట్లు ద్వాదశ దిన వృత్తాంతంబు ముగిసె. ఇట్లు ప్రథమభాగము—ద్వితీయభాగ ప్రారంభము.

అది విని యా కుటిల హృదయముగని పారిగొనక సుఖ మెటులం గలుగు. ఇంట చెట్టుబెట్టక గడ దొంగి లిన పండ్లు వీలుచుట కిరవగు నటులుండ నోడయని మడియుట కొడఁబడిన చెడుగుమగని కోడుదుడుకురా నోడఁబడుదునె ..చెడల నడువనె యటులగుట నతని మడియించక యంత గుణపరులకు గల చతురత గలిగిన చోరమ్ము—లేదని యుడుగుమని చెడిదములగు నుడు గుల నోడిసె.

ఈ గ్రంథముకూడ జిలుగువ్రాఁతలో నున్నది. శైథిల్య గ్రంథపాతములున్నవి. చాల కష్టము మీద గాని చదువరాకున్నది. సంఖ్య. 1417 వ్రాఁతగూడ చిత్రముగానే యున్నది. దేబులో నిముడునంత పరి మాణము గల పుస్తకము. వ్రాతపుటలో నొకమూల నుండి యిట్లు మొదలిడి వ్రాసియున్నది.

శ్రీమద్ద్వారకాద్వీపమునందు
కామరూపుండను నెపవయ
స్యులు వినిపించు చుండెడి చిత్ర
కథా వివరణము. మంత్రి యిట్ల
నిరెమ వినుమో మహారాజా! ఒక
పట్టణమునం దొకరాజును నతని
మంత్రియు ననోన్యన్య ప్రియు
లగుచు రాజ్యము సేయుచుండి
న య్యిరువురకును నేకదివసంబు
ననే కళాచతుర బుద్ధిచతు లను
కుమార యుగ్మము గలిగి......
ఇట్ల ద్వాదశి దిన వృత్తాంతంబు
ముగిసె. ఇట్లు ప్రథమభాగము.

కామరూప కథారంభమున. విభవ శ్రావణ బహుళ 8 శుక్రవారము ప్రారంభము. అని కలదు. చిత్రకథా వివరణము చివర నిజ శ్రావణ బ॥ ౧౦ గురువారం ముగిసినది. ఈ విభవసంవత్సరము క్రీ. శ. ౧౭౬౮. కావున యీ గ్రంథములు రెండు నా సంవత్సరముననే వ్రాయబడినవి.

వేంకటకృష్ణరాయఁడే విషయమునుగూర్చియైన పద్యములలోనే వివరించువాడు. ప్రబంధరాజ శిరో భూషణమును నామాంతరముగల ప్రకృష్ట బలరామ చరిత్రము లిఖించుచు నీ క్రింది పద్యమును వ్రాసి నాడు. ఈ బలరామ చరిత్ర గుడారు వేంకటదాస కవిచే రచితమైన ప్రబంధము.

సీ. నస్తే భగిరిచంద్ర (౧౭౮౭) సమ్మిత శకమున
        రసరసాంకాబ్దులై (౪౯౬౬) యొసగు కలిని
    రక్తాక్షి సంవత్సరమున వైశాఖ మా
        సము కృష్ణకామ దినమున వార్య
    వాసరమునఁ బూర్ణమై సన్నుతికెక్క
        బలరామ చరితంబుల వలయ వ్రాసెఁ
    గైరవిణీ సరిత్తీర శ్రీ పార్థసా
        రథి మందిర నికట ప్రథితవాసి
గీ. తడకమళ్ళ రంగనాయని తనయుఁడైన
    వేంకటాద్రిము కృష్ణుండు విశ్రుతముగ
    దీనఁగలిగిన లేఖ నాతీ్రవజని త
    స్ఖలితములనెల్ల మన్నింపవలయు బుధులు.

గ్రంథ సంఖ్య 4200. లిఖితదినాని ౧౫

క్రీ. శ. 1872 లో కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు రచించి ప్రకటించిన నరకాసుర విజయ వ్యాయోగముపై నీ క్రింది యభిప్రాయము పద్యరూపముగ నిచ్చియున్నాడు.

సీ. శ్రీకృష్ణదేవుని క్షితిపుత్ర విజయంబు
  వ్యాకరణాగ లక్షణవాక్య సరణి
సమ్మతంబుగ ధర్మసత్కవి యొనరించె
  నష్టాలక మ్మఁదెల్గు నందునిపుడు
ఘనుఁడు కొక్కొండ వెంకటరత్న కవి పతి
  గద్య పద్యంబుల హృద్యముగను
బొనరించె నీకృతి యనుపమ లక్షణ
  సమ్మతం బగునని నెమ్మితోడ
గీ. నార్యులెల్లరుఁ గైకొందు రనుచుఁదడక
మళ్ల వేంకట కృష్ణాఖ్య మహిని వెలయు
పండితుడు మెచ్చు చాతుర్య పటిమలందు
నెందు విఖ్యాతిఁ జెన్నొందు నీ చరిత్ర.

ఇదికాక కళాపూర్ణోదయ కథాసూత్రమును సీసపద్యమాలికగా రచియించి యున్నాఁడు. దాని ప్రారంభము.

నవీనరీతిని నక్షత్రశాలలు, పాశ్చాత్య దృక్సిద్ధాంత పద్ధతులు గ్రహించి క్రీ. శ. 1884 లో పంచాంగమును గుణించు గణితశాస్త్రవేత్తలు. కృష్ణారావు గారి చాటురచనము.

సీ. ఇప్పుడు విధులెల్ల నెఱిఁగి శోధించి పం
  చాంగముల్ ప్రకటించు చతురులైన
చంద్రపురీ రామచంద్రదాస్య స్వామియా
  సుబ్బాజిభాను సుధియును గాళి
బాపుదేవుండును ప్రబల సిద్ధాంత శా
  స్త్రియు పునానగరిని స్థిరమరాట
జంత్రియా లక్ష్మణ ఛత్రియు మంగళూ
  రు నమును బాలప్పయను ఘనుండు
గీ. చెన్నపురి నుండి నక్షత్రశాల కధిపుఁ
డైన రఘునాథ వర్యుండు దీనిఁ దెలిసి
నట్టి సుందర శ్రౌతియు నను గణకులు
గణితములు చేయుచుండుట గణనమిాఱు.



పై వారిలో 'రామచంద్రదాస్య స్వామి సుబ్బాజిభానుసుధి' అల్లాడి రామచంద్రశాస్త్రి. ఈతఁడు 1837 సిద్ధాంత శిరోమణి యను గ్రంథమును సంస్కృతమున రచించి దానికి తెలుగు వచన వ్యాఖ్య వ్రాసియున్నాఁడు ఈతనినిఁ గూర్చి, గ్రంథమును గూర్చి శిరసంవత్సరాది సంచికలో నేను వ్రాసిన 'తెనుగు వచన రచన' యను వ్యాసమున చూడనగును. మహారాష్ట్రుఁడగు లక్ష్మణచ్ఛత్రి జ్యోతిర్గణిత శాస్త్రములలో మహా విద్వాంసుఁడు. తెనుగు దేశమున దైవజ్ఞ సార్వభౌముఁడని ప్రసిద్ధికెక్కిన రాణీచయానులు (రాణీ మహాగ్ని చిన్న నరసింహ చయనులు) గా రీతని వద్దనే జ్యోతిశ్శాస్త్ర మభ్యసించిరి.

రఘునాథాచార్యులు గారాంధ్రులు. చెన్నపురి నక్షత్రశాల ప్రధాన గణకులు. వీరినిగూర్చి 'ఆంధ్రభాషా సంజీవని' 1880 పత్రిక చూడనగును.

### కళాపూర్ణోదయ కథాసూత్ర

సీసమాలిక

శ్రీ భారతీదేవి సిరిపుత్రకుని గూడి
  కేళీవనంబున గ్రీడసల్పి
మణిమయస్తంభంబు మధ్యమంబున గల్గు
  జలజాకరము కాంతి మెలగుచుండ
చుంబించు నెడపలు పోకున మణితంబు
  బొనరించి బాధచే ముగుద యంత
పాలయుల్క సెపమున నెంగము ద్రిప్పక పతి
  పవళింపనప్పు డప్పద్మజుండు
జలమున్న మణిమయస్తంభంబు పొంతను
  గన్పట్టునట్టు యక్కాంతి మోము
గనుకొని వికటస్థ కాంచన............

ఇదియును వ్రాఁత జెలుగుగా నున్నది.



# గ్రంథ విమర్శనము

## క్షేత్రయ్య పదములు :

సంపాదకులు. డాక్టరు గిడుగు వెంకట సీతాపతి ప్రకాశకులు. శ్రీ పిఠాపురం మహారాజా. వెల 8 రూపాయలు, ప్రతులకు, డాక్టరు గిడుగు వెంకట సీతాపతి. నెం 9, ఆఫీసు వెంకటాచలమొదలి స్ట్రీట్, ట్రిప్లికేన్ మదరాసు-5.

ఉత్తమ కర్ణాటక సంగీత సంప్రదాయ దృష్ట్యా పరిశీలిస్తే క్షేత్రయ్య త్యాగరాజు, శ్యామశాస్త్రి మొదలయిన ప్రశస్త వాగ్గేయ కారకుల కోవకు చెందినవాడని నిర్ణయించాలి. తత్రాపి 'పద' మనే ప్రత్యేక గీతశాఖ ఇతని రచనలవల్ల పరమావధి అందు కొన్నదని సుప్రసిద్ధ సంగీత విజ్ఞులందరు ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు.

క్షేత్రజ్ఞుని కంటె ప్రాచీనుడయిన అన్నమాచార్యునిలో సాహిత్యానికి వచ్చినంత ప్రాధాన్యం సంగీతానికి రాలేదు. క్షేత్రయ్య పదాలలో సంగీత సాహిత్యాలు రెండూ ఒక్కలాగని ప్రవహిస్తూ పరస్పరోజ్జీవకములుగా వెల్లివిరిశాయి. అన్నమాచార్యులతో ప్రారంభించిన పదరచన క్షేత్రయ్యలో పరిపూర్ణ పరిణతిపొంది, క్రమంగా త్యాగరాజాదుల కృతి స్వరూపావతరణకు దారితీసిందని అన వచ్చును.

ఇక కేవల సాహిత్యదృష్టితో చూసినా క్షేత్రయ్య పదరచనా పాటవం సామాన్యమైనది కాదు. ఆంధ్రదేశీయములైన జాతీయ పదాల ప్రయోగంలో ఇతడు సిద్ధహస్తుడు. శబ్దరత్నాకర కారుడితని నొక ప్రామాణిక కవిగా స్వీకరించి ఈతని పద ప్రయోగాలు తన నిఘంటువులో సోదాహరణంగా ఎత్తిచూపించడంవల్ల ఆనాటికే ఇతని సాహిత్య ప్రామాణికత స్థిరపడిందని నిశ్చయించ వచ్చును.

ఆయా నాయికల శృంగారభావ ప్రదర్శనంలోను, ఆ భావాల వైవిధ్య ప్రదర్శనంలోను ఇతడు అవధులకు వెళ్ళిపోయాడు. ఇతని వైవిధ్యం చూసిన తరవాత మరి ఈ కవి తరిచిచూడని నాయికా మనోభావం కలదా అని ఆశ్చర్యం కలుగుతుంది.

ఇత డింతగా నాయికాభావ వైవిధ్యం ప్రదర్శించడానికి పూనుకోడంవల్లనే ఒక్కొక చోట అంతగా ఉత్తమ ప్రకృతులు కాని పరకీయా సామాన్యాది నాయికల మనోవృత్తులు ప్రదర్శించడానికి కూడా జంకలేదు. కనక నేపథ్యస్థంగా కొన్నికొన్నిపదాలలో ఆయా నాయికల స్వభావాలనుబట్టి క్షేత్రయ్య కొంచెం మోటుగా కూడా పదరచన చేశాడు. న్యాయ్యంగా ఇది ఇతని సూక్ష్మమయిన లోక స్వభావ విజ్ఞతకు తార్కాణంగా తీసుకోవాలి.

ఇంకా ఆ కాలానికి సంబంధించిన సాహిత్యాభి రుచికూడా ఇలాంటి వర్ణనలకు కారణమే. ఒక కాలపు సాహిత్యాభిరుచి మరి ఒక కాలానికి కొంచెం మోటుగా కనబడడానికి ఒకప్పుడు ఆయా కాలిక పరిస్థితులు కూడా కారణాలుగా మారుతూంటాయి. ఇది ఏ సాహిత్యంలో నైనా సామాన్యంగా జరిగే విషయమే.

ఇటీవల కొందరు విమర్శకు లీ విషయాలు తిన్నగా అవగాహన చేసుకోక అన్యాయ్యంగా క్షేత్రయ్యమీద అసభ్యత్వారోపణ చేశారు.

శ్రీ పిఠాపురం మహారాజావారిచే ప్రకటితమైన ఈ గ్రంథంలో ఇంతకుపూర్వం శ్రీ విస్సా అప్పారావుగారు ప్రకటించిన సంపుటంలో కంటె ఎక్కువ పదాలున్నాయి. ఇందులో చాలా పదాలకు నృత్యానుకూలమైన సూచనలుకూడా విపులంగా చేర్చారు. ఈ గ్రంథ సంపాదకులు క్షేత్రయ్య పదాలన్నీ స్వీయ, పరకీయ, సామాన్య అనే మూడువర్గాల కింద విభజించి ముద్రించారు. ఇందుచేత పాఠకులకీ శీర్షికల వర్గీకరణంలో ఉన్న వర్ణనా వైవిధ్యం తెలుసుకోడానికి బాగా సౌలభ్యం కలిగింది.

సంపాదకు లీ సంచికలో 'క్షేత్రయ్య పదము లేమో?' అన్న శీర్షికలో అనుమానాస్పదంగా ఉన్న కొన్ని పదాలుకూడా చేర్చారు. ఈ విషయంలో ఇంకా లోతుగా పరిశోధన జరగవలిసి ఉన్నది. ఇంకా లుప్తప్రాయమైన క్షేత్రయ్య పదాలకోసం అన్వేషణ జరగవలిసిన అవసరం కూడా ఉన్నది. అందుచేత అనుమానాస్పదమైన ఈ పదా

లీ సంపుటంలో చేర్చడం బాగానే ఉన్నది. గాని ఈ సంపుటంలో క్షేత్రయ్యకు బొత్తిగా సంబంధించని మరికొన్ని ఇతర పదాలుకూడా చేర్చారు. ఇది ఈ సంపుటికి కేవలం అనవసరమే. ఈ గ్రంథంలో శ్రీ పీఠాపురం మహారాజా, పి. సాంబమూర్తి, ఇ. కృష్ణయ్యర్, పర్వతనేని వీరయ్యచౌదరి, గిడుగు సీతాపతిగార్లు క్షేత్రయ్య పదాలకు సంబంధించిన వివిధవిషయాలపై పీఠికలు రచించారు. ఈ పీఠికలు క్షేత్రజ్ఞ పద పరిశీలకులందరు తప్పక పరిశీలించ దగినవి. అన్నివిధాలా ప్రశంసనీయంగా ప్రకటించిన ఈ గ్రంథం సంగీతసాహిత్యాభిమానులందరికీ అవశ్యక పఠనీయమైనది.

---

## కల్పన

[ఆధునిక కవితాసంపుటి]

సంపాదకులు: అనిసెట్టి సుబ్బారావు, అవసరాల సూర్యారావు, బెల్లంకొండ రామదాసు, రెంటాల గోపాలకృష్ణగార్లు. ప్రకులకు—విశాలాంధ్ర ప్రచురణాలయం. గవర్నరుపేట. విజయవాడ. 1. వెల: నాలుగున్నరరూపాయలు.

ఈ ఆధునిక కవితాసంపుటిలో ౬౬ గురు కవుల ఖండ రచన లున్నాయి. ఇంతకు పూర్వం తెలుగులో వెలువడిన ముఖ్యమైన ఆధునిక కవితా సంపుటాలు రెండు. వీటిలో మొదటిది వైతాళికులు. రెండవది మహోదయం. ఈరెండు ఆధునిక కవితాసంకలన గ్రంథాలే. కల్పన ఈ రెండిటితో పరిపోల్చదగిన గ్రంథం. కాని ఆ రెండింటికీ, దీనికీ చాలా భేదా లున్నాయి.

మొత్తంమీద ఈ సంకలనంలో 'అభ్యుదయ' పంథాలో నడిచే రచనలే ఎక్కువగా ఉన్నాయి. అయితే సంపాదకుల 'చింతన' పరిశీలిస్తే కేవలం 'అభ్యుదయ' కవితాదృక్పథంతో ఈ సంకలనం చేసినట్లు కనబడదు. భావవ్యక్తీకరణంలోను, ఛందోరచనలోను, కొత్తదారులు తొక్కుతూ సాంఘిక సమస్యాస్ఫోరకములైన రచనలే ఈ సంకలనంలో ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఈ దృక్పథంతో ఇది తయారు చేసినపుడు దీనిలో ముఖ్యంగా బసవరాజు అప్పారావు, విశ్వనాథ సత్యనారాయణ, కవికొండల వెంకటరావు గార్ల సాంఘిక దృక్పథంగల ఖండరచనలలో ఒకటైనా లేకపోవడం ఈ గ్రంథాని కొక లోపంగా కనిపిస్తున్నది.

ఇటీవల యువకవులు తెలుగులో ఛందో రచనలో చిత్రవిచిత్రమైన కొత్త మార్గాలు తొక్కుతున్నారు. ఇవిగాక ఈనాడు ఇంగ్లీషులో స్వేచ్ఛాఛందః పద్ధతిని అనుసరించిచేసిన కవితారచనలుకూడా ఎక్కువగానే వస్తున్నాయి. అయితే ఈ స్వేచ్ఛాఛందో రచనలో గట్టిచిక్కు ఒకటి ఏర్పడుతున్నది. ఈపుస్తకంలో ప్రచురించిన ఈ జాతిరచనల్లో ఏ ఖండరచన తీసుకున్నా రచనఅంతా స్వచ్ఛమైన స్ఫాటికకవితా రూపంతో అవతరించిన రచనలు చాలా తక్కువగా ఉన్నాయి. వీటిలో కొన్నిచోట్ల భావం బాగా పలచబడి రచన వట్టి వచనంగా దిగజారిపోతున్నది. శ్రీశ్రీ, ఆరుద్ర, పాప వంటి నలుగు రైదుగురు రచయితలు మాత్రమే ఈ జాతిరచనలో కృతకృత్యులైనారు.

ఈ సంకలనంలోని స్వేచ్ఛాఛందో రచయితలలో ఒకలక్ష్యం సూటిగా సూక్ష్మంగా చెప్పగలవారు చాలా అరుదుగా ఉన్నారు. ఉదాహరణకు 'తల్లి-తనయునికి' అనే రచన తీసుకుందాం.

ఈ రచనాధోరణి ఇది: —

"నాయనా!

ఏడుపుతప్ప ఏముంది చెప్పడానికీ వ్రాయడానికీ! ఉన్న తరతరాలనాటి ఆస్తి, గౌరవ మర్యాదలు పూడ్చుకు పోయాయిగదా! బలవంతంగా చద్దామంటే స్నేహితులు చావనీయక, చావురాక, ఎప్పుడో నుయ్యో గొయ్యో చూసుకోడానికి వీలు వెతుకుతున్నా! నాలుగు ముక్కలు వ్రాద్దామని కూర్చుంటే కడుపు తరుక్కుపోతోంది. ఏ విషయం జ్ఞాపకంచేసుకున్నా చారెడంత పచ్చిరణాలను కెలుకుతోన్నట్లున్నది! నీకు తెలియదురా! తల్లి శోకం ఎంతపదునైనదో తెలియదు; నీవు భూమిమీద పడ్డనాడు ఎంతగ ఉప్పొంగిపోయానో? పాలుపోసి నీచుట్టూ ఎన్ని ఆశల్ని రెమ్మలు కొమ్మలు తొడిగించానో పూలల్లో పెట్టి ఎంత గొప్పగ పెంచానో నీకు తెలీదు!"

అని ఇలా ఇదేధోరణిలో ఈ రచన ఇంచుమించుగా నాలుగుపుటలవరకు సాగిపోతుంది. పుస్తకంలో ఇది ఛందఃపంక్తులుగా అచ్చువేశారు. నేనిక్కడ ఇదివచనంలాగే ఉదాహరించాను. ఇంతే తేడా. న్యాయానికి

ఇదిఅంతా కొంచెం భావోద్రిక్తమైన వచనరచనే గాని కవిత్వం అనడానికి వీలులేదు.

సంపాదకులు శ్రీ గ్రంథపీఠికలో శిష్ట్లారచనలతోనే కాల్పనికయుగం తరవాత వచ్చిన ఆధునిక యుగం ప్రారంభమైనదని అన్నారు. ఇది శిష్ట్లాతో ప్రారంభించినదనడంకంటె కాల్పనికయుగంలోనే గురజాడ వంటికవులలో వీరు నిర్దేశించిన అత్యాధునిక కవితా బీజాలు మొలకలెత్తాయని చెప్పడం న్యాయ్యం. శిష్ట్లాకవిత చాలావరకు ప్రయోగాత్మకంగానే (*Experiment*) ఉండిపోయిందిగాని స్వచ్ఛమైన అభివ్యక్తి అంతవరకు అందులో లేకపోయింది. అదిగాక ఈయనవాడిన 'నవమి చిలుక' వంటి కవితా సంకేతాలు పాఠకులలో విస్పష్టమైన ఆకృతి పొందలేక అర్థక్లిష్టత కూడా కలిగిస్తున్నాయి.

'కాల్పనిక' మనేపదం సంపాదకులు వెనకటి తరం కవుల కవితకు వాడారు. దానికంటె విభిన్నమైన లక్ష్యాలు పెట్టుకున్న ఈ కవితాసంపుటికి 'కల్పన' అనేపేరు పెట్టడంకంటె మరి ఏదైనా పేరు పెడితే బాగుండేది.

ఈసంపుటిలో ప్రకటించిన రచనలన్నీ ఒకే అంతస్తులో ఉండకపోవచ్చును. కాని దీనిలో-అధి వాస్తవికచ్ఛాయలు గల రచనలు మొదలు కొని వినూతన దృక్పథంతో రచించిన కేవల ప్రణయగీతాలవరకు-గల అన్నిరకాల రచనలు కనిపిస్తాయి. ఇంతేకాక ఈభావంలోను, పలుకుబడిలోను, నూతనత్వంలో వెల్లివిరిసే ఈక్రింది. ఆత్రగీతంవంటి మంచి రచనలు కూడా దీనిలో ఎక్కువగానే ఉన్నాయి.

పీటిగడియారం

'నువ్వు ఎక్కదలుచుకున్న రైలు
ఎప్పుడూ ఒకజీవితకాలం లేటు
నిన్నూ నన్నూ నిరీక్షించలేక
ఎక్స్‌ప్రెస్ వేగో ఒకబండీ
నీ ఆదర్శాల లగేజీ
ఎక్కనంటూంది టి. ఐ. సి.
నీ ఊస్సేతాల ట్రంకుపెట్లు
కలలబ్రేకులో పారెయ్యాలి
నువ్వు తెమ్మనుకున్నవన్నీ ఎక్కించేలోపల
కదిలిపోతుంది బండీ!
అందుకే అంగుళాలో కొన్ని
నీఅభిమాన హీరోలదగ్గిర ఒదిలెయ్యి
నువ్వు చేరదలుచుకున్న ఊరు
నువ్వు బతికుండగా చేరదా రైలు
దేవుడా! ఇంతచేశావా అని
ఉన్న ఊళ్లోనే ఉండు."

అత్యాధునికమైన కవితామార్గంలో బయలుదేరిన విప్లవభావాలు, వివిధరచనామార్గాలు అవగాహన చేసుకోదలిచినవారు కవితాసంకలనం తప్పక చదివి తీరాలి. ముద్రణ, పుస్తకాకారము ముచ్చటగొలుపుతున్నాయి.



Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

# రాయల శాస్త్రవైదుష్యము



శ్రీ దివాకర్ల వేంకటావధాని

రాయలవారి వ్యుత్పత్తి విశేష మపారము. అది సర్వతోముఖమై పరిణాహమున నల్ప విషయములనుండి యాగమాంతములవఱకు నెగఁబ్రాకుచున్నది. ఆయా సందర్భములలో నాముక్తమాల్యదయం దాయన ప్రదర్శించిన శ్రుతిస్మృత్యుపనిషత్పరిజ్ఞాన మపారమై యాశ్చర్యము నొసగించుచుండును. మధురాపురమును వర్ణించుచు నాయన యందలి ధరణీసురులు "హరధనదాదులైన వలహస్తము చాపరుదానధార" కనిచెప్పి దానికిఁ జిరసముపార్శ్వాగ్ని తడిచెంది నశించునని వారు భయమందుటయే కారణమని సూచించెను. బ్రాహ్మణుల దక్షిణహస్తమున నగ్నియుండునని వేదములు చెప్పుట యిందుకుఁ బ్రమాణము. విష్ణుచిత్తుఁడు స్వమతమును స్థాపించు సందర్భమున మొదట నారాయణుఁ డొక్కఁడే యుండెననియుఁ దరువాత "లీల నేకాకిత చనదు, పెక్కుయ్యెదనను దు నయ్యెఁ జదచిద్ద్వయంబునొచ్చి" యనియు ఛాందోగ్యోపనిషత్ప్రతిపాదితమైన యర్థము నుదాహరించెను. "ఏకోహవై నారాయణ ఆసీన్న బ్రహ్మా, నేశానో, నాపో, నాగ్నీషోమౌ, నేమే ద్యావా పృథివీ, న నక్షత్రాణి, నసూర్యో, నచంద్రమాః" "సఏకాకీ నరమేత, తస్య ధ్యానాన్తస్థస్య" యనుదు మహోపనిషద్వాక్యములందును, "సోకామయత బహుస్యాం ప్రజాయేయేతి, సతపోతప్యత, సతప స్తప్త్వా, ఇదగ్ం సర్వమసృజత" యను తైత్తిరీయోపనిషద్వాక్యములందును, నీ యర్థమే ప్రతిపాదింపఁబడినది. ఛాందోగ్యమునందలి యంతరాదిత్యవిద్యలో "కప్యాసం పుణ్డరీకమేవమక్షిణీ తస్యోదితినామ"యని యుండుటచే నక్షిణీ యను ద్వివచన శబ్దమువలన సూర్యునందలి పుండరీకాక్షుఁడు నారాయణుఁడే యని విదితమగుచున్నది. దీనిచే రాయలవారు,

..............అంతరాదిత్యవిద్య
నర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడయగుట
కక్షిణీయని యప్పద్ద్విత్వకృత్యక్షదళిత
తాను విధి రుద్రశక్రాదులందు నొకఁడు
కాఁడనుట శ్రుతియే విలక్షణతఁ దెలిపె.

నని వక్కాణించి యున్నారు. "అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అను నారాయణీయ యజ్ఞికోపనిషద్వాక్యమే "దలమై లో వెలిఁ దానెయున్కిఁ దెలిపె న్నారాయణం" బనునెడ వ్యక్తమగుచున్నది. "సర్వేశబ్దా అచిజ్జీవ విశిష్ట పరమాత్మనో వాచకా" యని శ్రీమద్రామానుజ విరచిత వేదార్థ సంగ్రహమునఁ గల యర్థమువకు ప్రసక్తులం దారుణములలో బ్రహ్మేంద్రాది శబ్దములన్నియు సామాన్యవిశేషముచే నారాయణునకు నందే పర్యవసించుచున్నవని చెప్పఁబడినవాక్యము ప్రమాణము. దీనిచే రాయలవారు "అరుణంబుల సామాన్య విశేష రీతి నిఖిలంబు నృష్టజాలంబు నిర్మలనారాయణ శబ్దమందు నెతుదిఁ బర్యస్తమగు నన్నరీతి"వని సూచించి యున్నారు. ఈ సందర్భముననే యాయన "ఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణ" అనెడి సుబాలోపనిషత్తునందలి వాక్యము నుదాహరించి తత్ప్రమాణముచే విష్ణుచిత్తుఁడు నారాయణునికన్న వేఱు దేవుఁడు లేఁడని నిరూపించెనని తెల్పియున్నారు. స్వమతస్థాపనమునందే విష్ణుచిత్తుఁడు ఋగ్వేదమునకు సంబంధించిన కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునఁ గల యింద్రప్రతర్దన వృత్తాంతమును, ఐతరేయోపనిషత్తునఁ గల యాగర్భజీవన్ముక్తుఁడైన వామదేవుని వృత్తాంతమును నుదాహరించి యుండెను. "మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతి ర్నారాయణ యని సమస్తంబునకుఁ బరాయణంబుగా

తతనిం బ్రతిపాదించు శ్రుత్యంతరంబుగలదని రాయలు సూచించిన యా శ్రుతి సుబాలోపనిషత్తు. కేశిధ్వజుఁడు ఖాండిక్యుని రాజ్యమెల్ల గ్రహించి "ఫలంబాకాంక్షింపక గెల్తు మృత్యువు నవిద్యం, బట్టుకుందున్, దుదకా జాకుందు"నని యోగ నియతిచే జ్ఞానాశ్రయుఁడై సుఖానీకముల రచింప నారంభించెను. "ఏ నవిద్యవలన మృత్యువుఁదరియింప ననఘ! రాజ్యముల మఖాదికములఁ జేయుచున్న వాఁడ"నని యీ విషయమునే యాతఁడు ఖాండిక్యుని కెఱుకపఱచియుండెను. దీనికి "విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయగ్ం సహ, అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా మృతమశ్నుతే" అను నీశోపనిషద్వాక్యము మూలము. ఇట మృత్యువనఁగా బ్రహ్మనిష్ఠవలనఁ బ్రమాదపడుట. అవిద్యయనఁగా మఖాదికర్మ. సంగము విడిచి కర్మలొనర్చినచో ఫలానుభవరూపమైన బంధముండదని "యోగినః కర్మకుర్వన్తి సంగం త్యక్త్వాత్మశుద్ధయే" యను భగవద్గీతా వాక్యము నిరూపించుచున్నది. కేశిధ్వజుఁడు ఖాండిక్యునకు మనంబునకు బ్రహ్మ మాశ్రయమనియు, నది పరాపరభేదంబుల రెండువిధములుగా నుండుననియు, నందు పరము మూర్తమనియు నపర మమూర్తమనియుఁ దెల్పియుండెను. ఈ యర్థమే "ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తంచైవామూర్తంచ" యని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. ప్రధానులు ఖాండిక్యునిఁ గేశిధ్వజుని మార్కొనఁ బ్రేరేఁచు సందర్భమున

అలసతఁబరున్న మనుజుండు కలియుగంబు
ద్వాపరంబెన్నఁ గూర్చున్నవాఁడు త్రేత
యుత్థితుఁడు యాయి మఱి కృతయుగమటన్న
నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినవె.

యని ఋగ్బ్రాహ్మణమునందలి యింద్రుని పలుకుదాహృతమైనది. "అణోరణీయాన్ మహతో మహీయాన్, ఆత్మాగుహాయాం నిహితోస్య జంతోః" అను శ్రుతి "అణుసమూహములకును నణీయు నిన్నుఁ గొల్తు" ననువాక్యమున ధ్వనించుచున్నది. ఈవిధముగా రాయలవారు వేదోపనిషత్తులందుఁ దమకుఁగల సర్వతోముఖవిజ్ఞానమును పెక్కుచోట్ల వెల్లడించి యున్నారు. కేవలము వేదోపనిషద్వాక్యముల యర్థతాత్పర్యముల వెలింగించుటయే కాక యందలివాక్యములను స్ఫురింపఁజేయుపదములనే వారు పలుచోట్ల వాడి యున్నారు. అందుచే వారి కావ్యభాగము లక్ష్యస్థములే కాని శ్రుతిమాత్రములు కావని తెలియుచున్నది.

విశిష్టాద్వైత మత సిద్ధాంతతత్త్వము వెలుంగుటకు ద్వివిధములైన సాధనములు కలవు. అందు బ్రహ్మసూత్ర భగవద్గీతోపనిషత్తులును దద్భాష్యములును నొకతెగకుఁ జెందినవి. ఇవి వాదక్షమములై పండితజనైకవేద్యములై యుండును. రెండవది వాదోపవాదములకుఁ గొఱగాకపోయినను విశిష్టాద్వైతమును పామరజనులకుఁగూడ సుబోధమొనరించు సులభసాధనము. తమిళభాషారచితములైన ద్రావిడ ప్రబంధములీ తెగకుఁ జెందును. వీనినే ద్రావిడవేదములనికూడ నందురు. విష్ణుచిత్తునింట నదురే యాలించినను వినవచ్చు పద్యములలో నిట్టి దివ్యప్రబంధముల యనుసంధానము చేఁ గలుగు పద్యడియు నొక్కటి. వైష్ణవమతప్రతిపాదకములగు నీ యిరుతెగల సాధనములందును రాయలు కడుంగడు నిష్ణాతుఁడనుట యాముక్తమాల్యదలో బహుళములైనదృష్టాంతములుగలవు. విష్ణుచిత్తుఁడు పాండ్యరాజసభలో నన్యమతావలంబకుల నోడించినసందర్భమున "జగదుద్గతికిని బీజము ప్రధానమను" పద్యములో సాంఖ్యాద్వైత మీమాంసాదులు సౌగత ప్రత్యక్షవాదుల మతములు సంగ్రహముగా సూచించి వాని నిత్యత్వాదులను బ్రహ్మసూత్రముల సాయమున ఖండించి విశిష్టాద్వైతమే పరమతత్త్వమని నిరూపించెను. ఇందు రాయలకు బ్రహ్మసూత్రతద్భాష్యములందుఁ గల సంపూర్ణపరిచయము వ్యక్తమగుచున్నది. విష్ణుచిత్తుఁడు వాదసమయమున "సుఖసంవిత్తత్త్వబోధైక చుంచుద్వైపాయన సూత్ర సచ్ఛ్రుతుల నీకున్ముని రూపించి యైఁ దద్విష్ణుత్వము ద్రావిడవ్యదివిషద్వాక్యవర్తనంబున్ విశిష్టాద్వైతంబును జేటగాఁ దెలుపఁ" ప్రమాణంబుల సూచించెనని రాయలవారు తెల్పియున్నారు. అపరిచితశాస్త్రగ్రంథ జాత్యంధుఁడైన విష్ణుచిత్తుఁ డట్లు చేయఁగల్గుటకు విష్ణుప్రసాదమే కారణము. రాయలు వాని నన్నింటి సమగ్రముగా నభ్యసించుట కాయని కొనుటేముపైఁగల యభిమానము కారణము.

ప్రత్యుపనిషత్తులలో రాయలవారికిఁ గల పరిచయము పైని సూచింపఁబడియే యున్నది. ఛాందోగ్య యజ్ఞిక సుబాల శాఖీతకీ బ్రాహ్మణోపనిషత్తులందలి వాక్యముల నాయన తన గ్రంథమునఁ బెక్కుచోట్ల ననుసంధానము గావించెను. ఇట్లే యితరములైన యుపనిషత్తులనుగూడ నాయన పరిశీలించెననుటలో ననుమానముకాని యతిశయోక్తికాని యుండనక్కఱ లేదు. వేదాంతవిషయములఁ జర్చించినచోట్ల నాయన సర్వదర్శనసారసంగ్రహము, వేదార్థసంగ్రహము, శ్వేతాశ్వతరదర్శన ముక్తికాద్యాత్మోపనిషత్తులు, సనత్సుజాతీయము మున్నగు గ్రంథములతోఁ దనకుఁ గల పరిచయము వెల్లడించి యుండెను.

భగద్గీతయుఁ దద్భాష్యములును రాయలవారికి జిహ్వాగ్రగతములే. ఆయన గావించిన వేదాంత విచారమునకు సంబంధించిన వాక్యము లన్నింటికి భగవద్గీతలో నాకరము చూపవచ్చును. ఖాండిక్య కేశిధ్వజ సంవాదమునందలి

జనిసాహస్ర బహుప్రయాణముగ
సంసారంపుఁ ద్రోవన్సదా
చనుచుండన్ ఘన మోహ ఖేద
మలమన్ సంసారి పాంథుండు వా
సనలన్ ధూళి మునుంగుఁ గాఁగ
నెపుడేన్ జ్ఞానంపు టుష్ణోదకం
బునఁ బ్రక్షాళన సేయు వానికపు
డమ్మోహశ్రమంబుం జనున్.

అను పద్యమునందలి యర్థమే యించుమించుగా గీతలందలి

యథైధాంసి సమిద్ధోఽగ్ని
ర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి
భస్మసాత్కురుతే తథా
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి
మచిరేణాధిగచ్ఛతి.

యను శ్లోక భాగములఁ గానవచ్చుచున్నది. గోదాదేవి విష్ణువు నుపాలంభించుపట్టున నాతఁడు మత్స్యకూర్మ వరాహ నారసింహాద్యవతారములలోనే శాశ్వతముగా నుండిపోయినచో నతఁ డప్పు చేయుటకు తిర్యగ్జాతివలపుకత్తెలే యుండరనియు, నున్నను వానిఁ వారలకున్నంత కామాతిరేకము కలుగదనియుఁ బల్కి వెంటనే తప్పు దిద్దుకొని "నోరులేని జంతువులకె నొప్పి ఘన"మనియుఁ, దా నాత్మవత్సర్వభూతాని యను ధర్మమును బాటింపవలెననియుఁ దెల్పి విచారించెను. ఈ వాక్యము "ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి" యనుదానిలోనిదే కదా! ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానమును జెప్పిన పిమ్మట విష్ణుచిత్తుఁడు పాండ్యరాజుతో "కావున ముముక్షువ కుపాశ్రయణీయుం డధోక్షజుండు. నీ వతని భజింపు మదియె భక్తియోగంబు...ఇంతకంటె సులభోపాయం బామోఘనంబున నయ్యధోక్షజుండు గాండీవి కుపదేశించిన శరణాగతధర్మం"బని బోధించి యాతని భాగవతప్రధానుం గావించెను. ఈ శరణాగత ధర్మంబు గీతా ప్రతిపాదితమైనట్టిదే.

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యః
మోక్షయిష్యామి భారత.

యను గీతాచరమశ్లోకము దీనినే చెప్పుచున్నది. ఇట్లే రాయలు గీతననుసరించి వ్రాసినచో ట్లెన్నియో కలవు.

పై ప్రస్థానత్రయము సంస్కృతభాషావేత్తలగు పండితులకుమాత్రమే సుబోధమై యుండును. ఇందలి యర్థమునే సామాన్య జనులకుఁగూడ నందుబాటులోనికిఁ దెచ్చునట్టివి ద్రావిడప్రబంధములు. సంస్కృత పాండిత్యము లేనివారు సైతము వీనినిజదివి వైష్ణవ మతసారముల నెఱుంగవచ్చును. రాయలీ ద్రవిడ ప్రబంధములనుగూడఁ బూర్తిగా నవలోడించినవాఁడే. విష్ణుచిత్తుఁడు పండితుఁడుకాదు కావున నీ ద్రావిడ వేదములనే చదివినవాఁడై యుండవచ్చును. గోదాదేవి తిరుప్పావై నాచ్చియార్ తిరువాయిమొయి మొదలగు ప్రబంధములను రచించెనఁట!

కన్యయా విష్ణుచిత్తస్య
కవితాభూత్ కృతిద్వయీ

జన్మనవ్యథేదనోదాయ
జగదుజ్జీవనాయచ.

అని దివ్యసూరిచరితము చెప్పుచున్నది. రాయలు పంచమాశ్వాసములో

ప్రతిదినము నిట్లుచని య
చ్యుత పూజయొనర్చివచ్చి సుదతివియోగ
చ్యుతధైర్యయగుచు నయ్యెడు
పతిగుణములు ద్రవిడభాషఁ బాడుచునుండున్.

అని వ్రాసి యుండెను. ఇవి యామునపథముఁ జదివినచే. ద్రావిడ ప్రబంధగతవిషయములఁ బరిశీలించినచో రాయలవా రందు నిక్షేపింపఁబడిన యర్థము నంతను ఆముక్తమాల్యదలో నిమిడ్చినట్లు తెలియ నగును. ఇట్లే రాయలవారు వేదాంత దేశికులవారు రచించిన మధుమథన కథాప్రతిపాదకంబగు ప్రబంధ శతకమునుగూడఁ బరిశీలించి యుండిరి.

ఖాండిక్యుని ప్రార్థనపై కేశిధ్వజుఁ డాతనికిఁ బునర్భవభయంబువాపి బ్రహ్మసాక్షాత్కారంబు కలిగించు యోగము తెలిఁగించెను. యమాది విషయికంబైన యాత్మప్రయత్నమున కధీనమైన సాత్త్వికపు మనోగతిని బ్రహ్మసంబంధినిగాఁ జేయు ప్రౌఢియే యోగ మని యాతఁడు యోగమును నిర్వచించెను. ఈ సందర్భమున రాయలు పాతంజల యోగసూత్రానుసారముగా యోగాంగములగు యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణలను, మనసునకు సమాశ్రయమైన బ్రహ్మమును దద్భేదములను, భావనాత్రయ స్వరూపమును వివరించెను. తరువాత యోగి విష్ణువును జింతింపవలసినవిధమును వర్ణించెను. ఈ సందర్భమున రాయలకు యోగశాస్త్రముతోడను దదభ్యాసముతోడను గల గాఢమైన పరిచయము వ్యక్తమగుచున్నది. ఇచ్చట నాయన చెప్పిన యంశములకుఁ బాతంజలయోగసూత్రరాజమార్తాండములందును, విష్ణుపురాణ సర్వదర్శనసార సంగ్రహ భగవద్గీతాదులందును, శ్రీ రామానుజ కృతవేదార్థ సంగ్రహము నందును నాధారములు గలవు. ఈ వివరణము చదివినచో నాయన కుపయోగమునఁ గల ప్రవేశము కేవల సిద్ధాంతమాత్రమే కాదనియుఁ దదభ్యాస రహస్యములనుగూడ నాయన యెఱింగి యుండెననియుఁ దెలియనగును.

స్మృతిగ్రంథములందును ధర్మశాస్త్రములందును రాయలవారికిఁ గల పరిచయ మాముక్తమాల్యదలో బహుస్థలముల వ్యక్తము చేయఁబడినది. కేశిధ్వజుఁ డొనరించిన యాగమున నాయన త్రేతాయుగ చరిత్రమున కనుగుణముగ గోవును యాగపశువుగా వర్ణించెను. కలియుగమున నశ్వాలంభ గవాలంభ సన్న్యాస పలపైతృక దేవరసుతోత్పత్తులు నిషిద్ధములని స్మృతి చెప్పుచున్నది. పూర్వయుగములందుఁ గొందఱు రాజులు గవాలంభము లొనరించిరనుట కనేక దృష్టాంతములున్నవి. కాళిదాసు మేఘసందేశమున గవాలంభము నుదాహరించెను. విష్ణుచిత్తుఁడు స్వమత ప్రతిష్ఠాపన మొనరించుచు ముముక్షువు పుండరీకాక్షునిఁ దప్ప నితరు నెవ్వని నుపాసింపరాదనియు" విష్ణువునకుఁ దత్తిశాక్యుల విగ్రహము లగుట బ్రహ్మరుద్రార్జున వ్యాసభాను భార్గవాదుల భజనంబు త్రైవర్గికునకుంగాక యపవర్గకాముల కయుక్తంబని స్మృతి చెప్పుచున్న"దనియు వక్కాణించెను. ప్రధానులు కేశిధ్వజునిపై నెత్తిపోవుటకుఁ బ్రేరేఁచినప్పుడు ఖాండిక్యుఁడు దీనుఁడు బద్ధాంజలిపుటుఁడునై శరణుచొచ్చిన వానిని గోపమునఁ గూల్చుట పరలోకార్జునబుద్ధికిఁ జాలకీడని చెప్పు కణ్వవాక్యము నుద్ధరించెను. యామునాచార్యుఁడు కుమారునికి రాజనీతిని బోధించు సందర్భమున రాయలు తనకుఁ గల స్మృతి ధర్మశాస్త్రపరిజ్ఞానమును బలుచోట్ల వెల్లడించెను. పాత్రుఁడైనవానిఁ బరికించి యాతఁ డడుగకుండ నొకఁడు చెప్పకుండఁ బనసపండ్లు దిగిన పరిగ దానము చేయవలెనని రాయలు చెప్పినరీతి నే పరాశరస్మృతి

అభిగమ్యోత్తమం దానం
ఆహూయైవతు మధ్యమం
అధమం యాచమానాయ,
సేవా దానంతు నిష్ఫలమ్.

అని నుడువుచున్నది. "పితృదేవ క్రియలను విధి పితృక్రియలె. మాతృ"లని రాయలు చెప్పినదానికి భారతానుశాసనికపర్వమునందలి "పితృపూజ సమగ్రము దైవతపూజనమున" కనుమాట మూలమైనది.

రాజు విచిత్రసరణివంపి ధార్మికుఁడును, పతిఁబొంది బ్రహ్మచారియు, బోంకి సత్యశాలియు సారగించి సదుపవాసియు కేడించి శూరుఁడును, జెంది ధనియు నగునని రాయలు చెప్పిన ధర్మసూత్రములన్నియు భారతమునందును యాజ్ఞవల్క్యాది స్మృతుల యందును జెప్పఁబడి యున్నవి. బ్రహ్మరాక్షసుఁడు సోమశర్మగా నుండినప్పుడు "పచ్చితోల్పట్టె చుచ్చాల మెట్లిందికోవఁదాన యాకెల్ల సుక్రతవట్టె"నని రాయలు వర్ణించెను. ఇట వర్ణింపఁబడిన మహిషీ మేషీ ధేను పాదరక్షాదానములవలన నపార పుణ్యఫలితములు కలుగు నని శేషధర్మాదులందుఁ జెప్పఁబడినది. "అర్ధరి కృష్ణా జినందానం సర్వవ్యాధి వినాశన"మ్మనియు, "ఉపా నహౌ ప్రదాతాచ సర్వలోక చరో భవే"త్తనియు శేష ధర్మములు చెప్పుచున్నవి. పయస్వినియైన మహి షిని సుశ్రుతునికి దానము చేసినచో నపమృత్యువు తొలఁగు నను ధర్మము కలదు. "రత్నేన శుభేన శుభం భవతి, నృపాణామనిష్ట మశుభేనచ" యని బృహత్సం హితయందును, రాజేశువారముల నేకు రత్నముల ధరింపవలె"నని హాలాస్యమునను జెప్పఁబడిన నీతిని బురస్కరించుకొనియే రాయలు రాజనీతి సందర్భమున

వెలయించునట్టి యొకమణి
వెలుఁగా సంగొనుము ధరణి వెండి సుశేషో
జ్జ్వలతికు వలదేవాసర
ముల మణుల విభూషణములు భూపతిదాల్పన్.

అని చెప్పియుండెను. మనువు

సురావైమల మన్నానాం
పాప్మాచమలముచ్యతే
తస్మాద్బ్రాహ్మణ రాజన్యౌ
వైశ్యశ్చ నసురాం పిబేత్.

అని ద్విజులకు సురాపానము నిషేధించెను. దీని నాధారముగాఁ గొనియే రాయలు పంచమాశ్వాసమునందలి వసంతర్తువర్ణనములోఁ గోకిలస్వనమునకుఁ బంచమత్వము వచ్చుటకు "ద్విజతగాంచియు మధుసేవ విడువలేక జాతిబాసిన కేంట్ల నిస్వనముఁ గూడుకొనుట"ను గారణముగాఁ జెప్పి చమత్కరించెను. గోదాదేవి విరహమును వర్ణించుసందర్భమున రాయలు మధ్యాహ్నము మంత్రవాది యామె ధృతి దూలునట్లుగా ఊహించ ధాంగ్రహాంగియు, సురుచిరవితాన కౌసుంభధారియునై ఘటయంత్రపరము త్రిప్పుచు జపింప మొదలిడెనని వర్ణించెను. ఇది యాభిచారిక క్రియయాటచే నాతనికిఁ గౌసుంభ వస్త్రధారణము చెప్పఁబడినది. సాధ్వాచారమున శ్వేతవస్త్రధారణమును నాభిచారికాది క్రియలయందు రక్తవస్త్రధారణమును స్మృతిగ్రంథములు విధించుచున్నవి. యామునాచార్య చరిత్రమున రాయలు పాండ్యరాజు వెత్తి శైవమును వర్ణించుచు షణ్ణవతి (96) శ్రాద్ధీయము నాతఁడు శంకరదాసమయ్య భక్త ప్రతతికారఁ బెట్టునని వర్ణించెను. షణ్ణవతి శ్రాద్ధములు స్మృతులలోఁ జేర్కొనఁబడినవి.* ఈవిధముగా రాయలు స్మృతి ధర్మశాస్త్రముల ప్రశంస చేసినచోట్లాముక్తమున లెక్కకు మిక్కిలిగా నున్నవి.

ఆముక్తమాల్యదయం దచ్చటచ్చట సూచింపఁబడిన పూర్వగాథలను బరిశీలించినచో రాయలవారి పురాణ సముచ్చయ పరిశీలనము తేటతెల్లమగును. ఆముక్తమాల్యదయందలి ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము విష్ణుపురాణములోఁ గూడ నున్నది. రాయలీకథా సందర్భమునఁ జేకాక వైష్ణవతత్త్వమును బ్రతిపాదించు వితరస్థలములఁ గూడ నా పురాణమును జదించుట వలనఁ గలిగిన విజ్ఞానమును విరివిగాఁ బ్రదర్శించెను.

అనాత్మన్యాత్మబుద్ధిర్యా
అస్వేస్వమితి యా మతిః
అవిద్యాతరు సంభూతి
బీజమేతద్ద్విధాస్థితమ్.

అను విష్ణుపురాణమునందలి శ్లోకము నాయన

ఆత్మకానిమేన నాత్మబుద్ధియును న
స్వంబునందు మిగుల స్వత్వమతియు
నవనివర! యవిద్య యను మహాతరువున
కుత్పత్తి కీద్వయంబు విత్తు మొదలు.

అని యథాతథముగా ననువదించెను. హిరణ్యగర్భవాసవాదులైన కర్మయోనులగు దేవతలశుద్ధులని

---

*అమాయుగ మన్వ్రాంతి
ధృతిపాత మహాలయాః
తిస్రోష్టకాశ్చ విజ్ఞేయా
షణ్ణవత్యః ప్రకీర్తితాః.

(2)

రాయలు చెప్పిన విషయము విష్ణుపురాణోక్త శ్లోకానుసారిగానే యున్నది. విష్ణుచిత్తుఁడు వామనావతారమును వర్ణించుచు వామనుఁడు తన దేహమును క్రిందినుండి శింశుమార చక్రమువఱకును పెంచినట్లు చెప్పియుండెను. భాగవత విష్ణుపురాణములందు విష్ణువు యొక్క యాకారపు నక్షత్ర మండలము రూపముతో యోగనిద్ర పొందుచున్నాఁడని చెప్పఁబడినది. ఇది గాక రాయలు విష్ణుపురాణము సాధారముగాఁ గొని రచించినపట్టింకను నెన్నియో కలవు. రాయలు విష్ణుచిత్తుని జడభరతమునితోఁ బోల్చి యాతఁడు సౌవీర భూరమణునికి తత్త్వము బోధించి ముక్తి కనిచిన వృత్తాంతము నుదాహరించెను. రహూగణునికి సంబంధించిన యీ వృత్తాంతము భాగవత పంచమస్కంధములో నున్నది. గోదాదేవి శ్రీరంగేశు నుపాలంభించు సమయమున భాగవత గాథల నెన్నింటినో పేర్కొని విష్ణుని కౌటిల్యము నెగ్గడించెను. ఆ సందర్భమున నే యొకచోటఁ బారిజాతాపహరణ వృత్తాంతము సూచింపఁబడినది. ఇంకొకచోట విష్ణువు వామనావతారమున భృగుపత్నిని దున్మి యామునిచే శపింపఁబడిన రామాయణోత్తర కాండమునందలి కథ యనుసంధింపఁబడినది. గోదాయౌవన వర్ణన సందర్భమున నాతఁడు శ్రీరాముఁడు చక్రవాకముల కిచ్చిన శాపమును బురస్కరించుకొని చక్కని యుత్ప్రేక్ష సంఘటించెను. ఉపాలంభ సందర్భమున నొకచో రాముఁడు శూర్పణఖకుఁ గావించిన యవజ్ఞ యుగ్గడింపఁబడినది. రాయలు మధురానగరమును "కపివర వియుక్తగిరి షద్భృగ్గహన నిలయగాత్ర గాహిత కనకముక్తాకవాట గోపురావేదితోచ్ఛ్రితాట్టోభ్యవప్ర" యని వర్ణించెను. "ముక్తాకవాటం పాండ్యానాం తత్ర ద్రక్ష్యథ వానరాః" అని రామాయణమున సుగ్రీవుఁడు వానరులను గూర్చి పల్కినపల్కు దీని కాధారము. "సకలప్రపంచంబును విష్ణుశక్తి సమన్వితమై యతనికి శరీరంబునై యుండు"నను నాముక్తమాల్యదలోని వాక్యము రామాయణ యుద్ధకాండమునందలి "జగత్సర్వం శరీరం తే స్థైర్యం తే వసుధాతలం" మన్నను శ్లోకభాగమునకు ఛాయగా నున్నది. యామునాచార్యుఁడు కుమారునికి రాజనీతి బోధించు సందర్భమున రాయలు భారతము నందలి యాదిపర్వములోని యాజోపయాజుల కథ నుదాహరించెను. మాలదాసరికథలో హరివంశములోని ఘంటాకర్ణుని వృత్తాంతము ప్రస్తావింపఁబడినది. మధురాపుర వర్ణనమున నశ్వములు శాలిహోత్రుని కోపముచే రెక్కలు గోల్పోయిన శార్ఙ్గధరోక్త వృత్తాంతము సూచితమైనది. గోదాదేవివిరాఁ గాఁగ్లను వర్ణించు సందర్భమున రాయలు గరుడోపాఖ్యానమునందలి గజకచ్ఛపోగ్రకలహమును పేర్కొనెను. మాలదాసరి కథలో గరుడుఁ డమృతమును మరల సురలకిచ్చిన వృత్తాంత ముదాహృతమైనది. బ్రహ్మరాక్షసుఁడు ప్రథమాం పిబతే వహ్నిః యను దేవీపురాణోక్తిని సూచించి దాసరి వాక్యమును ఖండించెను. ఈ విధముగా రాయలు సందర్భము కలిగిన చోట్లనెల్ల రామాయణ భారత భాగవతాదులందును హరివంశ విష్ణుపురాణాదులందును గల కథలను భావములను వివరించెను. ఇవి విగాహిత సకల పురాణుఁడైన యాయన వైదుష్యిని సూచించుచున్నవి. ఆయన "శ్రుతి పురాణోపసంహిత" లేర్చి సకల కథాసార సంగ్రహమును గూర్చియుండెను. ఆ సందర్భమున సంపాదితమైన జ్ఞానము నంతయు నాయన యాముక్తమాల్యదలో వెదచల్లెను.

శ్రుతిస్మృతి పురాణాదులలో నతినిష్ణాతుఁడైన రాయలకు సంస్కృతవాఙ్మయమునందలి కావ్యజాలము కొట్టిన పిండియని వేఱే చెప్పనక్కఱలేదు. కాళిదాస హర్ష భారవి మాఘ భవభూతులయు బాణాదులయుఁ గావ్యములందలి ఛాయ లాముక్తమునఁ బెక్కుచోట్లఁ గానవచ్చుచున్నవి. "స్వశక్త్యుపచయే కేచిత్ పరస్యవ్యసనే పరే, యానమాహు స్తథాసీనం త్వాముత్థాపయతిద్వయ"మ్మను మాఘమునందలి శ్లోకమును మనమునం దిడుకొనియే రాయలు ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము నందలి

ఎన్నఁడు లావుగూడు మన
కెన్నఁ డగున్దలీ, యయ్యెనేని పో
రెన్నికయౌనె, పోరిన జయిం
పన చెప్పిరె, నీదు భాగ్య సం
పన్నతఁ జేరెఁ గార్యమిటు

అను పద్యమును రచించెను. "పుట్టవదలి నళ్లోభిత్తిఁబట్టు శక్రకార్ముకపుఁ బలువన్నెకట్ల జెత్తి

దైన వనవాటి కాళ్ళకుంపనఁగ" నను పద్యము మేఘసందేశమునందలి "వల్మీకాగ్రాత్ ప్రభవతి ధనుః ఖండమాఖండలస్య" యను శ్లోకభాగమునందలి యర్థమును స్మరింపఁజేయుచున్నది. ఇవే యననేల? సంస్కృత కావ్యనాటకములందలి భావములు రాయల కావ్యమున లెక్కకు మిక్కిలిగాఁ గానవచ్చుచున్నవి. వసంతర్తు వర్ణనమున నొక్కచో రాయలు భర్తృహరి సుభాషితములందలి "విపది ధైర్య" మను శ్లోకభాగము నుదాహరించెను. రాయలు స్వయముగా సంస్కృతమునఁ గొన్ని కావ్యములు రచించిన దిట్ట, సత్యావధూప్రీణనము, జ్ఞానచింతామణి, మదాలసచరిత్ర, రసమంజరి మొదలైన వట్టి కావ్యములలోఁ గొన్ని. ఇట్టి పండిత కవిసార్వభౌమునకు సంస్కృత కావ్యములు కరతలామలకములై యుండె ననుటలో నాశ్చర్యమేమి?

రాయలవారికి సాహిత్యమునందే కాక శాస్త్రములందుఁగూడఁ గూలంకషమైన పాండిత్యము కలదు. ఆముక్తమాల్యదలో నాయన యుదాహరించిన శాస్త్రాంశములఁ బరిశీలించినచో నన్ని శాస్త్రములం దాయన యంత నిశితమైన విజ్ఞానము నెట్లు సంపాదించెనాయని యాశ్చర్యము కలుగును. వేదాంతమునందే కాక జ్యోతిస్సంగీత రాజనీతి వైద్యశాస్త్రములం దాయనకుఁ గల నైపుణ్య మపారమైనది. అందును జ్యోతిషమున నాయన కభిమానము మెండని చెప్పుటకుఁ జాల తార్కాణములున్నవి. దానికి సంబంధించిన సిద్ధాంత జాతకభాగములు రెండును నాయనకు సుపరిచితములే. గ్రీష్మర్తు వపగమించిన పిమ్మట వర్షర్తువు రాఁగానే సూర్యుఁడు కర్కాటకరాశిలోఁ బ్రవేశించును. కర్కాటక సంక్రమణము మనమందఱ మెఱింగినదే. ఈ విషయమును రాయలు 'కర్కటంపుట కోర్వక' యను పద్యమునఁ జక్కఁగా నుత్ప్రేక్షించెను. అట్లే వసంతాగమమును వర్ణించుచు సూర్యుఁ డుత్తరాశకుఁ దొలఁగుట సూచించెను. అమావాస్యనాఁడు సూర్యునిఁ బ్రవేశించిన చంద్రుని యమృతమును ద్రావి సూర్యకిరణములు వానతోఁ గూడ నమృతబిందువులను సైత ముమియుచున్నవో యన వడగండ్లు రాలెనని రాయలు వర్షర్తు వర్ణన సందర్భమున సూచించెను. అమావాస్యనాఁడు చంద్రుఁడు సూర్యునిఁ జొచ్చుట సుప్రసిద్ధ శాస్త్రవిషయము.

> కలావశిష్టో నిష్పీతః ప్రవిష్ట స్సూర్యమండలం
> అమాయాం విశతేరశ్మా అమావాసీతితః స్మృతా

యని దేవీపురాణము చెప్పుచున్నది. రాయలింద్రగోపములను బురోంగారక గ్రహము శిశువులతోఁ బోల్చుచుఁ గావించిన వర్ణనము గంభీరమై యాయనకుఁగల జ్యోతిశ్శాస్త్రవిజ్ఞాన పాటవమును సూచించుచున్నది. వర్షకాలమున రవిఁజూచి కుడుచువారలకును గృహకలాపములకును దృష్టి మిన్నులనె నిల్చెనని రాయలు వర్ణించెను.

> తరుశిఖరోపగతాః కృకలాసాః
> గగనతల స్థితదృష్టినిపాతాః
> యదిచ గవాం రవివీక్షణ మూర్ధ్వం
> ప్రపతతి వారి తదాన చిరేణ

యని బృహత్సంహితలోఁగల వాక్యమున కిది యనుగుణముగా నున్నది. దివ్యాంతరిక్ష భౌమములైన యుత్పాతము లొదవినప్పుడు రాజు తత్ప్రతిఘాతమునకై శాంతి కర్మల నొనరింపవలెనని యా గ్రంథమున నే చెప్పఁబడినది. రాయ లీ విషయము నే

> త్రివిధోత్పాతము లొదవిన
> నవని విభుఁడు విదుషులయు నధిక ద్రవ్యం
> బవనీ సురముఖ సురముఖ
> పవన సఖముఖముల భుక్తిబలిహోమ విధిన్

అని తెల్పియుండెను. ఉత్తరాయణమున సూర్యుఁడు మీనరాశిని దరువాత మేషరాశిని బ్రవేశించును. ఈ విషయము నాతగాఁ గొని రాయలు

> కినిసి వలఱేఁడు దండెత్తఁ గేతువగుట
> మీన మిలఁదోఁచుటుచితంబ మేష మేమి
> పనియనఁగ నేల విరహోత్క్యఁ బాంథయువతి
> దాహమున కగ్గిలాఁగఁ దత్తడియు రాఁడె

యని యద్భుతమైన యుత్ప్రేక్ష కావించెను. ఇట్లే వసంతమును వర్ణించుచు నాయన "ఘనమౌ చంద్రబలంబుకల్గి మలయంపుంగమ్మతే గాడ్పుఁదేరున నేతెంచు లతాంతబాణునకు సూర్యుండున్ మహింగ్రోత్తగా ననుకూలించె" నని మన్మథునకుఁ జంద్ర

బలమే కాక సూర్యబలముకూడ లభించెనని వర్ణించెను. సూర్యుఁడు ప్రతిదినము నస్తమింపఁబోవునప్పుడు తన తేజము నగ్నియందుంచుట శాస్త్రసిద్ధమైన విషయము. రఘువంశ చతుర్థసర్గమునందలి ప్రథమశ్లోకములోఁ గాళిదా సీ భావము నే సూచించెను. రాయలు వసంతర్తు వర్ణనమున నీ భావము నాధారముగా గ్రహించి

అరుణాంశుండు హిమర్తువన్ రజని
దీక్షైక్రుంకి పుష్పర్తువా
సరకల్యోదితుఁడౌచు నున్న
యిఁకటన్ శ్యామాకుచాలేప సం
కర సాంద్రాగ్ని శిఖారుణ ప్రభఁ గొనె

నని గంభీరమైన భావమును వెల్లడించెను. శారదృతువునఁ బ్రజలగస్త్యార్ఘ్యము నొసంగిరని రాయలు వర్ణించెను. ఈ ఋతువు రాఁగానే

కాశపుష్ప ప్రతీకాశ—అగ్నిమారుత సంభవ
మిత్రావరుణయోః పుత్ర! కుంభయోనే నమోస్తుతే

యని యర్ఘ్యము నొసంగినవారికి రాజమార్తాండమున ననంతమైన ఫలము చెప్పఁబడినది. వర్షకాలము రాఁగానే రవి కర్కాటకమునఁ జేరెననియు "వనితతి, వరాహ, వాహారి, వాయుభుగ్వైరోధి, వర్షాభులాధిఁ దోరఁగ" నని చెప్పి "మూఁడవయెడకుఁ జేరు తరణి ధరణిఁ బ్రమోదసంధాయిగాఁడె" యని సమర్థించెను. జన్మరాశికి మూఁడవ స్థానమునందు సూర్యుఁడు మేలుచేయునని జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. జన్మనక్షత్రము తెలియనప్పుడు సాధారణముగా నామమునుబట్టి నక్షత్రమును నిర్ణయించుచుందురు. ఓవా వీవో రోహిణీ యను సూత్రము ననుసరించి యీ యక్కరములు మొదటనున్న నామములవారికి రోహిణీ నక్షత్రమగును. ఇది వృషభరాశికిఁ జెందినది. వృషభమునకుఁ గర్కాటకము మూఁడవయెడ నుండును. ఈ పద్యము రాయలవారి జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానమును బహుముఖముల వ్యక్తము చేయుచున్నది.

రాయల రాజనీతిపాండిత్య మనన్యాదృశమైనది. ఆయన రాజనీతి సారమెఱుంగుటయే కాక దానినంతను నాచరణమునఁ బెట్టి చూపెను. యామునాచార్యుఁడు కుమారునికి రాజనీతి బోధించుసందర్భమున నాయన చాణక్య శుక్ర కామందక నీతిశాస్త్రములతోఁ దనకుఁగల సంపూర్ణపరిచయము వెల్లడించెను. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు చాళుక్యుల అభిలషితార్థచింతామణి సామ్రాజ్య పీఠికాతంత్రములందలి సంప్రదాయము లెన్నో రాయల రాజనీతిలోఁ గానఁబడుచున్నవని వ్రాసియుండిరి. అవి చాళుక్యులనుండి కాకతీయులును వారినుండి విజయనగర చక్రవర్తులును సంపాదించి యనుసరించిన యుత్తమ గ్రంథములు. "రాష్ట్రి మెఱియింపు, కోమటి దుర్గములు, తదవరోధ మగపడ్డఁ బుట్టింటి రూఢి నెఱపు" మని యామునాచార్యుఁడు చెప్పిన నీతి రాయలు తన జీవితమునఁ జెక్కుపొల్లు పాటించినట్టిదే. దాని నతిక్రమించుటచేతనే యాయన యల్లుఁడైన రామరాయలు తాళికోటయుద్ధమునఁ దనకే కాక సామ్రాజ్యమునకుఁ గూడ ముప్పు తెచ్చెనని చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు. రాయలు చెప్పిన ప్రతి సిద్ధాంతమునకును బరీక్షిత ప్రతిష్ఠితమైన యనుభవమో శాస్త్రమో మూలమైయున్నది.

రాయలకు సంగీత శాస్త్రమున మంచి ప్రవేశముగలదు. అతఁడు యువకుఁడుగా నుండినప్పుడు వీణావాద్యము నభ్యసించెనఁట! ప్రసిద్ధమాధ్వ గురువులలో నొకఁడగు రాఘవేంద్ర తీర్థునికిఁ బూర్వుఁడైన కృష్ణుఁడు కృష్ణరాయలకు సంగీత గురువుగా నుండెను. సంగీత సూర్యోదయమను గొప్ప సంగీత గ్రంథమును రచించిన లక్ష్మీనారాయణ పండితుఁడు రాయలకాలమునఁ గటకమునుండి విజయనగరమునకు వచ్చెననియు రాయ లాతని నంతఃపురమున సంగీతాచార్యునిగా నియమించెననియుఁ జెప్పుదురు. రాయలకు వీణావాద్యమున నభిమానము మెండు. శ్రీవిల్లిపుత్తూరున స్త్రీలు మేడలపై వలభులందు వేణిదంట వహించి విప్పుచుఁ బూవులు గోట మీటునప్పుడుఁ బోయెడు తేంట్ల మ్రోఁతవిని కాముకులు వారు వీణలు వాయించుచుండిరేమో యని భ్రాంతి నొందుచుండిరఁట! గోదాదేవి శ్రీరంగేశు నుపాలంభించు సందర్భమునఁ బరశురామావతార ప్రసక్తిఁ దెచ్చి యాతని కీర్తి లసద్వల్లకి "ప్రళయోగ్ర కుఠార కోణము నృపత్రైవిక్రమవత్పీఠికాఖ్యల త్రిస్థానము లేడుమార్లు వరుసన్ ఘటించు దోశ్శక్తిచే" మ్రోయఁగా భూపతి వర్ణ్యుఁడయ్యెనని వర్ణించెను. అట్లే గోదాదేవి కంఠమునందలి రేఖలనుగూర్చి యని సంగీతమున నెగడు మంద్ర మధ్య తార త్రిస్థానములకుఁ దీర్చిన రేఖల క్రమమున నొప్పెనని వర్ణించెను.

వ్యవహారే త్వసౌ త్రేధా హృదిమంద్రోభి ధీయతే
కంఠే మధ్యో మూర్ధ్ని తారో ద్విగుణశ్చోత్తరోత్తరః

అని సంగీత రత్నాకరమున నీ మూఁడు స్వరములును వర్ణింపఁబడినవి. వసంతర్తు వర్ణనమున రాయలొక విరహిణి మధుగర్వ మనెంచు నుద్దేశముతో మేఘరంజని బాడెననియు వెంటనే శక్రధనుస్సుతో మేఘము లుప్పతిల్లెననియు, వంత కదంబకేతకులు వికసించెననియుఁ దత్సౌరభముతోఁ గూడిన వాయువు ద్విగుణీకృతమైన తాపమును గలిగింపఁగా నామె సైపక మూర్ఛిల్లెననియు వర్ణించెను. మధురానగర సౌధవీధులందు స్త్రీలు తమకంటెను గ్రిందనుండు మేఘముల మేఘరంజి నాలపించి పై కాకర్షించి, యవి గర్జింపఁ దదనుగుణముగాఁ దమ పెంపుడు నెమిళ్లను నాట్యమాడింతురఁట! మాలదాసరి బ్రాహ్మవేళల వామనాలయమున కేగి మంగళనామ కైశికిచే నా దేవునిఁ గీర్తించుచుండెనని రాయల వర్ణన.

యస్తు గాయతి సంయుక్తం కైశికం విష్ణుసంసది
స తారయతి దుర్గాణి శ్వపాకో రాక్షసం యథా

యని కైశిక పురాణము చెప్పుచున్నది. ఇవిగాక రాయలు సంగీత శాస్త్రప్రసంగము తెచ్చి యందుఁ దనకుఁ గల విశేషమైన పాండిత్యమును సూచించిన ఘట్టము లింకను వనేకమున్నవి. సంగీతమున వలెనే రాయలు నృత్యమునఁగూడఁ గృతప్రవేశుఁడై యుండెననుటకు నిదర్శనములున్నవి. తృతీయాశ్వాసాంత పద్యములలో నొకదాన నాయన కృష్ణుఁడు కాళియాహిశీర్షముపై మత్తల్లి హల్లీసక నృత్యములఁ గావించెనని వర్ణించెను. హల్లీసకము మండలముగాఁ జేయఁబడు నృత్యమనియు నం దొక్కఁడు నేతయై యుండుననియుఁ గృష్ణుఁడును గోపికలును గావించిన నృత్య మట్టిదే యనియు హేమచంద్రుఁడు నుడివియున్నాఁడు.

వామదక్షిణ పాదాభ్యాం ఘూర్ణమానోప సర్పణైః
ఉద్వేష్టితాప విద్ధైశ్చ హస్తైర్మత్తల్లి దాహృతమ్

అని మత్తల్లి నృత్యము వివరింపఁబడినది.

రాయలకు సాముద్రికాది శాస్త్రములందున్న పరిచయముగూడ నాముక్తమాల్యదయం దెంతెంతేఁ బ్రకటితమగుచున్నది. మధురాపురమునందలి శూద్రులు నృపుల పదహాల రేఖలకెల్లఁ దమ భుజాగ్రహాలరేఖలే మూలములని చెప్పుదు సుజన భజనైక విఖ్యాతిఁ దనరియుండిరఁట! పాదిహాలరేఖలు మహాపురుష లక్షణములుగను విభవకారణములుగను బృహత్సంహితాది గ్రంథములందు వర్ణింపఁబడినవి. గోదాదేవి యవయవముల వర్ణించుపట్ల రాయలు సాముద్రిక శాస్త్రపరిజ్ఞానమును జక్కఁగా వెల్లడించెను. గోదాదేవి యూరువుల కట్టి శ్రీ గలవారి కరభములైనను (మణిబంధము నుండి కనిష్ఠాంగుళివఱకునుండు హస్తభాగము కరభము) దాస్యము చేయుననుటకు వానిపై వారు మోచు గొడుగులును గలశములును దార్కాణములని రాయలు వర్ణించెను.

మత్స్యాశ్వస్వస్తిక వేదికావ్యజన
కైశ్శంఖాత పత్రాంబుజైః
పాదేపాణితలేఽపి వాయువత
యో గచ్ఛన్తి రాజ్ఞీపదమ్.

అని బృహత్సంహితయే నుడువుచున్నది. గోదాదేవికిఁ జింతామయ నిద్రలందు సాయం సంధ్య యనెడి ప్లవగి కనఁబడి తాపము చేయఁగడంగెనని వ్రాసి రాయలు స్వప్నదృష్ట మర్కటము మంగళ సూచకమను స్వప్నశాస్త్ర మర్యాదను వెల్లడించెను.

స్వప్నే మయాయం వికృతోఽద్య దృష్టః
శాఖామృగశ్శాస్త్ర గణైర్నిషిద్ధః

అని సుందరకాండమున సీత యనిన వాక్యముగూడ నీ విషయమునే సూచించుచున్నది. అవతారికలో రాయలు తనకుఁ గలిగిన స్వప్నమును దండనాథులకును విప్రాదులకును వినిపింప వారు పద్మాక్షుఁడు స్వప్నమున సాక్షాత్కరించుట యత్యధిక భక్తిసూచకమని చెప్పి యింకను స్వప్నమునకు సంపూర్ణ వ్యాఖ్యానము కావించిరి.

దృశ్యతే భగవాన్ యస్య
స్వప్నే సర్వ శుభావహః
తస్మిన్నేవ దృఢా భక్తి
ర్జాయతే తస్య సంతతమ్

అను శ్లోకము వారి వ్యాఖ్యానమున కాధారమైనది. వసంతర్తు వర్ణనమున మాధవుకు పూచిన మావులను బూవిలుతోదున కమ్మెనని వర్ణించిన ఘట్టమున నాయన కళ్యశాస్త్రములోఁ గల పరిచయమును, మాలదాసరికథలో నొడ్డలికైనను బ్రాహ్మణునిఁ జంపిన శస్త్రమునకైనను బరుసవేది సమానముగా సువర్ణత్వము కలిగించునని వర్ణించు సందర్భమున నాయనకు స్వర్ణవిద్యయందుఁగల నమ్మకమును ద్యోతితము లగుచున్నవి.

ఆముక్తమాల్యదయందలి కొన్ని పద్యములలో రాయలకు రత్నపరీక్షయందుఁ గల నేర్పు వెల్లడియగుచున్నది. శరదృతువర్ణన సందర్భమున నాయన విష్ణు వాకాశమను తనపాదమునఁ బరివేషమనెడి యందెలోఁ గల సూర్యుఁడను పద్మరాగమున నొకప్రక్క శ్వేత మేఘావరణమను లసున పటదోషమును గనిపెట్టి యా యందెను దొలఁగించి పాలసముద్రమున మేల్కాని మహాలక్ష్మియను భాగ్యము నొందెనని వర్ణించెను. లసునపటమనఁగాఁ గెంపునందుండెడి దోషవిశేషము. ఆ దోషముతోఁ గూడిన కెంపు ధరించిన సిరి తొలఁగుననియు దానిని ధరింప మానిన సిరికలుగుననియు శాస్త్రము చెప్పుచున్నది. అందుచేతనే విష్ణువు దానిని దన పాదమునుండి తొలఁగించి లక్ష్మిని బొందినాఁడు. శరత్తున "యవసరాశి తతులు గిరులన వ్రథింకపతఁ" జెలంగుట నింగిలో మహా నీలమైన గరిమకుందగ బహుతృణగ్రాహియయ్యె నేమో యన్నట్లుండెనని రాయలవారి వర్ణనము. నీలము తృణగ్రాహి యగుట శాస్త్రసిద్ధము. ఈ విషయమునే చేమకూర వెంకటకవి "తృణముగా లోఁ జేయు నెంతటివానినీ నీలాల ముంగర నీలవేణి" యను పద్యభాగమున సూచించెను. దత్తిశాస్త్ర నిపుణులు "వజ్రం న కాభి రపి ధారయితవ్య మేవ పుత్రార్థినీభి రబలాభి" రని చెప్పుదురు దీనికి విరుద్ధముగా రాయలు గోదాదేవి బాహుపురుల వజ్రములుండెనని వర్ణించెను. ఆమె యప్పటి కింకను నవివాహిత యగుటచే నా శాస్త్ర మంతగా బాధింపదని యాయన తలంపు కావచ్చును.

కఫాదిదోషములచే జఠర వైశ్వానరుఁడు బలిమి చెడినచో వెలి మహౌషధము బలమిచ్చువిధమున దుష్టసచివుల స్థానమున యోగ్యుఁడును సమర్థుఁడునైన వాని నొకని నియమించినచో నతఁడు వారి నడఁచి రాజునకు సంపదఁ గలుగఁజేయునని రాజనీతిలో రాయ లొకచోట వర్ణించి యుండెను. మహౌషధ మనఁగా సొంటి. అది జఠరాగ్నిని ప్రజ్వలింపఁ జేయుట వైద్యశాస్త్ర ప్రసిద్ధియు, రాజాయుష్య పరతమై పాంగరాజ్యము నెత్తుగ హ్యాంగరాజ్య మెక్కయెత్తుగ నెసఁగవలెనను పద్యమునఁగల, "ధాతువుల్ దలిసి హేమాదులఁ గొని" మున్నగు ప్రయోగములచే రాయలవారికిఁ గల వైద్యశాస్త్ర పరిచయము తెలియుచున్నది. శరదృతు వర్ణనమున నాయన గాలిచే రేఁగియలలఁబడుచున్న పద్మపరాగము శరజ్జలజాక్షి కుండ మందలి సలిలంబు కల్మషం బడంగ మొగిల్విరి యొందఁ గాఁచుచో జలుకు నిశాకరజఃపటలి చెన్నువహించె నని వర్ణించెను. మధ్యాహ్నపు టెండలోఁ బసుపు పొడిని బావినీటిలోఁ జల్లిన దాని నీటికి మాధుర్య మబ్బునని వైద్యశాస్త్రము చెప్పుచున్నది. బ్రహ్మరాక్షస వృత్తాంతమందలి "కొంగవాల్గఱుకులం గుళులఁ బట్టుచు జబ్బలంటఁ గట్టిన విజ్ఞానరయు వా"రను పద్యభాగమున రాయలు తనకు శస్త్రవైద్యమునఁ గలుగు పరిచయమును వ్యక్తము చేసెను.

రాయల కలంకార శాస్త్రమునఁ గల పరిచయ మపారమైనది. ఆముక్తమాల్యదయందలి పద్యము లన్నియుఁ బ్రసిద్ధములైన యర్థాలంకారములం దేదో యొకదానికి లక్ష్యములైనట్టివే. మఱియు నతఁడు "భావధ్వని వ్యంగ్యసేవధి గాఁగ" సత్యావధూ ప్రీణనము చెప్పియుండెను. గోదాదేవి విరహావర్ణన సందర్భమున నాయన "నఖముఖోజ్ఝిత పరాఙ్ముఖ ముక్తబాష్పాంబుపటిమ దీపపుఁ జిటపటలు తెలుప" నను పద్యమున నక్రవిషాద వైవర్ణ్య నిశ్వాసాలస్య సాహస చాపల్యాది భావములను సూచించెను. ఆముక్తమాల్యదయందలి యాలంకారిక ప్రౌఢశైలియే యాయన కాశాస్త్రమునఁ గల సర్వతోముఖ పాండిత్యమును వ్యక్తము చేయుచున్నది. వసంతర్తువర్ణన సందర్భమున నాయన దోహదక్రియలను యథాశాస్త్రముగా వివరించెను. రాయలవలె గవి సమయముల నూతఁగొని యద్భుతములైన భావపరంపరల సృజించిన కవు లెందరో యుండిరి. తుమ్మెదలు సంపెంగల నొల్లకుండుట (V-16) నారాయణుఁడు వర్షర్తువు నిద్రించి శరత్తున మేల్కాంచుట (IV-139; 109) శరత్కాలమున నగస్త్యుఁ డాకసమున నుదయించుట మున్నగున వెన్నియో యిందుకు నిదర్శనములు.

రాయ లాముక్తమాల్యదలోఁ బ్రకటించిన లోకజ్ఞతయు సంప్రదాయపరిజ్ఞానమును నిరుపమానములైయున్నవి. వర్షర్తువునఁ గాదంబినుల యుమ్మనీరు తొరుగఁ గేకులు కేకలు వేయుట ద్విజత్వముచే నవి యారణ్యకధ్వని వినఁజేసి గర్భము సుఖద్యుతము చేయఁగడంగిన ట్లుండెనఁట! అరణ్యకముల నిండ్లలోఁ జెప్పరు. వానిని విన్న స్త్రీలకు గర్భస్రావమగునని సంప్రదాయము. ప్రసవబాధ యధికముగా నున్న తఱి విప్రులు వానిని బఠించినచో సుఖప్రసవమగు నని పెద్దలు చెప్పుదురు. శిశువులకుఁ గొంత వయస్సు రాఁగానే పాలపండ్లు రాలి స్థిరదంతములు వచ్చును. తరువాత వారికి గంభీరమగువాక్కు కూడ నబ్బును. ఈ విషయమునే రాయలు

కృతపయః పాన నవమేఘ పృథుకములకు
రాలె నొయ్యన వడగండ్ల పాలపండ్లు
మఱి బలాకా ద్విజాళి సంప్రాప్తికగ్గెఁ
దెరుగఁ జెరుగంగ ధ్వనియు గంభీరమయ్యె.

ననుపద్యమున సూచించెను. వసంతర్తు సందర్భమున వసంతలక్ష్మి తన యుదరమునఁబుట్టిన ధరణీజ సంతతికిఁగోరక దంతములు పొడసూపఁగా నే ప్రియుఁడైన మాధవునితోడి కూటమి మీఁదటఁ గల్గునని యెంచి చాల చెలంగెనని రాయలు కావించిన వర్ణనము లోకమున స్త్రీలు తమ శిశువులకు దంతము మొలచిన పిమ్మట వండియుఁ బురుషసంగమముఁ బొంది సంతసింతురను సంప్రదాయమున కనుగుణముగా నున్నది. గోదాదేవి ముఖమునకుఁ జంద్రకాంతి చౌర్యమును సడికట్టుటకు రాయలు సైరంధ్రులామె కన్నులకుఁ గజ్జలము దీర్చుచుండగా నామె ముఖము "తిత్థ్యాం చతుర్దశీనిశాన్త్యారేందుం" గనుటయే కారణమని సూచించెను. రాజనీతిలో నొకచోట నాయన కాలపృథువణిజ్న్యాయము (IV-239) నుదాహరించెను. శ్రీరంగమునందలి భాగవతులు విరక్తులు కావున "వలభి రత్నాంశువులఁ గట్టు తెలుపు చిత్రమునట కోర్వక దిగదిగ నరిగి ధావళ్య మనుగుదు"రఁట! చిత్రవస్త్రధారణము సదాచారము కాదని సంప్రదాయము. "ఉత్థాయ వాససీశుక్లే శుద్ధేశుపరిధాయ తు" ఇత్యాది పురాణ శ్లోకములును స్మృతులును గూడ నీయాచారమును బలపఱుచుచున్నవి. శరదృతువును వర్ణించుచు రాయలు క్రౌంచమునందలి హంసగ్రస్తహంసచ్ఛదాచ్ఛాదనానుభూతి చే హంస లయ్యెనని చెప్పి దానికి దాక్షమూడ గుప్త భుజగాళివాండములను దార్ష్టాన్తముగా సూచించెను. ఇట్టివి రాయలలోకజ్ఞత కుదాహరణము లగునట్టి వింకను నెన్నియో కలవు.

ఈవిధముగా నాముక్తమాల్యదలో రాయలవారికి వేదవేదాంగ స్మృతి శాస్త్రలోక సంప్రదాయాదులందుఁ గల కూలంకషమైన జ్ఞానము పెక్కుచోట్ల విదిత మగుచున్నది. ఇందుఁ జాలభాగ మాయనకు గ్రంథపఠనముచేఁ గలిగియుండవచ్చును; కొంత నిరంతర విద్వత్పరిషత్సంభాషణముచేఁ గలిగియుండవచ్చును. ప్రాచీనాంధ్రకవులలోఁ బలువురు వ్యుత్పత్తి భూషితులేయయ్యు రాయలవలె నింతగాఁ దమ గ్రంథముల దానిని బ్రదర్శించినవా రెందఱో లేరు. నిరుపమానమైన రాయల ప్రతిభ కపరిమితమైన వ్యుత్పత్తి యెంతో వన్నె చేకూర్చి యీతని కావ్యమున కనితరసామాన్యమైన ప్రౌఢిమ చేకూర్చెను.

---

# స్వాగతము



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఏది గతమైనదో భావి ఏదో వర్త
మానమేదో తెలియనీక మనసు నలమి
నను కలతపెట్టెడిని నిశలును పవళ్లు
పొగలు నగవులు కలగా పులగము సేసి,

కలలే వో-రాలిన ననల,
కలకల విడువిరుల కోరకాల గుముల నీ
డలె వేవో—నల్లని మొయి
ళులలా, పాలకడలిని నురుగుల తెరలలా!

లేత బొటవ్రేలి నవ మధురిమల మరిగి
కలలు గను కిసలయాధర తలములందు
తొలి ఉషస్సులలో తల్లి చన్దోయినుండి
రాలిపడిన పయస్సులు రావుమరపు!

ఏ నుడు రెండనో హృదయ
మెండిన మండు ఎడారిలో జరా
భీమయ మూర్తినై గళము
బీటలు వారగ దాహశాంతికై
ఆమని తేనెకై అరచు
నట్టి పరిస్థితి ఒక్క ఎందుకో
ఈమది మాటిమాటికి స్ఫు
రించును ప్రేయసి మోవి దాకగా!

ఏదో తెలియని అగాధాలలోబడు
సెలయేటి కెరటాల వలెని కొన్ని—
మన్నుపై కాలూని మిన్నుపై కేల్సాచి
విరిసిన హారవిల్లు సరణికొన్ని—
వానలో తమదారి వాసన పాడయి
చెదరెడు చీమల విధిని కొన్ని—
నిశ్శబ్దమనుకొను నిశిలోన అస్పష్ట
మహా శబ్దముల ముక్కలట్లుకొన్ని—

నివురు దుప్పటి కప్పుకు నిదురబోవు
వెఱ్ఱి నిప్పు గుండెలలోన జెఱ్ఱులట్లు,
ప్రాకుచున్నవి తలపులు పాములట్లు,
శిశిర కాలంపు లతలలో చివురులట్లు!
ఈ మనసులో సదా చలియించుచున్న
శబ్దరత్నాకరమున నిశ్శబ్దమైన
భావ బడబానల మొకటి పైకిలేచి
ఉద్ధతిని బొంది వివిధ శబ్దోర్మికలను
మరుగ బెట్టును—ఒకటొక టొరసికొనుచు
పైకి క్రిందికి అవి లేచి పడుచు కనలు!

ఒక రతనమ్ములో కులుకు
చున్నది చిన్నది పల్లపూస! మం
టికడవలో సుధాంబుధి న
టించుచున్నది!—

చక్రవర్తి ధరించు జలతారు బట్టలో
ఇన్నికోట్ల చినుగులెట్లు వచ్చె!
బిచ్చగాని కరాన వెలుగొందుచున్న దే
కమనీయ మణిరత్న కంకణమ్ము!
పగిలిపోయిన దేమి పరమాన్నమున కని
ప్రొయ్యిపై నిడ్డ ఈ క్రొత్తకుండ!
ప్రాణము లేదని పారవైచిన బిడ్డ
పెదవిపై ఏటికో పొదలు నవ్వు!
చింకిగుడ్డ నుండి కంకణమున నుండి
పెంకునుండి పెంకి పెదవినుండి
కదలివచ్చు మాయ కలలు, నీడలు—వింత
వింత వేషములను వేసికొనుచు:

నవ్వించుచు ఏడ్పించుచు,
కవ్వించుచు కుర్రదనపు కల్మషములపై
రువ్వుచు రాళ్లను పువ్వులు,
దవ్వుల నున్నట్లెయుండి దరినే కదలున్!

—అర్థమేమి? ఈ
శకలము లూహాలందుకొన
జాలని పూర్ణత నేదో అందు కొం
టకు జతనమ్ము సేయున? స్ఫు
టమ్ముగ నెన్నడో గోచరించునా?

# దాగిన కోరికలు ★ శ్రీ కాసుఖేల నరసింహరావు

నాకు కొన్ని కోర్కెలు మిగిలి పోయాయి. ఈ ఆఖరిక్షణాల్లో అవన్నీ అనుభవించాలనిపిస్తోంది. సాధ్యం కాదన్న విషయం నాకు తెలియకపోలేదు. కానీ, ఆ కోర్కెలు మిగిలిపోయేయ్ కదా అన్న బాధమాత్రం తప్పడంలేదు. నేనొక క్షయ రోగిని. శానిటోరియంలో వుంటున్నాను.

మానాన్న చాలా గడించి పోయాడు. ఆ డబ్బంతా నాకే సంక్రమించింది. ఏవిధంగా ఖర్చు పెట్టేవున్నా అడిగేవాడు లేడు. అయినప్పటికీ, ఏమిటో, ప్రపంచం ఒక్కనోటితో నా అంత మంచి వాడు లేడు అనాలని అదుర్దాపడేవాణ్ణి. ధర్మకార్యాలు, దానాలు తలపెట్టక పోయినప్పటికీ, ప్రపంచదృష్టిలో ఏవేవైతే కీడు, హాని, చెడు మొదలనువాటిక్రింద జాబితా చేయబడ్డాయో అనేవి కూడా నాదగ్గరకు రాకుండా చేసేసేను. కనిపించిన ప్రతివాడితోటి దయతో కూడుకున్న ఒక్కమాట, దాక్షిణ్యముతోనిండిన ఒక్క కార్యకలాపము, ప్రేమతో కూడుకున్న ఒక్క ఆలోచన సాగించేను. వీటన్నిటినీ, వట్టిమాటలుగానే కాకుండ, క్రియారూపకంగాకూడా సాగించకల్గేను. దాంతోటి ప్రతివాళ్లు నేనంటే ఎంతో మర్యాదగానూ, ఎంతో అభిమానంగానూ వున్నట్లు కనిపించేవారు. ఇంతకంటే ఏంకావాలి జీవితంలో అనుకునేవాణ్ణి. ఏమిటో, జీవిత పరమావధిని పొందినట్లే మురిసిపోయేవాణ్ణి.

ఊళ్లో అందరూకూడా నన్నింత మర్యాదగా చూస్తూవుంటే, వూళ్లో అందరికీ నేనంటే ఇంత గౌరవం వుండగా, వూళ్లోవున్న ప్రతి ఒక్కరూ నామీద అభిమానం వెళ్లబుచ్చుతూంటే, ఎందువల్లనో రామ్మూర్తిమాత్రం ఏవిధమైన భావమూ ప్రకటించేవాడుకాడు. చూడగా, అతనికి నామీద అభిమానము లేదు, ద్వేషమ్ము లేదు; ఆదరణ లేదు, నిరాదరణ లేదు; గౌరవము లేదు, తూష్ణీభావము లేదు; భయము లేదు, భక్తి లేదు; ఈర్ష్య లేదు, అసూయ లేదు; ఏలాటి అభిప్రాయమూ లేదన్న విషయంగా కనిపిస్తూంది, అతనికి నాగురించివున్న దృక్పథము.

అతనిలో కనిపించే ఆ భావశూన్యాన్ని చూచి నాకు కొంతకోపము, కొంతలజ్జ, కొంత అసూయ కలిగేయి. దాంతోటి రామ్మూర్తినిగురించి కొంత విచారణ చెయ్యక తప్పిందికాదు. తేలింది, ఏమంటే, రామ్మూర్తి ముండల ముఠాకోరు; త్రాగుబోతు; వ్యభిచారి; దొంగ; హంతకుడుకూడా నేమో అన్న సందేహము. అంటే సంఘదృష్టిలో అంతకన్న హీనుడు వుండడు. అంతకన్న నీచుడు ఉండడు. ఆ జీవితాన్ని ఏ వ్యక్తి చూస్తూచూస్తూ వరించడు.

రామ్మూర్తి జీవితాన్ని 'బాగు' చెయ్యాలన్న కోరిక జనించిందినాలో. అంటే రామ్మూర్తిని ఏకపత్నీవ్రతుడిగా, ఇంటిని అంటిపెట్టుకొని వుండే వాడినిగా, సంసారయాత్రే పరమావధిగా వుంచుకొనేవాడిలా తయారుచెయ్యాలనే కోరిక కల్గింది నాలో. ఆ కోరిక దినదినాభివృద్ధి చెందింది. అయితే, అతనితో ఏవిధంగా ఈవిషయాలు ప్రస్తావించడం? కోరికమాత్రం బలవత్తరమైపోతూంది. సరే, ఏమైతే అయిందనుకొని, ఒకరోజు రామ్మూర్తి కనిపించగానే పలకరించేను. అతనిలో ఏవిధమైన వివర్ణత కనిపించలేదు. నేను, నాఅంత మంచివాడు, నాఅంత మర్యాదస్థుడు హెచ్చరించేడే అన్న ఆశ్చర్యసంభ్రమాలుకానీ, సంతోషానందాలుకానీ, ఏవీ కనిపించలేదు. పైగా, ఏమిటో ఇదీ ఒక మామూలు విషయమే అన్న ధోరణి కనిపించింది, అతని ప్రవర్తనలో. నిజం చెప్పొస్తే, నాకే ఎందుకోసిగ్గు, భయం వేసుకొచ్చేయి. అయినా, ధైర్యాన్ని చిక్కబట్టుకొని, అతనితో మాట్లాడలన్నా. అక్కడే, ఒక చిన్న కాలవ వంతెన మీద కూర్చుందాం రమ్మన్నాడు. భయంభయంగానే వుంది. కానీ, నెత్తిమీద వేసుకున్నాక తప్పేదేముంది? రామ్మూర్తిని తన జీవితపంథాను మార్చుకోవలసిందిగా అభ్యర్థించేను. ఏం! అందరిచేత మంచి అనిపించుకోవలెనని ఎక్కడుందని అడిగేడు. అందరిచేత చెడు అనిపించుకోవడంలో తప్పు ఏమిటని అడిగేడు. పైన, ఈ మంచి చెడ్డలు ఏమిటని అడిగేడు. తరతరాలుగా ఒకవిధమైన ప్రవర్తన, సంఘములో అనేకమందికి లాభదాయకంగావుంటే దాన్నే మంచి అన్నారని, మరొకవిధమైన ప్రవర్తన అనేకమందికి నష్టదాయకంగా వుండేదాన్నే చెడు అన్నారని వాదించేడు. ఈవేళ నలుగురికి మంచిగా కనిపించిన ప్రవర్తన రేపు చెడుగా వుండొచ్చన్నాడు. అంతేకాదట. సంఘంలో అత్యధికులకేకాక, అల్పసంఖ్యాకులకూడా స్థానముండాలన్నాడు. నీకు, నీతోపాటు లోకంలో అధికులకూ ఏదైనా మంచిగావుంటే వుండవచ్చుకానీ, తనకు, తనతోపాటు మరిద్దరికి, అదే సమాచారము, అదేసంగతి మంచిగా కనిపించక పోవచ్చు. పైగా ఒక్కొక్కడిబుద్ధికి 'మంచి' అనేది పట్టకపోవచ్చట. ఉదాహరణగా, త్రాగుబోతు, త్రాగుడు చెడ్డ అలవాటని ఒప్పుకొనికూడా త్రాగడం మానేయకపోవచ్చట. ఏమంటే, త్రాగకపోవడం వాడినైజానికి విరుద్ధమట.

ఇంత దీర్ఘ ఉపన్యాసము ఇచ్చేసరికి నానోరు కట్టడి పోయింది.

ఆరోజునుంచీ, నేను, రామ్మూర్తి ప్రాణ స్నేహితులమయ్యాము. ఎక్కడ చూచినా మేమిద్దరమే. ఊరూరంతా విస్తుపోయింది. రామ్మూర్తి ఎంత మంచివాణ్ణి పాడుచేసేడు అనుకొనేవారే. నన్ను మాత్రం వేలెత్తి చూపెట్టేవారే లేకపోయారు. వాడితో, నాకు స్నేహం ఎలా కుదిరిందని అడిగేవారే. అయితే, మా యిద్దరి స్నేహితం, మాటల మాత్రంతోటే నిల్చిపోయింది. అంటే, అతని 'దుష్ప్రవర్తన' నాకుకానీ, నా 'సత్ప్రవర్తన' అతనికి కానీ అంటలేదు. ఇలా రోజులు గడుస్తూంటే, నాకు కొద్దిగా దగ్గు, జ్వరం ఆరంభించేయి. తగ్గిపోతుంది కదా అని మొదట్లో ఉపేక్షించేను. కాని, పోనుపోను అది క్షయ క్రిందకు దిగి, ఈనాడు రేపో, మాపో అన్నట్లున్నాను.

రామ్మూర్తి కన్పించకపోతే నాకు నిద్రపట్టడం లేదు. అంత హాయిగా మాట్లాడేవాడు. అతను మాట్లాడుతూవుంటే అమృతం ఒలుకుతూ వుంటుంది. మానవప్రవృత్తిని అతనికంటె చదివిచూచిన వాళ్ళు లేరని చెప్పాల్సిందే.

ఈ రోజుకి రామ్మూర్తి ఇంకా కన్పించలేదు. అబ్బ! మరీ ఆయాసంగా వుంది! ఏమో! నామట్టుకు నాకు, ఈరోజు నా ఆఖరిరోజు అనిపిస్తోంది. అయినా, ఇంకా రామ్మూర్తి రాలేదేమి చెప్మా? సాధారణంగా ఈవరకు వచ్చేవాడేనే? ఆ! అదుగో! రామ్మూర్తి వచ్చేడు! అయితే, అతని ముఖంలో, మామూలుగా రోజూ కన్పించే ఉత్సాహం, రోజూ కన్పించే ఉల్లాసం ఈ రోజు లేదు. పాపం, తన స్నేహితుడు ఈలోకాన్ని విడిచి వెళ్ళిపోతున్నాడని కాబోలు, ఆ దిగులు, ఆ విచారము.

"ఏం! రామ్మూర్తి! నే వెళ్లిపొయ్యే కాలం ఆసన్నమయిందనా, నీ దిగులు?" అ నడిగేను.

"కాదు" అన్నాడు.

నా మనస్సు చివుక్కుమంది.

కానీ, మళ్ళీ అడిగేను, "ఏం? అలాగున్నావు?"

"నాకు జీవితంయొక్క అర్థమేమిటో అగమ్యగోచరంగా వుంది. ప్రపంచంలో మంచి, చెడ్డలు లేవనుకున్నాను కానీ, వున్నాయి. అయితే, అందులో విచిత్రమేమంటే మంచితోపాటు కష్టాలు, చెడుతోపాటు సుఖాలు జతకుదరడమే. అసలు, ఆ సుఖాలతోటి జతపడబట్టే, చెడు అనేదానికి అంత విలువ, ఆ ఆకర్షణాశక్తి. 'సుఖం' అనే పదాన్ని ఏదో హాయినిగొల్పే శారీరిక పరిస్థితిని సూచిస్తూ వాడడం లేదు. కష్టసుఖాలు, అంటే మనం అనుకోకుండా, మనం వాటికోసం అర్రులు చాచకుండా, వాటంతట అవే, ప్రారబ్ధవశాత్తూ అంటామే, అలాగ తగులుకుంటాయే అటువంటి పరిస్థితులను సూచిస్తున్నాను. ఒకవిధంగా, దైవికంగా మనకు ఒరిగే కష్టసుఖాలన్నమాట. జబ్బుగా వుండడం, ఆరోగ్యంగా వుండడం, ఇలాటి కష్టసుఖాలన్నమాట."

"నువ్వు నా విషయాన్ని గూర్చి ఆలోచించడం లేదన్నావు?" అ నడిగేను.

"అవును. నిన్ను గూర్చి కాదు ఈ ప్రసంగం అంతా. నేను, ఈరోజు ఒక విలాసకత్తె దగ్గరకు వెళ్ళేను. ఆ మనిషిని చాలా ఏండ్లక్రిందట నాకు తెలిసివుండడం తటస్థించింది. మంచి ఆస్తికల కుటుంబములో జన్మ. గౌరవ మర్యాదలు, అంటే సంఘదృష్టిలో విలువకల ప్రతియొక్కటి ఆ కుటుంబ జీవనములో జీర్ణించిపొయ్యాయి. తల్లిదండ్రులకు ఒక్కటే కూతురు. దీనికి పెండ్లియీడు వచ్చినా, తండ్రి పెళ్లి చెయ్యలేదు. తల్లి చిన్నప్పుడే పోయింది. ఆ ఒక్క కూతురికి, దానికి నచ్చిన వరుడికిచ్చి పెళ్ళిచెయ్యాలని తండ్రికోరిక. ఆ కోరిక నెరవేరకుండానే ఆయన కూడా పరమపదించేడు. ఆ పిల్ల, ఈ వృత్తికి దిగింది. బస్తీలో బస. బాగా డబ్బు గుంజుతూంది. అడిగేను, ఏ పిల్లా తయారయ్యేవని. డబ్బుకోసం కాదు. ఏదో కోరిక పుట్టింది. ఆ కోరిక తీర్చుకోవాలని అంది.

ఇది ఇల్లావుంటే, ఆ వీధిలోనే, ఆ యింటికెదురుగ్గానే ఒక ఇల్లాలు, పాతివ్రత్య ధర్మాన్ని పాటిస్తూ జీవితం గడిపింది. జబ్బుచేసింది. రేపో మాపో అన్నట్లుంది. అత్తకుగాని, మామకు కానీ, ఆఖరకు మొగుడికికూడా దయాదాక్షిణ్యాలు లేవు. ఆ శరీరాన్ని – ఇంకా చావలేదు సుమా – మండుటెండలో పారేసేరు. అదీ చూచేను. ఏమిటి, ఈ జీవితరహస్యము? ఈ సాంఘిక వడివడి? ఈ మంచి చెడ్డల తారతమ్యము?" అని ముగించేడు.

నాలో కోరికలు ప్రబలేయి. సుఖించకుండానే జీవితాన్ని నాశనం చేసుకున్నానే అన్న పశ్చాత్తాపము కల్గింది. రామ్మూర్తి గడిపిన జీవితంలో ఒక్క క్షణం ఇవ్వమని భగవంతుణ్ణి ప్రార్థించేను. ఇంతలో తిరాలున జ్ఞాపకానికొచ్చింది. ఆఖరకు సిగరెట్టయినా త్రాగలేదని. రామ్మూర్తిని సిగరెట్టు ఇవ్వమన్నా. అందిచ్చేడు. వెలిగించమన్నా. వెలిగించేడు. ఒక్కమారు బాగపీల్చేను. అబ్బ! కండ్లు తిరుగుతున్నాయి. ఆ! ఎక్కడికో వెళ్తున్నా! ఎక్కడికో? ఎక్కడికో?

# శ్రీ ప్రమోదకుమార చటోపాధ్యాయ



శ్రీ వేలూరి రాధాకృష్ణ

ఆంధ్రలోకం ఎవర్ని ఎరిగున్నా ఎరిగుండక పోయినా, ప్రముఖ కళాకోవిదుడు శ్రీ ప్రమోద్ కుమార్ చటోపాధ్యాయ గారిని ఎరిగి ఉంటం సహజమే, ఎందుకంటే, ఆంధ్రావనికి వచ్చి విస్మృత కళాప్రపంచాన్ని మేల్కొల్పింది ఆయనే కాబట్టి! ఆయనను ఆంధ్రప్రముఖులు బందరులో స్థాపించిన ఆంధ్ర జాతీయ కళాశాలకు ఆచార్యులుగా ఆహ్వానించి నియమించారు. ఆయన కళాబోధనవల్లనే అంతవరకూ నిద్రితమైన కళాతృష్ణ మళ్ళా అందరిలోనూ ప్రజ్వలితమైంది. అందుమూలంగానైనా శ్రీ ప్రమోద్ బాబూను పునఃసంస్మరించుకోటం అప్రస్తుతం కాదనుకుంటాను.

శ్రీ ప్రమోద్ బాబూతో నాకు పరిచయం కలిగింది 1947 ఆగస్టులో మాచెర్ల గ్రామాన. నేను అప్పుడే శాంతినికేతనంనుంచి, శ్రీ నందాబాబూ వద్ద ఒకమాసం 'ప్రత్యేక విద్యార్థి'గా ఉండి తిరిగి ఆంధ్రదేశం వచ్చాను. అప్పటికే శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు, ఆంధ్రుల తరఫున, శ్రీ ప్రమోద్ బాబూనే, నూతన కళానికేతనానికి ఆచార్యులుగా తగినవారని కలకత్తానుంచి ఆయనను నాగార్జున కొండకు రప్పించారు. నేనది విని నేరుగా మాచెర్లకే వారి దర్శనార్థమై వెళ్లాను. పచ్చని పసిమిచన్నెగల దీర్ఘకాయుడు. ఖద్దరు వస్త్రధారి. ఆయన నన్ను నిజంగా ఆకర్షించారు. గాంధీ టోపీ ధరించి సాయంకాలం వాహ్యాళికోసం అప్పుడే బయలుదేరారు. ఆయనలో జాతీయత ముమ్మూర్తులా మూర్తీభవించిందని నాకు తోచింది! మా తండ్రిగారుకూడా, ఆయనవద్ద, 1925-26 సంవత్సరంలో తొమ్మిది మాసాలపాటు బందరులో ఆంధ్రజాతీయ కళాశాలలో స్వర్గీయ, అడవి-బాపిరాజు గారు మొదలైన ప్రముఖులతోపాటు కళాభ్యాసం చేయటంమూలాన మా తండ్రిగారిని శ్రీ ప్రమోద్ బాబూ బాగా ఎరిగిఉన్నవారు. శ్రీ గుఱ్ఱం మల్లయ్యగారుకూడా నన్ను 'ఫలాని వారి కుమారుడను' అనే ఆయనకు ఎరుకపరచారు. వెంటనే ఆయన అమితమైన ఆనందంతో 'నీవు రామమూర్తి కొడుకువా!' అని ఇంగ్లీషులో అంటూనే నన్నాలింగనం చేసికున్నారు! దానినిబట్టి నా తండ్రిగారు ఆయన హృదయంలో ఏవిధంగా అగ్రస్థానాన్ని ఆక్రమించుకున్నారో తెలిసికొని మురిసిపోయాను.

తరువాత నేను ఆయనను 1949 మార్చిలో కలకత్తాలో వారి స్వగృహంలో కలుసుకున్నాను. అప్పటికే ఆయన ఆంధ్రదేశం వదలివచ్చేసి రెండేళ్ళయిందని చెప్పగా విని ఎంతో విచారించాను. ఆయన నాగార్జున కళానికేతనాన్ని వదలిన వెంటనే, అది పూర్తిగా విస్మృతమై, నిర్జీవమైపోయిందని వింటానికి కూడా చాలా విచారించాను.

శ్రీ ప్రమోద్ కుమార్ చటోపాధ్యాయ, బాల్యంలోనే కలకత్తాలో ప్రభుత్వ కళానికేతనంలో చేరి, కళాభ్యాసం చేశారు. ఆ అభ్యాస సమయంలోనే, మనుష్యుల ముఖచిత్రాలని రచించటంలో చాలా ఉత్సాహాన్నీ నేర్పునీ కనబర్చారు. కేవలం ముఖకవళికలే కాకుండా, ప్రతివ్యక్తిలోనూ ఉన్న వ్యక్తిగత విశేషాలనికూడా అతి నేర్పుగా, ఆయన రచనలో తీసికోరాగల్గిన ప్రజ్ఞా, ప్రత్యేకతా చూపించగల్గారు. ఆ ప్రత్యేకతే, ఆ నైపుణ్యమే ఆ కాలంనుంచీ, ఆయన ఇప్పటి వృద్ధాప్యంలో కూడా ఆయనకు ఆయనే సాటిగా నిలబెట్టినవి.

శ్రీ ప్రమోద్ బాబూ బాల్యందాటి, యౌవనప్రారంభదశలో నుండగా కుటుంబంలో ఒక విషాదమైన సంఘటన ఆయనను ఒక్కమాటుగా దేశసంచారిగా మార్చినది. ఆ వైకల్యంలో కూడా ఆయన సంచారాన్ని వృథాపోనీయలేదు. ముఖ్యంగా ఆ సమయంలో ఆయన సంచరించింది హిమాలయ పర్వతాలలో. ఆయనకక్కడే ప్రకృతిశోభతో నిక్కటమైన పరిచయం కలిగింది. ఆయన సంచారమే చాలాకాలంవరకూ స్థిరవిధానంగా చేసికొని, ప్రకృతినే ఆరాధిస్తూ ప్రకృతినే చిత్రిస్తూ కాలం వెళ్లబుచ్చారు. ఆయన హిమాలయ ప్రాంతాలలో నున్న ప్రముఖ పుణ్యక్షేత్రాలనన్నిటినీ చూచారు. అందులో ముఖ్య

హైమవతి, మానస సరోవరం, కైలాసం. ఇవి భువనైక స్వర్గధామాలుగా ప్రతీతియే కదా. ప్రతి హిందువూ ఆ పవిత్రస్థలాలని చూడాలని అభిలషిస్తాడు. చాలా మందికి అది తీరనికోరికగానే నిలిచిపోతుంది. ఆ రెండు పవిత్రస్థలాలనీ ఆయన ఎంతో సహజంగా, పవిత్రతతో చిత్రించారు. ఆవిధంగా దర్శించిన ప్రతి దృశ్యాన్నీ స్థలాన్నీ ఆయన కుంచెతో, ఒక దినచర్యగా రచించారు. కేవల దృశ్యాలే కాకుండా, అక్కడ వసించే మానవుల ప్రత్యేకతనీ, వారి విశిష్టలక్షణాలనీ, ఆయన చిత్రాలలో మూర్తీభవింపజేశారు.

ఆయన ఎక్కువకాలం టిబెట్టు ప్రదేశంలోనే నివాసం ఏర్పాటుచేసుకొని టిబెట్టులోని జనాన్నే చిత్రించి, వారిదైనందిన చర్యలలో ఏకమైపోయారు. ఇప్పటికీ ఆయన చిత్రాలలో ఆ ప్రత్యేకత గోచరమవుతూనే ఉంటుంది. ఆయన చిత్రాలలోనే కాకుండా రచనలతో కూడా, ఆయన యాత్రాజీవితాన్నీ అప్పటి మన సారస్వతాన్నీ అలంకరించారు. ఆయన ఆ యాత్రారచనలనీ, చిత్రాలనీ ఒక గ్రంథంగా కూడా ప్రచురించారు. దాని పేరు ఆయనే "అమిజాత్రి" అని చెప్పినట్లు (నేను యాత్రికుణ్ణి) అని చెప్పినట్లు బాగా జ్ఞాపకం. ఆయన నిరంతర యాత్రాప్రభావమే ఇప్పటి ఆయన నిత్యజీవితంలో కూడా గోచరమవుతూంటుంది. ఆయనకళలో ఉన్న ప్రత్యేకత కూడా అదే. ఆయన ప్రదర్శించిన భావం, ఎంతో ఆధ్యాత్మికంగా నిగూఢంగా, అవాఙ్మానస గోచరంగా ఉంటుంది. మహాభక్తుడు కూడా కావటం మూలాన, టిబెట్టుప్రదేశం ఆయన పరచింతన సాధనకు ఎంతో అనుగుణంగా కనిపించింది. అక్కడే బహుకాలం ధ్యానముద్రలో యోగసాధనలో గడిపారు. అక్కడ ప్రకృతిసిద్ధంగాఉన్న అతిశీతల వాతావరణంకూడా ఆయనను చలింపచేయలేకపోయింది. అక్కడున్న దరిద్రం ఆయనకు స్వర్గధామంగా తోచింది. అక్కడున్న అనారోగ్యం ఆయనను బాధపెట్టలేదు. ఆ ప్రదేశమే స్వస్థలంగా చేసికొని ఇక అక్కడే చిరస్థాయిగా ఉండేటంతగా ఆధ్యాత్మిక చింతతో యోగసాధనలో మునిగి పోయారు.

కాని అకస్మాత్తుగా ఆయనలో ఒకనాటి సుప్రభాతాన, ఒకవిధమైన సంచలనం కలిగింది. ఆ సంచలనమే, తిరిగి తన స్వస్థలానికి తీసికొచ్చింది. మళ్ళా తన సాధనలో పెట్టింది! తన బంధువులతో పరిచయం చేసింది!

సంచార కార్యక్రమంలో మునిగిపోకముందు, ఆయన ముఖచిత్రణంలో ప్రత్యేక నైపుణ్యాన్ని చూపించి జనాన్ని సమ్మోహన భరితుల్ని చేసి నవ్వాకు, కలకత్తాలో మరిరొక సంచలనం క్రొత్తగా లేవదీయబడింది. అదే హావెల్, అవనీంద్రుల సంయుక్త కృషి. దానికి శ్రీ ప్రమోద్ బాబు ఏమాత్రం సుముఖంగా లేరు. మళ్ళా పూర్వసాంప్రదాయంలోనే, భారతీయకళను సాధనచేసేందుకు జరిగే ప్రయత్నాలు, ఆయనకు కేవలం పేలవంగా కనిపించినవి. ఆయన అందువల్ల, అవనీంద్రుల బృందంతో కలవకుండా విడిగానే ఉండిపోయి, ఆయనకు నూతనమనీ, అభ్యుదయదాయకమనీ తోచినట్లు, ప్రతిప్రచారం చేయ నారంభించారు. ఆయనకు పాశ్చాత్య కళాకారుల్లో ప్రముఖులైన, టీషియన్, వెలాస్క్వెజ్, మొదలైన కళాకారులు బాగానచ్చారు. వారి పద్ధతిలో భారతీయకళను సమన్వయంచేసి ఎందుకు సాధనచేయకూడదని ఆయన వాదన.

దీనికి వ్యతిరేకంగా ఆయన సంచారానంతరం ఇంటికి తిరిగివచ్చింతరువాత, ఆయన భావాలే పూర్తిగా మారిపోయినవి. అప్పటికి ప్రస్తుతమైన, భారతీయమైన కళను అభినందించి, తీవ్రరూపంగా సాధనచేయటం ప్రారంభించారు. క్రొత్త ఉత్సాహంతో, సరిక్రొత్త ఊహాలతో చిత్రాలని రచించారు. భారతీయకళలో ప్రధానమైనవది, భావాన్ని, ముద్ర, చిహ్నలద్వారా సూచనా మాత్రంగా అభివర్ణించి, ఆ నట సత్యాన్ని, ప్రగాఢంగా చూపరుని చింతనా ప్రజ్ఞకు వదలివేయుటమని ఆయన తెలిసికున్నారు. మన భారత భాగవతాది పురాణాలలోని భావాలు, ఆధ్యాత్మిక కథలు ఇవన్నీ, ఆయనలో ఒక వినూత్నమైన ఉద్రేకాన్ని కలిగించినవి. మన భక్తి కారణాలైన దైవతిహాసాలన్నింటినీ, పునఃచిత్రీకరించి వాటిలో క్రొత్తజీవం పోద్దామని నిశ్చయించారు. నిజమైన ఆధ్యాత్మిక చింత కలిగి ఇతరప్రముఖులవలె, తనూ కళాకారుడుగా ప్రపంచానికి అందజేయవలసిన సందేశం, ప్రత్యేకంగా ఉందని గ్రహించి తనూహించినరీతిన, దేవతలనీ భారతవీరులనీ చిత్రించ నారంభించారు.

ఆయన చిత్రించి ఆవిధంగా ప్రపంచానికి అందజేసిన సందేశం 'చంద్రశేఖర' అనే చిత్రం ద్వారా నిరూపించిన దైవేతిహాసం. ఆచిత్రం నిజంగా

పాటిలేనిది! ఇది చెన్నపట్నంలో అడయారులోని థియసాఫికల్ సొసైటీ తాలూకు ఆర్టు మ్యూజియమ్‌లో ఉంది. ఆ వర్ణసంకలనంలోని ప్రత్యేకత ఆ రేఖాగతిలోని సౌకుమార్యం, ఆ ముఖంలో తీవ్రమైన ధ్యానముద్రను సూచించే నైపుణ్యం, ఇవన్నీ కలిసి ఆ చిత్రాన్ని పాటిలేనిదిగా చేసినవి. దీనిని బాగా ప్రచారంలోకి తీసికోవచ్చింది ప్రసిద్ధకళావిమర్శకుడు జేమ్సు ఎచ్. కసిన్సు. ఈ చిత్రం ప్రపంచంలో, అన్ని ప్రముఖ ప్రచారవార్తాసంచికల్లోనూ ప్రచురితమైంది. దానికి కసిన్సు ప్రత్యేకమైన విశిష్టవ్యాఖ్యానాన్నిచ్చి, దానిని అత్యున్నతస్థాయిలోకి తీసికొవెళ్ళారు! శ్రీ నందాబాబూ చిత్రించిన 'శివ' అనే చిత్రం సిస్టర్ నివేదిత వ్రాసిన అభిప్రాయాన్ని బట్టి ప్రదర్శించినది. దాని ప్రత్యేకత వేరు. దాని విశిష్టత వేరు. దాని కదేసాటి దీనికిదే సాటి.

అవిధంగా శ్రీ ప్రమోద్ బాబు అనేక ఇతిహాసాలనుంచి భావాలను తీసికొని చిత్రించారు. అందులో 'పురుషుడు-ప్రకృతి' ముఖ్యంగా పేర్కొనదగింది. పురుషుడు కుంటివాడు ముసలివాడు. ప్రకృతి సౌష్ఠవంగా ఉన్నప్పటికీ అంధురాలు. పురుషుణ్ణి, ప్రకృతి తన బుజాలమీద మోస్తూంటుంది. పురుషుడామెకు త్రోవ చూపుతాడు. పురుష ప్రకృతులు అవినాభావసంబంధం కలవి. నిజానికి ఈ రెండూ రెండు ఉదాత్తభావాల వ్యక్తీకరణ. ప్రకృతికి శక్తిలేనిదే సృష్టి లేదు. శక్తికి ప్రకృతిలేనిదే సృష్టి లేదు. ఈ రెండు భావాల కలయికవల్లనే సృష్టి జరుగుతోంది. అదే శ్రీ ప్రమోద్ బాబు ఆయనచిత్రంలో ప్రదర్శించింది. ఆయన రచించిన మరికొన్ని ఆధ్యాత్మిక చిత్రాలు చాలా అగ్రస్థాయిన ఉంచదగినవి. 'లక్ష్మి' 'దుర్గ' 'శారద' ఇందులో ఒక్కొక్క దానిలో ఒక్కొక్క ఉదాత్తభావం వ్యక్తీకరింపబడింది. ధర్మార్థ కామ మోక్షములనే నాలుగు విశిష్టభావాలూ నాలుగు వినుగు రూపాలు గల మేఘాలలో ప్రతిబింబింపబడినవి. ఆ మేఘాలు జీవితమనే వర్షాన్ని లక్ష్మీదేవిపై కురిపిస్తవి. ఇది మొదటిచిత్రంలోనే ప్రదర్శన. ఇక రెండవదైన 'దుర్గ'లో శక్తికీ విషయానికీ కల సంఘర్షణ బాగా విశదీకరింపబడింది. ప్రపంచంలో ఉండే దౌష్ట్యాన్నంతనీ, మహిషరూపంలో పెట్టి, శక్తి దుర్గ రూపంలో హతమార్చటం ఇందులో చూడవచ్చును. ఇది చాలా ప్రఖ్యాతి చెందిన భావమైనా, ఇందులో శ్రీ ప్రమోద్ బాబు ప్రత్యేకమైన సౌశీల్యం గమనింపదగింది. మూడవదైన 'శారద'లో ఐహికమైన విషయాలనుంచి ఆధ్యాత్మిక చింతద్వారా విముక్తిని పొంది, ఆత్మ, పరమాత్మ సన్నిధానాన్ని పొందటం ప్రదర్శింపబడింది. 'శారద' ఆంధ్రులకు చాలా పరిచయమైనదే. ఆయన ఆంధ్రదేశంలో ఉన్న సమయంలో, ఈ ఉదాత్తభావాన్ని మూర్తీభవింపజేశారు. ఆయనచిత్రాలలో మరికొన్ని 'ఉష - వరుణులు' 'మానసదేవి' 'గాయత్రి' 'చిత్రగుప్త' 'ఇద్దరు అశ్వనులు' మొదలైనవి చాలా ప్రశంసింపదగిన చిత్రాలు.

ఇక శ్రీ ప్రమోద్ బాబు రచించిన భారతవీరుల చిత్రాలలో ఎన్నదగినదీ జగద్విఖ్యాతి గాంచినదీ, 'సామ్రాట్ అశోక'. ఈ చిత్రం ఇండోరు మహారాజుకు సమర్పింపబడింది. ఇది ఆయన చిత్రాలలో అత్యుత్తమమైనదిగా పేర్కొనవచ్చును. ఆ అశోక చక్రవర్తి సర్వాభరణాలంకృతమైన స్వర్ణసింహాసనం ఎదుటగా కూర్చొనియుంటాడు. అతని ఖడ్గము అవ్యక్తంగా ఒదిలివేయబడి, ప్రక్కగా వ్రేలాడుతూంటుంది. అతనిముఖంలో అతిగంభీరమైన విచారం సువిదితంగా గోచరమవుతుంది. అదియొక మహాద్భుతమైన క్షణము. అశోకుడు కళింగులను గెలిచి, వారి నందరినీ హతమార్చి, విజేతగా తిరిగి స్వనగరం చేరుతాడు. ఆ సమయంలో అశోకుని పరితాపము శత్రువులను అంతులేకుండా హతమార్చినందుకు తీరని చింత, అతని ముఖంలో ప్రతిబింబిస్తుంది. ఆ క్షణంలో మళ్ళా సింహాసనాన్ని అధిష్ఠించటమా లేక విసర్జించి బౌద్ధమతాన్ని ఆలింగనం చేయ్యటమా అనే సమస్యలోని చింత! ఆ ఘట్టాన్ని శ్రీ ప్రమోద్ బాబు అతి నిపుణతతో చిత్రించారు. ఇలాటి మచ్చుతునకలు ఆయన కుంచెలోనుంచి చాలా వచ్చినవి.

ఆంధ్రలోకంలో ప్రఖ్యాతినిగడించి ఆయన ప్రత్యేకతను వెల్లడించిన శ్రీ ప్రమోద్ బాబు, ఇప్పుడు మళ్ళీ, జీవికకై, తను చిన్నతనంలో, ఒదిలివేసిన ముఖచిత్రలేఖనాన్ని ప్రారంభించి, కాలం వెళ్ళదీయవలసి వచ్చింది.

భారతప్రభుత్వం ఇలాంటి ప్రముఖ విశిష్ట వృద్ధ కళాకారులకు గౌరవ వేతనాలను ఏర్పాటుచేసి భారత జాతి గౌరవ ప్రతిపత్తిని నిలవబెట్టవలసిందిగా హెచ్చరించటం నేను విధిగా భావిస్తున్నాను.

# ఊర్వశీ!



మూలం :
రవీంద్రనాథ ఠాకూర్

అనువాదం :
శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి

మాతా నాసి న కన్యకాసి న వధూ ర్నాసి స్వయం సుందరీ
రూపేణాఽప్రతిమేన నందనవనే వాసస్త్వయా స్వీకృతః
సంధ్యాయాః పతనే చ శాద్వలతటే కృష్ట్వా సువర్ణాంచలం
దీపాన్ శ్రాంతతనుద్యుతి ర్న రచయే స్సాంధ్యాన్ గృహాణాం పురః

పద్భ్యాం శంకాజడాభ్యా మతిశయ విలసత్కం ప్ర వక్షస్స్థలాభ్యా
నమ్రైర్దృష్టైర్విలాసై స్స్మిత హసితముఖై ర్లజ్జయా త్వం నిశీథే
నిస్తబ్ధే కేళికాన్త్యై న విశసి భవనం నాంశుకం స్మేరవక్త్రే
కుర్యాస్తుల్యోషసా త్వం విచరసి భువనేఽకుంఠితా స్వైరగత్యాం

వృన్త హీనసుమవత్ స్ఫుటతాం త్వం ప్రాప్య యౌవన మనోజ్ఞలతాయాం
ప్రస్ఫుటాఽసి సమయే కిల కస్మిన్ ఊర్వశి! ప్రథితరూపవిలాసే

ఆదిమే కిల వసంతవిభాతే ఉత్థితాసి మథితోదధి మధ్యాత్
వ్యస్య దక్షిణకరేఽమృతపాత్రం దక్షిణేతరకరే విషభాండం

యత్పాదాంభోజసీమా ముదధిరయ మహో! భ్రాంతకల్లోలభంగైః
మాహాత్మ్యం నీయమానో వ్యపగతమహిమా సేవతేఽయం ఫణీశః
మన్త్రైః క్ష్వేళాపహార ప్రణుతమహిమభిః పాతయన్ శీర్షలక్షం
కుందస్వచ్ఛ ప్రభాసా సురపతి వినుతా శోభసేఽనిందితా త్వం

ఆసీ ర్బాలా కదాపి త్వమిహ? మహిమయు గ్యౌవనం శాశ్వతం తే
కస్యాఽగారే విశాలే కిము రమణి! మణిస్తోమముక్తామయై స్త్వం
క్రీడ ద్రవ్యై రనైషీ ర్లలితశిశువయో బాలకేళీవిశేషైః
సింధౌ వేళాకినీ త్వం నివససి నిబిడధ్వాంతపూర్ణోదరేఽస్మిన్

దీప్తై ర్మాణిక్యరూపై రనపగత విభారూషిత ద్వారదేశైః
కల్లోలప్రోదగీతై రపగత మలిన స్మేరవక్త్రాబ్జశోభా

పర్యంకే విద్రుమాణా మధిగతశయనా యాసి నిద్రాం నిశాయాం
శ్చాపి త్వం కస్య వాంకం సముపగతవతీ తుల్యజన్మా జగత్యాం

అస్మిన్ తావ ద్భవత్యా జగతి కృతమహో జన్మ యస్మి న్ముహూర్తే
తస్మి న్నేవ ప్రభూతే తవ లలితతనౌ యౌవనం పూర్ణభావః
విశ్వం ప్రీణాన్యజస్రం బహుయుగ మహితా త్కేవలం దీర్ఘకాలాత్
శోభాం పుష్ణా స్యపూర్వాం వినుత మహిమభా గూర్వశి! ప్రేయసి! త్వం

ధ్యానే భంగ మవాప్య మౌనినికరా స్తే పాదమూలే ఫలం
స్వేహాం ధ్యానసమాధిరూప తపసా మాయత్త మాతన్వతే
ఆఘూర్ణైః కఠినైః కటాక్షవితతే స్తైద్య త్రిలోకీ జనః
చాంచల్యం సముపైతి యౌవనదశాయత్త స్వశక్తి ర్ధ్రువం

దేహా న్మోహనగంధ మంధపవన స్తే దిక్తటే ష్వాదరాత్
సమ్యక్ప్రాపణసేవయాధిగమిత స్త్వద్దాసతాం సుందరి!
ముగ్ధాస్తే కవయోఽపి మత్తమధులి ట్సామ్యం వహన్తో భృశం
గాయన్తోఽనుసర న్తి తావకతనౌ సౌందర్యపానేచ్ఛయా

విన్యాసై ర్మధురైః పదాంచ, నినదైః పాదాంగదానాంకలైః
నిర్యాస్యాకుల చీరికాంచలమనోరమ్యా తటిచ్చంచలా
మధ్యే దేవసభం కదా పులకితై రంగై స్సముల్లాసిసీ
కుర్యాః నృత్య మహో! విలోలసుతనూ కాంతోర్వశి! బ్రూహి మే

ఛందసి ఛందసి సాగరమధ్యే, నృత్యతి నృత్యతి వీచిసమూహః
నస్య శిరోభి ర్వసుధా కాంతా వస్త్రదశాంచల మంచతి కంపం

హారా త్త్వత్స్తనమండలాన్తరగతా స్తారాః పత న్త్యంబరే
స్వాత్మానం రహయ త్యురస్థంగతం చిత్తం నరాణాం క్షణం
నృత్యం రక్తపరంపరా వితనుతే తత్రత్య నాడీగణే
దూరా ద్భ్రశ్యతి దిక్తటేషు రశనా త్వన్మధ్యతోఽసంవృతే!

స్వర్లోకోదయపర్వతే త్వముషసో మూర్తింగతా శోభసే
మోహం కల్పయసి త్రివిష్టపజుషా మూర్వ శ్యగాధం హృది

లోకస్యాశ్రుపరంపరాభి రనిశం ధౌతా త్వదీయా తనుః
రక్తేనైవ హృదో జగత్ప్రియజుషాం తేఽంఘ్రిద్వయం రంజితం

వేణీం విముచ్య వసనేన వినా కృతాత్వం - విన్యస్య పాదకమలం వికచారవిందే
విశ్వప్రియేఽతి లఘుభారతయాఽఖిలస్య-హృత్సర్గధామ్ని కురుషేఽఖిల విభ్రమాంస్త్వం

తచ్ఛ్రూయతాం సకలదిక్షు భవన్నిమిత్తే - ఆక్రందనాని విసరన్తి దివో భువశ్చ
హే నిష్ఠురే బధిరతాం కిము యాసి తన్వి! - ఊర్వశ్యనుగ్రహ ముదీర్ణకృపే! కురుష్వ

ఆవర్తతే కిము పున స్స యుగః పురాణః? - ఉత్తిష్ఠసి త్వమపి కిం పున రబ్ధిమధ్యాత్?
సిక్తై శ్శిరోజనికరైః ప్రథమప్రభాతే - ఆద్యాం తనూం ప్రకటయే ర్యది చిత్ర మేతత్!

సర్వాంగమేవ భవదీయ ముపైతి కంపం - ఆఘ్రాత మాప్య సకలాఙ్ఘ్రిస్పృశాం చ యస్య
చ్యోతన్తి వారికణికా నయనా దకస్మాత్ - క్షోభం ప్రయాతి జలధి ర్నవగీతభంగైః

నాయాతి నైతి చ పున స్సమయోఽప్యతీతః - అస్తంగత స్సభగవా న్హి మానచంద్రః
అస్తాద్రివాస రసికోర్వశి! తత్త్వ మేతత్ - వాసంతకాల రసవైభవ మత్ర చిత్రం.

కేషాం శ్వాసపరంపరా విరహిణాం దీర్ఘత్వ మాపాదితా
వాసంతోచ్ఛ్వసితైః ప్రహర్షజనితై స్సంసర్గిణీ వీజ్యతే?
ఆశాసు ప్రసృతే చ పౌర్ణమనిశి జ్యోత్స్నావితానే స్వయం
వేణుం హా స్తనివేశితామల మసౌ దూరస్మృతి ర్వాదయేత్

బాష్పప్రవాహ మియ మద్య గతస్మృతి శ్శ్ర-సంపాతయ త్యవిరతం నయనద్వయేఽస్మిన్
ఆశా తథాపి నహి నశ్యతి జాగరూకా - ప్రాణస్య రోదనబలా దనిబంధనేఽద్య.

(శ్రీ గోపాలరెడ్డిగారి తెలుగు అనువాదానికి కృతజ్ఞతతో - రచయిత)






'ఆరుద్ర'



[అధివాస్తవిక కల్పన]

### ప్రస్తావన

కథకుడు : ఈ ఊరులోని, ఒకానొక పార్కులోని రాతిబెంచి ఒకటి రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుంది. నమ్మండి. మరోసారి చెప్తా. ఈ ఊరులోని, ఒకానొక పార్కులోని రాతి బెంచీ ఒకటి నాతో రోజూ మాట్లాడుతూ ఉంటుంది. నేను పొరబడటం లేదు. పార్కు బెంచీ ఏమిటి మాట్లాడట మేమిటి అని మీరు కొట్టిపారేయకండి. పార్కు బెంచీ కూడా మాట్లాడగలదు.

కదలికఉన్న మానవుడు, కదలిక లేని రాయిని దేవుడిగా పూజిస్తున్నాడు. మానవుడు ఆలోచించ గలడు. మానవుడు తాను సృష్టించిన దేవుడు తనని సృష్టించాడని ఆలోచించేడు. దేవుడు ఆలోచించ గలడని మానవుడు ఆలోచిస్తున్నాడు. మానవుడి ఊహలో దేవుడు రాయి. దేవుడు ఆలోచించగలి గితే రాయి ఆలోచించగలదు. ఈ వాదం మీరు ఒప్పుకోరు. నాకు తెలుసు. పోనీ మరోలాగ చెప్తా.

మానవుడు ఆలోచించగలడు. తనలో తాను ఆలోచించుకొన్న విషయాలను ఇతరులకు ప్రకటించ గలడు. అతనిలాగ ఆలోచించగల ఇతర జంతువులూ, ఆహారంకోసం అన్వేషించగల జీవకోటీ అతనిలాగ అభిప్రాయ ప్రకటన చెయ్యలేకపోయినా, గొంతుకతో ఒక శబ్దాన్ని చేయగలవు. ఆలోచించగలవు. వాటిలో అవి మాట్లాడుకోగలవు. ఇక అచరజీవకోటో? వాటికీ ఆహారం అవసరమే. ఉన్న చోటనే ఉండి—లేక ఉన్నట్టు కనబడి—మనకు కనబడని నేలకింద ఆహారాన్ని సంపాదిస్తాయి. అవి ఆలోచించవు. వాటిలో అవి సంభాషించవు. సరే ఇక జడపదార్థాలలో కదలవు. ఆహారాన్ని కావాలనవు, ఆలోచించవు, మాట్లాడవు. జడపదార్థాలకి ఉదాహరణలు కుర్చీ, తోలు సంచీ, మొదలైనవి. అయినా అవి జీవం లేనివా? కావు; ఒకనాడు సజీవమైనవే. చచ్చిపోయిన చెట్టు శవాన్ని ముక్కలుచేసి ఆ కట్టెతో మనం కుర్చీ తయారుచేస్తున్నాం. చంపిన పసువుల చర్మాన్ని సంచీలగా కుట్టుకుంటున్నాం. అవి చనిపోయిన జీవ పదార్థాల కిందే జమ. పూర్తిగా ఏనాడూ జీవంలేని, ఎన్నడూ చలనంలేని, ఏ కోశానా ఆకలిదప్పులులేని జడపదార్థాలు ఉన్నాయి. అందులో రాయి ఒకటి. రాయిలో శక్తిలేదా, కదలిక లేదా, రాయిని విసిరి కొడితే ఎదురుగుండా ఉన్న గాజుపలక బద్దలవుతుంది. దానికి కదలిక ఎక్కణ్ణించి వచ్చింది. గాజు పలకని బద్దలుచేసే శక్తి ఎక్కణ్ణించి వచ్చింది. మానవుడే ఇచ్చాడు. రాయికి కదలికనీ, శక్తినీ ఇవ్వ గలిగిన మానవుడు దానికి మాట్లాడే శక్తిని, ఆలోచించ గల శక్తినీ ఇవ్వలేడా? ఇవ్వగలడు. కాబట్టే నేను ఈ ఊరులోని, ఒకానొక పార్కులోని రాతి బెంచీకి ఈ శక్తులు ప్రసాదించేను. అందుకే అది రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుంది. ఏం పార్కు బెంచీ ఎందుకు మాట్లాడకూడదు? ఏమిటీ? రాయి మాట్లాడినా, ఏమిటి మాట్లాడగలదని అంటు న్నారా? చెప్తా వినండి. మనలాగే ఏ యుగంలో

జీవిస్తున్నదో, ఏ సంప్రదాయంలో పెరిగిందో వాటి ప్రభావాల ప్రతిబింబ కిరణాలనే ప్రసారం చేస్తుంది. పౌరాణిక కాలంలో రాయి ఒకటి ఆలోచించింది. మాజీ—అహల్య అనే రాయి. తరతరాలుగా రాముడి కోసం ఎదురుచూస్తున్న శబరిలాగే నిర్వేదపడి ఉంటుంది. నిరీక్షించుతూ, నిట్టూర్పు విడుస్తూ పక్కనున్న చెట్లతో సంక్రందనుడు చేసిన ద్రోహాన్ని, ఆక్రందనంతో పూసగ్రుచ్చినట్టు చెప్పి ఉండవచ్చు. పౌరాణిక కాలం అయింది. ఇక పుక్కిటిపురాణ పౌరాణిక కాలంలోనో—కాశీమజిలీల కట్టుకథల్లో, పేదరాశి పెద్దమ్మ వినికిడిచేసే వింత కథల్లో భయంకర మాంత్రికుల మాయల్లో పడి పాశాల్లో చిక్కుకొని, కామానికిగురియై నీచానికిఒప్పుకోనక రాళ్ళుగా మారిన భవ్యన్న దేశాల రాకుమార్తెలు వివిధ రకాలుగా విలాపించేరు. రాళ్లు కూడా తాము జీవిస్తున్న యుగంలోని శైలిలోనే మాట్లాడుతాయి. మానవుడు దేవుడుగా పూజించే రాయి ఆదికాలంలో అయితే ఆ భాషే మాట్లాడేది. ఇప్పుడు మన భాషే మాట్లాడుతుంది. అలాగే ఈ ఊరులోని, ఒకానొక పార్కులోని రాతి బెంచీ ఒకటి రోజా నాతో మన భాషలోనే మాట్లాడుతూ ఉంటుంది.

కోపిష్టి: చాలించవయ్యా. ఇందాకట్నుంచీ చూస్తున్నా. నా దుఃఖంలో నేవుంటే ఒకటే గొణుగుడు. ఈ పార్కులో కూర్చోనివ్వవా ఏమిటి?

కథకుడు: కూర్చోనివ్వకపోవడానికి నేనెవణ్ణి.

కో: అరే. నేను అనదలచుకొన్న మాటని నువ్వే అనేస్తున్నావే. బలేవాడివిలాగ ఉన్నావే. నీ పేరేమిటి? నా పేరు—

కథ: పేర్లెందుకు లెండి. నేను చెప్పినది విన్నారా? మీ అభిప్రాయ మేమిటి?

కో: నాకేం వినబడలేదు.

కథ: అయితే నామీద ఎందుకీ కోపం?

కో: ఒక ముక్క వినబడలేదనే—పోనీండి. ఇప్పుడు చెప్పండి వింటాను.

కథ: ఈ పార్కులోని ఒకానొక రాతిబెంచీ రోజా నాతో మాట్లాడుతూ ఉంటుంది.

కో: నిజంగా?

కథ: మిమ్మల్ని చంపుకు తిన్నట్టు.

కో: ఏమని మాట్లాడుతూ ఉంటుంది?

కథ: ఏమని మాట్లాడుతూందా. వివిధ మనస్తత్త్వాలు గల మానవుల్ని పరిశీలించి విభిన్న దృక్పథాలు గల మతాలను ఆకళింపుకొని నైరుస్యం ఉన్న భావాలను సమన్వయం చేసి కావ్యాన్ని రచించే మహాకవి లాగ మాట్లాడుతుంది.

కో: ఇంతకీ ఏమని మాట్లాడుతుందో చెప్పారు కారు.

కథ: ఒక్కొక్కప్పుడు—రాళ్ళను కూడా కరిగించే విషాద గాథలను చెపుతుంది.

కో: నిజంగా ఆ గాథలు అంత విషాదకరమైనవా?

కథ: నాకు నిజం. మీకు అబద్ధం.

కో: అయితే ఆ గాథలు రాళ్లని కరిగించే విషాద గాథలయితే మరి ఈ పార్కు బెంచీ ఎందుకు కరిగిపోలేదూ?

కథ: కరిగిపోలేదని ఎవ రన్నారు?

కో: ఆఁ. కరిగిపోయిందా? లేదు. నువ్వు అబద్ధమాడుతున్నావు.

కథ: లేదు. నిజమే. అబద్ధమాడితే నాకు ఒరిగే దేదీ లేదు. ఆ పార్కు బెంచీ కరిగిపోయింది. ఇసుకలో కలిసిపోయింది. అందుకే నేను ఇలా కూర్చున్నా.

కో: ఏమిటయ్యోయ్. గడియకోమాట అంటున్నావ్. క్షణం కిందట ఒకానొక రాతిబెంచీ రోజా నాతో మాట్లాడుతూ ఉంటుందన్నావ్. ఇప్పుడు ఆ పార్కు బెంచీ ఇసుకలో కరిగిపోయిందంటున్నావ్? ఏది నిజం.

కథ: రెండూ నిజమే. పార్కు బెంచీ ఇసుకలో కరిగిపోయింది. అయినా అది రోజా నాతో మాట్లాడుతూ ఉంటుంది.

కో: పోవయ్యా, నువ్వెవరో పిచ్చాళ్ళా ఉన్నావ్. నీతో నాకేమిటి వాదన.

కథ: నేను పిచ్చివాణ్ణికాదు. నామాట వినండి. నేను పిచ్చివాణ్ణి కాదు.

కో: నువ్వు ముమ్మాటికీ పిచ్చివాడివే.

పార్కు బెంచీ: అతడు పిచ్చివాడు కాదు.

కో: నువ్వెవరివి?

పా. బె: నేనే అతడితో మాట్లాడే పార్కుబెంచీని.

కో: చాలు. నువ్వూ పిచ్చిదానివే.

కథ: కాదు. ఆమె పిచ్చిదికాదు.

కో : పరిపోయింది. ఆమే పిచ్చిదికాక, నీవూ పిచ్చివాడివి కాకపోతే మస్య స్నేనా పిచ్చివాణ్ణి. మా బావుంది.

పా. బె : కోప్పడకండి. ఇతడు ఇందాకట్నుంచి చెప్పినదంతా అక్షరాలా నిజం. రోజూ నేను అతడితో మాట్లాడుతూ ఉంటాను. నా బాధలని గాథలగా అతడికి విన్నవిందుకొంటాను.

కో : నీకు మరేం పనిలేకేమిటి ?

పా. బె : అవును మరేం పనిలేక నే—శ్రద్ధగా వినే శ్రోత ఉంటే కథ చెప్పడంకన్న మరేం మంచి పని ఉంది. వింటానంటే మీకూ చెప్తాను.

కో : సరే చెప్పు వింటాను.

పా. బె : అయిదేళ్ళ కిందటిదాకా ఇప్పుడు మాట్లాడే పార్కు బెంచీమీద పింఛను పుచ్చుకొన్న ఉద్యోగులు కూర్చుంటూ ఉండేవారు. వాళ్లు రోజూ సాయంత్రం నాలుగు అయేసరికి సరిగ్గా వచ్చి తిష్ఠ వేసేవారు. ఈ పార్కు బెంచీమీద విశాలంగా కూర్చుంటే ముగ్గురు, ఇరుక్కుని కూర్చుంటే నలుగురూ పడతారు. కానీ ఈ పింఛను పుచ్చుకొన్న ఉద్యోగులు ఎనమండుగురు, ఈ పార్కు బెంచీమీద నలుగురు కూర్చుంటే తక్కిన నలుగురు ఇంటిదగ్గిర్నుంచి తెచ్చుకొన్న గోనెపట్టా పరుచుకొని కింద కూర్చునేవారు. వాళ్ళ స్నేహం చాలా గాఢమైనది. ఈ ఎనమండుగురిలో ఏ ఒక్కడు గానిపెం కొంచెం ఆలస్యమైనా వాళ్ళలో ప్రతిఒక్కడూ చాలా బాధపడేవాడు. ఒకవేళ ఆరోజు హాజరు కాకపోతే తతిమ్మావాళ్లకి ఆ రాత్రి కునుకు పట్టేదికాదు. అంతటి అన్యోన్యంగా వాళ్లు ఉండేవారు. వాళ్లందరూ పరిపూర్ణ జీవులు. ప్రతిఒక్కడూ మనుమల్నీ మనుమరాళ్లనీ ఎత్తిన సంసారులే. అశేషమైన అనుభవాలనీ, అపారమైన దుఃఖాలనీ అనేకమైన సుఖాలనీ రుచి చూచినవాళ్లు. వీళ్లు ఈ పార్కు బెంచీని తమ స్వంతం చేసుకున్నారు. మరెవ్వరూ ఈవైపు రావడమే మానేశారు. వీళ్లు రోజు రోజూ అనేకమైన విషయాలు చర్చించేవాళ్ళు...

నాయుడు : అయితే పంతులూ, హిట్లరు గెలుస్తాడూ ?

పంతులు : గెలుస్తాడోయ్, నాయుడూ. గెలుస్తాడు. హరిశ్చంద్రుడు అబద్ధం ఆడినా, ఆడవచ్చునుగానీ, హిట్లరు ఓడిపోడం కల్ల.

నా : మరి—చర్చిలు.

పం : చర్చిలు లేదు ఉర్చిలులేదు. ఎవరెన్ని చెప్పినా, హిట్లరుజాతకంలో చక్రవర్తియోగం రాసిఉంది.

మొద : అన్నట్టు పంతులూ, జాతకం అంటే జ్ఞప్తొచ్చింది. మీ జాతకాల బావకి నా జాతకం ఇయ్యిమీ.

పం : ఇచ్చేను, మొదలియారూ నిన్ననే ఇచ్చాను.

చంద్రుడిలో, రవి వెళ్ళగానే మీ మూడో వాడికి పెళ్లవుతుందని చెప్పాడు...

పార్కు బెంచి : ఇలా యుద్ధంనుంచి జ్యోతిష్యంలోకి సంభాషణ మారింది. ఇంకోకమాటు.

పం : అమ్మయ్య అయిపోయింది. ఒక చాప్టరు. నాయుడూ, చదివావా న్యూసు.

నా : ఆ చదివాను. అయితే పంతులు హిట్లరోడిపోయా డేమండి ?

పం : నే చెప్పలేదటోయ్. హరిమీద గిరి పడ్డా, అరు నూరయినా హిట్లరు ఈ దెబ్బతో ఓడిపోక తప్పదని.

నా : నేనమ్మను, సుమా ఈ పేపరు వాళ్లు...

పం : పేపరువాళ్లూ లేదు, గీపరు వాళ్ళూ లేదు. జాతకంలో రాసి పెట్టినది అక్షరాలా జరిగి తీరాలి. గ్రహ గతుల్ని మార్చడం మానవ మాత్రులతరమా ? హిట్లరుజాతకం మన మనుకొన్నట్టూ దాఖలా ఇచ్చిందా లేదా, జ్యోతిష్య మంటేనే అంత.

మొద : అన్నట్టు, పంతులూ, జాతకం అంటే జ్ఞప్తొచ్చింది. మీ జాతకాల బావగారికి నాది ఇయ్యిమీ.

పం : ఇచ్చేను మొదలియారూ, నిన్ననే ఇచ్చాను. కుజుడిలో శని వెళ్లగానే మీ మూడో వాడికి పెళ్లవుతుందని చెప్పాడు.

పార్కు బెంచి : ఇలా అయిదేళ్ళపాటు వీళ్ళ సంభాషణలు ఈ పార్కు బెంచీ విన్నాది. వీళ్ళసంభాషణల్లో యుద్ధమూ జ్యోతిష్యమే కాక రవంత సాహిత్యం కాస్త శృంగారం, కూస్త పుకార్లూ, కొంచెం వేదాంతం, కించిత్తు స్వవిషయం రోజూ దొర్లుతూ ఉండేవి. అయిదేళ్లపాటు వీళ్ల సంభాషణాలు విన్నాక ఈ పార్కు బెంచీకి విసుగెత్తింది. ఎందుకా? జీవితంలో వైవిధ్యం ఉండాలి. తరతర

పార్కు బెంచీలను చూస్తే మొదట్లో నాకు ఈసడింపుగా ఉండేది. వాళ్లమీద గంటకొకడు, కూర్చునేవాడు. మరి ఈ పార్కు బెంచీమీదో ఒక్కొక్క కుటుంబంలాంటి ఎనమండుగురు వ్యక్తులు సరిగ్గా నాలుగయినా సరికి వచ్చి కూర్చునేవారు. ప్రపంచాన్ని కాచి వడబోస్తున్నామనుకొనేవారు. తక్కిన ఏ పార్కు బెంచీకి జీవితంలో ఇంత సెక్యూరిటీ ఉంది. ఏ క్షణంలో ఎవరు వచ్చి కూర్చుంటారో వాళ్ళకే తెలియదు. నా సంగతా. వడ్డించిన విస్తరి. అందుకే మొదట్లో గర్వపడ్డాను. కాని అయిదేళ్ళపాటు దినములు పరస్పర ప్రతిధ్వనులు అయితే తక్కిన బెంచీలను చూసి అసూయపడ్డాను. వాటి జీవితంలో వైవిధ్యం ఉంది. నాలో లేదు. ఈపార్కు బెంచీమీద ఒడ్డు చేరుకొన్న, కాటికి కాళ్లు చాచుకొన్న శీంధను పుచ్చుకొన్న ఎనమండుగురు ముసిలివాళ్లు తప్ప మరెవ్వరూ కూర్చోరు. తక్కిన బెంచీల మీదో-అప్పుడే కాపరం పెట్టిన కొత్తదంపతులు ఇంకా ఇంకా పెళ్లికాని బ్రహ్మచారులూ, ఎందుకూ పనికి రాని వాజమ్మలు, అంతా తెలిసిన సర్వజ్ఞులూ, ఉద్యోగంపోయిన జర్నలిస్టు, సీటుదొరకని విద్యార్థి, చీకూ చింతాలేని ధనవంతుడు, పాపం పుణ్యం ఎరుగని పసిపిల్లలు, ఎందరో మహానుభావులు కూర్చుంటారు. అందుకే తక్కిన బెంచీలను చూస్తే నాకు ఈర్ష్య పుట్టింది. ఏమైనాసరే తక్కిన పార్కు బెంచీలలాగ జీవించా లనుకున్నాను. నాటినుంచీ మనుష్యులతో మాట్లాడడం ప్రారంభించాను. ఈపార్కు బెంచీమీద కూర్చుంటే గల లాభాలని వ్యాపారపు ప్రకటనలాగ బిగ్గరగా ఏకరవు పెట్టేదాన్ని. పిల్లల్లారా రండి. నా దగ్గరికి రండి. నేను చాలా మంచిదాన్ని. మీకు ఎన్నో ఆటలు నేర్పుతాను. మీరు దొంగాట ఆడుకొంటే నేను తల్లిపై కళ్ళు మూస్తాను. నా పక్కనే ఎంత చక్కటి పొదఉందో చూశారా? అందులో మీరు దాగుడుమూతలు ఆడుకోవచ్చు. రండి పిల్లల్లారా. నా దగ్గరికి రండి అని ఆహ్వానించేదాన్ని. అయినా ఈ ఎనమండుగురు ముసిలివాళ్లకి భయపడి ఏ పిల్లా నాదగ్గరికి వచ్చేది కాదు. పోనీ ఈ ముసిలాళ్ళ లేమ మనుమల్ని మనుమరాళ్ళనీ వెంట తీసుకొనివస్తే కొంత కాకపోతే కొంతైనా సంతోషించేదాన్ని. వాళ్ళు ఎన్నడూ అలాంటి పని చేసేవారు కాదు. నాకు వళ్లు మండేది. మళ్ళా ఈ పార్కు బెంచీమీద కూర్చుంటే గల లాభాలని వ్యాపార ప్రకటనలాగ ఉద్ఘాటించేదాన్ని. కొత్తగా పెళ్లయిన దంపతులారా! రండి. నాదగ్గరకు రండి. నేను చాలా మంచిదాన్ని. మీకు ఎన్నో సదుపాయాలు చేస్తాను. చూశారా నా పక్కనే ఎంత చక్కటి పొద ఉందో. దాని చాటున, నీడల మాటున నా ఒడిలో మీరు కూర్చుంటే మిమ్మల్ని మరెవరూ చూడలేరు. చూసి కన్ను కుట్టుకోలేరు. మీకు ఏకాంతం ఇవ్వడం నా హామీ. మీరు మాట్లాడుకొనే మాటల్ని మరెవ్వరికీ చెప్పను. ఒద్దంటే నేనే వినను. రండి. నన్ను పావనం చెయ్యండి. కొత్తగా పెళ్లయిన దంపతులారా రండి. అని స్వాగతం పలికేదాన్ని.

అయినా ఈ ఎనమండుగురి ముసిలివాళ్ళకీ భయపడి ఏ జంటా నాదగ్గరకి వచ్చేదికాదు. నా జీవితం చాలా దుర్భరం అయింది. బ్రతుకులో సాధించదలచుకొన్నది సాధించలేకపోతే ప్రతీక్షణం తీక్షణం అవుతుంది. ముళ్లమీద కూర్చున్నట్టుంటుంది.

ఇలా ఉండగా నా అదృష్టవశాత్తూ ఒకనాడు మూడుగంటల మధ్యాహ్నానికే ఒక యువకుడు ఈ పార్కు బెంచీమీద సేద తీరుతూ కన్ను మూశాడు. చుట్టూ, పచ్చపట్టు, తలమీద ఎత్తయిన గుబురుచెట్టు, పక్కనే దట్టమైన పొద. అతగాడికి ప్రాణం లేచి వచ్చిందో లేదో నాకుమాత్రం హాయి అనిపించింది. ఇతగాడు ఇలాగే నాలుగు దాటేదాకా—సాయంత్రం ఎనిమిదిదాకా విశ్రమిస్తే వెయ్యి దేముళ్లకు మొక్కుకొంటానని ప్రార్థించుకొన్నాను. నాలుగూ అయిదు నిమిషాలు అయింది. యువకుడింకా నిద్ర పోతున్నాడు...

పంతులు: ఏమిటయ్యా నాయుడూ. ఏమిటీ విచిత్రం. ఎవ రిక్కడ పడుకొన్నది.

నాయు: తెలీదు పంతులూ. నిజంగా విచిత్రంగానే ఉంది.

మొదలి: లెగ్గొడుదువా.

పం: లేపు—మొదలియారూ లేపు.

మొద: ఏ అయ్యా, లెండు. బార్కం పండుకొందుకి పీడా, వాసలా లెయ్‌మీ.

నా: ఎవ రితడు. కుంభకర్ణుడి అమ్మ మొగుళ్ళా ఉన్నాడు. లేవడేం?

పంతు: పోనీ నాయుడూ గోనెపట్టా పరుస్తా-కూర్చుందాం. అతడే లేస్తాడు. లేవకేం చేస్తాడు.

మొద: ఉండుమీ బంతులు—ఈ పోంబేరి పిల్లకాయ ఎందుకుదా లెగవడో చూస్తును. ఏఅయ్యా లెయ్. లేస్తువా లేదా?

పంతు: చెయ్యి చేసుకోకు — మొదలారూ చెయ్యి చేసుకోకు. వాడే లేచిపోతాడు. రా—ఇలా వచ్చి కూర్చో...

పార్కు బెంచీ: పంతులు మొదలియారుని శాంతపర్చేడు. తరవాత శర్మ, రాజు, రావు, మూర్తి అయ్యరూ వరసగా వచ్చేరు. ఈ పార్కు బెంచీమీద పడుకొన్న యువకుణ్ణి చూశారు. చుట్టూ కింద కూర్చున్న తమ సహచరులని చూశారు. ఒక్కొక్కడూ ఆ యువకుణ్ణి లేపుదామనే ప్రయత్నించి విరమించేరు. అందరూ గోనెపట్టామీదా, పచ్చ పట్టుమీదా కూర్చొన్నారు. ఏ ఒక్కరూ పూర్వపు స్వేచ్ఛతో మాట్లాడలేదు. వాతావరణం ప్రశాంతంగా ఉంది.

మర్నాడు:—

పంతు: మొదలియారూ. మళ్ళా ఈ కుర్రాడెవడో ఇక్కడే పడుకొన్నాడే.

మొద: నేను నిన్న కొడ్తును అంటే ఊరుకోమంటివి. వాడు బండుకొనడా మరి.

పంతు: నాయుడింకా రాలేదేం. గోనెపట్టా లేదు. ఎక్కడ కూర్చుందాం.

మొద: ఈ పోంబేరి బిల్లకాయను లెగ్గొడుదును. కూర్చుందాం.

పంతు: ఒద్దు. ఈపిల్లి బ్రమ్మహత్య మనకెందుకు. వాడు లేచేదాకా ఆ బెంచీమీద కూర్చుందాం.

మొద: ఈ బసవా రాస్కెలు లేచునా?

పంతు: లేకపోతే పీడాపోయిరి. అక్కడ పోయి కూర్చుందాం. రా,

మొద: ఏమి బంతులూ—మన మెందుకు బోవలె అంటా. నీవు ఉండుమీ.

నాయు: నమస్కారం పంతులూ. అరే మళ్ళా దాపురించాడా ఈ శని.

పంతు: ఏం నాయుడూ ఇవాళ ఇలా ఆలస్యంగా వచ్చావ్. గోనెపట్టా పరుచుకు ఇక్కడే కూర్చుందామా లేక ఆ రెండో బెంచీమీద పోయి కూర్చుందామా.

మొద: మన మెందుకు బోవలె అంటా. ఏమి నాయుడూ.

నా: అవును పంతులూ మనమెందుకు పోవాలి. ఇక్కడే కూర్చుందాం.

మొద: అ బెంచిమీదకి బోతే రేడియో వినిపించునా?

నా: అవును. అయిదేళ్ళనుంచీ అలవాటు పడ్డాం, ఇక్కడే కూర్చుందాం.

పంతు: అలవా టేమిటయ్యా. పదేళ్ళు అలవాటు పడ్డ ఆఫీసునుంచి ట్రాన్స్ఫరు అయితే వెళ్లమా లేదా? ఇదీ అలాగే అనుకొందాం.

నా: అదుగో. తక్కినవాళ్ళంతా ఒస్తున్నారు వాళ్ళనీ అడుగుదాం. అందరికీ ఏది యిష్టమైతే అదే చేద్దాం...

పార్కు బెంచి: అందరూ వచ్చారు. అందరూ క్రితంరోజులాగే పచ్చపట్టుమీదా, గోనెపట్టామీదా కూర్చున్నారు. క్రితంరోజులాగే ముళ్ళమీద కూర్చున్నట్టే, సెగముందు ఉన్నట్టే, కూర్చున్నారు. అందరూ చోటు మార్చడం మంచిదని నిశ్చయించుకొన్నారు. అప్పుడే చోటు మార్చేశారు. ఆతరవాత వాళ్ళు ఏమయినారో నాకు తెలీదు. ఆ మర్నాటినుంచీ నా జీవితం చాలా బాగా ఉంది. నాకు చిరవాంఛితా లన్నీ సమకూరేయి. ఈ పార్కు బెంచీమీద మధ్యాహ్నం సేద తీరే యువకుడు కొన్నాళ్ళపాటు వరసతప్పకుండా బడలిక తీర్చుకొనేవాడు. అతగాడు ఒక కవి. ఉన్న ఊరులో ఉండలేక, తిండిలేక ఉండడానికి చోటులేక ఈ మహా నగరపు మహాపథాలలో పరిభ్రమిస్తూ జీవితంలో భ్రమిస్తూ ఉండేవాడు. రోజులో ఏదో వేళకు నా దగ్గరకువచ్చి విశ్రమించేవాడు. పరిశ్రమించేవాడు. అతడు రాసిన మహాకావ్యం నా సమక్షంలోనే ఉద్భవించడం నాకు గర్వకారణం. అతను ఏమయినదీ తర్వాత చెప్తాను.

ఇంతలో వేసవి వచ్చింది. పగళ్లు, సెగళ్లు, రోళ్లు, పగులుతున్నాయి. వేడి గాడ్పులు ఈ చెవిలోంచి ఆ చెవిలోకి కొట్టి రోజు చల్లబడగానే పేటంతా పార్కు చేరుకొనేది. ఒంటినిండా నగలతో, తలనిండా పువ్వులతో, చల్లని తల్లులు, పిల్లలని వెంటపెట్టుకొని విహారానికి వచ్చేవారు. రోజల్లా ఆఫీసులో విధిలేక చెమటోడ్చి సాయంత్రం అయేసరికి తెరిపినిపడి ఉద్యోగులు పార్కులో ఊపిరి పీల్చుకొనేవారు. ఇక రాత్రి ముదిరేక—ఇళ్ళల్లో గాలిదూరక నిద్ర పట్టని మొగరాయుళ్ళంతా చాపా దిళ్ళూ పట్టుకొని చెట్లకిందకి చేరుకొనేవారు.

ఈ ఋతువులో నా ఆనందానికి మేర లేదు. కొంతమంది గాయకులు నా చుట్టూ రాత్రుళ్ళు చేరేవారు.

ఒకనాడు సాయంత్రం — ఒక జవరాలు తన రాలుగాయి తమ్ముణ్ణి వెంటబెట్టుకొనివచ్చి ఈపార్కు బెంచీమీద కూర్చుంది. మర్నాడుకూడా. ఆమర్నాడు కూడా. మూడో నాడు...

యువతి: ఏమిటిరా తమ్ముడూ, ఇలారా. రమ్మంటే.

తమ్ము: నువ్వెళ్ళికూర్చో అక్కయ్యా. నేను తరవాత వస్తాను.

యువ: రమ్మంటే నీక్కాదురా. ఇలా రా. ఉండుండు. నీపని పట్టిస్తా. రాత్రి ఇంటికి వెళ్లేక నాన్నతో చెప్పి.

తమ్ము: చెప్పుకో నాకేం భయమా?

పా. బె: తమ్ముడు తుర్రుమని పారిపోయాడు. జవరాలు ఒంటిగా ఈ పార్కు బెంచీమీద కూర్చుంది. అప్పుడు అలవాటుప్రకారం ఇక్కడ సేదతీరే యువకుడు వచ్చాడు. జవరాలిని చూశాడు. జవరాలు అతణ్ణి చూసింది. ఇద్దరి చూపులూ కలిసాయి. జవరాలు బెదిరిన లేడి పిల్లలాగ క్షణం ఒదిగి కూర్చుంది. మరు క్షణం లేచి నుంచుంది. ఆమె వీక్షణంలో రవంత నిబ్బరం ఉంది. ఒకింత ఆశకూడా కలదు. అతనే అన్నాడిల్లా.

కథకుడు: ఫరవాలేదు. మీరుకూర్చోండి. నేను మరోబెంచీమీద కూర్చుంటాను.

పా. బె: అన్నాడేగాని అతడు అడుగు వెనక్కి వెయ్యలేదు. అలాగని ముందుకూ వెయ్యలేదు. ఉన్న చోటే ఉండిపోయాడు. మరి యిద్దరిలో ఏ ఒక్కరూ మాట్లాడలేదు. ఆమెకూడా అలా నించొనే ఉంది. ఇద్దరూ కొన్ని శతాబ్దులు అలా నిలబడ్డారా. ఇంతలో తమ్ముడు వచ్చాడు.

తమ్ముడు: అక్కయ్యా. కాణీ యివ్వవ్. బఠాణీలు కొనుక్కుంటా.

పా. బె: నేత్రావధానపు పానకంలో తమ్ముడు ఉపకరించే పుడక అయేడు. యువకుడు జేబులోంచి కాణీ తీసి కుర్రాడికిచ్చాడు. కుర్రాడు బిడియ పడుతూ వెనక్కి తగ్గాడు. జవరాలు అందికదా.

యువ: ఒద్దండీ. వాడికి డబ్బు లివ్వకండి.

కథకుడు: ఫరవాలేదులెండి.

పా. బె: అని ఇచ్చి వెళ్ళిపోయాడు. వెళ్ళి రెండో బెంచీమీద కూర్చున్నాడు.

యువ: ఏమిటిరా. నీకు బుద్ధిలేదూ. కొత్తవాళ్ళ దగ్గర డబ్బులు పుచ్చుకొంటావా? ఉండు నాన్నతో చెప్తాను.

తమ్ము: చెప్పకే అక్కయ్యా. నీకు దండం పెడతానే.

పా. బె: అక్కయ్య తమ్ముణ్ణి అదలించి చూసింది. అంతలో కుర్రాడిమీద వాత్సల్యం కుదుట పడ్డాది. తమ్ముడు రివ్వున ఎగిరిపోయి బఠాణీలు కొనుక్కొన్నాడు, జవరాలు రేడియో పాట నే వింటున్నాదో, ఆలోచనలు పోతున్నాదో చెప్పడం కష్టం. రెండో బెంచిమీద యువకుడు బెదరి బెదరి చూసీ చూడకుండా ఇటువైపుచూస్తూ తలలో ఏదో రాస్తూ అల్లంతదూరంలో కూర్చున్నాడు. జవరాలుకూడా అంతే నేమో.

మర్నాడు

యువకుడే ముందు వచ్చి రెండో బెంచిమీద కాచుకు కూర్చున్నాడు. ఇతడు రాడేమో అన్న భయంతో, వస్తే ఎవరేనా చూస్తారేమో అన్న సంకోచంతో తడబడుతూ జవరాలు తమ్ముణ్ణి వెంటబెట్టుకొని వచ్చింది. యువకుడు వాళ్ళనిచూసి చిరునవ్వు నవ్వాడు. జవరాలు తన పెదవుల వెనకనే ముసిముసి నవ్వుని దాచుకొంది.

యువకుడు: అబ్బాయి యిలారా. (దూరం నుంచి)

తమ్ముడు: ఆయన పిలుస్తున్నారు వెళ్ళనా అక్కయ్యా.

యువ: నన్నెందుకూ అడగడం. నిన్న నన్నడిగే ఆయనదగ్గర డబ్బులు పుచ్చుకొన్నావా?

యు: రా అబ్బాయి ఫరవాలేదు (దూరం నుంచి)

పా. బె: తమ్ముడు యువకుడిదగ్గిరికి వెళ్ళాడు. దూరంగా

యువ: నీ పేరేమిటి అబ్బాయీ.

త: హనుమంతు.

యు: మరి మీ అక్కయ్య పేరో?

త: చెప్పకూడదు.

యు: ఏం?

త: మా అక్కయ్య చెప్పొద్దన్నాది.

యు: చెప్పు ఫరవాలేదు.

త: నేన్చెప్పను. చెపితే నాన్నతో చెప్పి కొట్టిస్తుంది.

యు: కొట్టించదులే.

త: నీకు తెలీదు.

యు: నిన్న కానీ పుచ్చుకున్నావని చెప్పిందా?

త: లేదు.

యు: అయితే భయంలేదు చెప్పు.

త: ఊహూ. చెప్పను.

యు: పోనీ ఆయన నీ పేరు అడుగుతున్నారు చెప్పేదా అక్కయ్యా అని అడుగు. చెప్పమంటే నే చెప్తా.

పా. శె: తమ్ముడు అక్కయ్యదగ్గరకు వచ్చాడు. యువకుడికీ తమ్ముడికీ జరిగిన సంభాషణ వినపట్టే వడి-చింది. జవరాలు.

తమ్ము: అక్కయ్యా, ఆయన నీ పేరు అడుగుతున్నారే.

యు: ఊ.

పా. శె. అని ఉరిమింది జవరాలు. లేనికోపం కుమ్మరించింది. తమ్ముడు జడిసి తప్పుకొన్నాడు.

(దూరంగా)

యు: ఏం అబ్బాయ్ అడిగావా.

తమ్ము: అడిగేను.

యు: మరి చెప్పు.

త: చెప్పొద్దంది.

యు: ఊఁ అన్నాది.

త: అంటే ఒద్దు అనే అర్థం.

యు: కాదు.

త: అవును.

యు: ఇదుగో మధ్యాహ్నం భోజనం చేశావా?

త: ఊఁ.

యు: ఇప్పుడు ఊ అంటే ఒద్దూ అనా అర్థం.

త: కాదు చేశాను అని అర్థం.

యు: అలాగే మీ అక్కయ్య ఊ అంటే చెప్పమనే అర్థం. కాబట్టె చెప్పు.

పా. శె: తమ్ముడు అక్కయ్య పేరు చెప్పాడు. యువకుడు మురిసిపోయాడు. జవరాలు నిండుకుండ. తమ్ముడు బఠాణీలు కొనుక్కొనడానికి పారిపోయేడు.

జవరాలు యువకుడివైపు నవ్వినట్టు చూసింది. నన్ను కావన్నట్టు యువకుడు పైకి ఊరుకొన్నాడు. వాలుగ కన్నులు కలకాలం మాట్లాడుకోగలవు.

ఆ మర్నాడు.

యు: నీకు బఠాణీలు ఎక్కడివిరా? మళ్ళా ఆయనదగ్గర కానీ పుచ్చుకొన్నావా?

త: లేదక్కయ్యా. కానీ పుచ్చుకోలేదు.

యు: మరి నీకు బఠాణీలు ఎక్కణ్ణించి వచ్చాయి.

త: ఆయన కొని పెట్టారు.

యు: పుచ్చుకోకూడదని చెప్పలేదూ.

త: కానీ పుచ్చుకోకూడదన్నావుగాని బఠాణీలు పుచ్చుకోకూడదన్నావా?

యు: ఇకమీదట బఠాణీలుకూడా పుచ్చుకోకు.

త: బఠాణీలు పుచ్చుకోస్లేవే. ఛా. వెధవ బఠాణీలు బావులేవు. ఇకమీదట్నుంచీ వేరుసెనక్కాయలే తింటా. పరేకాని అక్కయ్యా ఈచీటి నీ కాయన ఇమ్మన్నారే.

పా. శె: తమ్ముడు జవరాలికి ఓకాగితం అందించాడు. ఆ కాగితం ఇలా పాడింది.

ఏదో ఏదేదో కోరిక
హృదయములో వెలసె నా
వదనములో మెరిసె
వెన్నెల తొలి వెలుగులలో
వన్నె జాజి పూ తావులలో
నన్ను జూసి నీ కన్నులు
వన్నె చేసి కరుణిస్తే—ఏదో

పా. శె: పాట చాల పొడుగైనది. మీకు తెలుసుగా ఈ కవులు ప్రేమలో పడితే ఎంత పొడుగాటి పాటలు రాస్తారో. ఈ పాటని జవరాలు చదువుకొంది. తల ఊపింది. మురిసిపోయింది.

రెండు రోజులతరువాత 'అజ్ఞాత ప్రేయసికి అంకితం' అని ఈ పాటే ఒక ఆంధ్ర మాస పత్రికలో అచ్చయివచ్చింది. ఆ పత్రిక ప్రతిని యువకుడు జవరాలుకి ఇచ్చేడు. ప్రేమ ఆశలని పెనవేసుకొని ఆకాశందాకా అల్లుకుపోయింది. ఒకనాడు

యు: రేపు మాయింటికి రాకూడదూ. మానాన్నగారు మిమ్మల్ని చూస్తారు.

మన సంగతి—

యు: ఇలా అజ్ఞాతంగానే ఉండనీ—

యు: అంతేనా.

యు: అప్పుడే ప్రేమ పచ్చగా కలకలలాడుతుంది.

పా. బె: అతడు తనని పెళ్ళిచేసుకొని సుఖపెడతాడని జవరాలు అద్దాలమేడని కట్టుకొన్నాది. అతడు ప్రేయసి కళ్ళనే తప్ప తండ్రి కళ్ళని చూడడానికి భయపడ్డాడు. అతడు ఆమెని కట్టుకొని సంసారం ఈదలేడు. ఆర్థికంగా అతడి బరువు అరవై టన్నులు. ఆమె కన్నులు పెళ్ళిచేసుకొంటే అంతకు రెట్టింపు బరువు. కొన్నాళ్ళదాకా వాళ్లు ఏదీ తేల్చుకోలేకపోయారు. అతడు విచారంలో మునిగిపోయాడు. ఒక రాత్రి ఊరంతా సద్దణగేక పార్కంతా పవళించేక అతడు నాతో మొరపెట్టుకున్నాడు. నేను హితోపదేశం చేశాను. అతడు నా మాటలని చెవిని పెట్టలేదు.

..........................

ఈ పార్కు బెంచీ వీపుమీద ఒక దక్కటి చెట్టుకొమ్మ విస్తరించిఉంది.

..........................

మర్నాడు పొద్దున్న పోలీసులు నా దగ్గరకు వచ్చారు. వాళ్ళతోపాటు పేట పేటంతా వచ్చారు. ఒక ఊరులేని పేరులేని శవాన్ని పోలీసులు పట్టుకొనిపోయారు. అప్పటినుంచీ నా దగ్గరకి పిట్టమనిషయినా రావడం మానేశారు. నేను ప్లేగులో కడుపున పుట్టిన పిల్లలు చచ్చిపోతే ఏడ్చే తల్లిలాగ ఇలా ఉన్నాను. మూడునెలల తరువాత ఎవరో పరాయి ఊరు మనుష్యులు ఆ బెంచీమీద కూర్చొని పేపరు చదువుకొంటున్నారు. చెలియలి కట్టదగ్గర ఏదో ఆడశవం తేలినట్టు పేపరు చెప్పింది. నేను ఇసుకలో కరిగిపోయాను.

గోపి: పాపం.

పా. బె: ఆనాటినుంచీ నేను ఈయనతో మాట్లాడుతూ ఉంటాను.

గోపి: ఈయ నెవరు?

పా. బె: ఈయనే ఆ యువకుడు.

గోపి: నిజంగా.

కథకుడు: నిజం. ఈ పార్కు బెంచీ రోజూ నాతో మాట్లాడుతూ ఉంటుంది.

గోపి: మరి మీరు ఉరిపోసుకొని చచ్చిపోయారు కాదా?

కథకుడు: ఉరిపోసుకొని నేను చచ్చిపోలేదు. ఉరిపోసుకొని బ్రతికాను.

గోపి: ఏమిటో బోధపడకుండా ఉంది. చచ్చిపోయిన మనిషి, కరిగిపోయిన పార్కు బెంచీతో మాట్లాడడం నాకేం బోధపడలేదు.

కథకుడు: ప్రయత్నించితే బోధపడనిదంటూ ఏదీ ఉండదు.

గోపి: మీరు చచ్చిపోయిన మనుష్యులయితే ఇక్కడెందుకు ఉంటారు?

కథకుడు: ఇంకెక్కడికి పోను. నాకు ఇల్లూ వాకిలీ తిండీ బట్టా అక్కర్లేదాయె. నాకు కావలసినదంతా ఓదార్పు మాత్రమే. నేను బ్రతికివున్నాళ్లు నన్ను ఓదార్చని ఉత్సాహపరచని మనుష్యులు నేను చచ్చిపోయాక మాత్రం నన్ను ఓదార్చుతారా? నేను బ్రతికున్నప్పుడు కవిత్వం రాసేటప్పుడు, ప్రేమించేటప్పుడు, బాధపడేటప్పుడు, ఉన్న కాణీ డబ్బులు కుర్రవాణికి బఠాణీలకి ఇచ్చేటప్పుడు నన్ను ఈ పార్కు బెంచీయే ఓదార్చేది. అటువంటి పార్కు బెంచీని విడిచి ఎక్కడికి పోయేది. పోతే నాకు శాంతి ఉంటుందా? సరే దానికేంలెండి. మీరు ఇంక ఈ చోటు ఖాళీ చేయండి.

గోపి: ఏం—ఎందుకు ఖాళీ చెయ్యమంటున్నావ్?

కథకుడు: చెలియలికట్టదగ్గర తేలిన శవం ఇక్కడికొచ్చే వేళయింది. దయచేసి ఈ సీటు ఖాళీ చేయండి.

గోపి: అయితే నిజమే అన్నమాట. ఈ బెంచీ అక్షరాలా దెయ్యాల బెంచీయే అన్నమాట. సరేగాని పోయే ముందు నే నెవరో చెప్పిపోదామనుకొంటున్నాను. వింటావా?

కథకుడు: వింటే వచ్చిన నష్టంలేదు. చెప్పండి.

గోపి: నేను చెలియలి కట్టదగ్గర తేలిన శవం తండ్రిని. ఆనాడు నా కూతురు ఆహ్వానించినట్టు మా యింటికి వస్తే నీకు నేను మామగార్ని అయేవాణ్ణి. ఇవాళ మా అబ్బాయి అసలు సంగతి చెప్పాడు. అమ్మాయీ వాడూ కలిసి రోజూ ఇక్కడ నిన్ను ఈ పార్కు బెంచీదగ్గర కలుసుకొంటూ ఉండేవాళ్ళని ఇవాళే నాకు తెలిసింది. వెంటనే ఈ పార్కు బెంచీని చూసిపోదామని వచ్చాను. మరి వెళతాను. మరొక్క సంగతి. పోనీ ఎందుకులే—ఈ పార్కు బెంచీయే నిన్ను ఓదారుస్తుంది. నే వెళతా.

---

# స్త్రీల గేయ కావ్యములు



'కృష్ణశ్రీ'

స్త్రీల పాటలలో కథా గేయములూ గేయకథలూ మాత్రమే కాక గేయ కావ్యములు కూడా కలవు. కథా గేయాలలో కథ ప్రధానం గేయకథలలో పాట ప్రధానము. గేయ కావ్యాలలో గేయమూ కథా చక్కగా కలిసి సాగి, వేర్పాటు గోచరించక, మొత్తపు రచనకి కావ్యత్వసిద్ధిని సమకూరుస్తాయి.

'సురాభాండేశ్వరము'లో 'తళతళా యనుచు తాటంక రుచులు, జలజాక్షి పన్నీట స్నానంబుజేసి, కరకందు చీరయొకటి మీగాళ్ళ, కులుకుచూ నటియించు కుచ్చెళ్ళదీర్చి, తలిరి గృహములో దీపములు వెలుగా, చెక్కుటద్దములపై చెంగులు జారా, పిక్కటిలు సబ్బలా బిగువైన రవికె, తీర్చి......అందెలు, మొరయుచు ఘల్లనా మ్రోయుచుండగను, లోపలి కరుగు అతిసొగసులాడి' మన కన్నులకు కట్టినట్లు కనబడుతుంది. 'అంబరీషుని చరిత్రము'లో 'బంగారు మేడలూ పసిడి కోటలునూ, పారేటి కాలువలు పద్మాల వరుసలు, అచ్యుత అని యెప్పుడు హంసలూ బలుకొ, గోవింద యని యెప్పుడు కోవిలలు బలుకొ,' చక్కనైన వైకుంఠపురము బొమ్మకట్టుతుంది. 'బాలక్రీడల'లో గోపికలు యశోద కడకేగి "అందముగా మేమూ, వాకిట, దేవర గొలువగనూ। పందిలి వేసిత్తె కాళ్ళడన్నె మరి పాపము గాదటవే॥ యింపుతానో లమ్మా, ముందటి, వుంచిన పూపారములూ। పెంపుడు కోతికి పెట్టివచ్చెమరి పసిబిడ్డల పనులటవే॥ యెల్లప్పుడు మమ్మా, కలుసుకు, యెడబాయక వుండే। మా గొల్లవీథికి వెలతిలబట్టను, గట్టిగ నీకొడుకే మగడూ॥" అని చెప్పడము వింటే కృష్ణుడి అల్లరి చక్కగా బోధపడుతుంది. 'రుక్మిణీదేవి వేవిళ్ళ'లో "మారమా బోబాము మాపాడుముతో చద్ది నీవు చేయించవనమ్మ, చారలేనీ సన్నబియ్యపూ అన్నాన చద్ది వకటి కల్పుమా, పుల్లన్ని పెరుగు బోసి సాంతిపోడుములు వేసి పెరుగు చద్దొకటి కల్పూ, కమ్మన్ని నెయి బోసి కందిపొడుమూ వేసి కమ్మనీ చద్ది కల్పూ," అనుకుంటూ ఏళ్ళే గౌరీ, సరస్వతీ, అరుంధతీత్యాది పుణ్యస్త్రీలపాటలు వింటే మనకి కాకపోతే స్త్రీలకైనా నోరూరుతుంది. 'దారుకావన విహారణలీల'లో 'దివ్య సుందరరూపమును దాల్చుచు, డాకేల శాంబర నీటుగను మీటుచు, వలకేల బంగరు......చెంబూను దు ..జల్తారు ముడిసంచి కరమున దగిలించి ..... వచ్చు' సుందరేశ్వరుడూ, మార్కండేయ చరిత్రలో 'యురు మప్పళించి కనుబొమ లెగవేసి, తోడరి మీసమ్ము వడిబెట్టుకొనుచు, భుజగేంద్ర కైవడి బుసకొట్టుకొనుచు, ప్రళయకాలమునాటి పావకుని రీతి, బిల్వవనమునకు వచ్చి పెడబొబ్బలు' పెట్టే యముడూ మనకి ప్రత్యక్షమైనట్లు కనపడతారు. 'కన్యకామ్మవారి పాట'లో "వాసవి కన్యాంగనము, చేసి నీకొత్తె చెలులంత గూడి కురులు సన్నగ దువ్వి కొప్పుగా ముడిచి నుదుటను తిలకంబు నొప్పరంగ దిద్ది, నఖ శిఖాంతము భూషణములను బెట్టి, తహతహలాడుచు 'నీ ముద్దు ముచ్చట లేమి నే గంటి, కోమలి నిన్నెట్లు గుండెంబులోన, పసత్రోయ నగునమ్మ పద్మాయతాక్షి' అని విలపించే కుసుమశెట్టి భార్యను వింటే 'పాపము' అనిపిస్తుంది. కాని ఈపాటలన్నీ మొత్తమ్మీద కేవలము కథని మాత్రమే చెప్పుకుంటూ సాగిపోతాయి. కథనంతా చదివినతర్వాత 'బాగుంది' అని పించవు. కనక వీటి నన్నిటినీ గేయకథలుగా పేర్కొంటాము గాని గేయకావ్యము లనలేము. ఏపాటి అయినా 'కావ్యము' అనిపించుకోవాలంటే ప్రారంభించినదగ్గర నుంచీ చివ్వరివరకూ చదువరిని ఆకర్షించి, జల్లుమనిపించి, మనస్సుకి పట్టాలి; అంటే చదువరికి • రసానుభవ మివ్వాలి. పండితుల రచనలలో చదువరులను మెప్పించేవే గాని జల్లుమనిపించేవి చాలా తక్కువ; లేవని

అన్నా అనవచ్చునేమో. స్త్రీలపాటలలో మెప్పించ గలవి ఎన్నో ఉండవు; కాని హృదయతంత్రుల్ని స్పృశించి జల్లుమనిపించేవి మట్టుకు చాలావున్నాయి. "ఏడవకు కుశలవుడ రామకుమార, ఏడిస్తె నిన్నెవ్వ రెత్తుకుంటారు, ఉంగరమ్ములు గొనుచు, ఉయ్యాల గొనుచు, ఊర్మిళా పినతల్లివచ్చె ఏడవకు, పట్టుటంగీ గొనుచు బాజాలు గొంచు లక్ష్మన్న పినతండ్రి వచ్చె నేడవకు" అన్న సీతమాటలు విన గానే కడుపు తరుక్కు పోతుంది. స్త్రీలపాటలనిండా ఇలాంటి ఘట్టాలు కుప్పలు కుప్పలు. అయితే పాటఅంతా రసవంతంగా వుండి జల్లు జల్లు మనిపించగలిగేవి కొద్దిగా మాత్రమే ఉంటాయి.

'శ్రీరామపట్టాభిషేకము' అందమైన రచన. తొలిపుటలలో ఊర్మిళను నిద్రలేపే లక్ష్మణుణ్ణి చూపించి మన ఆపేక్షని రేపి, తరవాత పోగారు పని చేసినట్టు శ్రీరాముని పట్టాభిషేకాన్ని వర్ణించాడు రచయిత. ఆ ఉత్సవమంతా, 'పదునాలుగేండ్లు పైకప్పుతో ఎక్కనుర్వీపతి లేకయుండిన' సింహాసనము దగ్గిరున్నంచి, మ్రోసిన దుందుభులూ, చూసి వచ్చిన దివ్యదంపతులూ, పాటలుపాడిన అమర కన్యలూ, యోగమూర్తి జనకుడూ, మెచ్చుకునే పేరంటాండ్రూ, పరిహాసము చేయు పరమేశ్వరుడూ, 'నిండుగంగాజలము నింపినా గూనలో కుందనపు ఛమిడి కుండికనునుంచి యమరిన ఘడియారమూ', వసిష్ఠుని దీవనలూ, నివాళిలూ, గౌరి కళ్యాణాలూ, మంగళహారతులూ, కట్నాలూ, సింహాసనావరోహణమూ, నవనిధి స్వర్ణాన్, తేరూ, ఊరేగింపూ, తోరణాంతరగమనమూ, ఏలలూ, తేరు దిగుటా, దంపతులూ, సర్వమూ వర్ణించాడు. మధ్య మధ్య, ఊర్మిళను నిద్రలేపి వచ్చు లక్ష్మన్ననుచూచి, ఫాలకంటి 'ఇన్నాళ్ళవలె గాదు యినకులో త్తముడా, సౌమిత్రి వచ్చేటి సంభ్రమ్ముజూడూ, సతి లేపుకొని రాగ సౌమిత్రి ముఖమూ పొంగుమాసున్నదీ పుంజరీ కాక్షా, పదునాలుగూ యేండ్ల బసిరికలు దీర, లక్ష్మన్న ముఖారవిందములు జూడూ' అని చేసిన పరిహాసమూ, జనకుని గనిపుత్రులెల్లరూ 'జౌనయ్య నీభాగ్యమహిమయిది' యన్న మెచ్చుకోళ్ళూ, వసిష్ఠుని దీవనలూ, సభలోని దొరలువిన గా "వనచరులు జాంబవులు ఒనర రాక్షసులూ, కలలోన రఘుపతిని జూసి యెరుగుదురుమా, మన భాగ్యమున నైక వర మదిగో గానా, అడవి మృగముల నేల అవని పతికి కలిగె, కోతులు కను పెద్ద కొనియాడినట్టి, భ్రాంతి పడగలయట్టి ప్రభువులు గలరా" అనే హనుమంతుని సంతోషమూ, 'అకుశలపైనున్న ఆరామ సౌత్రి అలింగనము, చేసిన పార్వతీనాథుని దీవనలూ ఇమిడ్చి, కథని మానవహృదయానికి దగ్గరగా తెచ్చారు. నిద్రపోయే ఊర్మిళయొక్క శయ్యపై కూర్చుండి, "కురులు చిక్కులుదీసి శిరసుబ్బకొత్తి, కౌగిటజేర్చుకొని కన్నీరు' దెచ్చుకున్నాడట లక్ష్మణుడు. "అల్లుకొని తామరలు వల్లకలువల్లా, అల్లిబిల్లిగ బూసి రెల్లు గొన్నట్లు, ఇంద్రనీలాలు పోసులు బోసినట్టూ, పచ్చి పగడాల రాసులు బోసినట్టూ, ప్రాతఃకాలము భానుడుదయించినట్టు" ఉండినదట జన సమూహము. 'సంజీవిపర్వతం దెత్తిన హస్తముల' సుమిత్ర పద్మాలా కడియాలు పెట్టెనట! ఉజ్జ్వలమైన రచన శ్రీరామ పట్టాభిషేకము.

పోగారు పనిలో ఇంత జాగ్రత్త కనబరుస్తూ, ఉత్సవాన్ని కాక కథని వర్ణించేది పరబ్రహ్మము రచించిన 'చిరితొండరాజు చరిత్ర.' ఇది సిరియాళుణ్ణి వృత్తి జంగమునకు హారముగా సమర్పించిన శైవ గాథ. శివలోకమందు పరివారసమేతుడైన 'శివుని దేహమున్కనా చెమట బుట్టెనట'. 'దినదినమూపర వేదాంతిమూర్తి తిరిగి మర్దిస్తిరా త్రిపుర రాక్షసుల, మరల మర్దిస్తిరా భస్మాసురూని (?!)' అని పార్వతి అడుగగా హరుడు 'గురులింగ జంగముల కృప జూచువాడు, చిరితొండ సెనిశెట్టి చిన్నిభక్తుండు—మహేశ్వరు లీలాఖండంబు లడుగ—చిక్కులకపు తీగి ఖండించి కట్టి—యొత్తిజాచియు తాను గొరుత్తులో లేక—హరహరా యని బిలువ అచటికి బోయి, రాజుకి మోపెత్తి వస్తి నిప్పాడు, సతిజూడు నాకిపుడు చమట బుట్టెంది' అన్నాడట. పార్వతి ఆ భక్తుణ్ణి చూపించమంటే సదమని, 'కాషాయ వస్త్రములు ఘనముగా గట్టి—రాగి భూషణములు వంట ధరియించి, భస్మలేపనంబు బాగుగా బూసి, పులి చర్మమూ తోలు వంట ధరియించి, దండకమండలంతా జేత బట్టి,' శివయతి వేషము పాంబుడు వేస్తే, 'పసిడి కుచ్చులబొంత బాగుగా గట్టి, రమణొప్ప రత్నభూషణములు దాల్చి, రాగి భూషణములు వంట ధరియించి, చంక గొరుకులబుట్ట శిరసునను బెట్టి', పార్వతి యెరుక వేషము ధరించినది. సతిపతు లిద్దరూ సిరియాళపురి చేరి పూరి వెలుపల మర్రిమాను క్రింద విడారము (మా. 'చెన్నారు నాయిల్లు విడారు నీకు, కాళహస్తి మాహాత్మ్యం) చేశారు. చిరితొండడు జంగమార్చన వ్రతము నెరవేర్చుకోడానికి వచ్చి శివుని తీసుకువళ్ళాడు. తరవాతి కథ ప్రసిద్ధమే. సిరియాళుని నెత్తుకొని తల్లి 'వలను యింటను నీవు యేల బుట్టితివి'

అని విలపించడము వింత. (వెలమలు వీరశైవులా అని ప్రశ్న. బొబ్బిలి వెలమలకు వేణుగోపాలస్వామి కుల దైవము.) కథ మాత్రము చేర్పుగా నడిపినాడు రచయిత. జంగము కపటయోగి అయి, వాహన మేదీ యొక్క చిరితోంథని భుజా లెక్కడమూ, పార్వతి తిరుమళాంగదేవిదగ్గర స్వభర్తృ తిరస్కారము చెయ్యడమూ, పార్వతీ పరమేశ్వరులు సిరియాళుణ్ణి భయ పెట్టి పారిపొమ్మనడమూ, అన్నీ సిద్ధము చెసిన రాజ దంపతులతో 'బిడ్డలేని యింట కుడువని వ్రతమూ,' గొడ్డుబోతుల యింట కుడువని వ్రతమూ, నడిపితిమి మా చిన్నినాటనుండియును' అని పరమాత్మ అనడమూ, విషాద మతిశయించడానికి ప్రవేశపెట్టినవి.

'లక్ష్మణదేవరనవ్వు'లో కూడా కథా ప్రారంభము ఆకర్షవంతంగా ఉంది. రావణ వధానంతరము శ్రీరాముడు సుగ్రీవ విభీషణాది మిత్రులతో అయోధ్య చేరి, ఒకనాడు వెన్నెల బైట వేల సంఖ్యలలో గద్దెలు వెట్టించి కొలువుకూర్చుండి ఉండగా మేలుకొని కునికి, కిలకిలనవ్వె లక్ష్మణ దేవరప్పుడూ. కొలువులోని వారంతా ఎవరి లోపాలు వారు జ్ఞాపకము చేసుకుని, తమ్ము చూచే లక్ష్మణుడు నవ్వినాడనుకొని తలలువంచుకున్నారు. 'కొలువులో నవ్వుటకు కోపించి రాజా - తలతెగ వేతునని తాళ్మిమెత్తె' సీతా, ఈశ్వరుడూ అడ్డుపడ్డారు. 'నవ్విన కారణ మేమిటని' దండించి అడిగేడు రాముడు. దీనితో కథ ఒక్క దాటుని పర్వతశిఖరము ఎక్కి కూర్చుంది. లక్ష్మణుడు అడవిలో తాను చెప్పిన ఘడియకి సరిగ్గా నిద్రాదేవి తన్ను పొందవచ్చినందుకు నవ్వే నన్నాడు. రాముడి కోపనుతో పతాకదశకందుకున్న కథ లక్ష్మణుని వివరణతో ప్రతిపతాక (*Anti-climax*) కి దాటింది. 'తమ్ముని పల్కు లాలించి' విసే రాముడికి 'అరచేతికన్నీరు అతి సహస్రమాయె! స్త్రీలపాటలలో రసమెప్పుడూ ధ్వనిస్తానే వుంటుంది గాని పండితకవుల "అంతి నవ్వ డద్భుత రసంబయ్యె" అనే వాక్యాలలోలాగ వాచ్యముకాదు. నరుకుతానని లేచిన పాప పరిహారముకోసము రాముడు లక్ష్మణుని పాన్పుమీద కూర్చుని, తమ్ముని పాదములు తొడలపై నుంచుకొని వొత్తినాడు. ఇది ప్రకరి. లక్ష్మణుడు 'వకమారు వత్తితె వూరుకొనియుండె - రెండవ మాటికి కలగంటే ననెను. మూడవమాటికి కను విప్పి జూచి—కలగాదు నిజమని కడుభీతినొంది, ధరణీశు డనుట దెలసి ధరణిపై వ్రాలె. పాదములపయి నున్న తమ్ముణ్ణి యెత్తి, కనకసింహాసనమున కూర్చుండబెట్టి - చంద్రుడు లేని రాత్రి యెట్టిదట బోలు—తమ్ముడా నీవులేని సభయల్లె బోలూ—తమ్ముడా నీ విపుడు సభకు యేతెంచు'మని రాముడు సభకి తీసుకు వెళ్లేడు. ఇది కార్యము. ఈ కథకి బీజమూ, బిందువూ లేవు. లక్ష్మన్నకి నిద్ర కునుకు రావడమూ, అతడు నవ్వడమూ అన్నవే బీజమూ బిందువు అనుకోవాలి. పతాక, ప్రకరి, కార్యములు మాత్రము తెలుస్తున్నాయి. అటుతర్వాత కథకీ లక్ష్మణుని నవ్వుకీ సంబంధము లేదు.

స్త్రీల పాటలలోవి అన్నీ ప్రఖ్యాత కథలే; కుచేలుని పాటా, రుక్మిణీ కల్యాణమూ, అంబరీషుని చరిత్రమూ, ధృవచరిత్రా, గజేంద్రమోక్షమూ, రామాయణ కథలూ, భారత భాగవత గాథలూ, శైవ గాథలూను. (ప్రహ్లాద చరిత్ర నాకింకా కనపడలేదు) అక్కడక్కడ సూర్యుని సుత్తాలూ, అశ్వత్థ ప్రదక్షిణమూ వంటి ఖండ గేయాలూ; వశిష్ఠ వాక్యాలూ, వేదాంతపుచ్చెల కథా, వంటి తత్త్వపు పాటలూ; తిరుమంత్రపు కీర్తనా, ప్రయాగ ధవళమూ వంటి సగము సగము ఆధ్యాత్మిక గేయాలూ వున్నాయిగాని, ధర్మాంగచరిత్రా, సారంగధర పాటా వంటి ఐతిహాసికాలు తగినన్ని లేకపోడము చిత్రమే. ధర్మాంగ చరిత్ర ద్విపదలలో ఉంది. కథ అంతా పడవప్రయాణమువలె జాలుగా సాగిపోతుంది. రచయిత ఎక్కడా ప్రత్యేక సౌందర్యము సాధించడానికి యత్నము చెయలేదు. కనక మొదటినుంచి కొసవరకూ ఏదో కథ జరిగిపోతోందనే అనిపిస్తుంది గాని, ఎవరో కవి చెప్తున్నాడనిపించదు. మానవ దంపతులకు పాము పుట్టడమూ, ఆ నిజము దాచి మంత్రులు కుమారుడే పుట్టేనని చాటించడమూ, కత్తికి బాసికము కట్టి కోడల్ని తెచ్చుకోడమూ, ఆ పిల్ల పామును తీసుకుని తీర్థాలన్నీ తిరగడమూ, చివరికి బ్రహ్మగుండంలో స్నానము చేస్తే పాము బాలకుమారు డవడమూ— అన్నీ ఆశ్చర్యపడకుండా మామూలు కథ చెప్పినట్లే చెప్పుకుపోయాడు రచయిత. అతని ఉద్దేశం మాత్రము ఈ కథను యిందీవరాక్షులు వినాలనే. ఛందస్సు నూటికి తొంభయి పాళ్లు ద్విపదలలోనే వున్నా యతులకోసము పెద్ద ప్రయత్నము చెయ్యక, పడని చోట యతిని లాక్కువచ్చి వెయ్యకుండానే నడిపించుకుపోయాడు కవి, కాని పండితుడు మాత్రము అవును. దేశాల పేరూ, త్రైలోక్య సుందరి అంగ సౌష్ఠవమూ, అర్కిలిదేవి బుజ్జగింపూ, తీర్థసంసేవనమూ, బ్రహ్మగుండస్నాన సన్నాహమూ, కథ యొక్క వాస్తవిక వక్రగతీ, నడపడానికి పాము

రుడికైతే ఓపిక ఉండదు. సరిగ్గా ఈ పాట పేరింటిదే పూరి నారాయణరాజు రచించిన సుదీర్ఘమైన పదమొకటి ఉంది. పేర్లు మాత్రము రెండింటిలోనూ ఒకటే; అప్పైతే కథాకల్పన అంతా వేరే.

'సారంగధర పాట' చక్కని రచన. ఈ వింత కథని రాజనరేంద్రుడికీ 'రాజమహేంద్రము'కీ ఎందుకు ముడిపెట్టేరో తెలియడము లేదు. రాజమహేంద్రవరములో పాటక జనులలో మాత్రము, సారంగధరుడి తెగిన కరచరణాలను సిద్ధులు బాగు చెయ్యడమూ, సారంగధరుడు బైరాగులలో కలియడమూ ఉన్న ఈకథే ప్రచారములో వుంది. ఇది శైవగాథలలాగ "పర్వతాలమల్లన ధిమిడి మేడల మీద వెలిగించె తోగిరూపు" అని శివస్మరణతోనే ప్రారంభించినా, 'శ్రీరామచంద్రుడా సీతమహాదేవి విభీషణ వరద కావు' అని సారంగధరుని చేత పలికించడమూ, ఆకాశవాణి రాజనరేంద్రునితో 'ప్రహ్లాదు నీవంటి పరమభక్తుడు వీడు' అని సాక్ష్యము చెప్పడమూ చూస్తే శైవవైష్ణవాలు రెండూ కలిపి మెలిపి ఉండిన విజయనగరానంతర కాలములో ఈపాట రచించబడి ఉంటుందనిపిస్తోంది. ఇది కేవలము స్త్రీలపాట మాత్రమే కాదేమోనని దీని జంగం కథ పోలికలు అనుమానము కలిగిస్తాయి. స్త్రీలపాటలలో సందర్భానుసారంగా కథలు ఇమిడ్చి చెప్పడము కనపడదు. ఈ సారంగధరపాటలో రత్నాంగి, సారంగధరుణ్ణి నేరవిచారణచేసే రాజనరేంద్రుడికి రెండుకథలు చెప్పుతుంది. పాలుతాగే బాలుడి బుగ్గ మీద రక్తపు మరకచూచి, పెంపుడు ముంగిస తన బిడ్డని కరిచిందని భర్తతో చెప్పి ముంగిసని చంపించిన బ్రాహ్మణిగాథ ఒకటి. తరవాత తుంపెములైన పాము శరీరము చూపి నిజము తెలుసుకుని, 'భరని పరికించి' దానిని దహనము చేశారట. దంపతులు, ఇది ఆతురకోపము అనర్థకారి అని సూచించేకథ, రత్నాంగి మరొకకథ చెప్పింది. చోళదేశములో నిమశాపురము నేలు చిత్రకేతుడను మహారాజు ఒక చిలకను పెంచాడు. ఒకనాడు పక్షిజాతులన్నీ పయనమైపోతూ 'దేవతావనములకు వేవేగపోదాము వత్తువా పక్షిబావా' అని ఈచిలకని పిలిచాయి. రాజు ఆజ్ఞపుచ్చుకుని చిలక వాటితో వెళ్ళి, తింటే మానవాకారమిచ్చే మామిడిపండు ఒకటి ముక్కున కరుచుకుని రాజు దగ్గిరకి తిరిగి వెళ్ళింది. రాజు ఆపండుసంగతి విని తనతోటలో నాటించాడు. అది మొక్కై, మ్రానై పండు పండింది. అది కిందపడగా ఒక పాము దానిని కొరికి విషఫలమైపోయింది. ఈ సంగతి గ్రహించని హార్కారు ఒకడు అంతఃపురములో ఆ పండునప్పగించాడు. తొలి పండును తను పండితులకిచ్చి, మలి పండు తాను తినవచ్చునని దానిని మంచిలపతి ఒక బ్రాహ్మణుడికిస్తే, ఆ(విషాక్త) ఫలము తిని బ్రాహ్మణుడు వెంటనే చచ్చిపోయాడు. 'అయ్యయ్యో బ్రహ్మహత్య అరక్షణములోగల్గి అధికపాపము వచ్చెను'అని వాడిగల ఆయుధముతో పక్షిని చంపేడు రాజు. తర్వాత ఒక వేశ్య తనకూతురుతో పోరాడి, చచ్చిపోదిద్దామని ఆచెట్టు కిందికివచ్చి పండుతిని, పన్నెండేండ్ల బాలకన్యక అయింది! ఈ వింత తెలుసుకుని రాజు పశ్చాత్తాపము పొందేడు. మొదటి కథలో బ్రాహ్మణుడికి తన తప్పు వెంటనే తెలిసింది. రెండో కథలో ఆలస్యంగా తెలిసింది. ఈ కథలవల్ల 'నిజము నిలకడమీద తెలుస్తుంది. తొందరపడకయ్యా స్వామీ' అని రత్నాంగి హెచ్చరించింది. రాజు వినలేదనుకొండి. చివరకు ఆకాశవాణి నిజము చెప్పింది రాజుకి. ఇలాంటి కథలు 'కుశలవ కుచ్చల కథ'లో రెండున్నాయి. సుదీర్ఘమైన పదాలలో ఇముడ్చగల 'పిట్టకథల్ని' స్త్రీల పాటలో ఇముడ్చ యత్నించడము సారంగధర పాటలోనే కనబడుతుంది. ఈ పాట 'తకిటతక' అనే అయిదక్షరాల ఆవృతాలు నాలుగు గల తొలి పాదానికి, రెండు 'తకిటతక'లూ, ఒక దీర్ఘాక్షరమూగల మలిపాదము చేర్చిన వరుసతో వుంది. రెండో భాగంలోని దీర్ఘాక్షరం పది అక్షరాలకాలము సాగితేనే గాని పాదాలసామరస్యము నిండదు. ఒక్క దీర్ఘాక్షరము రెండు ఆవృతాల మేరకు సాగడము ఈ పాటలోనే కనబడుతుంది.

స్త్రీల పాటలకి రామాయణము అందివచ్చినంత సులువుగా తక్కిన పురాణాలు అందిరావు. మానవ హృదయస్పర్శ రామాయణంలో వున్నంతగా తక్కిన గాథలలో ఉండదు. అందుకే హృదయవాదులగు స్త్రీసారస్వతనిర్మాతలు రామాయణము మూలమూలలా వెతికేవారు కథలకోసము. ఊర్మిళాదేవి నిద్రా, సీత అగ్నిప్రవేశమూ, రాఘవ కల్యాణమూ చక్కని కథలు. సీత ముద్రికలూ, సీతాదేవి ఆనవాళ్ళూ మధురస్మృతులు. ఊర్మిళాదేవి నిద్రసంగతి జానకీదేవి రాముడికి జ్ఞాపకము చేస్తుంది. 'ప్రియురాలి దగ్గరకు నీవు పోయి, సరససల్లాపములచే, దుఃఖోపశ్రమలెల్ల మాన్పవయ్యా' అని లక్ష్మణుని పంపుతాడు రాముడు. లక్ష్మణుడు వెళ్ళి ఊర్మిళపాన్పుపైన కూర్చుని ఆమె దేహము నిమురుతూ 'విరహభాష

ణము' చేస్తాడు. ఊర్మిళ లేచి కోపతమకముతో వణుకుతూ 'అయ్యో మీ రెవ్వరయ్యా! మీరింత యాగడమ్ముల కొప్పైరీ, మా తండ్రి జనకరాజా! వింటె మీము యాజ్ఞసేయక మానరూ, మాయొక్క బాధ విన్నా! మీకిపుడు ప్రాణమునకు హానివచ్చు, మా యక్క మఱిది విన్నా మిమ్మిపుడు బ్రతుకనివ్వరు జగతిలో' అని భయపెట్టి ఉదాసీనుడైన ఆగంతుకుడికి చీవాట్లు పెట్టడము ప్రారంభిస్తుంది: 'ఒకడాలి కోరి గాదా ఇంద్రునికి ఒడలెల్ల హీనమాయె, పరసతిని కోరి గాదా రావణుకు మూలముతో హానిమాయెనూ', అంటూ కూవరసనే. తన్ను గుర్తించలేదని లక్ష్మణస్వామికి నగవువచ్చింది. 'శ్రీరాము తమ్ముండనే' అన్నాడు. 'అతడనగ సృష్టిలో నొకరు గలరా' అన్నది. 'జనకు నల్లుడ గాదటే' అని తండ్రిని జ్ఞాపకముచేశాడు. 'భూమిలో జనకులనగా నెవ్వరూ' అంది. కాని కొంత మెలకువ వచ్చింది. 'శత కమలమున బుట్టినా చేడెరో సీతకును మఱదీ గావా' అన్నాడు. స్ఫురణా దానితో కోపమూ వచ్చాయి ఊర్మిళకి, 'సీతయనగా నెవ్వరు, భూమిలో సృష్టిక నేను రెఱుగా' అన్నది. గట్టి దెబ్బతగిలింది లక్ష్మన్నకి. ఏమి చేయగలడూ, కృతాపరాధు డాయెను! "నిన్ను బాసినది మొదలూ, ప్రాణసఖి నిద్రాహారము లెరుగనే, నీవు లేవకున్నను ఓసఖి ప్రాణములు నిలుపలేనే, అనుచు కన్నుల జలములూ' కారంగ బల్కి 'కత్తిరొమ్మున తీసి వాదము చేయగా' ఊర్మిళా గద్దిల్లి పడి లేచి, పతిపాదపద్మములకూ, ప్రణమిల్లి పసితి లేవక యున్న' తన పతిని కరమునా లేవనెత్తి గుచ్చికౌగిట చేర్చి యా కాంత కండ్ల జలములు దుడిచెనూ' 'మా తండ్రి జనకరాజా మిము నమ్మి మరచి పెండిలి జేసెను' అని కుమిలింది. ఏవో తాపోపశమన వాక్యాలు ఆడినాడు. కౌసల్య వచ్చి వారిద్దరికీ శిరసంటింది. భోజనశాలలో అణి ముత్యాల పీటమీద లక్ష్మన్న కూర్చుంటే శాంతాదేవి 'మరకతా మాణిక్య రమ్యం' టే 'మురిపెంపు సిగ్గుచేతా చిలుకలా కోలికి ముఖమటు వంచెను' భోజనాలు చేసి తాంబూలాలు వేసుకుంటూంటే శాంతమ్మ 'చెడ వినవే జానకీ చెలియ ఊర్మిళ బుద్ధులన్ని, పైడిపానుపుల సోలి యుండె నొక పదునాలుగేండ్లు పతితో, కుందనపు ప్రతిమకళలూ, ఈ కళలు రెండుండి దాగున్నవో' అన్నది. అంతమట్టుకు బాగానే వుంది. అందరూ సంతోషించారు. అడిపకుచు మఱవలి నంలతో విడిచి పెట్టునా? 'దృష్టి తగులాకుండునూ సీతాల నివాళులివ్వరమ్మా' అన్నది. మాటకారి సీతమ్మ జవాబు చెప్పింది "ఇంద్రాది చంద్రముఖాను మించేటి చంద్రములా మీ తమ్ములూ, దృష్టితగులకుండ వారికే నివాళు లీ"మ్మంది. శాంతమ్మ మళ్ళీ విసిరింది: 'అక్కచెల్లెండ్రు మీరు మిక్కిలి సౌందర్యశాలురమ్మ, మాతమ్ముల వలుగురినీ వలపించు జాణలకు దృష్టి తగులూ' అని. దీనితో సామాన్యులకి ఆటకట్టిపోతుంది. సీతమ్మ ఆట కట్టునా? వినండి వరహాల మూట్టికాయ! "మా యన్న ఋష్యశృంగూ వనములోనుండి బాయకున్నా, రేమి రెరుగని తపసినీ ఓ వదిన కేళించి విడిచి నావూ" అన్నది సీత. నాదన సోమిడి ఊర్వశీ వరకాసురుల సంభాషణ దీనితో తులతూగునంటారా? తరవాత "మల్లెపూవులగాలి విసరగా శయ్యపై కూర్చుండిరి" ఊర్మిళా లక్ష్మణులు. "కీలుకొప్పమర విడచి లక్ష్మణుడు నేర్పుతో జడలల్లెను, బొండుమల్లెలు జాజులు జడపయిని శృంగారముగ జుట్టెనూ, తాంబూలములు వేయుచూ దంపతులు కలసి ముచ్చటలాడుచూ" ఉన్నప్పుడు సీతమ్మ చెరబోయిన గాథ చెప్పేడు లక్ష్మణుడు.

సీత అగ్నిప్రవేశము, పురుషులమీద స్త్రీ హృదయము ప్రయోగించిన బ్రహ్మాస్త్రము. శ్రీరామచంద్రుడు రావణుని చంపి సీతమ్మను తెమ్మన్నప్పుడు ఆమె జడలుగట్టిన తలకట్టుతో మాసిన వస్త్రముతో ఉన్నది. వచ్చి రాముని పాదములపై వ్రాలినది. "పాదములపయినున్న పసితి నటు దీసి, లక్ష్మణా వినవయ్యా...తన క్లిష్టమగునట్లు తరలి పొమ్మనుము" అని రాముడు కనకరథము నెక్కి వెళ్ళిపోయాడు. 'పోకు పోకుము రామ పోకు శ్రీరామ' అనినంత యా రథము నాగలేదాయె. 'భూదేవి పుత్రికను శ్రీరామసతిని నాయాన' అన్నది. ఆగిపోయింది రథము. 'చిచ్చు గావింపుమా అందు జొచ్చెద'నన్నది. 'గడగడ వణకుచు యా లక్ష్మణుండు, కడుదుఃఖమున తాను కన్నీరుగార్చ, భయమేల మరదిరో పాపంబు లేదు, ద్రోహంబు గల్గిన దగ్ధమయ్యెదను, ద్రోహంబు లేకున్న బ్రతికి వచ్చెదను' అని చెప్పి ముమ్ముందు నగ్ని పూజించి, 'నాయందు పాపంబు లేకయుండినా, అగ్నిగుండము లారి కొలను లాగుండు, నిండుమంటలు చెంగ సీరుగా మారు నిప్పులన్నియు గూడి కుంకమై వెలయు' నని అగ్నిలో ఉరికింది. అంపట గుండంబు చల్లారె, భూదేవితా వచ్చె పుత్రికను రెత్తె.' లక్ష్మణుడు సీత నిర్దోషి అన్నాడు. రాముడంటాడు: "అటులనకు లక్ష్మణా ఆడువార

లును, అగ్నిమంత్రింబున నగ్నిబట్టేరు." అగ్ని దేవుడు పలికి, "కాని మాటలు బల్కు ఘనమ శ్రీరామ, సీత పతివ్రత శ్రీలక్ష్మి" యన్నాడు. దశరథుడు 'సీత చెరనుండగా నరకమందుంటి, సీత చేకొనుమింక సిద్ధించుసుఖము' అన్నాడు. 'అగునంచు బలికె దా నశరీరవాణి.' ఈ కావ్యము చదివితే రాముడిమీద మనకి కోపమువస్తుంది.

సీతముద్రికలు, సీతాదేవి అనవాళ్లు మేఘసందేశాన్ని జ్ఞాపకము చేసే గేయకావ్యాలు. హనుమంతుడు సీతకి అనవాళ్ళిమ్మని అడిగితే శ్రీరాముడు తన మధురజీవితములోని సుందరఘట్టాలు చెప్తాడు. ఆమె "తల అంటు అడకే ఆడినట్లుండు' పచ్చి పసుపలదకే యలదినట్లుండు, తొలకరి మెరుపువలె తా వెలుగుచుండు." తొలిసారి శ్రీ రాఘవులు పారిజాతపొన్నపవ్వళించి యుండగా, 'గొజ్జంగి రేకులా కొప్పుజారగను, పణతి పాపిటచేరు బొట్టు దూలాడ, గాజుకంకణమ్ములు మెరయు పద్మాయతాక్షులా పణతిని కోడి తెచ్చి, బంగారుకలువులకు తాళములు వేశారు. శ్రేలి యుంగరముదీసి ముందార వేసి పద్మాక్షి తెమ్మ'ని పలికినాడట స్వామి. 'కొత్తగా కట్టిన చిత్రకూటములో స్నానమాడుటకు పోయి, తిరిగివచ్చి, రాముణ్ణి తీసుకువెళ్ళి, 'ఇది యేమి చోద్యమో యినవంశజా డా, మింట చంద్రుడు వచ్చి ధరణి నున్నాడు, తుమ్మెదలాడుచున్నవి మాడరమ్మ'న్నదట సీతమ్మ. 'మింట చంద్రుడుగాదు సఖియనీమోము, తుమ్మెదలవిగావు సఖియ నీ కురులు' అని పలికినాడట శ్రీరాముడు. ఆదర్శదంపతుల సంయోగ శృంగారాన్ని ధ్వనిస్తూ 'సీతాదేవి అనవాళ్ళు' ప్రబంధకవుల పచ్చి శృంగారాన్ని దిగదిడుపుచేస్తుంది.

'సీతముద్రికలు' చిత్రమైన గేయకావ్యము. అశోకవృక్షపు కొమ్మలలో దాగిన హనుమంతుడు తనముందు పడవేసిన రామముద్రికతో సీతమ్మ తన చరిత్ర చెప్పుకుంటుంది.

తన పతి, వినయము, నా |
　　తండ్రి వా,క్యమ్ము పూని,
తాపసు,ల మహి,మా |
　　దండకా,రణ్యసీ,మ
అలసి తి,రిగి చా,లా |
　　అడచే, పర్ణశా,లా
ఉచితముగ, నొకటి వే,సి |
　　ఉంటిమే, మా ర్తి బా,సి
వినవే పా,చికలాడు,చుంటిమి,..,
పర్ణశాలా,వాకిటను, కనక మృ,గము కను
　　　　　　గొంటిని,...,
నా మనసు, గు ర్తెరిగి, చనెనే రా,ముడు
　　　　　　దాని,వెంటను,..,
దానవుడ,ని తెలిసి, దవరు బా,ణము సం,
　　　　　　ధించెను,..,
నూటిగా, వేసెను ॥ వినవే ము,ద్రిక నాటి,
　　　　　　వింతలు ॥,..,

మొదటి నాలుగు పంక్తులూ, 'తకిట' అనే ఆరేసి ఆవృత్తాలవి. ఐదోది నాలుగావృత్తాలే కాని అవృత్తానికి సాహిత్యాక్షరాలు 'తకకిటతక'లుగా పెరిగి పాటని బిగిస్తాయి. తరవాతి పాదాలు మళ్ళీ ఆరేసి 'తకకిటతక' ఆవృతాలే గాని ఆఖరి ఆవృతానికి అక్షరాలు ఉండవు. పాదాలలో యతులూ అంత్యప్రాసలూ పడతాయి. అంత్యప్రాసలు పడడమువల్ల (అధ్యాత్మ రామాయణమూ, శారదరామాయణమూలాగ) పాట బిగువు ఎక్కువైంది. ఈ పాట మొత్తంలో పైన ఇచ్చినలాంటి ముద్రికలు ఏడట. వరస తెలియనిదము కష్టము గనకే కాబోలు ఈ పాట అచ్చైనట్లు కనబడదు. కథా పాటా కూడా చక్కగా కలిసి వస్తాయి పాట వింటూంటే. వినవలసినపాట 'సీత ముద్రికలు'

'రాఘవకల్యాణము' 1910 లో మంగు వెంకట రంగనాథరావుగారు అచ్చువేయించారు. ఈయన నూరురకముల పాటల్ని అచ్చువేయించి ప్రచారము చేశారు. ఆరోజుల్లో ఈ పాటల్ని అమ్మేవారు వీటని పాడుకుంటూ తిరిగి అమ్మేవారు. రచయితలు ఫలానా అని తెలియకపోడమువల్ల కాపీరైటుబాధలేక, చెన్నపట్నములోని వేలూరి కుప్పుస్వామి మొదలి, రాజమహేంద్రవరంలో ముగ్గురు నలుగురు పుస్తక విక్రేతలూ ఈ పాటల్ని విరివిగా అచ్చువేసి ప్రచారము చేశారు. వీటినిండా అచ్చుతప్పులు కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. సవరించి అచ్చువెయ్యవలసిన అవసరమెంతేనా ఉంది...రాఘవకల్యాణము రామలక్ష్మణులు మిథిలకి చేరడముతో ప్రారంభము. శ్రీరామచంద్రుని చెలువమును చెలికత్తెలు,

మన్మథు,నీ కన్న, నూ.., దురియునా,
　　హరిహరా,దుల కన్న,నూ, ,
అతను చం,ద్రుల కన్న,నూ..,
　　అతి, రూపమ్ము, గలవార,డే, ,

పుండరీకాక్షుండు పురుషోత్తముడు
రామచంద్రుడు నీకు తగునా॥

అని చెప్పేరు. ఆమాట విని 'ఉప్పరిగె మేడలో కొప్పుగా నా సీత గవాక్షంలే జూచెను.' రాముడు కనబడలేదు. ఏమి చేయగలదూ? 'శృంగారమాతున్న విరుల పానుపుమీద పలుమారు పవళించెనూ(!)' 'పవళించు ఇంతికీ పాదములు ఒత్తుతూ వీవన్నలే విసరిరీ; పరిమళాదులు చల్లగా అంతటా భాస్కరుడు తా క్రుంకెనూ; పున్నమ్మ చంద్రుడూడు పడుకున్న ఇంతికీ పడిరయుండిపైతోచెనూ; 'ఇనరశ్మి కాదు అమ్మ విను సీత పున్నమ్మ చంద్రుడూ; నిన్నింత వేచెటి మన్మథునిపట్టి పంకెళ్ళ వేయింతమా'; అణిముత్యపు శేరులూ అన్నన్ని సున్నంపు పేరులాయె; పానుపూ విరులన్ని కసవుచే పోలెను కనులనే నీ దేహమూ;' అని శైత్యోపచారాలు చేశారు. 'నిండు మక్కాలలారా నిలవర్షుణ్ణి గావారుగా, మింటనైనా తాను అంటివుండానైతి అందునుండే చూతునూ' అనుకుంది సీత. ఇంక తానేమి చేయగలదూ? 'కలికి చిలుకా చెప్పమా తినా కల్యాణవిభునితోనూ, హరు విల్లు విరిచియూ తిన్న పెండ్లాకుమని ఆ రామచంద్రులతో' విల్లొకటి వచ్చింది మధ్య! 'ఈ విల్లు విరవగా కాని నేనివ్వనని ప్రతిజ్ఞ జేల బలికె' అని విసుక్కుంది. కాని విసుక్కుని ఏమి లాభమూ? 'సకల లోకముల కెల్లా నీవు కర్తవే గణనాయకా, లెక్కలేని టెంకాయలూ నీకిస్తు హరివిల్లు విరిచినమా!' ఇక అక్కడ కొలువుకూటములో. ఆ రామలక్ష్మణులకూ ఆ జనకు డెదురు నడచీ, శీఘ్రముగ శ్రీపాదపద్మములు నడిగియో సింహాసనా లిచ్చెనూ. ఇక మాస్తున్న తక్కిన రాజు లేమనుకుంటున్నారూ—'మేటిరాజుల కెల్లనూ రెుచ్చోట స్థలమెరుపని జూపకా, చిరుత బాలల కిట్లు సింహాసనాలియ్య నిరిఠెంత దొడ్డదనికీ.' రాముడు వచ్చిన పని వ్యక్తరించి విల్లు తెప్పించ మన్నాడు. తెప్పించారు. అప్పుడంటాడు లక్ష్మన్నతో: 'భోజన మొప్పకున్ననూ పౌఖ్రిత దినమెల్ల వృథా సుమా, అలి ఒప్పకున్న జన్మమెల్ల వృథా చూపేలా ఓ లక్ష్మణా. నడుము సన్నము, నాడుమీ ఆ యింతి నలుపుగాకుండ చూడరూ'(!) రాఘవకల్యాణమంతా ఇంపైన కావ్యము. వివాహమూ, సమాగమమూ అన్నీ వర్ణించాడు ధీరయితే. సీతాదేవి అన వాళ్ళలోని ఒక గాథ రాఘవకల్యాణములో జరిగిన ఘటనే, రాముడు సీతకు అద్దములో ఆమె ప్రతిబింబము చూపి ఇంకొక స్త్రీయా అని ఏమార్చడము.

రామాయణగాథలలోనూ, భాగవత గాథల్లోనూ స్త్రీల పాటలు పోషించుకునే వస్త్వైక్యత చాలా ఆశ్చర్యజనకము. 'గుహాభరతుల అగ్నిప్రవేశము'లోనంతటా సాఫీగా నడిచిపోయే కథే వినబడుతుంది. కాని 'భరతుడు...రాజ్యకాముడైన రాజ్యము లిచ్చి, ఇక్కడ నుండాము ఈ మునుల గొలచీ, మవరాక మనపీటి మహాత్ములకు జెప్పూ' అని రఘురాముడు హనుమంతుని పంపునప్పుడు సీతమ్మ గుహరాజు సంగతి జ్ఞాపకము చెయ్యడమూ, గుహుని అగ్నిప్రవేశయత్నము మున జాల గట్టలవెంట విని 'చముగుకుచు విస్తలూ ధరణికి దిగగా, అందుకుని కురులు విడి సెర చిక్కుదూలా, కట్టుకున్న బట్టలు ఘనముగను వెలుగ, సురిగింజ పూసలా కొలది ముత్యాలు, కుచముల వసుమను సరులు తూగాడా, కొల్నడిల అగ్నికి ఆహుతు' లౌటకు గుహుని రాణులు బయల్దేరడమూ, తాను అగ్నిలో పడకుండా అడ్డిన హనుమంతునితో గుహరాజు 'బ్రతికి నే కొరగాను బంధువులకెల్లా, పేదలకు భరతుండు రాజ్యాధిపుండు, అగ్నిలో భరతుండు పడకుండ బోమ్మా' అని హెచ్చరించడమూ, 'తిమ్మలానైనాను తలచి రావయ్యా, మమ్ము దలచవుగాని మాటలను విలచీ, రాకున్న వగచేము రావయ్య వేగా' అని అయోధ్య యింతులు 'కుయ్యిగా' వనములలో కోటానకోట్లుగా కోయిలలు కూయడమూ, గమనిస్తూ చదువుకుంటూపోతే, రాముని రాక ఇంచుకంత ఆలస్యమైపోతే అయోధ్యలో ఎంత అలజడి పుట్టిందో కళ్ళకి కట్టుతుంది. కుప్పలు కుప్పలు అద్భుతప్పలతో ఎన్నడో అచ్చయిన గుజిలీ ప్రతి చాటున గుహ భరతుల అగ్నిప్రవేశము 'హంసపత్రాంతరితమైన ప్రసవమట్లు' చల్లని సుగంధము విరజిమ్ముతోంది. భరతుని అగ్నిప్రవేశయత్నము చూచి కౌసల్య కడుపు కరిగిపోయింది. "అర్కకులు కన్నీరు అరచేతి తుడిచే, అగ్రజుని జూపేను అగ్ని జొరకయ్యా, వీరి అన్నతో కూడ వీరావదిన నేడూ, నా అన్న జూపేను మరి యగ్ని జొరకూ, నీ వెల్లెరిగితిని తిన్నడిగితి వయినా, కన్నాను అదరేను... స్తన్యమున పాలు చేసేను, నేను నీ కొడుకునూ నీవె జూతు వనుదూ, తిన వాము నయనమ్ము తెన్నారడింమా, వేగిరపడకు భరత..." అనే కౌసల్య క్లేశములు కపి బాపదలచీ 'అమ్మనీ కింతేలె అంగలార్పగనూ' అని చల్లని వార్త వినిపిస్తాడు ఇంతిమాత్రముతో సొగసు అగదు. 'ఏమిరా పావకుడ... పెద్దనుండేద వింకా, ఇక్కడక్కడ వనక సెచోట వనక, కుడిచేటి కష్టపడు కార్యమెరుగావూ, భరతుడు చూడగా బంధించి

నిన్నూ, భస్మమ్ము జేసేను బంటునై నిలువగా' అని పావకునిలో ఉరికి చెదిర్చిపారేశాడు హనుమంతుడు! ...'శ్రీరాఘవేశ్వరుల నయన జలములు కైకాత్మజాని మేను కలయంగ తడిపె, శ్రీరాఘవేశ్వరుల నయన జలములను, కైకాత్మజాని కభిషేకమ్ములాయె'నట! 'అల్లంతట వశిష్ఠు రాగాను జూచి, తమ్ముడు తానును సాష్టాంగ మెరిగి, తమ తండ్రి యేడన్నాడట కరుణా కుమారుడు. వశిష్ఠ ఋష్యశృంగులకు అందరూ మొక్కుతూంటే హనుమంతుడు 'ఎందరైనా మునులు రేమెన్నిగాని, ఏడిపించెటి (కపట) మునిని యెక్కాడ మూడా' నన్నాడట! "భమిడి మేషిలలోను కనక స్తంభమునా, బంధించీయున్నదీ పట్నపేనూగా, భమిడి గొలుసులతోను పట్టుకొనివచ్చి, గంగ భాండమ్ములా కడిగి చల్లార్చి, అంబరమ్ములతోడ అంభారి జేసీ, జోడుల ఘంటలూ పొలుపమరగట్టి, మూపురమున ఘంట మ్రుదమురగానూ, తెచ్చియూ శ్రీరాము ముందిర నిలిపితే 'కన్నీరు తెచ్చినదట' సామజము. 'ఎదురుగా వచ్చేటి తనయులను జూచి కన్నులా జలములూ కారుతూ నిలిచిందట' కౌసల్య. అడుగడుగుకీ రఘుస్వని చిప్పిలే అమృతఫలము సుహాధరతుల అగ్ని ప్రవేశము. 'పవిత్రములు బట్టి' రాఘవుడు స్నానము చేశాడని చెప్పడమునుబట్టి ఎవరో వశిష్ఠుడే ఈ గేయము రచించాడనీ, 'జాలగర్జు' అన్న కోవపీయ పదాన్ని వాడడాన్నిబట్టి అతడు గోదావరీ గర్భదేశమువాడనీ ఊహ చెయ్యవచ్చును.

ఈ పాటల కర్తృత్వమును నిర్ణయించడానికి ఇంతకంటె పెద్దఆధారాలు లేవు. ఎవడో ఒక కవి—లింగంపల్లి గోపయ్యవంటివాడు—తన పేరు వేసుకుంటాడు చివ్వర, తక్కినవారంతా 'పాడినవారికి బ్రహ్మలోకమూ, విన్నవారికి విష్ణులోకమూ' చూపిస్తారు. పాటలలో ఎక్కడేనా కీర్తన వుంటే,—మంగళహారతిలాంటిది—ఆ కీర్తన చివ్వర రచయిత పేరు దొరకవచ్చు. కీర్తనల చివర పేరు నిముడ్చడము జంగం కథలూ, చంపూకావ్యాలూ, కీర్తనలూ, రచించేవారి అలవాటు. దీనినిబట్టే, వెంకటనాథుడు వెంకటేశ్వర్ల వేటా, హరిదాసు తిరుమంత్రమూ, రామకృష్ణుడు గజేంద్రమోక్ష కథాగీతిమూ, కరణము ఆదినారాయణదాసు సూక్ష్మ రామాయణమూ, పరిబ్రహ్మము చిరితొండరాజు చరిత్రా, పరాంకుశ శేషదాసు శ్రావణశుక్రవారాలపాటా, అళఘురి శఠకోపాచార్యులు గోపికా కృష్ణలీలలూ రచించినట్లు తెలుస్తుంది.



# రసము - అనుపపత్తి సప్తకము



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

రసమును సమ్యఙ్మిథ్యాసంశయ విపర్యయముగా గాని, ఆనుమానికముగా గాని, లౌకిక ప్రత్యక్షముగా గాని, భ్రమజ్ఞానముగా గాని నిర్వచింపరాదని యనుచున్నారు. ఇట్లు అనిర్వచనీయమైన రసమొకటి గలదా? అను ప్రశ్నను విచారించు సందర్భమున అనుపపత్తి సప్తకమును విమర్శింపవలెను. ఈ విషయమును ప్రస్తుతించిన అభినవ భారతి అసోమయస్థితిలో నుండుటచే విశేష విచారణ ఆవసరమగుచున్నది.

“సంభావనా విరహాయోగా ప్రతిపత్తా వయోగ్యతా” అని మొదటి అనుపపత్తి. రసప్రతీతిలో గల విషయము నుద్దేశించిన దీ యాశంక. రసప్రమేయము అవగతమగుచున్నదా? లేదా? రసప్రతీతి కలిగిన తర్వాతనే ఈ ప్రమేయము మనకు పూర్తిగా అవగతమగుచున్నది. రసప్రతీతికి పూర్వము ఈ ప్రమేయము తెలియబడకపోయినను, భావింపబడకపోయినను, ప్రమేయావగతి కలుగ నేరదు. అజ్ఞాత వస్తువునకై యత్నము జరుగదు గదా! కావున రసప్రతీతియే సంభవింపజాలదు. ప్రమేయము స్పష్టముగా విదితము కానిచో విశ్రాంతి లక్షణ లక్షితమైన ప్రతీతి యుండజాలదు. ఉద్దిష్టవిషయము నిజముగా ఉన్నపు డది తెలియబడగా సంచారిభావసంవలితమైన స్థాయిభావము సముద్దీపితమై ప్రవృత్తిపరమగును. విషయమజ్ఞాతమైనచో నది అనుద్దిష్టార్థమగును గనుక మనః ప్రవృత్తికి హేతువుకాలేదు. కాని రసచర్వణలో గల ప్రమేయము రసప్రతీతికి పూర్వ మవగతమగునది కాదు. అట్టిచో కావ్యానుశీలనము పూర్తియైన తర్వాతే రసప్రతీతి బయలుదేరుచున్నదని చెప్పవలెనా? లేక ప్రమేయజ్ఞానము లేకుండానే రసప్రతీతి కలుగుచున్నదా?

ప్రవృత్తియొక్క సామాన్య స్వభావమును గమనించితిమేని ఈ యనుపపత్తి నిరాధారము కాగలదు. ఈ విషయమును స్థాయిభావ విచారణావసరమున నాంధ్రభారతిలోను, భారతిపత్రికయందును విమర్శించి యున్నాను. ప్రతి ప్రవృత్తియందును ఉద్దిష్టార్థము సమగ్రముగా తెలియబడి ఉండదు. మన ముద్దేశించు సాధ్యము అస్పష్టముగా తెలియబడుటచేతనే తత్ప్రాప్తికి యత్నించ గలుగుచున్నాము. ప్రమేయజ్ఞానము క్రమక్రమముగా ప్రవృత్తిలో మనకు స్పష్టమగుచున్నది. ప్రఖ్యాతమైన ఇతివృత్తమునే కవులు స్వీకరించవలెనని భరతుడు విధించాడు. అత్యంతమజ్ఞాతము, అవిజ్ఞేయమునగు విషయమును కవులు స్పృశించరాదు. కొద్దిగనో, గొప్పగనో అందరకు తెలిసిన విషయమునే గ్రహించి, సమగ్రముగా ఆ విషయము నభివ్యక్తము చేయుట మహాకవులలో గాననగును. ఇట్టి అభివ్యక్తి ప్రతిప్రవృత్తిలోను గలదు.

రసమనబడు సౌందర్య తత్త్వము లేదను బుద్ధితో ఈ యనుపపత్తి బయలుదేరుచున్నది. ఈ సౌందర్యమున కస్తిత్వము లేనిచో మానవుడు, బాహ్యప్రకృతి, ఈ రెంటికి గల సంబంధము, మానవుని అనుభూతులు అనున వేవియు లేవని చెప్పవలసి వచ్చును. సకల ప్రపంచము నాధారము చేసికొని సౌందర్య మున్నదనుచున్నాము. సౌందర్యము జగన్నిష్ఠమై, అంతర్యామిగా ఉండి, విషయాకారమున అభివ్యక్తమగుచున్నది. ఇట్టి సౌందర్యమున కస్తిత్వమును నిరాకరించితిమేని జగమే లేదని చెప్పవలసివచ్చును. సౌందర్యము లేనిచో ఆత్మాభివ్యక్తి యుండదు. ఆత్మాభివ్యక్తి లేనిచో ఆత్మగాని, ఆత్మతో అనన్యత్వ సంబంధము గల బాహ్యజగత్తుగాని ఉండజాలవు. ఆత్మానాత్మలు లేనపు డనుభూతియే లేదు. కావున సౌందర్యమున కస్తిత్వమును నిరాకరించుట జగదస్తిత్వమునకే భంగకరమగునని “బోశాంకెట్” (*Bosanquet*) పలికినాడు. జగన్నిష్ఠముగా సౌందర్యము నెప్పు డనుభవించగలమో, అపుడే రసప్రతీతి కలదని స్పష్టమగుచున్నది. ఈయనుభూతికి ముందుగాని, వెనుకగాని రసజ్ఞానము బయలుదేరదు. అనుభూతియందే రసజ్ఞానము క్రమక్రమముగా సమగ్రమగుచున్నది.

“స్వగత పరగతత్వ నియమేవ దేశకాల విశేషావేశః” అని రెండవ అనుపపత్తి. ప్రతి వ్యక్తియు సుఖము ననుభవించవలెనని, దుఃఖమును దగ్గరకు

రానీయగూడదని యత్నించును. వచ్చిన సుఖమును కాపాడుకొనుటకు ప్రతివ్యక్తియు జాగరూకత వహించును. దుఃఖమును పోగొట్టుకొనుటకు చాల శ్రమను గూడ పడును. ఇట్టిచో నూతనమగు అనుభూతిలో సుఖమున్నదో, లేక దుఃఖమున్నదో తెలియదు గనుక నెవడును ఈ రసప్రతీతికి సంసిద్ధుడు కాజాలడని భావము.

కాని రసప్రతీతినుండి వెనుకకు మరలుటకు బదులు ప్రతివ్యక్తియు సౌందర్యాస్వాదమున కుత్సుకుడగుచుండుటచే రసచర్వణలో దుఃఖము కలదేమో అను ఆశంక ఎవనికిని కల్గుటలేదని స్పష్టము. రసచర్వణయం దుత్సుకత సుఖాభిలాషవలన గాని, దుఃఖనివారణేచ్ఛవలన గాని కల్గుటలేదని వేరొకచో వివరింపగలము. ఆత్మానాత్మల సంవలనముతో నుత్పన్నమై, ప్రమాతృప్రమేయముల కభేదప్రతీతిని జూపుచున్న రసప్రతీతియే సర్వజనాభిలషిత మగుచున్నది. సుఖాపగమ భీరుత్వము, తత్పరిరక్షణవ్యగ్రత, తచ్ఛాశ్వతేచ్ఛ, తజ్జిహాస, తత్ప్రతిచికీర్షాప్రయత్న గోపనేచ్ఛలు మొదలగు వాటి కిచట అను ప్రవేశము లేకపోవుటచే సంవేదనాంతరము కలుగజాలదని చెప్పరాదు.

రసప్రతీతిలో ప్రమాతృప్రమేయముల కభేద ప్రతిపత్తి కలదు. ఒకసమయమున సుఖముతోను, వేరొకవేళ విషాదముతోను కన్పడు నటుడే రసప్రతీతిలోగల ప్రమేయమని తలంచుదము. సుఖదుఃఖావస్థలు ప్రదర్శింపబడునపుడు సుఖావస్థలో సామాజికుడు తాదాత్మ్యమును పొంద నుత్సుకించును, కాని దుఃఖావస్థలో నభేదము నందజాలడని ఈయనుపపత్తిలో గల ప్రధానభావము.

లోకధర్మికన్న విలక్షణమైన నాట్యధర్మితో గూడిన నాట్యప్రయోగములో వేషభాషాది వశమున నటుని స్వరూపము ప్రచ్ఛాదితమగును. ఆ లౌకిక భాషాదిభేదములతో, లాస్యాంగములతో నుత్పన్నమగు నాట్యధర్మియందు నటునకు దుష్యంతాది పాత్రలతో నభేద ప్రతిపత్తి కలుగుచున్నది. దుష్యంతాది రూపాంతరము నటునిపై ఆరోపితమైనట్లు భాసించుటచే స్వరూప నిహ్నవము కలుగగా, నటునకు సుఖముగాని, దుఃఖముగాని కలుగుటలేదు. నటునకు దుష్యంతునితో కలుగు అభేద ప్రతిపత్తియును సాధారణీకరణమున సుఖోత్సుకతగాని, దుఃఖనివారణేచ్ఛగాని ప్రధానముగా కన్పడుటలేదు. ఈ సాధారణీకరణమున నటునకు దేశకాలోపహితత్వము నశించుటచే, ప్రదర్శింపబడు సుఖదుఃఖావస్థలు నటునకు చెందినవని గాని, దుష్యంతాది పాత్రలకు చెందినవని గాని చెప్పరాదు. ఈ సుఖదుఃఖములు వస్తునిష్ఠములగు అవస్థావిశేషములై మానవులచే అనుభూతములగు చున్నవి. వ్యక్తిసమాశ్రితములుగా గాక జీవితనిష్ఠములగా ననుభవింపబడుచున్నవని భావము. ఇట్లు సిద్ధింపజేయు సాధారణీకరణమే రసప్రతీతికి మొదలను తీసికొనిపోవుచున్నది గనుక ఈ యనుపపత్తి చెల్లదు.

"నిజసుఖాది వివశీభావము" మూడవ అనుపపత్తి. దేశకాలాద్యుపాధి సహితమగు వ్యక్తిత్వము అనుపహిత చైతన్యమనబడు తత్త్వానుభూతిలో కోల్పోవుటకు సంసిద్ధులమగుచున్నాము. ఈ తత్త్వము స్వసంవిత్స్వరూపమైనదే ఇట్టి యనుభూతి రాగలదు మనచిత్తవృత్తిలో బయలుదేరు ఆనందమున మనకు తన్మయత్వము రాగలదు. కాని బాహ్యనిష్ఠమగు వస్త్వంతరమున ఈ తన్మయత్వము సిద్ధింపజాలదు. కావున స్వసంవిత్స్వరూపము గాని కావ్యమును ఆస్వాదించునపుడు తన్మయత్వము రాజాలదని ఆశంక.

ఉపహితమగు వ్యక్తిత్వమునుండి విముక్తి కలిగినపుడే తన్మయీభవనము రాగలదు. చిత్తస్థమగు ప్రమేయముతో అనన్యత్వము కలుగగా ఈ విముక్తి వచ్చును. నిరపేక్షభావన లేనిచో నీ అనన్యత్వము కలుగదు. నిరపేక్షభావనకు సాధారణీకరణ మవసరము. ఆతోద్య గాన, విచిత్ర మండప, విదగ్ధ గణికాద్యుపరంజనముల నాశ్రయించుకొని సాధారణీకరణము సిద్ధించును. అహృదయునకు సహితముగు హృదయ వైమల్యము సంప్రాప్తముకాగా కవి, నట, సామాజికులు సహృదయు లగుచున్నారు. ఏవం విధ సహృదయులకు కావ్యానుశీలనమున తన్మయీభవనము కల్గుటచే నీ యనుపపత్తి నిరాధారమగుచున్నది.

"ప్రతీత్యుపాయ వైకల్యము" అనబడునది నాల్గవ అనుపపత్తి. రసప్రతీతియందు మన మవలంబించు ప్రమాణమేది? ప్రతీత్యుపాయము లేనిచో ప్రతీతి కలుగనేరదు. రసప్రతీతి లౌకికజ్ఞాన విలక్షణమైనచో లౌకిక ప్రమాణభిన్నమైన ప్రమాణమే కావలెను. ఇట్టి ప్రమాణ మేదియు నిచట కన్పించదని తాత్పర్యము.

కాని రసప్రతీతిని సాక్షాదపరోక్షానుభూతి యని వేరొకచోట వివరించితిమి. ప్రమాణములన్నియు ప్రత్యక్ష ప్రమాణము నాశ్రయించుకొని బయలుదేరు నవగుటచేతను, రసప్రతీతి ప్రత్యక్షప్రతీతి యగుట

చేతను, ఈ యనుపపత్తి అతిపేలవ మగుచున్నది. నిర్వికల్పక ప్రతీతికై ప్రత్యక్షప్రమాణమును వదలి ఇతర ప్రమాణములను రసప్రతీతి అపేక్షించదు. రసప్రతీతి సాక్షాత్కారరూపమే యని విస్మరించరాదు. ఇచట ప్రత్యక్ష ప్రమాణము భావనా సమున్మిషితమై ప్రవర్తించుచున్నది. ఇచ్ఛాజ్ఞానానందము లిచట సమ్మిళితములై కన్పించుచున్నవి.

“స్ఫుటత్వాభావము” అనబడునది ఐదవ అనుపపత్తి. రసప్రతీతి అస్ఫుట ప్రతీతి యని, ఇట్టి ప్రతీతి యందు విశ్రాంతి కన్పించదని భావము.

కాని వాత్స్యాయనుడు “సాచేయం ప్రమితిః ప్రత్యక్షపరా” అని న్యాయభాష్యమున పలికినాడు. ప్రమాణములన్నియు ప్రత్యక్షప్రమాణమున పర్యవసితములై అర్థవంతము లగుచున్నవి. ప్రత్యక్షమున పర్యవసితముగాని ప్రమాణము ప్రామాణికము కాజాలదు. రసప్రతీతియందు ప్రత్యక్షానుభూతియే కలదు. ఈ ప్రత్యక్ష ప్రతీతి శబ్దాదిసహితమగు అభినయాదికములతో సహకృతమైనది. లౌకిక ప్రత్యక్షమున కన్పించు ఇంద్రియార్థ సన్నికర్షను మించిన సాధన సామగ్రి యుండుటచేతనే దీనిని ప్రత్యక్షజ్ఞానము కాదని యనరాదు. శబ్దలింగ వ్యాపారసదృశమగు నీ అభినయమును ప్రత్యక్ష వ్యాపారకల్పమని అభినవగుప్తుడు నిర్వచించినాడు. రసప్రతీతి ప్రత్యక్షానుభూతియైనను లౌకిక ప్రత్యక్షముకన్న కించిద్విలక్షణమే యగుచున్నదని భావము. ఈ వైలక్షణ్య స్వరూప మన్యత్ర విచారింపబడును. ప్రత్యక్ష ప్రతీతిలోనే స్ఫుటత్వము లేదనిన, ఏ ప్రతీతిలోను స్ఫుటత్వము లేదనవలసివచ్చును.

“అప్రధానత్వము” ఆరవ అనుపపత్తి. అప్రధానమగు వస్తువుయం దాత్మవిశ్రాంతి కలుగదు. విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగవశమున రసనిష్పత్తి కలదని భరతుడనినాడు. ఈ విభావాది భావములు అప్రధానములగుటచేత చిత్తవృత్తి యగు స్థాయిభావమునకు అంగము లగుచున్నవి గనుక వీటికి అన్యముఖప్రేక్షకత్వము కలదు. కాగా వీటిని అనుసంధింపజేయు స్థాయిభావమే చర్వణకు యోగ్యమగును. పురుషార్థములను తెలుపు చిత్తవృత్తులే ప్రధానమైనవి. ఇవి స్థాయిభావము లని పిలువబడుచున్నవి. కావున రసప్రతీతిలో విభావానుభావ వ్యభిచారి భావములకు ప్రాధాన్యములేదని, ఇవి రసమును నిష్పన్నము చేయజాలవని ఈ యనుపపత్తిలో గల ముఖ్యాశయము.

వెనుక భారతిలో ముద్రితమైన నా వ్యాసములో స్థాయి సంచారి భావములను విచారించు సందర్భమున ఈ ఆశంకకు సమాధానము నిచ్చియున్నాను. ఆత్మాభివ్యక్తిరూపములగు చిత్తవృత్తులను స్థాయిభావము లనుచున్నాము. స్థాయిభావమున అంతర్లీనముగా సంచారిభావము గలదు. విభావములద్వారా ఉన్మిషితమైన సంచారిభావము అనుభావములద్వారా బహిర్గతమై స్థాయిని ప్రవృత్తిపరము చేయుచున్నది. విభావానుభావ వ్యభిచారి భావముల సంవలనము స్థాయిభావముద్వారా జరుగుటచేతను, ఇట్టి స్థాయిభావమే రసముగా పరిణమించుటచేతను ఈ యనుపపత్తిలో సామంజస్యము లేదని నిశ్చితమగుచున్నది

“సంశయయోగము” అను ఏడవ అనుపపత్తి. విభావాది భావముల సంయోగమున రసము నిష్పన్నమగునని చెప్పి, స్థాయిభావములు రసములుగా నెట్లు పరిణమించగలవో భరతుడు చెప్పినాడు. రసమున స్థాయిభావపరిపోషమునకూడ విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగము చెప్పబడినది ఈ సంయోగమును రసనిష్పత్తియందు చెప్పవలెనా? లేక స్థాయి స్వభావ నిర్వచనమున చెప్పవలెనా? లేక ఉభయత్ర చెప్పవలెనా? రసనిష్పత్తి సూత్రమున స్థాయిభావము చెప్పబడకపోవుటచేతను, ఈ సంయోగము రసనిష్పత్తియందే చెప్పబడుటచేతను, స్థాయిభావ విషయమున విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగమును ప్రతిపాదించుట సంశయాస్పదము.

స్థాయిభావస్వభావమును గమనించిన ఈ యనుపపత్తి పేలవమని తేలగలదు. ఆనందము, ఆర్తి, రోగము మొదలగువానివలన అశ్రుపాతాదికముకల్గును. వ్యాఘ్రాదులవలన క్రోధ, భయాదులు వచ్చుచున్నవి. శ్రమ, చింతాదిభావము లుత్సాహభయాద్యనేక భావములలో కలసియున్నట్లు కన్పించుచున్నవి. బంధువినాశ మను విభావమువలన పరిదేవితాశ్రుపాతాద్యనుభావములు చింతాదైన్యాది సంచారిభావములు కన్పించగా నీ అవస్థ నవశ్యము శోకముగా పరిగణించుచున్నాము. కాని విభావాదుల సంయోగము లేనిదే శోకమను స్థాయి కలుగనేరదు. ఈ సంయోగము లేనిచో శోకము పరిపుష్టముకూడ కాజాలదు.

ఉద్యాన, కటాక్ష, ధృత్యాదులచే లౌకిక విలక్షణముగా విభావానుభావములు సముపరంజకములై కావ్యనాట్యములలో భాసించుచున్నవి. ఇట్లు అలౌకికము లగుచున్న విభావములు సంస్కార పూర్వకముగా నానారూపములతో కవి, నట, సామాజికులచే

స్వీకరింపబడుచు, మనస్సుతో అనన్యత్వము నందుచున్నవి. తద్ద్వారా సముద్దీపితములైన సంచారి భావములు అనుభావరూపమున బహిర్గతము లగుచు, చిత్తవృత్తియగు స్థాయిభావమును మేల్కొలుపుచున్నవి. అప్పుడు పరిపుష్టమైన స్థాయిభావము నిర్విఘ్న సంవేదనాత్మక చర్వణాయోగ్యమై రసమని పిలువబడుచున్నది. చర్వ్యమాణ తైకసారమగు నీ యర్థము సిద్ధస్వభావముగాక సాధ్యస్వభావమగుచున్నదని స్పష్టము. కావ్యానుశీలనమున ఆస్వాదించబడుచు, చర్వణాతిరిక్త కాలావలంబిని గాని రసము స్థాయిభావముకన్న విలక్షణమైనదని తెలియనగును.

ఇట్లు సిద్ధమగు రసమునకు ఏ అనుపపత్తులును వర్తించజాలవు. తన్మయీభవనయోగ్యమగు రసము స్వయంప్రకాశము, స్వయంసిద్ధము, వివిధ విషయములతో అనన్యత్వ సంబంధము కలదియు నైనది. ఇట్టి రసప్రతీతిలో ప్రమాతృప్రమేయములకు అభేద ప్రతిపత్తి గలదు. బాహ్య విషయ సామగ్రిని మనస్సుచే నియంత్రితము చేసి తదంతర్లీనభావము నభివ్యక్తము చేయుటకు సహకరించువాడు ప్రమాత. ఇంద్రియ గ్రాహ్యస్వరూపముల నవలోకించి, తత్తత్స్వభావముల నవగాహనము చేసికొని, వాటి నిజస్వరూపస్వభావములను చూపించు ప్రమాతృ వ్యాపారమున సంవిత్సంవేద్యమగు రస మనుభూతమగుచున్నది. కవియొక్క ఆత్మసంస్కారవశమున ఏయే విషయములేయే రీతులగా స్వార్థావిష్కరణ సలుపుచున్నవో, ఆయారీతులు కావ్యాదిరూపములలో సూచింపబడుచున్నవి. కావ్యానుశీలనమున సామాజికుడుగూడ కవి అనుభవించు ఆత్మసంస్కారమును అనుభవించ గలుగుచున్నాడని భావము. కాగా సహృదయునకు సహితము ప్రతిభావ్యుత్పత్తులు అవసరమని స్పష్టము.

చిత్తవిస్తారము, చిత్తవికాసము, విశ్రాంతి లక్షణ లక్షితమగు అనుభూతి, జ్ఞానావగతి, ఆనందానుభూతి అనువన్నియు ఈ ఆత్మసంస్కారమున కన్పించుచున్నవి. కావ్యావలోకనము నారంభించగనే మనోహృదయములు భావనావశమున ఉన్మిషితము లగుచున్నవి. అపుడు కావ్యనిష్ఠమగు రసము సాక్షాదపరోక్షముగా ప్రతీయమాన మగుచున్నది. ఈ భావనా వ్యాపారముయొక్క ప్రాధాన్యమును చూపుటకే "కావ్యార్థభావనేనాయమపి సభ్యపదాస్పదం" అని విశ్వనాథుడనినాడు. భావనావ్యాపారవశమున రసము సాక్షాదపరోక్షముగా ప్రతీయమానమగుచున్నది. కావ్యగతమైన ఈ రసమును సంచారిభావముగాను, అనుభూతిలో గల జగదాభాసగాను, అసంపూర్ణమైన బ్రహ్మానుభూతిగాను పలువురు పలువిధముల నిర్వచించినారు. సంచార్యాదిభావములు అనుభూతిలో గల అంగములగుటచే, అనుభూతి అలక్షణమును గ్రహించినచో రస స్వరూపస్వభావము లవగతములు కాగలవు.





# పాప



శ్రీమతి మాలతీ చందూర్

"మధ్యాహ్నం అర్ఫనేజినుంచి ఉత్తరం వచ్చింది" అంది ప్రభ దూరాన వున్న కెరటాల్ని చూస్తూ.

"ఊ" అన్నాడు ప్రకాశరావు పైప్ ముట్టిస్తూ.

"శనివారం మధ్యాహ్నం చూసుకు వెందుకు రమ్మన్నారు" అంది ప్రభ బెరుగ్గా, భర్తకళ్ళలోకి చూస్తూ.

"నువ్వు నిదానించి యీ పని చేస్తే మంచిది. ఆపైన అనవసరంగా బాధ పడ్తావు" అన్నాడు భర్త.

"ఆరువారాలు వుంచుకుని — అలవాటు కాక పోతే పంపెయ్యవచ్చుట. రూల్సు అన్నీ చదివాను."

"అమాటే నేను అంటూంట. ఆ తెచ్చుకున్న పిల్లకి మన ఇల్లూ, మనం — వీటికి అలవాటు పడదే అనుకో — ఆపైన అది నీలోపంవల్ల అని బాధపడ తావు...అందుకే తటపటాయిస్తున్నాను."

"ఈసారి యేంబాధ పడను. మీరు చూడండి. అంటీ ముట్టనట్టుగావుంటే, యీలోపల ఆపిల్లకి మాలిమి అయితే మంచిది. లేకపోతే తిరిగి పంపేద్దాం ........"

"అని తేలిగ్గా మాటల్లో అంటావేగాని — నువ్వు పంపలేవు, ప్రభా — అది నీలోపంవల్ల నేమో అని మనసులో వూరికే బాధ పడ్తావు. పోయినయేడు పిల్లిపిల్లను చూడు; వద్దూ, అంటూంటే, పాలుపోసి మచ్చిక చేశావు. ఆపైన మనం వూరికెళ్తే, అది జెంగ పెట్టుకు చచ్చిపోయిందని విని, దానికోసం ఏడ్చేడ్చి, నువ్వు వారంరోజులు పడుకేశావు. అంచేత — యీపిల్ల రావడం పోవడం, వీటివల్ల మళ్ళీ నీ ఆరోగ్యం పాడవటం, మనసులో కలవరం, యివన్నీ వస్తా యేమోనని భయం" అన్నాడు ప్రకాశరావు, పైపులోని యాష్ దులుపుతూ.

ప్రభ యిసకలో — మూపుడు వేల్తో — పిచ్చి గీతలు గీస్తోంది. భర్తకి తనపైన వుండే ప్రేమాభిమానా లకి ప్రభ కళ్లు చెమర్చాయి. అది భర్త కనిపెడ్తా డేమోనని అలాగే తలవంచుకొని గీతలు గీస్తోంది యిసు కలో. తనకి ఏవీ తక్కువ చెయ్యని యీ భర్తకి — కనీసం స్త్రీ యివ్వగలిగిన సంతానాన్ని తను యివ్వ లేకపోయింది. తనకి అన్నీ వున్నాయి; కాని ఒక్కొక్క క్షణంలో ఏవీ లేవు అని హృదయం ఎందుకో వాపోతూ వుంటుంది. తనది — అని లాలించి ప్రేమించే ఒక్క బిడ్డగనక వుంటే, తనకీ మానసిక వ్యథ వుండేదిగాదు. భర్తకి తనమనుకించి యింత బాధ వుండేది కాదు. కాని ఏంలాభం — తన కింక పిల్లలు కలగరు. అది డాక్టరు చెప్పాడు. తనచేతుల్తో పెంచి — పెద్దను చేసి వృద్ధిలోకి వచ్చేటట్టు చెయ్యడానికి ఒక ప్రాణి కావాలి. ఈ క్షణంలో తను మాటాడక వూరు కుంటే — భర్త పిల్లని పెంచుకోనివ్వడు. ధైర్యంగా తనకోర్కె పైకి చెప్పివెయ్యాలి.

"ఈసారి మీకు ఏమీ కష్టం కలగకుండా ప్రవ ర్తిస్తాను. ముందు వెళ్ళి మనకి యిష్టమయిన పిల్లని ఏరి తెచ్చుకోవచ్చుట. ఆపైన ఆరువారాలు చూసి, ఆ తర్వాత ఆ పిల్లను ఎప్పటికీ మనం పెంచుకో వచ్చుట. మన పాప గనక వుండివుంటే యీపాటికి పదేళ్ళు ... " అంటూ ఆగిపోయింది ప్రభ. కన్నీరు టపటపా రాలింది.

"అదుగో— నీమనసు అంత తొందరలో బాధ పడ్తుంది. మాటమాటకి ఏవో జ్ఞాపకానికి తెచ్చుకు బాధపడ్తావు. ఆపిల్ల వచ్చేక యిక పంచ ప్రాణాలూ ఆపిల్లమీదే పెట్టుకు అల్లాడకుండా వుంటావని మాట యిస్తే వెళ్దాం. ఆరువారాల్లో మచ్చిక కాకపోతే— మామూలుగా పంపేటంత మనోనిబ్బరం నీకు కావాలి. ఆ మనోనిబ్బరం తెచ్చుకుంటే నాకేం అభ్యంతరం లేదు."

ప్రభ కృతజ్ఞతతో భర్తవంక చూసింది. అతను చిరునవ్వుతో, ఆమెజడ చిగుళ్ళని తనవేళ్ళకు తిప్పుతున్నాడు.

* * *

శనివారం పొద్దుటనుంచీ యిద్దరి హృదయాలూ ఆలోచనలతో, భయాల్తో వూగిసలాడుతూవున్నాయి. ప్రభకి ఏదో తెలియని ఆదుర్దా. కణతలు కొట్టుకుంటున్నాయి. కాస్త తలనెప్పిగా వుంది. భర్తకి తెలిస్తే ప్రయాణం ఆపేస్తాడేమో నని అతివుత్సాహంగా, యింట్లో యీగదిలోంచి ఆగదిలోకి, ఆగదిలోంచి యీగదిలోకి పనిలేకుండా తిరుగుతోంది. మనసులోని భయాన్ని — భర్త కనిపెట్టకుండా, అర్థంలేని కూనిరాగాల్తో, అనవసరంగా హైరాన పడుతోంది.

ప్రకాశరావు ఎరగనట్టు వూరుకున్నా, ప్రభ మనస్థితి గ్రహించుకోనంత అమాయకుడు కాదు. ఆమె లోపలవున్న భయాన్ని — పైకి అతిఉత్సాహంగా మార్చి ప్రవర్తిస్తోందని గ్రహించుకు, భార్యని చూసి జాలిపడ్డాడు.

పాపం! పిచ్చిప్రభ. తమకి సంతానం లేకపోయినందువల్ల — ఏమీ లోటు లేదని ఎన్నిసార్లు నచ్చచెప్పినాగూడా, ఏదో తను తప్పుచేసినట్టు బాధపడుతోంది. నిజానికి తనకి కావలసింది ప్రభ సంతోషం, ప్రభ ఆరోగ్యం. తనకి ప్రభ వుంటే చాలు.

పిల్లలు లేరని చింతలేదు. నిజంగా ఆనాడు— డాక్టరు— పిల్లకావాలా తల్లికావాలా? అని ప్రశ్నిస్తే తన హృదయం ప్రభ— ప్రభ అని ఏడ్చింది. కాని... ఆపిల్ల బతికుంటే బాగానే వుండేది— కాని ఆ బతకని బిడ్డకోసం ప్రభ బాధపడి— తను ఏదో లోపం చేసినట్టు వూహించుకుని కుమిలిపోవడం ఏమీ బాగాలేదు. తనకి ముఖ్యం ప్రభ. తర్వాతే మరొకటి.

* * *

ఆరాబోయేపిల్లతో తమఇల్లు కళకళ్లాడుతుందని ఏవేవో ఆశలతో ఆనందం పొందుతోంది ప్రభ. ఆమె ఆశలు తను నిరాశ చెయ్యకూడదు. మూడుగంటలకి ప్రకాశరావు తనకారు గరాజులోంచి తీశాడు. కారు పోర్టికోలో నిలిపి హారన్ కొట్టాడు. ఒక బుట్టనిండా పళ్ళు, ఒక బుట్టనిండా మిఠాయి, బిస్కట్లపాకెట్లు, పనివాడు వెనకసీట్లో పెట్టాడు. వంటమనిషితో— తాము వచ్చే వేళకి వేడినీళ్ళు, భోజనం సిద్ధంగా వుంచమని పురమాయించి ప్రభ కారులో ఎక్కి, భర్త పక్కన కూచుంది. ఆమె నుదుటిమీద స్వేదబిందువుల్ని — వణికే కంఠస్వరాల్ని చూసి — భర్త చిరునవ్వుతో "కాస్త స్థిమితపడు" అన్నాడు.

ప్రభ కొత్తపెళ్ళికూతురులా సిగ్గుపడింది.

అర్ధ వేళ గేట్లలోకి కారువెళ్ళి, బిల్డింగుముందు ఆగింది. ప్రభ, ఆమెభర్త, కారు దిగి హాల్లోకి అడుగు పెట్టారు. ప్రభ గుండెలు అమితవేగంగా కొట్టుకుంటున్నాయి. మేట్రన్ చిరునవ్వుతో యిద్దర్నీ ఆహ్వానించి, కూచోబెట్టింది.

"ఈ హోమ్‌నుంచి పంపిన పిల్లలు ఆనందంగా వుండటంగాని, భాగ్యవంతులవడం కాదు — మాకు కావలసింది. అది మీరు మనసులో వుంచుకోవల్సిన ముఖ్యవిషయం" అంది సరాసరి వ్యవహారంలోకి దిగుతూ ఆ మేట్రన్.

ప్రకాశరావు మాట్లాడలేదు. ప్రభ కిటికీలోంచి, దూరాన డాబా పిట్టగోడమీద వాలిన కాకిని చూస్తోంది.

"ఆరూ పదేళ్ళమధ్యన వున్న పదిమంది పిల్లల్ని యిక్కడికి పంపమని చెప్పాను. అందులో యిద్దరికి తెలుగు కూడా వచ్చు. వారి తాలూకు పేపర్లు చూస్తారా?" అంది ప్రకాశరావు వైపు తిరిగి మేట్రన్.

"అబ్బే, ముందు పిల్లల్ని చూసి, ఆ తర్వాత వచ్చినపిల్ల తాలూకు కాయితాలు చూడొచ్చు"

"చాలామంది పిల్లల్ని తీసుకెళ్ళినమర్నాడే— తనని కూతురిలా ప్రేమించలేదని— అమ్మా నాన్నా అని పిలవలేదని కంప్లెయింట్ చేస్తూంటారు. అవి వొక్క రోజులో రావు. యిక్కడికొచ్చిన పిల్లలంతా— తల్లి తండ్రుల్లేనివారు. అనాథ బాలబాలికలు. వాళ్ళమీద ఒక్కసారి ప్రేమ కురిపించి— వుక్కిరిబిక్కిరిచేసి, హడలుగొడ్తారు చాలామంది. యీ వాతావరణం మారి — ఆ వాతావరణంలోకి యిముడుకు పోయేందుకు కాస్త వ్యవధి కావాలి. నిదానిస్తే— పసిపిల్లలు మీలో కలిసిపోతారు" అంది మేట్రన్.

భార్యాభర్తలు తలవూపారు.

తెల్లగా
ఉతుకబడినవి

ప్రకాశవంతముగా
ఉతుకబడినవి

ఇందుకు
సన్ లైట్
సబ్బే కారణము

బాదకుండగనే బట్టలను
తెల్లగాను, ప్రకాశవంత
ముగాను ఉతుకును!




S. 206-50 TL

"చూడండి — రేపటినుంచే అమ్మా నాన్నా అని పిలవమని వత్తిడి చెయ్యకండి. పిల్లకి పిలవాలని అనిపించితే మీరు చెప్పకుండానే పిలుస్తుంది. ఆరు వారాల టైములో మీలో కలిసిపోతే సరి. లేకపోతే యిక్కడికి తిరిగి తీసుకువచ్చేస్తాం. ఈలోపల మీకూ పిల్లకీమధ్య ప్రేమ ఏర్పడితే, పేచీయే లేదు. కాని యీమధ్యలో పిల్లకి ఏమాత్రం కష్టం గలిగి, యిక్కడికి వస్తానని అన్నా అడ్డుపెట్టకూడదు. ప్రతి శని వారం మధ్యాహ్నం యిక్కడినుంచి, మా ఆయా అక్కడికి వచ్చి సాయంత్రందాకా గడుపుతుంది. పిల్లకి చెప్పుకునేవి ఏమన్నా వుంటే, అవి ఆయాతో నిర్భయంగా చెప్పుకునే అవకాశం మీరు కల్పించాలి. పిల్లకీ — మీకూ మధ్యన ప్రేమ గలగటానికి ఆయా మీకుకూడా తగినంత సాయం చేస్తుంది. పిల్లకి ఏనాడు యిష్టంలేకపోతే, ఆనాడు ఆయాతో తిరిగి వచ్చేందుకు ఏమీ అభ్యంతరం పెట్టకూడదు. ఆరు వారాలదాకా—పిల్లమీద హక్కంతా మాదే, వుండటంమటుకు మీ ఇంట్లో" అని మేట్రన్ కుర్చీలోంచి లేచింది.

ప్రభ, ప్రకాశరావు కూడా లేచి నుల్చున్నారు.

వసారాలోకి మేట్రన్ వెనక యిద్దరూ వెళ్ళారు. వసారాలో పదిమంది పిల్లలు — బొమ్మలు, రాళ్ళు, పువ్వులూ పెట్టి ఆడుకుంటున్నారు.

మేట్రన్ ఒక్కొక్క పిల్లనే పిల్చి—ఏమి వేసుకు తిన్నావు, ఏమాడుకుంటున్నావు- మొదలయిన ప్రశ్నలన్నీ వేసింది.

పదిమందిపిల్లల్లోనూ, సన్నగా—ఎర్రగావున్న పిల్ల ప్రభావతికంటిని కట్టేసింది. రెండు జడలు, వాటికి చెరోపక్కనా రిబ్బను, పెద్దకళ్లు. అసలు ముఖం అంతా కళ్లేనా అనిపిస్తుంది. పల్చని ముఖం. మోకాళ్లు దిగని నీలపుగౌను. ఆ పిల్లవంక తదేకంగా చూస్తోంది ప్రభ. ఏదో జ్ఞప్తికి వచ్చినట్టు భర్తవంక తిరిగింది. అతనూ — ఆ పిల్లవంకే పరీక్షగా చూస్తున్నాడు. ప్రభావతిహృదయం ఒక్కసారి ప్రేమతో పొంగింది. ఆపల్చని చెక్కిళ్ళను ప్రేమతో నిమిరితే, ఆ పెద్దకళ్లకి కాటుక పెట్టి అందం చేస్తే — ఆ నీలపు గౌనుకి బదులు పట్టుపరికిణీ జాకెట్టు కుట్టిస్తే — పిల్ల వంటి రంగుకి—బంగారు షైను సరిపోతుంది. ఏవేవో ఆలోచనలు బుర్రలో తిరిగాయి.

ఆ పిల్లని వేలుతో చూపించింది—మేట్రన్కి.

"పాపా—రా—" అంది మేట్రన్.

పాప వచ్చి తలవంచుకు నుల్చుంది. బొటని వేలుతో భూమిమీద రాస్తోంది. రెండు చేతులూ వెనక్కి కట్టుకుంది.

"ఏం వేసుకు తిన్నావ్" అని ప్రశ్నించింది మేట్రన్.

"పప్పు—అన్నం" అంది పాప.

ముగ్గురూ హాల్లోకివచ్చి కూచున్నారు. మేట్రన్ పక్కబీరువాలోంచి రిజిష్టర్ తీసి చూసింది.

"పాప. అయిదోఏట యిక్కడికి వొచ్చింది. తల్లితండ్రులగురించి అడిగితే చెప్పలేక పోయింది. అసలు వాళ్లెవరో ఆపిల్లకి తెలీదు. ఒక ముసలమ్మ మటుకు నెల్లాళ్ళు పాపని పెంచి హోమ్లో అప్పగించింది. ఆ ముసలమ్మకూడా చచ్చిపోయింది. పాప వయస్సు ఏడేళ్లు. అంత ఆరోగ్యమైనపిల్ల కాదు. బలహీనమైన శరీరం—" అంటూ పాపనిగురించి చెప్పి పుస్తకం మూసేసింది.

కారులోవి పళ్ళూ, బిస్కట్లూ, మేట్రన్కి అప్పచెప్పి, పిల్లలకి తినేందుకు మిఠాయి పెట్టారు. పాప. ఒక చిన్న సంచీతో, మెట్లదగ్గర వచ్చి, నిల్చుంది. ఆయా చెయ్యి పట్టుకుని, పాపని కారు దగ్గరకు తీసుకువచ్చింది. వెనకసీట్లో ప్రభా, పాపా ఎక్కారు.

కారు సరాసరి బజారుకు తీసుకెళ్ళమంది ప్రభ. బజార్లో పాపకు అరడజను గౌనులు. బొమ్మలూ బిస్కట్లూ కొన్నారు. షాపులోకెళ్ళాక, ప్రభ పాపతో కావలసిన బొమ్మలూ—గౌనులూ ఏరుకోమంది. పాప నుల్చున్నచోటునించి, అంటే ప్రభ పక్కనించి కదలకుండా, చేతులు వెనక్కి కట్టుకుని, అలా గౌనులవంకా, బొమ్మలవంకా చూస్తూనుల్చుంది. ఒకక్షణం పాప సమాధానానికై చూసి, ఏమీ సమాధానం రాక, ప్రభ తనకి వచ్చిన గౌనులూ బొమ్మలూ కొంది.

* * *

ముగ్గురూ యింటికి బయలుదేరారు. కారులో పాప ఒకమూలగా కూచుని కిటికీలోంచి బయటకి చూస్తోంది. ప్రకాశరావు కారు డ్రైవ్ చేస్తున్నాడు. ప్రభ పాపని దగ్గరకు తీసుకుందామనుకుంది కాని ధైర్యం చాలలేదు. కారు గుమ్మంముందు ఆగింది.

వంట మనిషి—పనివాడు—ఆత్రతగా చూస్తున్నారు గుమ్మంలో నుల్చుని. ప్రభా, పాపా కారు దిగారు. ప్రకాశరావు కారు గరాజులో పెట్టేందుకు వెళ్ళాడు. ప్రభ చిరునవ్వుతో పాపని వెంటపెట్టుకు మేడమెట్లెక్కింది.

పాప మంచం, ప్రభమంచానికి ఆనించి వేసింది. పాపకి ఆరాత్రి తల స్నానం చేయించి, సాయంత్రం కొన్న కొత్తగౌను తొడిగింది. అన్నంపెట్టి నిద్రపోగొట్టడానికి గదిలోకి తీసుకొచ్చింది ప్రభ. ఆవేళకి ప్రకాశరావు పేపరు చూస్తున్నాడు. పాపని మంచం మీద పడుకోబెట్టి, దుప్పటి వంటినిండా కప్పుతూ, ఏదో అతిలాలిత్యంగా అడుగుతోంది పాపని. పాపం సమాధానం చెప్పకుండా ముసుగు తలనిండా కప్పుకు పడుకుంది. ప్రకాశరావు మనసు చివుక్కుమంది. ప్రభ గమనించనట్టు—పాపబట్టలు, చిన్న బీరువాలోకి సర్దుతోంది.

ఆ మర్నాడంతా ప్రకాశరావుకి శెలవ. అతనికి చాలాచాలా కొత్తగా వుంది. పాప యింట్లో తిరిగి, నవ్వి, అల్లరి చేస్తుందనుకున్న అతని వూహాలు అబద్ధం అయాయి.

పాప అసలు యింట్లో వున్నట్టు అలికిడే అవలేదు. అతను పేపరుకోసం డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చేవేళకి కిటికీలో కూచుని వాకిట్లోకి చూస్తోంది పాప. అంత పెద్దగదిలో — ఆ సోఫాలమధ్య, పాప, చిన్నపాప, అలా ఒంటిగా కూచోడం చూసి, అతని హృదయం జాలితో నిండిపోయింది.

"పాపా!" అన్నాడు మృదువుగా.

పాప దబుక్కున కిటికీలోంచి దిగింది. వులిక్కిపడ్డట్టు—అతనివంక భయంగా చూసింది.

"అలా ఒంటిగా కూచున్నావేం?" అన్నాడు ప్రకాశరావు దగ్గరకు వెళ్ళి,

పాప దూరంగా జరిగి "వూరికేనే" అంది.

"ఆడుకో—బొమ్మలున్నాయిగా" అన్నాడు మనిషి ఆగిపోయి.

"అల్లాగేనండి" అంది పాప భయంగా.

పాప 'అండీ' అనటం విని, అతనికి కష్టం వేసింది. తనెంతో ప్రేమగా దగ్గిరకు రాబోతే, పాప దూరానికి వెళ్తోంది. అయినా కొత్తగదా అని సరిపెట్టుకు పేపరు పుచ్చుకు వెళ్ళిపోయాడు.

*           *           *

మర్నాడు సాయంత్రం ప్రకాశరావు ఆఫీసునుంచి యింటికొచ్చేవేళకి, యింట్లోంచి నవ్వులూ పరుగులూ వినిపించలేదు. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. అతని హృదయం నిరాశతో మూల్గింది. పాప మేడమీద గదిలో కుర్చీలో వొదిగికూచుని బొమ్మలు చూసుకుంటోంది. ప్రభ పాపకోసం స్వెట్టరు అల్లుతోంది.

ఆ రాత్రి పాప నిద్దరపోయాక ప్రకాశరావూ ప్రభా పాపనిగురించి చాలాసేపు మాట్లాడుకున్నారు. పాపం నవ్వడం లేదనీ గెంతడం లేదనీ యిద్దరికీ వలితిగావున్నా, కొత్తగదా అని సరిపెట్టుకున్నారు. వచ్చే శనివారం ఆయా వచ్చేవేళకన్నా పాప తమలో కలిసిపోతే చాలనుకున్నారు. ఇద్దర్నీ—'అండీ' అని సంబోధిస్తున్నదని మనసులో వున్నా—పైకి యిద్దరూ ఎరగనట్టు వూరుకున్నారు.

ఆ తర్వాత రెండురోజులు సాయంత్రం ఆఫీసునుంచి రాగానే ప్రకాశరావు పాపని వుత్సాహంగా పలకరించాలని చూశాడు. కాని లాభం లేకపోయింది. ఆ మర్నాడు సాయంత్రం "ఖబుర్లేమిటే?" అని ప్రభావతిని అడిగాడు.

ప్రభావతి నిరాశతో నవ్వి తలతిప్పింది. ఇంక మళ్ళీ ఆ ప్రశ్న అడిగే ధైర్యంలేక నిశ్శబ్దంగా వూరుకున్నాడు.

శనివారం వచ్చింది. ఆ మధ్యాన్నంనుంచి పాప వీధి గుమ్మందగ్గిరే తచ్చాడుతోంది. ప్రభావతి హృదయం కలుక్కుమంది. ఆయామీద చూపిన అభిమానంలో తనమీద పాప, ఏదో వంతన్నా చూపితే— అనుకుంది మనసులో. కాని ఆయా పాపకి రెండేళ్ళనుంచీ తెలుసు, తనని వారంరోజుల నుంచేగా—అని సరిపెట్టుకుంది. పాప మాట్లాడకపోయినా, కనీసం నవ్వితేనన్నా చూడాలని ప్రభావతి మనసులో అనుకుంది.

మధ్యాన్నం వొంటిగంటకి ప్రకాశరావు కారులోంచి దిగిన ఆయాని చూడగానే, పాప పరుగెత్తి వెళ్ళి కౌగలించుకుంది. భార్యాభర్తలిద్దరూ తప్పు చేసినట్టు మనోవైపుకి చూశారు. సాయంత్రం ఆరింటిదాకా ఆయా వుంది. యీలోపల పాప నవ్వింది. అక్కడి పిల్లలగురించి తెలుసుకుంది. ఆయావళ్ళో కూచుని, పన్నెండు రాజులకథ అడిగింది.

ఎరగనట్టు యీ గదిలోంచి ఆ గదిలోకి తిరుగుతున్న ప్రభ ఇవన్నీ గ్రహించింది. పాప తనతో

చనువుగా వుండటం లేదు. తనని ప్రేమించలేక పోతోంది. తను ఏమిచ్చి పాపని తన దానిగా చేసుకో కలుగుతుంది?—యిదే ఆమె బాధ.

ఆయా వెళ్తూ—ప్రభతో పదినిముషాలు మాట్లాడింది. "మీరు ఏమీ బాధపడకండి. మరో వారంలో మాలిమి అవుతుంది" అంది ఓదారుస్తూ.

"ఏమన్నా కావాలని అడిగిందా?"

"ఎప్పే ఏమీ అక్కర్లేదుట. మీ మీద ఏమీ నేరాలు చెప్పలేదు. అది మొదటి సుగుణం. ఎటొచ్చీ, మీ రంటే పాపకి నమ్మకం ప్రేమ కుదరడం లేదు" అంది ఆయా ఆలోచనగా.

"ఏం చేస్తే కుదురుతుంది?" అంది ప్రభ ప్రార్థిస్తున్నట్టు.

"క్రమేపీ మీకే తెలుస్తుంది"—అని ఆయా వెళ్ళిపోయింది.

ఆ రాత్రి భార్యా భర్త లిద్దరూ మళ్ళీ మాటల్లోకి దిగారు.

"బజారుకు తీసుకెళ్ళనా—బొమ్మలూ అవీ చూసి కావాలంటుందేమో—" అంది ప్రభ భర్తతో.

"అనాడు అడిగిందా? ఏ చిన్నపిల్ల అయినా అయితే కొత్తా పాతా లేకుండా యివి కావాలి అవి కావాలి—అని అడుగుతారు. పాప స్వభావం అలాంటిది కాదు. అయినా నీ తృప్తికోసం చేసిచూడు. కాని అస్తైన బాధపడకు" అన్నాడు భర్త.

మొర్నాడు పాపని బజారుకు తీసుకెళ్ళింది ప్రభ. అక్కడినుంచి బీచికి తీసుకెళ్ళింది. పాప ఏదీ కావాలని అడగలేదు. బీచిలో మాట్లాడలేదు. పిచ్చిక గూళ్ళు కట్టలేదు. కాని కట్టే పిల్లలవంక తదేకంగా చూస్తూ నిల్చుంది.

"వెళ్ళి వాళ్ళతో ఆడుకుంటావా?" అని ప్రభ పాపని అడిగింది.

పాప—వెళ్ళనని—తల వూపింది.

కాసేపు కూచున్నాక యింటి కొచ్చేశారు. ఆ రాత్రి ప్రభకి నిజంగానే భయంవేసింది. ఈసారి గూడా తను ఓడిపోతున్నానా — అని ఆలోచించింది.

మర్నాడు సాయంత్రం ప్రభ మామూలుగా మాట్లాడుతున్నట్టు ముఖంపెట్టు—"పోనీ — మీరు పాపని ఎక్కడికన్నా తీసుకెళ్ళండి—అలవాటు అవుతుందేమో, . . . . ." అంది భర్తతో.

ప్రకాశరావు అల్లాగే అని తల వూపాడు. ప్రభ ఎంత ఆలోచించి, బాధపడి, యీమాట అందో అతనికి తెలుసు.

ఆ వారంలో ప్రకాశరావు పాపని జూకి తీసుకెళ్ళాడు. సర్కస్‌కి తీసుకెళ్ళాడు. పార్కుకీ, బీచికీ—యిలా తిప్పాడు. పాప జూలోని కోతుల్నీ, సర్కస్‌లోని బఫూనుని చూసి నవ్వింది. అంతే, ప్రకాశరావుకి దగ్గరగా మటుకు రాలేదు.

* * *

నాలుగు వారాలు గడిచిపోయాయి. యీలోపల రెండు మూడుసార్లు పాపని స్నేహితు లిళ్ళకు తీసుకెళ్లామని అనుకున్నారు. కాని పాప తమని ప్రేమించకపోతే — మేట్రన్ వెనక్కి తీసుకెళ్ళిపోతే. అప్పుడు నవ్వరూ? అందుకని స్నేహితు లిళ్ళకి తిప్పలేదు. మిగతా వూరంతా తిప్పారు. పాప యింట్లో వున్నట్టు ఎవరికీ అనిపించేది కాదు.

ప్రభ ముఖంలో బాధ, కళ్ళల్లోని ఆందోళన ప్రకాశరావుని కలత పరుస్తూండేవి. కాని అతనికి పాపమీద మమకారం ఎక్కువవుతోంది. ఇంకో వారం యిలా వుంటే ఆయా పాపని తీసుకెళ్లా నవచ్చు—పాప వెళ్ళిపోతే? అతనికి గూడా ఏదో వెలితిగా తోచింది. పాపని తమదిగా చేసుకోడం ఎల్లా?

అయిదో శనివారంగూడా గడిచింది. ఆయా వచ్చింది, వెళ్ళింది. ఆ శనివారం ఆయాగూడా పాప సంగతి బోధపడటం లేదంది. ఆరువారాల్లో గూడా చనువు కాకపోతే మేట్రన్ తీసుకెళతా నంటం ఖాయం.

"మీ లోపం ఏమీలేదు—చూస్తున్నానుగా! యీ యింట్లో పడితే పాప సుఖపడుతుంది—కాని ఏంచేద్దాం? మీరు చేతనయినంతా చేస్తున్నారు. పోనీ మిమ్మల్ని ఏమని పిలుస్తుంది?" అంది ఆయా.

"అసలు ఏమనీ పిలవదు. నేనే పదిసార్లు చుట్టూ తిరుగుతా?" అంది ప్రభ, బిట్టర్‌గా నవ్వి.

"ఇంకో వారం టైముందిగా—యీ లోపల మార్పు రావచ్చు" అంది ఆయా ఓదారుస్తూ.

"అంత అదృష్టమా?" అంది ప్రభ ఆయాని వీధి దాకా పంపుతూ.

ఆ రోజు బుధవారం. వంటమనిషి క్రితం రోజున కూడా రాలేదు. ఆనాడు పొద్దుట ప్రభ వంటచేసింది. ఆ సాయంత్రం వండవద్దనీ, హోటల్‌లో భోంచేద్దామనీ చెప్పి ప్రకాశరావు ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం నాలుగున్నరకి అతను కారు పోర్టికోలో ఆపి, హాల్లోకి వస్తూ—"ప్రభా" అని పిల్చాడు.

మెట్లమీంచి—ట్రే, అందులో టీపాయీ పెట్టుకుని—పాప నెమ్మదిగా దిగుతోంది. అతని కేక విని.

"ఇస్, కేక లెయ్యకు—అమ్మ బబ్బుంది" అంది అతన్ని కేక లేస్తున్నట్టు.

ప్రకాశరావు తన చెవుల్ని నమ్మలేకపోతున్నాడు. మెట్లదగ్గరకు పరుగునవచ్చి,

"ఏమిటే పాపా, అంటున్నావు?" అన్నాడు నవ్వుతూ.

"అమ్మకు జ్వరంగా వుంది. అల్లరి చెయ్యకూడదు" అంటూ ట్రేని పక్కనున్న టేబుల్ మీద పెట్టింది పాప.

ప్రకాశరావు మెట్లు ఎక్కబోతుంటే, ఆపి, "నాన్నొస్తే—లేపొద్దను. నిద్దరపోతాను" అంది—అమ్మ, పైకెళ్ళద్దు—" అంది పాప.

ప్రకాశరావుకి అమితోత్సాహం కలిగింది.

"అయితే ఏం చెయ్యను?" అన్నాడు పాప వంక చాలా ఆణకువతో చూస్తూ.

"అమ్మకి జ్వరంగా వుందని ఆయాకి ఫోన్ చేశాను. 'నేను రాను—నువ్వు పెద్దదానవయ్యావు—నువ్వు చూసుకో' అని అందీ—ఆయా!" కళ్ళు తిప్పుతూ చెప్పింది పాప.

ప్రకాశరావు—నోరు తెరుచుకు—వింటున్నాడు.

"అమ్మకి టోస్ట్ వేయిచ్చి, కాఫీ కాచిచ్చాను. నాకు కాఫీ పెట్టడం వచ్చు. అమ్మ బాగా వుందని తాగింది". అంది పాప ట్రే తీసుకుని.

"మరి నాకో?" అన్నాడు ప్రకాశరావు.

"వంటింట్లో—బిస్కట్లు కాఫీ — మనిద్దరం తాగుదాం," అంది పాప.

ప్రకాశరావు మొఖం కడుక్కొచ్చి—వంటింట్లో వచ్చేవేళకి—పాప సంచీలోంచి ఏమిటో తీస్తోంది.

"అదేమిటి పాపా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"పిన్నీ"

"అంటే"

"ఎవరింట్లో వాళ్ళు పనిచేసుకునే టప్పుడు గౌను మాసిపోకుండా కట్టుకుంటారు."

"ఎవరిచ్చారు?"

"నేను స్కూల్లో వుండగా కుట్టుకున్నా" అంది పాప నవ్వుతూ అతనివంక చూస్తూ.

ప్రకాశరావు పాపని ఎగరేసి—హృదయానికి గట్టిగా అదుముకున్నాడు.



# క్షేత్రయ్య పదకవిత



శ్రీ పి. గణపతిశాస్త్రి

ఇటీవల క్షేత్రయ్య, సారంగపాణి మొదలయిన పద కర్తలను గురించీ, వారి పదరచనా పద్ధతిని గురించీ పత్రికల్లో చాలా వాదోపవాదాలు చెల రేగాయి. కొందరు విమర్శకు లీ జాతి రచయిత లందర్నీ కలియగట్టి వీరందరు కేవలం అసభ్యపద రచనలు చేశారని అనేకవిధాల దోషారోపణలు చేశారు. మరికొందరు వీరంతటి ఉత్తమ రచయితలు లేరని వీరిని ఆకాశానికి ఎత్తేశారు.

ఈ దోషారోపణల ధాటీ క్షేత్రయ్యమీద అతని పదరచనమీద మరింత తీవ్రంగా సాగింది. ఈ విషయాలకు సంబంధించిన వాదోపవాదాలు తీవ్రమైన అభినివేశాహంకారాలతో సాగిఉండడంవల్లను, కొంత మంది ప్రసిద్ధులలోనే ఈ విషయంలో తీవ్రమయిన భేదాభిప్రాయా లేర్పడి ఉండడంవల్లను, ముఖ్యంగా ఈ వ్యాసంలో క్షేత్రజ్ఞుని పదరచనలను గురించిన దోషారోపణల ఔచిత్యానౌచిత్యాలను గురించి కొంచెం వివరించి వ్రాస్తాను.

## దోషారోపణలు

పై విమర్శకులు క్షేత్రయ్యపదాలు చాలా అసభ్యంగా ఉన్నాయనీ, పదాల చివర కేవలం 'మువ్వగోపాల' అనే మకుటం మాత్రంచేర్చి, ఇతను మువ్వ గ్రామానికి సమీపంలో ఉన్న సానెంపాడు వేశ్యలపై తనలో ఉడికిన లంపటత్వం మాత్రమే వ్యక్తీకరించాడనీ, మరి మధురభక్తి అనేది ఇతని పదకవితలో ఏకో కాన్నా కనబడడం లేదనీ, తన సమాన కాలీనులయిన రాజుల లాలసా సంతృప్తికోసమే ఇతడీ పదరచన కుపక్రమించాడనీ, కనక ఇతని పదాలన్నీ కేవలం 'చెత్త' కింద జమకట్టి వెయ్యాలనీ, వీటికి సాహితీగౌరవమే లేదనీ—ఇలాగ అనేకవిధాల దోషారోపణలు చేశారు.

ఈ విషయాలమీద ఇంతగా వాద ప్రతివాద ధూళి రేగినతరవాత మన భాషలో బయలుదేరిన పదాల రచనా సంప్రదాయము, మధురభక్తి సంప్రదాయము, తత్స్వరూపము, ఈ మార్గంలో క్షేత్రయ్య అవలంబించిన రచనాపద్ధతి మొదలైన విషయాలన్నీ సాంప్రదాయిక దృష్టితోను, అనుశీలన దృష్టితోను పరిశీలించిన తరవాతనే క్షేత్రయ్య పదకవిత అంతరువు, గుణదోషాలు మొదలైన విషయాలను గురించి చర్చించి ఒక నిర్ణయానికి రావడం న్యాయ్యము.

ఇటీవలి విమర్శకులు పదకర్త లందరినీ ఒకే వర్గంకింద జమకట్టి చాలా తీవ్రమయిన దోషారోపణలు చేశారు. గాని ఈ సందర్భంలో ఒక విషయం ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి.

నిజానికి అన్నమయ్య, క్షేత్రయ్య, సారంగపాణి, సభాపతయ్య మొదలయిన పదకర్తలందరు ఒకే కాలానికిగాని, తరహాకుగాని చెందినవారు కారు.

వీరిలో ప్రతి రచయితకు ప్రత్యేకవ్యక్తిత్వము, రచనాపద్ధతి, విశిష్టమైన అంతరువు ఉన్నాయి. ఆయా రచయితల రచనానైఖరినిబట్టి, వీరిలో కొందరు ఉత్తములనీ, మరికొందరు కొంచెం తక్కువ అంతరువుకు చెందినవారనీ ఇలాగ ఆయా రచయితల తారతమ్యభావాలు తేల్చుకోవాలి.

## పదకవిత

మన భాషలో పదకవిత ప్రత్యేక శాఖగా పేర్కొనదగిన గేయ వాఙ్మయంగా ప్రసిద్ధిపొందింది. దీనిలో సంగీత సాహిత్యాలు రెండుసమాన స్థాయిలో నడుస్తుంటాయి. అంతేకాదు. ఈ జాతి రచనలలో సంగీత సాహిత్యాలు రెండు పరస్పరాచ్ఛాదన సంభవించకుండా విజృంభిస్తూ క్రమంగా అర్ధనారీశ్వర మూర్తివలె ప్రత్యేక వ్యక్తిత్వంతోను, సౌందర్యంతోను భాసిస్తాయి. పదరచనలో కనిపించే ప్రత్యేక లక్షణాలలో ఇది చాలా ముఖ్యమయినది.

త్యాగరాజాదులు రచించిన కృతులలో చాలా వాటిలో సంగీతాని కున్నంత ప్రాముఖ్యం సాహి

త్యానికి కనబడదు. ఈ జాతి కృతులలో సంగీత భావమే సాహిత్యంలోని పదాలకు జీవంపోసి ప్రాణ ప్రతిష్ఠ చేస్తుంది. ఉదాహరణకు త్యాగరాజు దేవమనోహరి రాగంలో రచించిన

'రామా! ఇక నన్ను బ్రోవ
రాదా! దయ లేదా?'

అనే కృతి తీసుకుందాము. కేవలం సాహిత్య దృష్టితో పరిశీలించినపుడు ఈ కృతి పల్లవిపదాలలో రసస్ఫోరకమైన శక్తిఏమీ కనబడదు. కాని దేవమనోహరి రాగంతో వీటిని రంగరించినప్పుడీ పల్లవిపదాలు జీవచైతన్యంతో నృత్యంచేస్తూ శ్రోతలహృదయా లుర్రూతలూగిస్తాయి. ఇక్కడ సంగీతానికి వచ్చినంత ప్రాధాన్యం సాహిత్యానికి రాలేదు. ఇలాంటిచోట్ల సంగీతమే సాహిత్యాని కుద్దీపక మౌతుంది.

రామదాసు మొదలయిన వారు రచించిన కీర్తనలలో చాలా వాటిలో సంగీతానికి సాహిత్యానికున్నంత ప్రాధాన్యం కనబడదు. ఉదాహరణకు ఈ క్రింది కీర్తన భాగం తీసుకుందాము.

"ఏతీరుగ నను దయజూచెదవో
ఇనవంశోత్తమ రామా!
నాతరమా భవ సాగర మీదను
నళినదళేక్షణ రామా!
కారుణ్యాలయ భక్తవరద! నను
కన్నది కానుపు రామా!"

దీనిలో సంగీతం ఛాయామాత్రంగానే ఉండిపోయి సాహిత్యానికి చేదోడు వాదోడుగా నిలబడుతుంది. ప్రత్యేకంగా ప్రయత్నించి ఈ కీర్తన పదాలన్నీ పొడిగిస్తూ, అర్థభావాదులన్నీ అలక్ష్యంచేస్తే తప్ప—రాగలాపన కిక్కడ అవకాశమే లేదు.

ఇక ఉత్తమమైన పదరచనలో సంగీత సాహిత్యాలు రెండూ సమాన స్థాయిలో నడుస్తూ పరస్పరోద్దీపకములై మేళవించి ఒక వినూతనమైన ప్రత్యేక స్వరూపంలో భాసిస్తాయి. ఈ క్రింది క్షేత్రయ్య పదం దీనికి ఉదాహరణగా స్వీకరింపవచ్చును.

సావేరి - ఆది
(స్వీయ—సఖీ శిక్ష)

పల్లవి:
తాళి మొక్కరికైన వద్దా! ఓ చెలియరో

అనుపల్లవి:
లోలాక్షి! మువ్వగోపాలునికి
నీకు మాటలైతే! ॥తాళి॥

౧ వాడిలుగ నీవలుగ వలెనె? మీకై తిరుగు
లాడి చాలు నన్నట్టున్నది; రెవరు మెత్తురే!
కూడక మీరినట్లున్నది- నే కెల్లమీకు—
కోపము ముక్కునున్నది చెలియరో! ॥తాళి॥

౨ చలమున వాడొకడంటే సైగగా నూరకుండక
చెలియరో! యిదేటి కోపము? చెల్లనె మీతోడ
చెలిమి చేసినపాపము! ఎందుకే మీకు
వలువని మనస్తాపము? చెలియరో! ॥తాళి॥

౩ ఎలమి పాలునీరువలె కలిసియుండ
మువ్వగోపాలునితో—
చెలియరో ఈ చలమేటికి? ఇటువంటి గుణము
చెల్లునే నీ వంటి మేటికి? వివేకమింత
వలువదా? లెస్సాయెను నేటికి ఓ చెలియా!
॥తాళి॥

## మన పదరచనా సంప్రదాయము.

ఆంధ్రభాషలో పదరచన అన్నమాచార్యునితోను, తద్వంశీయులైన తాళ్ళపాక కవులతోను, బాగా విస్తృతమై ఒక స్వతంత్ర గేయ శాఖగా స్థిరపడిపోయింది. క్షేత్రజ్ఞుని కాలానికి 'పద' మనే మాట మధుర భక్తి, శృంగారము కలిసిన ఒక జాతి గేయ రచనగా ప్రసిద్ధికెక్కినట్లు కనబడుతుంది. అన్నమాచార్యుని పదాలు, తదితర తాళ్ళపాక కవుల పదాలు పరిశీలిస్తే ఆ కాలంలో పదాలు కేవలం శృంగారపరంగానే గాక ఆధ్యాత్మికంగా రచించే సంప్రదాయం కూడా ఉన్నట్లు కనిపిస్తున్నది.

అన్నమాచార్యుడు తాళ్ళపాక కవులలోనే కాక, ఇంతవరకు మనకు పదకర్తలుగా ప్రసిద్ధులయినవా రందరిలోను ప్రథముడు. ఇతడు క్రీస్తు శకం 1408 లో జన్మించి 1503 లో పరమపదించాడు. అంటే ఇంచుమించుగా 15 వ శతాబ్ది ప్రథమార్థం నాటికే మన పదరచన స్థిరంగా నెలకొన్నదని నిశ్చయించవచ్చును. అన్నమాచార్యుని కాలానికే పదరచన స్థిరపడినదంటే—అంతకు చాలాకాలానికి పూర్వమే పదరచన, తత్సంప్రదాయము మన దేశంలో ప్రారంభమై ఉండాలి.

క్షేత్రజ్ఞుడు 17 వ శతాబ్ది ప్రథమభాగంలోనివాడు. ఇందుచేత ఇతని పదరచన ఆ సమీపం

లోనే ప్రారంభమై ఉండాలి. దీనినిబట్టి క్షేత్రయ్యకు సుమారు రెండు శతాబ్దాల పూర్వంనించీ మన దేశంలో పదరచన ప్రారంభించి ఉండవచ్చునని నిశ్చయించవచ్చును. ఏతావతా — క్షేత్రయ్యకు సుమారు రెండు శతాబ్దాలనించీ దేశంలో పదరచనా సంప్రదాయం నెలకొన్నదనీ, అది అన్నమాచార్యునితో స్థిరస్వరూపం ధరించినదనీ ప్రస్తుతం మనకు లభిస్తున్న ప్రమాణాలనుబట్టి నిర్ధారణ చెయ్యవచ్చును.

అన్నమాచార్యునితోను, తద్వంశీయులతోను ప్రారంభించిన పదరచన క్షేత్రయ్య కాలం నాటికి బాగా పరిణతమై పరిపూర్ణస్థితికి వచ్చింది. ఈ పరిణతి పరిశీలనకు పూర్వం అన్నమాచార్యుల కాలం నాటి పదకవితాస్వరూప స్వభావాలెలాగఉన్నాయో పరిశీలిద్దాము.

## తాళ్లపాక కవుల శృంగార కీర్తనలు

తాళ్ళపాక అన్నమాచార్యుడు, తద్వంశీయులైన పెద తిరుమలాచార్యుడు, తిరుమలాచార్యుడు తాము వ్రాసిన మధుర భక్తి స్ఫోరకములైన రచనలకు శృంగార కీర్తనలని పేరు పెట్టారు. ఇవన్నీ వేంకటేశ్వర నామాంకితంగానే రచించారు. తాళ్ళపాక కవులు ఈ శృంగార కీర్తనలలో స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, ఖండిత మొదలైన నాయికల మనోభావాలన్నీ నూత్నములైన భంగిములతోను, వైవిధ్యాలతోను, అనేక విధాలుగా వర్ణించారు. ఇంకా కొన్ని కొన్నిచోట్ల వేంకటేశ్వరునికీ, శ్రీకృష్ణునికీ అభేదాధ్యవసాయం చేసి శ్రీకృష్ణుని బాల్యచేష్టలు, శృంగార చేష్టలు మొదలైనవన్నీ వెంకటేశ్వరనామాంకితంగానే రచించారు. ఇవిగాక వేంకటేశ్వరుని మేలుకొలుపులు, పవళింపు సేవలు, ఇంకా వివిధములైన భోగాలు, వాటి వర్ణనలు ఈ కీర్తనలలో ఎక్కువగా కనిపిస్తాయి.

వీరి పదాలలో సాంప్రదాయికంగా వచ్చే అష్టవిధనాయికలే గాక, భోగకాంతలు, పరకీయలు, చెంచెతలు, బోయస్త్రీలు, మొదలైన వారు కూడా వెంకటేశ్వరుని నాయికలౌతారు. అయితే తాళ్లపాకకవుల కీర్తనలలో ఇలాంటి అసాంప్రదాయికాలైన నాయికా మనోభావ వర్ణనలు స్వల్పంగానే కనిపిస్తున్నాయి.

సాంప్రదాయికంగా వచ్చే స్వాధీనపతికాది నాయికలు, వారి మనోభావవర్ణనలు, తాళ్ళపాక కవుల కీర్తనలలో ప్రధానంగా ఉన్నాయని అనుకున్నాము. ఈ విషయంలో ఈ కవులలో కనిపించే విస్తృతి, వైవిధ్యము క్షేత్రయ్యలో ఇంకా ఒక అంతరువుదాకా పైకి వెళ్ళిపోయాయి. క్షేత్రయ్య అంతటితో ఊరుకోక నాయికా మనోభావ వైవిధ్య ప్రదర్శనాలలో అవధులకు వెళ్ళిపోయాడు.

ఈ క్రింది ఉదాహరణలనుబట్టి అన్నమాచార్యుని పదరచనా రీతి గ్రహించవచ్చును.

సామంత రాగము.

ఎంత మేలు చేసినదో ఏమిచెప్ప చిత్త
మంతయు నీకిచ్చిన యొయ్యారి యెవ్వతెరా!
దాడింబ పువ్వులవన్నె తకుళు బన్యోవ కొంగు
వేడుకతో వల్లెవాటు వేసి
గోడ సెక్కి చూచి తన కొప్పు చెంగలువ బంతి
దోడక వేసినట్టి యొరప రెవ్వతెరా!
కంకణాల మెరుగుల కరములొయ్యన యిరు
వంకల చెలుల మీదవైచి
కొంకక తమలపాకు కొనవంక గరచి నీ
వంక చూచి పన్నసేసె వనిత యెవ్వతెరా!
పిక్కటిల్లినట్టి తన బిగువుజన్నుల కాంతి
నిక్కపమై యిరువంక వెడల
యొక్కువతో దిరువేంకటేశున నిన్నుగూడి
చెక్కునొక్కి కౌగలించె
చిత్రిణి యెవ్వతెరా!

వరాళి రాగంలో రచించిన ఈ క్రింది గీతంలోని విరహోత్కంఠితాభి వర్ణనం అన్నమయ్య రచనలోని ఉదాత్తఫణితికి ఉదాహరణగా ఇవ్వవచ్చును.

నీకు వలచినసతికి సిగులుగలదా మీద
నీ కరుణ మరవ కింతియు చాలును!
నీవంటి చతురునకు నిక్కంబు గావలచి
జీవంబు విడిచినా సిగి గలదా?
భావముల నినుదలచి పడతి యిట్లాయెనని
ఆ వేళ వనుదలము మంతెచాలు!
తగిలి నినుబాసి సంతాప దావాగ్ని నిటు
నొగిలినా నాకెందు నొప్పిగలదా?
వగవీర మరుని పూబాణముల దెగిన—పొం
దుగ నప్పుడైన వగకువుగా! నీవు!
కూరుముల నిటు నిన్ను గూడిన లతాంగికై
వేసె ఇక మరుచేతి వరవుగలదా?
సారమతి వెంకటేశ్వర నన్ను నలయించి
యీరీతినైన జనవిత్తుగానీవు!

క్షేత్రజ్ఞునికి రెండు శతాబ్దాల పూర్వం బయలు దేరిన అన్నమయ్య రచనలలోనే క్షేత్రజ్ఞుని రచనా ఫణితికి పునాదులు పడిఉన్నాయి.

ఇక క్షేత్రయ్య రచనలలోను, అన్నమయ్య రచనలలోను గల ప్రత్యేక గుణాగుణాలు పరిశీలించే ముందు ఈ పదరచయిత లవలంబించిన మధురభక్తి సంప్రదాయాన్ని గురించీ, ఈ భక్తిమార్గంలో వీ రవలంబించిన మార్గాలనుగురించీ కొంచెం పరిశీలన అవసరం.

## భక్తిసంప్రదాయం

మన దేశంలో చిరకాలంనించీ భక్తిమార్గం ఈశ్వరారాధనా సాఫల్యములకు సాధనంగా ఉన్న విషయం సామాన్యంగా అందరికీ తెలిసినదే. అయితే ఈ భక్తిసాధనలో అనేక మార్గాలున్నాయి. ఆయా సాధకుల స్వభావాలనుబట్టి ఆయా మార్గభేదా లేర్పడుతూంటాయి. ఈశ్వరుని జగన్మాతగా గాని, జగత్పితగా గాని, మిత్రాది భావనలతో గాని—ఇంకా పురాణ ప్రసిద్ధులయిన రామకృష్ణాద్యవతార రూపంలో గాని, అర్చించే సంప్రదాయాలు, మార్గాలు మనకు సర్వసాధారణమైనవే. ఇంకా పరమేశ్వరుని ప్రియతమ భావనతోను, ప్రేయసీభావనతోను, అర్చించే సంప్రదాయంకూడా మనకు అనుశ్రుతంగా వస్తున్నదే. మీరాబాయి, చండీదాసు, కబీరు మొదలయిన భక్తుల చరిత్ర లాయా భక్తి వైవిధ్యాలకు లక్ష్యాలుగా కనిపిస్తున్నాయి.

## మధురభక్తి

ఈశ్వరుని ప్రేయసీ రూపంలో గాని, ప్రియతమ రూపంలో గాని అర్చించే మార్గమే మధురభక్తి మార్గమని ప్రసిద్ధిపొందింది.

భాగవత ప్రసిద్ధమైన గోపికల భక్తిమార్గమీ మధురభక్తి మార్గమే. జయదేవుని గీత గోవింద కావ్యంకూడా ఇలాంటి మధురభక్తి మార్గానికి సంబంధించినదే. జయదేవు డీ కావ్యంలో రాధాకృష్ణుల ప్రణయం మధురమార్గ లక్ష్యంగా ప్రదర్శించాడు. ఇంకా ఔత్తరాహులయిన మీరాబాయి, చండీదాసు మొదలయిన భక్తుల చరిత్రలలోను, వారు రచించిన గేయాలలోను, ఈ మధురభక్తి ప్రస్ఫుటంగా వెల్లివిరిసింది.

నారదభక్తి సూత్రాలలో 'యథా వ్రజ గోపికానాం' అనే సూత్రంలో గోపికాభక్తి ఈ విధమైన భక్తికి తార్కాణంగా ఉదాహరించబడినది. ఈ విధంగా మధురభక్తి శాస్త్రప్రసిద్ధమై మన ప్రాచీన భక్తిసంప్రదాయంలో సుస్థిరంగా నెలకొన్నది.

ఈ సంప్రదాయమే ఆయా కవుల కావ్యాలలోను, గేయాది రచనలలోను అనేకవిధాలుగా అభివ్యక్తిపొందింది.

## మధురభక్తి వర్ణనం

భక్తిమార్గ మనేసరికే అది సంపూర్ణమైన సగుణారాధనగా మారిపోతుంది. జ్ఞానమార్గంలో కేవలము అనిర్వచనీయము, అవాఙ్మానస గోచరము, అయిన ధ్యేయవస్తు వీ భక్తిమార్గంలో మానవహృదయానికి అతి సన్నిహితమై చేదోడు వాదోడుగా నిలిచి నెచ్చెలి, జనని, మొదలయిన సన్నిహితాత్మీయ బంధు స్వరూపం ధరిస్తున్నది. ఇక ప్రేయసీ భావనలో గాని, ప్రియతమ భావనలో గాని, రాధికా గోపికాది భావనలలో గాని, ఈశ్వరారాధనం జరిగినప్పుడు భక్తునికి ఆయా భావాలకు అనుకూలమైన మానసిక పరిస్థితి ఏర్పడడం సహజం. కావ్యాలలో గాని, పదాలలో గాని ఈ పరిస్థితి అభివ్యక్తమైనప్పుడు, భక్తుని మానవ సహజమైన భావావేశం అభివ్యక్తమవుతుంది.

అలాగ కాకుండా—భక్తుని భావనలో మానవ సహజస్థితి లోపించినప్పు డానిలో ఉద్భవించిన కవిత నీరసమైనట్టి శుష్క వేదాంత పదాలతో దొర్లించిన తత్త్వాల ధోరణిలోకి దిగి జారుకుంటుంది.

అయితే ఇక లౌకిక శృంగార కవితకు, మధుర భక్తి కవితకు, భేదమే ఉండదని భావించకూడదు. ఉదాత్త భావపూరితమై దివ్యత్వం ధ్వనింపజేస్తూ మానవాత్మను భక్తి శిఖరంపై ప్రతిష్ఠింపజేయ గలగినది మధురభక్తి కవితఅనీ, తద్భిన్నమైనది కేవల శృంగార కవిత అనీ, ప్రత్యేకంగా నిర్దేశించవచ్చును. ఆయా పరిసరవర్ణనలనుబట్టి, విభావానుభావాదిభేదాలనుబట్టి కూడా ఇది మధురభక్తి అనీ, ఇది లౌకిక శృంగార మనీ వేరువేరుగా నిర్ధారణ చెయ్యవచ్చును.

## అన్నమయ్య—క్షేత్రయ్య

క్షేత్రయ్య పదరచన కుపక్రమించేసరికి అంతకు పూర్వంనించీ భారతదేశంలో అనుశ్రుతంగా వస్తున్న భక్తి సంప్రదాయాలు, ఆంధ్రదేశంలో అంతకు పూర్వం రెండు శతాబ్దాలనించీ వ్యాప్తిలో ఉన్న అన్నమాచార్యాది తాళ్లపాక కవుల మధురభక్తి

మయములైన శృంగార కీర్తనలు, వాటి రచనాసంప్రదాయాలు క్షుణ్ణంగా అవగాహన చేసుకొని ఉండవచ్చును.

క్షేత్రయ్యను అన్నమయ్యతో పరిపోల్చి చూచినప్పుడు పరస్పరము వీరికి పోలికలేగాక, కొన్ని ప్రత్యేక గుణాలుకూడా విస్పష్టంగా కనిపిస్తాయి. అన్నమయ్యకూడా క్షేత్రయ్య మాదిరిగానే అసంఖ్యాకంగా పదాలు రచించినవాడే గాని ఇతని పదాలలో సంగీత ప్రస్తారానికి అంత ఎక్కువ అవకాశం కనబడదు. ఈయన పదాలన్నీ చాలావరకు పరిమిత మాత్రాబద్ధములైన పదచ్ఛందస్సులలాగే భాసిస్తాయి.

క్షేత్రయ్య పదాలలో సంగీతం సాహిత్యాన్నిగాని, సాహిత్యం సంగీతాన్నిగాని ఆచ్ఛాదించకుండా రెండూ రెండు రెక్కలుగా విడివడి శ్రోతలను అనంతాకాశం అవధులలోకి ఆకర్షించుకు పోతాయి. నిజానికి సంగీత సాహిత్యాల కలయిక క్షేత్రయ్యలో అమరినంత మనోహరంగా మరి తదితర పదకర్తల రచనలలోను జరగలేదు. ఈ విధమైన పదరచనా పటిమవల్లనే నేటికీ ఇతడొక సుప్రసిద్ధ దాక్షిణాత్య సంగీత వాగ్గేయ కారకుడుగా ప్రశంసింప బడుతున్నాడు. గానాభినయాను రూపమైన పదరచనా శిల్పం ఇతనిలో సంపూర్ణ పరిణతి చెందినదని ప్రఖ్యాత సంగీతవేత్తలందరు ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. నిజానికి అన్నమాచార్యునితో సవలెత్తిన పదరచన క్షేత్రయ్యలో సంపూర్ణంగా పరిణతమై భాసించింది.

క్షేత్రయ్యలో వచ్చినంత పరిణతిగాని పరిపూర్ణతగాని, అతరవాతి పదరచయితలలో కనిపించడంలేదు. మొత్తంమీద క్షేత్రయ్య తరవాత బయలుదేరిన పదరచయితలలో ఉదాత్తత, పరిణతి, క్రమక్రమంగా క్షీణించిపోయాయని చెప్పవచ్చును.

ఇక వస్తుస్వీకరణ వైవిధ్య దృష్ట్యా చూసినా అన్నమాచార్యుని కంటె క్షేత్రయ్యలోనే ఎక్కువ వైవిధ్యం కనిపిస్తున్నది.

అన్నమాచార్యునిలోనే అక్కడక్కడ పరకీయలు, భోగకాంతలు, చెంచెతలు, భోయస్త్రీలు మొదలయిన నాయికలు ప్రవేశిస్తున్నారు. అన్నమాచార్యులీ విధమైనవారిని వెంకటేశ్వరుని నాయకలుగా వర్ణించడం కేవలం అసభ్య ధోరణిఅని స్థూల దృష్ట్యా పరిశీలించిన విమర్శకులకెవరికైనా తోచవచ్చును. కాని అది సరిఅయిన విమర్శక దృష్టి కాదు. నాయికాస్వభావం ఎటువంటిదైనా—ఆమె పరమేశ్వరారాధనకు — ఆత్మార్పణకు అర్హురాలనే దృష్టితోనే అన్నమాచార్య డీ విధమయిన మార్గం అవలంబించి, సూక్ష్మమయిన వాస్తవిక (*Objective*) దృష్టితో ఆయా నాయికా చిత్రణ కుపక్రమించాడు.

క్షేత్రయ్య దగ్గరకు వచ్చేసరికి ఈ పద్ధతి ఇంకా కొంచెం విశ్శృంఖలంగా సాగింది. ఇతడు సాంప్రదాయికంగా వచ్చే అష్టవిధ శృంగారనాయికల వివిధ మనోభావాలే గాక భోగకాంతలు, పరకీయలు మొదలైన నాయికల మనోభావాభివర్ణనలలో అవధులకు వెళ్ళిపోయాడు. ఇంకా అక్కడక్కడ అంతగా ఉత్తమ ప్రకృతులుగాని నాయికల స్వభావాభివర్ణనలుకూడా చేర్చాడు. ఇంతగా సాగిన ఇతని నాయికా వైవిధ్య వర్ణనం పరిశీలించిన తరవాత మరి ఈ విషయంలో ఇత డభివర్ణించని నాయికాభావం ఏదైనా ఉన్నదా? అని ఆశ్చర్యం కలుగుతుంది.

ఇంకా ఆయా పదాలలో ఆయా నాయికల స్వభావాల ననుసరించి—సకృత్తుగా నేటి అభిరుచికి కొంచెం మోటుగా కనిపించే ధోరణిలో పదరచన సాగించాడు. అయితే ఇలాంటి వర్ణనలన్నీ వాస్తవిక (*Objective*) దృష్టితోను, నాయికా వైవిధ్య ప్రదర్శన దృష్టితోను, చేసినవన్న విషయం చాలా జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. ఆయా నాయికల స్వభావాభివర్ణనలలోను, సూక్ష్మమయిన వైవిధ్య ప్రదర్శనంలోను, సంగీతసాహిత్య సమ్మేళనంలోను, పదరచనా శిల్పంలోను ఇతడు ప్రదర్శించిన నిరుపమాన శక్తికి క్రింది పదాల ఉదాహరణలు చాలుననుకుంటాను.

యదుకుల కాంభోజి - ఆది.

[స్వీయ, ముగ్ధ, ప్రేమగర్విత]

పల్లవి :

ఎంత చక్కనివాడే! నాసామి వీ
డెంత చక్కనివాడే!

అనుపల్లవి:

ఇంతి మువ్వగోపాలుడు - సంతతము -
నామదికి - సంతోషము చేసు నే!

౧. మొలక నవ్వులవాడె - ముద్దుమాటలవాడె
తళుకారు చెక్కుటద్దములవాడే
తలిరాకు జిగిదగడెదగు మోవిగలవాడె
తెలిదమ్మిరేకు కన్నుల నమరువాడే

౨. చిరుతప్రాయమువాడే -
చెలువొందు విదియ చం
దురుగేరు నొసలిచే మెరయువాడే
చెరుకు విల్తునిగన్న దొరవలెనున్నాడే
మెరుగు చామనచాయమే నమరువాడే
౩. పొదలు కెందామరల
పెంపొదవు పదములవాడే
కొదమసింగపునడుము కొమరమరువాడే
మదకరికరముల మరువు చేతులవాడే
సుదతి! మువ్వగోపాలు
డెంత సొగసు గలవాడే!

ముఖారి - ఆది.
[స్వీయ - ముగ్ధ - కలహాంతరిత]

పల్లవి:
అలాగే మంచిది కానిమ్మనవే ఓయమ్మా!
అనుపల్లవి:
బాల! మువ్వగోపాలుడు
పంతము సాధించెనమ్మా!
౧. వినవే వానికి నా చేతి విడెమైన గారాదట!
తనయొద్దనుచుకట్ల నిలిచిన కాదట!
ననుజూచిన పాపమట!
నామాటంటే సైరదట!
తనకు గాని యీ మేను దాచి
యెవరికయ్యానమ్మా!
౨. విరిబోణి నేనున్న యింటి పొరుగిల్లైన జేరదట!
అరసి నేవచ్చిన త్రోవనైన రాడట!
మరి నావలెనున్న ప్రతిమలనైన గనుగొనడట!
సరసిజాక్షి యీపాపపుజన్మ
మెవరికయ్యానమ్మా!
౩. వనిత మువ్వగోపాలుడు -
తనుదా నొచ్చుకొన్నాడట!
తనతో నేమి పనియున్నది పొమ్మనినాడట!
యెనసినది కల్లట! ఇచ్చినబాస లేదట!
మనసులేనివానితో నేమల్లాడి
యెందుకయ్యానమ్మా!

కాంభోజి రాగము - త్రిశ్రత్రిపుట.

పల్లవి:
మోసమాయెనే - నాబుద్ధికి మోసమాయెనే
అనుపల్లవి:
మోసమాయె నేమిసేతు
మువ్వగోపాలుడు నేడు
మ్రొక్కినరాడె? ఓ చెలియరో!
౧. అందరికి చల్లనైన ఆ చందమామ
నాపాలిటి కవలమాయెనయ్యో! చెలియ!
ముందు నే నెవ్వరిపొం దెడబాపితినో!
అందుకు నే నీలాగైతిని ఓ చెలియరో!
౨. కలకల నాకన్నీరు వెల్లువాయె నేటికే
వెలది మోము జూచితినో చెలియా!
చిలుకపగ సాధించెనే కని పెంచిన నా
చేతు లెటువంటివో ఓ చెలియరో!
౩. ఏప్రొద్దు ప్రాణవిభుని ఎడబాయని యింతులు
ఎన్ని నోములు నోచిరో చెలియా!
దాపునగూడున్న విభుని దవ్వులదెట్టే
చెలులు నాపాలగలిగిరో! చెలియరో!

## మధురభక్తి - అన్నమాచార్య క్షేత్రజ్ఞులు

అన్నమాచార్య క్షేత్రజ్ఞులిద్దరు మధురభక్తి సంప్రదాయంలోనే పదరచన చేసినా ఇద్దరిలోను, తారతమ్యాలెంచవలసివస్తే - క్షేత్రయ్యకంటె అన్నమయ్యలోనే మధురభక్తి భావం ఒక చాపువాసి ఎక్కువగా ఉన్నట్లు కనబడుతుంది. దీనివల్ల అన్నమయ్యలో క్షేత్రయ్యకంటె ఒక చాపువాసి ఉదాత్తత కనబడుతున్నది. క్షేత్రయ్య స్వీకరించిన వైవిధ్యం వల్ల ఇతనిలో అది అక్కడక్కడ సకృత్తుగా ఒక చాపువాసి తగ్గినటు కనబడుతున్నది. వాస్తవంగా ఇద్దరిలోను కనిపించే విభేదం ఇంతే!

## స్థూల విమర్శకులు

ఇటీవల స్థూలవిమర్శకులు కొందరు ఆంధ్రదేశీయమైన పదరచనాసంప్రదాయము, మధురభక్తి, అభక్తి వ్యక్తులో వచ్చే ప్రత్యేకత మొదలైన విషయాలు నేటి తిన్నగా అవగాహన చేసుకోకుండా కేవలం స్థూలదృష్టితో క్షేత్రజ్ఞుడు మొదలైన వారిపదాలు చదివి, క్షేత్రయ్య పదరచనమీద చాపల్యతావిరహితమైన విమర్శలు చేశారు. అంతటితో ఊరుకోక ఇంతటి ఉత్తమపదకర్తమీద అసభ్యత్వాది నిందారోపణలు కూడా చేశారు. ఈ విమర్శకులు క్షేత్రజ్ఞుని పదరచనాకాలము, ఆనాటి పదరచనా సంప్రదాయాలు, వీటి విషయంలో అవలంబించవలసిన చారిత్రిక దృక్పథము మొదలైనవిషయాలన్నీ పూర్తిగా విస్మరించినట్లు కనబడుతున్నది.

## అసభ్యత్వారోపణ

ఈరోజుల్లో మనం పెద్దనవంటి ప్రబంధకాలపు కవిని పరిశీలింపదలిచినప్పుడా కాలపు కవితాసంప్ర

దాయాలు, చారిత్రికపరిస్థితులు, ఆయాకవుల ప్రత్యేక స్వభావాలు, వారివారి తరతమభావాలు, మొదలైన విషయాలన్నీ జాగ్రత్తగా అవగాహన చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాము. అంతేగాని కేవలం స్థూలదృష్టి అవలంబించి ఆషామాషీగా ఆకాలపు రచనలన్నీ పట్టి అసభ్యరచనలనిగాని పనికిమాలిన చెత్త రచనలనిగాని కొట్టి పారవెయ్యడం లేదు! ఉదాహరణకు పెద్దన మనుచరిత్రే తీసుకుందాము. ఆకాలపు కవితాసంప్రదాయాలనుబట్టి పెద్దన తన మనుచరిత్రలో పురవర్ణన, గజాశ్వాది వర్ణనలు, విరహవర్ణన, సంభోగవర్ణన, అవయవవర్ణనలు మొదలైనవన్నీ ప్రవేశపెట్టాడు. ఈనాటి కవులుగాని విమర్శకులుగాని ఇలాంటి విషయాలాధునిక కావ్యాలలో అవశ్యకాలని అనుకోరు. మనదృష్టి కానాటి విరహాదివర్ణనలు కొన్ని మోటుగా కూడా కనిపించవచ్చును. అంతమాత్రంచేత పెద్దన అసభ్యవర్ణనలు చేశాడని మన మతన్ని దుయ్యబట్టడం లేదు.

నిజానికి పెద్దన్న చేసిన సంభోగాది వర్ణనలు మాత్రమే ఉదాహరించి వట్టి స్థూలదృష్టితో ఇత డసభ్యధోరణిలోకి దిగిపోయాడనడం కూడా తేలికే. స్థూలంగాచూస్తే ఈవాదం చాలా సబబైనదే అని అంతగా లోతులు తెలియని పాఠకు లెవరైనా అంగీకరిస్తారు. క్షేత్రయ్యను విమర్శించిన స్థూల విమర్శకులు కూడా సరీగా ఈపద్ధతే అవలంబించారు. ఈ వాదు పెద్దన్న ఉత్తమ కవి అని సమర్థించడం హాస్యాస్పదమైనట్టుగానే క్షేత్రయ్య ఉత్తమ పదరచయిత అనీ ఇతనిలో అసభ్యత లేదనీ సమర్థించడంకూడా అలాగ చర్వితచర్వణమైన హాస్యాస్పద విషయమే!

ప్రబంధ కవులలో ఉత్తములలోనే తారతమ్యాలున్నాయి. ఎంత నిశిత పరిశీలనచేసినా ఈనాడు పెద్దనను మనమొక అత్యుత్తమ ప్రబంధ కవిగా గౌరవిస్తున్నాము. పెద్దనాది కవులలో ఉన్నట్టుగానే అన్నమాచార్యాది పద రచయితలలో తారతమ్యాలున్నాయి. అన్నమాచార్య లించుమించుగా ఈ ప్రబంధయుగానికి చెందినవాడే. ఆ కాలపు అభిరుచినిబట్టిగాని నిశితమైన ఈకాలపు అభిరుచినిబట్టి గానిచూస్తే ఇతనిలో అసభ్యత ఎక్కడా గోచరించదు.

ఈ వ్యాసంలో ఉదాహరించిన క్షేత్రయ్య పదాలనుబట్టి అన్నమాచార్యుని రచనలలోను క్షేత్రయ్య రచనలలోను గల సంప్రదాయసామ్యాలు, పదరచనారీతులు, తారతమ్యాలు పాఠకులకు సులభంగానే స్ఫురిస్తాయి.

క్షేత్రయ్య అన్నమాచార్యునికి రెండుశతాబ్దాల అనంతరం ఉద్భవించినవాడు. ఇతనిలో రెండు శతాబ్దాల పదరచనా పరిణతివల్ల వచ్చిన చూపువాసి శృంగారవర్ణనాధిక్యంమాత్రం కనిపిస్తుంది. అంతేగాని ఇటీవలి విమర్శకులు స్థూలదృష్టితో ప్రదర్శించినంత అసభ్యత ఎక్కడా ఇతని రచనలలో కనబడదు.

అయితే ఈ విమర్శకులు క్షేత్రయ్య నాయికా వైవిధ్య ప్రదర్శనంకోసం సకృత్తుగా అక్కడక్కడ రచించినవి అనుదాత్త నాయికాపరమైన పదాలు కొన్ని చదివి, సరియైన వాస్తవిక దృక్పథంతో అవి అవగాహన చేసుకోలేక ఇటువంటి విమర్శనకు ఉపక్రమించారని తోస్తుంది.

అంగ ప్రత్యంగవర్ణనలు చేసినంతమాత్రాన రచయితమీద అసభ్యతారోపణ చెయ్యడానికి వీలులేదు. ఆ రచయిత ఆ విషయంలో అవలంబించిన ఉదాత్త మదాత్త దృక్పథాలనుబట్టిమాత్రమే సభ్యతాసభ్యతలు నిర్ణయించాలి. క్షేత్రయ్య రచనలు వాస్తవిక దృక్పథంతో పరిశీలించినవారికి క్షేత్రయ్య నాయికా స్వభావవర్ణనలలో ఎక్కడా అసభ్యత స్ఫురించదు. పైగా సూక్ష్మమైన ఈతని స్వభావ పరిశీలనలు పాఠకులలో ఆశ్చర్య గౌరవాలినుమడింప జేస్తాయి.

## ఆధునిక దృష్టి

క్షేత్రయ్యపదాలీకాలంలో కులీన బాలికల గానాభినయాల కనర్హమైనవని ఇంకొక విమర్శ వచ్చింది. నిజానికి క్షేత్రయ్యలో ఇలాంటి పదాల సంఖ్య చాలా స్వల్పం. అదిన్నీగాక ఇది సాహిత్య విమర్శనకు సంబంధించిన సమస్య కానేకాదు. సుప్రసిద్ధులయిన పెద్దనాదుల కావ్యాల భాగాలన్నీ బాలబాలికల పఠన పాఠాలకు తగినవి కావు. మనం ఆ కావ్యాలలో సముచితములైన భాగాలే నేడు పాఠ్యభాగాలుగా నిర్ణయిస్తున్నాము. ఇది కేవలం బాల బాలికల విద్యావిధానానికి సంబంధించిన సమస్య.

క్షేత్రయ్యరచనలలో సకృత్తుగా అక్కడక్కడ కనిపించే కొన్ని పదాలు పరిహరిస్తే అవి నేటి బాలి

కల గానాభినయాలకుకూడా సముచితమైనవే. సకృత్తుగా కనిపించే కొన్ని పదాలుమాత్రం ఉదాహరించి క్షేత్రజ్ఞుని పద రచన అంతా చెత్తకింద జమ కట్టడం సమ్యగ్దృష్టిలేని విమర్శకులు చేసేపనికింద జమ కట్టాలి.

సుప్రసిద్ధులయిన తమిళ విమర్శకులు నేటివరకు క్షేత్రజ్ఞుని ఒక ఉత్తమ వాగ్గేయకారకుడుగా గౌరవించి ఇతనిపదాలు విరివిగా బాలికల నృత్యగానాల కుపయోగిస్తున్నారు.

మరి అదేమి దురదృష్టమోగాని ఆంధ్రదేశంలో కొందరు విమర్శకులు ఇటీవల ఇతనిమీద ఇతని పద రచనమీద లేనిపోని దోషారోపణల కుపక్రమించారు.

ఇతని కేర్పడిన క్షేత్రజ్ఞ నామధేయాన్నిబట్టి చూస్తే ఇతడు తీర్థయాత్రాపరుడైన ఒక భక్తుడై ఉండవచ్చునని చెప్పవచ్చు. ఇతడనేక క్షేత్రాలు దర్శించి ఆయా దేవతలమీద పదరచన చేశాడనీ, కనక నే ఇతనికి క్షేత్రజ్ఞ నామధేయం ఏర్పడినదనీ చెబుతున్నారు. ఆయా దేవతలమీద ఇతడు రచించిన పదాలనుబట్టి ఈ ఊహ సమంజసమైనది కావచ్చును.

అయితే క్షేత్రయ్య పదాలు ప్రకటించిన శ్రీ విస్సా అప్పారావుగారు తమ గ్రంథ పీఠికలో క్షేత్రయ్య నిజ నామధేయం మువ్వ వరదయ్య అనీ, మువ్వగ్రామానికి సమీపంగా సాతెంపాడు వేశ్యల సాహచర్యం కొంత ఇతని పదరచనకు ప్రోద్బలం కలిగించి ఉండవచ్చుననీ వ్రాశారు. పేరునుబట్టి చూస్తే ఇతడు తీర్థయాత్రాపరుడైన భక్తుడని అంటే అనవచ్చునుగాని, ఈ వేశ్యా సాహచర్యానికిమాత్రం ఇతని రచనలో ఎక్కువ తార్కాణం కనబడదు. ఇది కేవలం మువ్వగ్రామ పరిసరాలనుబట్టి వారు చేసిన ఊహాగానం మాత్రమే. మధురభక్తి ధోరణిలో పద రచన చేసినంతమాత్రాన ఈవిధమైన వేశ్యా సాహచర్యం కల్పించడం సముచితం కాదు. కేవలం రచనలనుబట్టి ఇలాంటి ఊహాగానాలు ప్రారంభిస్తే అన్నమాచార్యాది తాళ్ళపాక కవులకు కూడా ఇలాంటి తతంగాలు కల్పించవలసి వస్తుంది. అన్నమాచార్యాది తాళ్ళపాక కవులందరు ఉత్తమభక్తులుగా నేటికీ గౌరవింపబడుతున్నారు. అందుచేత అనుకూలంగా గాని వ్యతిరేకంగా గాని తగినన్ని సాక్ష్యాలు దొరికినదాకా ఇలాంటి విషయాలలో కేవలం తటస్థభావం అవలంబించడమే న్యాయ్యము.

శ్రీ అప్పారావుగారు క్షేత్రయ్యయెడల భక్తిగౌరవాలతోనే ఇలాంటి ఊహాగానాలు చేశారుగాని ఇటీవలి విమర్శకులీ ఊహాగానాలు పట్టుకుని క్షేత్రయ్యమీద అతని పదరచనమీద అన్యాయమైన విమర్శలోకి దిగిఉండడంవల్ల ఈవిషయంలో ఇంతగా వ్రాయవలసిన అవసరం కలిగింది.

క్షేత్రయ్యచరిత్రనుగూర్చీ అతనిపదాలనుగూర్చీ ఇంకా విశదమైన పరిశోధన జరగవలసిన అవసరం ఎంతేనా ఉన్నది. క్షేత్రయ్య రచించిన పదాలన్నీ లభించినట్లుకనబడదు. అతడు కొన్ని వేలవరకు పదాలు రచించి ఉండవచ్చునని విజ్ఞులు అభిప్రాయ పడుతున్నారుగాని మన కింతవరకు లభించిన పదాలు కొన్నివందలుమాత్రమే.

కొంత నిశిత పరిశోధన జరిగినమీదట క్షేత్రయ్య చరిత్రనుగురించీ పదాలనుగురించీ కొన్ని కొత్త విషయాలు బయటపడవచ్చును. ప్రస్తుతం క్షేత్రయ్య పేరుతో ప్రకటింపబడిన పదాలలో కొన్నికొన్ని ప్రక్షిప్తాలుండినా ఉండవచ్చును.

సంగీత సాహిత్యాభిజ్ఞులీ విషయంలో ఇంకా నిశితపరిశోధనలుజరిపి విస్మృతిప్రాయమైన క్షేత్రయ్య పదాలు పునరుద్ధరించగలరనీ, ఆంధ్రదేశంలోకూడా క్షేత్రయ్య పద కవితపై సముచితమైన దృక్పథం ఏర్పడగలదనీ, తద్వారా మనదేశంలో క్షేత్రయ్య పదాలకు సముచితమైన గౌరవాదరాలు లభించగలవనీ, క్షేత్రజ్ఞుని పదకవిత నృత్యగానాలతో విలసిల్లగలదనీ ఆశిస్తున్నాను.

---

# దివ్యభావనము



శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

సాయంవేళ, కపర్ది నృత్యరచనానంజాత శోభాసరి
త్తోయ స్నాత భవత్పదద్వితయ మాధు స్నిగ్ధచంచచ్ఛవి
స్వాయత్తమ్ముగ, చిత్తభంభరము చేయన్ బ్రసాదింపవే
సాయంకాల నటన్మహాప్రభుప్రియా! సర్వేశ్వరీ! శాంకరీ!

నటనాచాతురి నేర్చునీ మగని విన్నాణంపు జేష్టాళి, దు
ర్ఘటమై పోల్చెదు నీవులేనిది, యసంఖ్యాకమ్ముగా సృష్టి, సా
గుటయెల్లన్, మఱి త్వద్విలాసభ్రుకుటీ, కోటీర సంస్పందన
చ్ఛటలన్ సంభవమై విరాజిలెడులే సర్వేశ్వరీ! శాంకరీ!

అతడున్ జేతనతావిభూతియగుచున్ హార్ద్వంద జిచ్ఛక్తివై
తత బ్రహ్మాండములెల్ల దావక కృపాతారళ్య సంభూతి సు
స్థితి జెందన్ గరుణింతు వంతటను గించిత్కుంచితాపాంగవీ
క్షిత దత్సంస్మృతి నల్ప జాలెదవటే సర్వేశ్వరీ! శాంకరీ!

అతడో నిష్కలమూర్తి! నీవో మఱి తద్వ్యాఖ్యాత్మరూపస్థితిన్
దత శాంతావృత నిస్తరంగతకు వాత క్షుబ్ధ పాథోధి రూ
పత, గల్పించెదు శక్తివై మెలగుదంబా! యంతె కానీ విభి
న్నత మీ యిర్వురియందు మృగ్యమమెదున్ సర్వేశ్వరీ శాంకరీ!

ఉదయాదిత్యనవారుణద్యుతులు ప్రద్యోతింప నుత్సాహ స
మ్మద సంరంభనిదానమై పొలిచెదున్, మధ్యాహ్న రోచిః ప్రభా
భ్యుదితంబై కనవచ్చు తావకలసన్మూర్తి స్ఫురద్దీప్తు ల
చ్ఛదయా శాంతములొల్కు సంజలనహో! సర్వేశ్వరీ! శాంకరీ!

అంబా! వాల్చితి శీర్షమున్ నతుడనై, యశ్రుప్రవాహోర్మి సి
క్తంబుల్ యుష్మదుదారపాదములు, స్నిగ్ధంబుల్, ప్రపూతమ్ములా
లంబంబుల్ మఱి మాదృశార్తులకునున్, రాజత్కరంబెత్తి వే
సంబాళింపుమ యుష్మదాశిషములన్ సర్వేశ్వరీ! శాంకరీ!

భావింతుఁ, మది దావకీన కరుణా భాగీరథీ వీచికా
సేవా భాగ్యము నంది, నందనవనీ సేమంతికా సౌరభ
శ్రీవాల్లభ్యము నంది, మానసము, దృగ్రేఖాంతమై పొంగి న
ట్లై వర్షించుట బాష్పముల్ కనుగొనల్ సర్వేశ్వరీ! శాంకరీ!

భాసించుఁ భవదీయమూర్తి రుచిరంబై, దివ్య గంగాంబుజ
శ్రీసాహస్రకమై, సుధాకర కళారేఖాపరిస్నాతమై
దోస్స్రోతోంబు పవిత్రమై, మధురమై యోగీశ హృద్భావనా
శ్వాసంబై, శ్రుతిగేయమై, ప్రణతమై సర్వేశ్వరీ! శాంకరీ!



మధుర, తంజావూరు రాజులనాటి :

# దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము



శ్రీ నేలటూరి వేంకటరమణయ్య

(గతసంచిక తరువాయి)

## 3

నాయక యుగాంధ్ర సాహిత్యమును గురించి పెక్కు దురభిప్రాయములు ప్రబలియున్నవి. భాష పరిశుద్ధమైనది కాదు, తత్కారణమున నది యుత్తరాంధ్ర కవిత్వముతో సరితూగజాలదు; కావున నది రెండవ రకమని చెప్పవలసి యున్నది, అని కొందఱభిప్రాయ పడుచున్నారు. వీరియందు ప్రముఖులు జయంతి రామయ్యపంతులుగారు. దాక్షిణాత్య కవులు చాతుర్య ప్రదర్శనమే కవిత్వమునకు పరమావధియని యెంచి తత్పూర్వకాలపు సాంప్రదాయమును వీడఁబుచ్చి భాషా సాంకర్యమున కాలాయపడిరి; వారి రచనలలో గొప్పకట్టు వ్యాకరణ విరుద్ధ ప్రయోగముల కనేకముల కిదియే కారణమని పంతులుగారు సెలవిచ్చిరి. భాషా విషయములందు పంతులు వారు పరమ నైష్ఠికులు. కవిత్రయము వారి రచనలు వీరికి కొలతబద్ద. తదనుసారము రచింపజాలని కవులను వీరు మెచ్చరు. తెనుఁగు లోక వ్యవహారము నందింకను ప్రవర్తిల్లుచుండు జీవభాష యను సంగతిని వీరు విస్మరించినట్లున్నది. జీవభాషలకు నిత్య పారిశుద్ధ్యము చేకూరదు. నానాటికి నది యభివృద్ధి నందుచుండును. ఈ యభివృద్ధి ననుసరించి భాషా పరిశుద్ధి మాఱుపు లేక యెల్లప్పుడు నొక్క తీరున నుండదు. దాని స్వభావము నూతన పరిణామములనందుచు యుగయుగమునకును భిన్నముగ నుండును. మఱియు కవిత్వ గుణావగుణములను నిర్ణయించు నపుడు వ్యాకరణ మొక్కదానినె యొరగల్లుగ గ్రహించుట యుక్తము గాదు. "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" అని పెద్దలు చెప్పుదురు. కావున కావ్యరచనయందు శబ్దార్థములు రెంటికిని సమాన గౌరవము గలదు. వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు కావా చిక్కముగ గానవచ్చినంతటనే కావ్యములను గ్రిందుపఱచుట సముంజసము గాదు.

ఈ సందర్భమున వీరేశలింగము పంతులు వారి వాక్యములు స్మరింపదగినవి. "ఇప్పటి వారు కవిత్వ సారస్యమును విచారింపక గ్రంథములందు రేఫద్వయ ప్రాస విశ్రమమైత్రియు, యేదో వ్యాకరణదోషమో యున్నదన్న హేతువుచేత రసవంతములైన యుత్తమ గ్రంథములను సహిత మగ్రాహ్యమని నిరాకరించుచున్నందున, అట్లు చేయుట యుక్తము కాదు. ఛందో వ్యాకరణ దోషములు లేని రసహీనములగు గ్రంథములకంటె ఛందో వ్యాకరణ దోషములను గలవయినను రసవంతములయిన గ్రంథములే యధికాదరణీయములు."

నాయకయుగము క్షీణయుగమనియు, నీ కాలములో తెలుగు కవిత్వము క్రొత్తపోకడలు లేక వెనుకటి రీతులలోనే విస్తారము వహించినదనియు, నూతన ప్రతిభ క్షీణించెననియు, తిక్కన పోతన గార్లవలె కవిత్వము దివ్యకళ యని విశ్వసించిన వారుగాని శ్రీనాథునివలె రసోచితముగ వ్రాయగలవారు గాని, పింగళి సూరనవలె నూత్న కల్పనలు జేయగలవారు గాని ఈ కాలములో లేరనియు, సాహిత్యము క్షీణదశలో నుండుటకు గారణము సంఘ జీవితముకూడ క్షీణస్థితిలో నుండుటయే యనియు ఖండవల్లి లక్ష్మీరంజనముగా రనుచున్నారు.

సీతారామ భట్టాచార్యులవారు వచించినట్లు, "దక్షిణాంధ్ర వాఙ్మయ మింతయని యిప్పటికిని చెప్పవలనుపడదు. రఘునాథ రాయాదులు రచియించినట్లు చెప్పు గ్రంథము లిప్పటికిని బయట పడలేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు తద్వాఙ్మయమును

ప్రపంచమున కెలుకచేయుటలో ప్రథములైనను, దాని వైఖరి యెట్టిదో సంపూర్ణముగ దెలియరైరి." పరిషత్తు వారొక్కరే కారు,— చెప్పిన గటువుగ నుండును— గాని, వాస్తవముగ దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయ విమర్శకుల కనేకుల కావాఙ్మయముతో బరిచయము తక్కువ. "ఈ కాలములో కవిత్వము క్రొత్తపోకడలు లేక వెనుకటి రీతులలోనే విస్తారము నడిచె"నని చెప్పిన లక్ష్మీరంజనముగారే "ఇది క్షీణయుగమైనను ఈ కాలములో పెక్కు సాహిత్య ప్రక్రియలు ఆంధ్ర భాషలో వెలసినవి. మొట్టమొదటిసారి వచనరచనము విస్తారముగా ఈ కాలముననే జరిగినది. యక్షగానము లని పిలువబడు నాటకము లీనాడే వ్యాప్తిలోనికి వచ్చినవి" అని వ్రాసిచ్చినారు. వచనరచనయు యక్షగాన ప్రాదుర్భావమును క్రొత్తపోకడలు గావా? కావ్యరచనయు దొల్లిటి మార్గమున సాగలేదు. ఉత్తరాంధ్ర ప్రబంధములు వర్ణనా ప్రధానములు, అందు కథాంశమల్పము. ఔచిత్యమును బరిపాటింపక ప్రబంధ కవులు దమ గ్రంథములలో నిచ్చవచ్చినట్లు వర్ణనలు పెంచిరి. కృష్ణరాయ విరచితాముక్తమాల్యద, భట్టుమూర్తి కృత వసుచరిత్ర మున్నగు ప్రబంధము లిందుకు దార్కాణ. నాయక యుగ కావ్యము లిట్టివి కావు. అందు కథాంశము ముఖ్యము. వర్ణనలకొఱకు కథ నడక యెచటను నిలచిపోదు. వర్ణనలు లేక పోలేదు. కాని యవి కథ కనుగుణముగ వచ్చును, విజయ విలాస కువలయాశ్వచరిత్రములను మనువసు చరిత్రలతో బోల్చిచూచిన నుత్తరాంధ్ర ప్రబంధములకును నాయక యుగకావ్యములకు గలభేదము తెల్లము గాగలదు. తిక్కన పోతనాదుల వంటి మహాకవులు ప్రతి శతాబ్దమునను బొడచూపరు. అట్టి వారు లేక పోయినంత మాత్రమున వాఙ్మయము క్షీణదశకు వచ్చె నని యెంచుట తగవుగాదు. నూతన ప్రతిభ క్షీణించిన దని యన్నారుకదా లక్ష్మీరంజనముగారు. వారి యభిప్రాయమేమొ చక్కఁగ దెలియరాకున్నది. ప్రతిభ యనఁగా నప్పటప్పటికి వికసించెడు బుద్ధియని యర్థము చెప్పినారు శబ్దరత్నాకర కారులు. మేధాతిశయము గల కవులెవ్వరు నీ యుగమున బుట్టలేదని గాబోలు వీరి యభిప్రాయము. అగునేని యట్టి తలంపు ప్రమాద జనితమని చెప్పవలయును. కథా సంవిధానమునగాని, కల్పనా చాతుర్యమునగాని, చమత్కార వచోవిలాసమునగాని, వర్ణనా సౌష్ఠవమునగాని నాయక యుగాంధ్ర కవులెవ్వరికిని దీసిపోరు. చేమకూర, సవరము, శేషము, కంకంటి, పుష్పగిరి, ధరణిదేవుల కవులు వర్థిల్లిన కాలమును క్షీణయుగమనుట సాహసము గదా?

---

దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయము నీతి బాహ్యమని చెంచయ్య భుజంగరావు గారలు ఖండించిరి. దాక్షిణాత్య కవులు పాతివ్రత్యము కంటె వ్యభిచారమును అతిశయముగ వర్ణింతురనియు దుర్నీతి నుపదేశింతురనియు దత్కారణమున నది యనర్థకరమనియు జెప్పిరి. సీతారామాభట్టాచార్యుల వారు వారి విమర్శనొప్పుకొనక యది వారి క్రైస్తవ మతాభిమానము పెంపున జేసిన దుర్విమర్శయని నిరసించిరి. కాని యిట్టి విమర్శ కంకురార్పణము జేసిన వారలు చెంచయ్య, భుజంగరావు గారలు గారు. వీరికి దారిచూపినవాఁడు వీరేశలింగము పంతులు. పంతులుగారు తమ యాంధ్ర కవుల చరిత్రయం దచటచట కొందఱు కవులను గూర్చి చెప్పిన అభిప్రాయములను వీ రేకముఖమునకు దెచ్చి దాక్షిణాత్య వాఙ్మయ మంతటిమీఁదను పొద్దు బెట్టిరి. ఇది వీరు చేసిన పొరపాటు. కాని వాస్తవముపై దృష్టియుంచి చూచితిమేని యిట్టి విమర్శకు గొంత యెడము గలదని తోఁచకపోదు.

నాయక యుగము శృంగార యుగము. భోగమప్పటి యాంధ్రులకు జీవన పరమావధియైనది. స్త్రీలౌల్యము సామాన్యము; బహుకళత్ర గ్రహణమును, వేశ్యాంగనా గమనమును సిరి గలవారికి లక్షణములు. కేవలాంగ భోగములతోఁ దృప్తినందియుండక ధనవంతులగు రసికవతంసులు స్త్రీల సర్వాంగముల నే కాక స్త్రీ పురుషుల పరస్పర సంబంధ వర్తనలకు జెందిన బయలుపెట్టరాని మర్మవిషయములను గూడ నాయక నాయికా వ్యాజమున పలువిధముల వర్ణింపించి యానందించెడివారు. ఈ కారణముచేత నాయక యుగాంధ్ర వాఙ్మయమునకు కళంకు దెచ్చెడి నీతి బాహ్యకావ్యములు పెక్కు బయలువెడలినవి. కాని దాక్షిణాత్య వాఙ్మయము సర్వమును నీతిబాహ్య శృంగార వర్ణనాత్మకము గాదు. కొందఱు దాక్షిణాత్య కవులు హద్దుమీఱి శృంగారమును పచ్చిగ వర్ణించినది వాస్తవమె. కాని వారి తప్పుకై దాక్షిణాత్య వాఙ్మయము నంతటిని దూషించి ఖండించుట సద్విమర్శకుల పద్ధతి కాదు.

ఈ సందర్భమున దృష్టియందుంచు కొనదగిన యంశమొకటి కలదు. కావ్యనిర్మాణము యొక్క ముఖ్యప్రయోజనము ధర్మోపదేశముగాదు. ప్రపంచాను

భవమువలన గలిగిన భావోద్రేకము శబ్దరూపమున బహిర్గతమై కవితయన బరగుచున్నది. రసాలంకార భూషితమైన కవిత కావ్య మనబడును. కావున కావ్యోత్పత్తికి ప్రధాన కారణము ప్రపంచానుభవము వలన వలుగు భావోద్దీపనమే. ప్రపంచానుభవము బహువిధములైనది. దానినిబట్టి భావము లనేక రూపములు ప్రభవించుచుండును; వాని ననుసరించి కవితా వస్తువయును మారుచుండును.* ఏతత్కారణమున కవిత్వము నిర్ణిరుద్ధమై యుండవలయుననియు, నీతి నిబంధనలను కవులు జరుప వేయవలసినది లేదనియు వాదించు వాఙ్మయ విమర్శకులును గలరు. కావున శృంగారాత్మకమైనదని దాక్షిణాత్య వాఙ్మయమును వెలివేయు బూనుట భాష కపకారము జేయ బూనుటయే కాని యన్యము కాదు.

# 4

నాయక యుగమునం దాంధ్ర సాహిత్య వాహిని బహు ముఖముల ప్రవహించినది. ఇందు ముఖ్యమైనవి మూఁడు. కావ్యము, నాటకము, గీతము.

౧. కావ్యము:—ఇది త్రివిధములైనది, పద్య కావ్యము, ద్విపదకావ్యము, వచనకావ్యము.

పద్యకావ్యములు:—దాక్షిణాత్యాంధ్ర పద్య కావ్య రచయితలలో ప్రథమమున జేర్కొన దగిన వాడు తంజావూరు రఘునాథ నాయకుఁడు. ఇతడు బహు గ్రంథకర్త. నూఱు గ్రంథములను రచించెనట! విజయరాఘవ నాయకుఁడు తన తండ్రి రచించిన గ్రంథములను గొన్నింటిని పేర్కొనియున్నాడు.

> భువిమెచ్చ నచ్యుతాభ్యుదయ కావ్యంబు
> నవరస చిత్రంబు నలచరిత్రంబు
> హరువైన పారిజాతాపహరణంబు
> మెఱవడి జూపు వాల్మీకి చరిత్ర
> జానకీ కల్యాణ చాటు కావ్యంబు
> తా నిర్వహించిన తక్కిన కృతులు.

ఇవి యన్నియు నాంధ్రకృతులని తోచెడిని. ఇందు పారిజాతా పహరణ కావ్యరచనను గూర్చి యజ్ఞ నారాయణ దీక్షితులు దన సంగీత రత్నాకరమునం దిట్లు చెప్పియున్నారు.

> యో మధ్వరోన యదు నేతరి పారిజాత
> మాజీహరన్నరస మచ్యుత భూప సూనుః
> కావ్యం తదత్ర విబుధైస్తు కథం కథంచి
> దాలేఖి చిత్ర మవధాయ ఫణీంద్ర కల్పైః॥
> ఏవం వదత్స్వనయ మేవ కృపారసార్ద్రైః
> జాతాభిషేక మపి తం జగతీబిడౌజాః
> తత్రాప్యపి ప్యుత మణీభి రసౌ సభాయా
> మాసీత్స ఏవ వసుధేశ పటాభి షేకః॥

ఇందువలన రఘునాథ నాయకుఁడు పారిజాతాహరణము ఆశువుగా జెప్పెనని తెలియుచున్నది. ఇవిగాక రామాయణమును రఘునాథుఁ డాంధ్ర కావ్యముగా రచించి దానిని మధురవాణిచే సంస్కృతీకరణము గావించెను. ఈ యంశమును రఘునాథుని వాక్యములుగ మధురవాణి ఇట్లు తెల్పుచున్నది.

> "రసోత్తరం రామ కథాసు బంధ కావ్యం
> మయా కల్పితమాంధ్ర వాణ్యా
> కార్యం కయా సంస్కృత వాగ్విరేతత్
> ఇత్యేవచిత్తే గణయన్న వాత్సీత్.
> అజహాదలంకృతిక్రమము నేక రసోల్లసితం
> సరస పదార్థ సంగతి సమగ్ర గుణానుగుణం
> రఘు రమణ ప్రబంధ తిలకం రసికాభిమతం
> సుదతి విధేయతా మితి సుధీ రగదీన్నృపతిః ?

రఘునాథ కృతములని పై జేర్కొన్న ఆంధ్ర గ్రంథములలో రెండు మాత్ర ముపలబ్ధమైనవి. అంగు రామాయణ మొకటే, కాని ఇది మధురవాణి సంస్కృతములోనికి దిర్చుమా జేసిన రామాయణమని తోచదు. ఏలనఁగా, మధురవాణి రామాయణము చిన్న కావ్యము. ఇందు పదునాలుగు సర్గలును మొత్తము మీఁద ౧౫౦౦ శ్లోకములు గలవు. కాని మనకు లభ్యమైన రఘునాథ రామాయణ మసమగ్రము; ఇందు బాలకాండమునందు మూఁడాశ్వాసములును నాలవ యాశ్వాసారంభము నందిరువదియారు పద్యములు మాత్రము కలవు. ప్రథమాశ్వాసమంతయు భీతి కరము బాలరామాయణమునకును సరిపోయినది. ద్వితీయాశ్వాసము కోసలదేశ వర్ణనతో ప్రారంభమై ఋశ్యశృంగ చరిత్రతో దుద ముట్టినది. తృతీయాశ్వాసము ఋశ్యశృంగుని యయోధ్యాగమనముతో నారంభ మయి పుత్రకామేష్టితో ముగిసినది. నాల్గవ యాశ్వాసము శ్వేతద్వీప వర్ణనతో నారంభమైనది. మొత్తముమీద నందు పద్యములుగాని వచనములు గాని కటూ కలవు. దీనినిబట్టి చూడఁగా రఘునాథుఁడు వ్రాయ దలపెట్టిన ఈ రామాయణము

బృహద్గ్రంథమని తోచుచున్నది. ఇది మధుర వాణి ౧౫౦౦ శ్లోకములలో సంస్కృతీకరించిన యాంధ్ర రామాయణమై యుండదు. శేషారామ భట్టాచార్యుల వారును నిట్టి యభిప్రాయమునె వెలిబుచ్చియున్నారు. కాని వారి యభిప్రాయమునకు కారణము వేఱు:— "మధురవాణి కావ్యముతో దీనిని పోల్చిన యెడల నిదియే భాషాంతరీకరింపబడినట్లు తలంచుటకు వీలు లేదు. ఏలన తెలుగు గ్రంథముకంటె సంస్కృత కావ్యము ప్రౌఢతరముగ నున్నది." మధురవాణి భాషాంతరీకరించిన యాంధ్రరామాయణము ప్రస్తుతమునందుండు రామాయణమున కంటె భిన్నమైనదే యైనను నిది ప్రౌఢిమయందు మధురవాణి సంస్కృతీకరణమునకు సరికాదనుట న్యాయము గాదు. ఏ కావ్యమందు గాని రచనా సౌష్ఠవము మొట్టమొదటి పద్యము నుండి చిట్టచివర గద్యమువఱకు నొక్క తీరుగ నుండదు, సందర్భమునుబట్టి మాఱుచుండును. విరాటోద్యోగములందును, యుద్ధపంచకమందును గానవచ్చు తిక్కనగారి కవితా ప్రౌఢిమ శాంతి సప్తకమున గానరాదు. మనుచరిత్ర మొదటి మూడాశ్వాసములలోని మజా తరువాతి గ్రంథమునందు లేదు. రఘునాథ రామాయణము రామాయణము నందంతయు నొక లేశము. కథానాయకుడగు రాముని జన్మమునకు ముందే యాగిపోయినది. ఆ లేశమును సంపూర్ణముగ విరచితమైన మధురవాణి గ్రంథముతో పోల్చి యందు ప్రౌఢిమ చాలదనుట పునాదిని పరీక్షించి పై కట్టడము జక్కనిది కాదని యన్నట్లున్నది. రఘునాథ రామాయణ కవిత్వము రసవంతమైనది. నిరర్గళమైన ధార, సరసమైన శైలి, మధురమైన వాగ్గుంఫనము, స్వభావ సిద్ధమైన వర్ణనలు చదువ జదువ చవులూరుచుండును. ఋశ్యశృంగుని కథ చొక్కమై యింపెసలారుచు రఘునాథుని కవితా వైభవమును ప్రకటించుచున్నది. గ్రంథమున దక్కిన భాగము నష్టమైపోయెనని వాఙ్మయ చరిత్రకారులును విమర్శకులును వాపోవుచున్నారు. కాని రఘునాథుఁడు వ్రాసినంతయు నింతియయేమొ, పూర్తి సేయక మునుపె యతడు స్వర్గసీమ నలంకరించెనేమొ.

రెండవది వాల్మీకి చరిత్ర. ఇది మూడాశ్వాసముల చిన్న ప్రబంధము, వాల్మీకి పూర్వ చరిత్ర వర్ణింపఁబడినది. సప్తద్వీపములందలి పుణ్యతీర్థములును, ఋషుల పర్యటనమును, వాల్మీకి సమాగమమును, నతని జ్ఞానోత్పత్తియు, బోయజీవనమును, రంభోర్వసుల పరాభవమును మనోహరముగ వర్ణించినాడు. రఘునాథ భూపాలుడు సౌందర్య పిపాసువుఁడు, రసజ్ఞుఁడు. కవిత్వ స్వరూపమెట్టిదో నిర్దేశించినాఁడు.

పలుకఁగ వలె నవరసములు
గులుకం బద్యములు చెవులకున్ హృద్యముగా
నలుకక యటుగాకున్నం
బలుకక యుండుటయె మేలు బహుమానముగన్
చెప్ప వలె కప్పురంబులు
కుప్పలుగా బోసినట్లు గుంకుమ పైపై
గుప్పిన క్రియ నిరిపాట్లను
విప్పిన గతి ఘుమ్మనన్ గవిత్వము సభలన్
చెవులకుఁ జవులై చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్త కావ్య కళాబం
ధువులై రసపిండువులై
యవురా! యన గవిత లవలి నలరఁగ వలదా.

దీని కనుగుణముగనె చెప్పినాడు కవిత్వమును. లచ్చారావుగారు చెప్పినట్లు "ఈతని కవిత్వము లలితార్థ చమత్కార సన భూయిష్ఠమై స్వభావోక్తి ఘనమై పండిత పామరకర్ణ రసాయనంబై మృదుమధుర శైలితో నెంతయు సమయోచిత వర్ణనలతో నొప్పారుచున్న యది. వ్యర్థపదంబులు గానరావు."

రామాయణ వాల్మీకి చరిత్రలు గాక సావిత్రీ చరిత్రను వర్ణించు రెండాశ్వాసముల పద్యకావ్య మొకటి కలదు. గ్రంథ పీఠిక గాని యాశ్వాసాంతములు గాని లేవు. యత్కృతియో తెలియదు. కాని గంటి సూర్యనారాయణ శాస్త్రులవారు దీనికి శృంగార సావిత్రి యని నామకరణము జేసి రఘునాథ నాయకుని కంటగట్టినారు. దీనికి వారు చూపిన కారణ మొక్కటియే. "శ్రీ రఘునాథ రాయ మహాకవి రచియించిన రామాయణమందలి పద్యములు — ఋశ్యశృంగ తపోభంగము పట్టున నున్నవి— ఈ గ్రంథము నందుండుటచే తత్కర్తయే యేతత్కర్త యని మే మూహించినాము." అని చెప్పినారు. ఆ రెండు గ్రంథములకును ఉమ్మడియైన పద్యము లెవ్వియో వారు తెలుపలేదు. ముద్రిత రఘునాథ రామాయణము లోని పద్యము లెవ్వియు శృంగార సావిత్రియందు గన్పట్టవు. ఈ విషయము నింకను బరిశోధింపవలసి యున్నది. ఇది యెట్లున్నను గవిత్వమునుబట్టి చూడఁగా శృంగారసావిత్రి రఘునాథుని రచన కాదని తోఁచుచున్నది. శృంగార సావిత్రిని రఘు

నాథుఁ గ్రంథములతో బోల్చి చూచిన నీ విషయము దెల్లము కాఁగలదు.

## చేమకూర వేంకట కవి

ఇతఁడు రఘునాథుని యాస్థానాంధ్ర కవి బృందమునకు శిరోమాణిక్యము. దాక్షిణాత్యాంధ్ర కవులలో నింతవ మించిన కవిలేడు. ఇతఁడు సారంగధర చరిత్ర, విజయ విలాసములను రెండు గొప్ప కావ్యములను రచించి రఘునాథుని కంకిత మిచ్చెను. సారంగధర చరిత్ర వేంకట కవి యొక్క ప్రథమ రచన. కవిత్వము రసవంతమైనదే. కాని విజయ విలాసములోని పరిపక్వత యందు గానరాదు. చేమకూర వారి కవిత నాంధ్రలోకము చిరకాలము క్రిందనే చవిచూచినది. ఇంటిపేరు పసయైనను, కవిత్వము పసగా నున్నదని యొక ప్రాచీన వాఙ్మయ విమర్శకుఁడు వక్కాణించెను. "ఈ చేమకూర చక్కెరమడిలో నమృతము పారించి పెంచినది కాని మట్టిలో నీరు పారించి పెంచినది కాదు." అని యానందపరవశులై యభాషించినారు పూజ్యపాదులు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రి గారు. సెబాసని యామోదించినది ఆంధ్ర విద్వత్ప్రపంచము. "పింగళి సూర్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునకు తరువాత విజయవిలాసమే సర్వవిధముల చేతను తెలుఁగులో శ్లాఘ్య కావ్యముగ నున్నది." "సామెతలతోను, శబ్దాలంకారములతోను నిండి యుండి యర్థగౌరవము కలదయి రసవంతమయి యున్నందున చేమకూర వేంకటకవి కవిత్వము సర్వజనాదరణీయమయిన దని తలచుచున్నాను," అని సెలవిచ్చినా రాంధ్ర కవి చరిత్రకారులు.

వాస్తవముగ చేమకూర వారి కవిత్వము నెంత పొగడినను తనివి తీరదు. వేంకటకవి భాషింప నేర్చిన యమృత ధారాధరము. అతనిది సాధారణ కవిత్వము గాదు. ఆమనియందు చిగురాకు జొంపములలో డాగి కర్ణరసాయనముగ బాడుకోయిల గానము. ఇందు సుధారసమును మరపించు మృదు మధురధారయు, శిరీషకుసుమ పేశలమగు సూక్తులును, ఆనందాబ్ధి నోలలాడించును. ఒక వింత. కవీశ్వరులు రసధునీ ప్రవాహమువలెను చమత్కార పయఃపూరమువలెను గవనము చెప్పియున్నారు. ఈ రెంటిని సమ్మేళనము గావించి యత్యంతరమణీయముగను హృదయంగమముగను కావ్యకల్పన చేసినవారు కొందరే. ఇందు మహాకవి రామరాజభూషణుఁడు ప్రముఖుఁడు. మన చేమకూర కవియన్నచో రామరాజ భూషణుని యనుకరించి నాడు, అగ్రస్థానము నాక్రమించినాఁడు. ఈ విషయమునందితడు రామరాజ భూషణునికంటెను, వేయేల ఆంధ్రకవు లెల్లరకంటెను మిన్నయై వన్నెకెక్కెను. రసగుంఫితముగాని పదమును గాని పద్యమును గాని యాతని గంటము వ్రాయ నెఱుఁగదు. అద్భుతవర్ణనలు శబ్దార్థాలంకారములు, చమత్కారోక్తులు వెల్లికొల్లలై యుల్లమును రంజింపఁ జేయును. సారస్వత గల్పవృక్షముపై నల్లిబిల్లిగ నల్లుకొన్న యమృతవల్లివంటి దితని చమత్కారము. బుద్ధికి సులభముగ గోచరముగానివిధమున భావశబ్దార్థములతో లంకె పెగిలియున్నది. ఇట్టి యసామాన్య కవితాప్రభావము గల్గినవాడగుటచేతనే,

"తారసపుష్టి మైఁ బ్రతిపదంబున
 జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ
 న నేక కృతుల్ ప్రసన్న గం
భీరగతిం రచించి మహిమించిన"

యారఘునాథ భూపరసికాగ్రణి వేంకట కవి కావ్య కన్యలను వలచి వరించెను.

కృష్ణాధ్వరి:- కృష్ణాధ్వరి రఘునాథ భూపాలుని యాస్థానము నలంకరించిన విద్వత్కవిపుంగవులలో మతియొక్కఁడు. ఈయన బహు గ్రంథకర్త. తాను వ్రాసిన గ్రంథములనన్నిటిని రఘునాథునికె యంకిత మొసఁగెనట. వినుఁడు:

నవరస శ్రీ రఘునాథ భూపాలీయ
 నామ భామాభీష్ట దాయకుండు
నైషధ పారిజాతావతారిక కావ్యవర్య
 స్వయంవర వల్లభుండు
కల్యాణ కౌముదీ కందర్ప నాటక
 కన్యోద్వహాన బద్ధ కంకణుండు
అమరుకాహంకార హారి భంగిక
 శృంగార సంజీవనీ కాముకుండు
శాశ్వ చింతామణీ వధూతల్పరుండు
మంచిజామాత రఘునాథమనుజ నేత
తెలియ నైషధ పారిజాతీయ కృతియు
నేపురక్కుల చెల్లె లై హెచ్చునమును.

ఇందువలన కృష్ణాధ్వరి రఘునాథ భూపాలీయము, నైషధ పారిజాతీయావతారిక, కల్యాణ కౌముదీ కందర్ప నాటకము, శృంగార సంజీవని,

తాళ చింతామణి, నైషధ పారిజాతీయమను నాలు గ్రంథములను రచించె నని తెలియుచున్నది. వీనిలో రఘునాథ భూపాలీయము విద్యానాథ మహాకవి విరచిత ప్రతాపరుద్రీయమువంటి యలంకార శాస్త్ర మనియు నందువలెనే యిందును ప్రతి శ్లోకమునను కృతి పతి నామము తగిలియున్నదనియు శ్రీ చల్లా సత్యనారాయణగారు చెప్పుచున్నారు. ఈ రఘునాథభూపాలీయమును నైషధ పారిజాతీయమును దప్ప తక్కిన గ్రంథములు గాన్పించుట లేదు. ఇవి సంస్కృత గ్రంథములని కొందఱూహించుచున్నారు. శృంగార సంజీవని సంస్కృతమున రచియింపఁబడి యుండవచ్చును, తక్కినవానిమాట యిదమిద్ధమనుటకు వీలు లేదు, అవి తెలుఁగు గ్రంథములైనను కావచ్చును. అనుపేని కల్యాణ కౌముదీ కందర్ప నాటకము యక్షగానము కావచ్చును.

నైషధ పారిజాతీయము ద్వ్యర్థికావ్యమని దాని పేరే తెల్పుచున్నది. ద్వ్యర్థికావ్యకర్తలలో నితనిస్థాన మున్నతమైనదని విమర్శకుల యభిప్రాయము. పింగళి సూరన "రాఘవ పాండవీయమును రంజకముగాను ప్రౌఢముగాను రచియించెను. తరువాత భట్టుమూర్తి తన హరిశ్చంద్ర నలోపాఖ్యానమును రచియించి యాత్రోవను కీర్తి గాంచెను. కాని నైషధ పారిజాతీయము పై రెంటివలెకాక దక్కని శైలిలో వ్రాయఁబడినది. రెండు ప్రబంధములవలె నడచుచున్నది." అని సీతారామ భట్టాచార్యులవారు వక్కాణించి యున్నారు. "సూరన తొట్టతొలి రచన యగుటచేత గావలయుఁ ప్రబంధమునందువలె వర్ణనలపై దృష్టి నిలుపక కథాకథనవ్యగ్రుఁడై రాఘవ పాండవీయమును రచించెను. ... రామరాజ భూషణుఁడు ... హరిశ్చంద్ర నలోపాఖ్యానముల కథను గైకొనుటయే కాక ప్రబంధోచిత వర్ణనలన్నిటిఁ జేర్చి సూరన్న కన్న ద్వ్యర్థి కావ్యరచనలో నధికుఁడననిపించుకొనుటకు ప్రయత్నము జేసెను. కృష్ణాధ్వరియు వారిని మీఱఁ గోవలము వర్ణనలను జేర్చుటయే కాక కథాకల్పన యందును మృదుపదార్థ రచనయందును దృష్టినిల్పి తన ద్వ్యర్థికావ్యమును జక్కని ప్రబంధద్వయముగా సంతరించెను!' అని చల్లా సత్యనారాయణగారు వచించి యున్నారు. ఇదియంతయు వాస్తవమే కావచ్చును. శ్లేషకావ్యకర్తలలో కృష్ణాధ్వరి కడు దొడ్డవాఁడే కావచ్చును. కాని శ్లేష కవిత కాలికి దగిల్చిన సంకెల; భావప్రకటనను నిర్నిరోధముగ సాగనీయదు. ఎట్లు విజాకర్షణశక్తివలన సర్వపదార్థములను భూమి తనవైపున కాకర్షించుచున్నదో యట్లే శ్లేష కవి దృష్టినంతటిని బహుళార్థ పదసంయోగమువంకనే లాగుచుండును. కావున కృష్ణాధ్వరియు నన్య శ్లేష కావ్యకర్తలవలె తన యావచ్ఛక్తిని వలసిన యర్థములు గలపదములకూర్పునందె వినియోగింపవలసి వచ్చెను. వీరేశలింగముపంతులుగారన్నట్లు, "ఇట్టి గ్రంథముల యందు నిఘంటువులు వెదకి పదములనేర్చి కూర్చిన శిల్పప్రౌఢిమయే కాని యర్థచమత్కారముగాని భావ గౌరవముకాని రసపుష్టిగాని పుట్టదు." కృష్ణాధ్వరి నేర్పును పాండిత్యమును నెంత ప్రశంసాపాత్రములైనను, సమకాలికులగు రఘునాథ వెంకట కవుల కవిత్వమువలె నుత్తమమైనది కాదు.

కాళయ్య:—రఘునాథ నాయకుని కాలము నుండియు తంజావూరు ఆస్థానము నాశ్రయించుకొని యున్నను, కాళయ్య మంత్రుకెక్కినది విజయరాఘవుని కాలమునందె.

'అయ్య దివముల రాము భద్రమ్మ వారు
నేడు కృష్ణాజి కవితల నేర్పు మెఱసి
వినికి సేయుటగొల్ల మీ ఘనత గాదె'

యను విజయరాఘవుని వాక్యమువలన కాళ కవి తంజావూరాస్థానమందలి భోగకాంతలకు విద్య గఱపెడివాఁడని తెల్లమగుచున్నది. ఇతఁడు రచించినది రాజగోపాల విలాసమను గ్రంథ మొక్కటియే. ఇటీవల నిది తంజావూరి సరస్వతీ మహాలు పుస్తక భాండాగారాధికారులచే ప్రకటింపఁబడినది. ఇది యైదాశ్వాసముల గ్రంథము. మన్నారుగుడి స్థల పురాణము. మొదటి యాశ్వాసమున చాల భాగము పీఠికకు సరిపోయినది, తక్కిన భాగమున రుక్మిణీ కృష్ణుల సంయోగము వర్ణింపబడినది. రుక్మిణీస్వీయ యని పేర్కొనబడినది. ఇట్లే చతుర్థాశ్వాసము తుదవఱకు, కలహాంతరిత భద్ర, జారిణి లక్షణ, విప్రలబ్ధ జాంబవతి, ఖండిత మిత్రవింద, విరహోత్కండిత సుదంత, ప్రోషిత భర్తృక కాళింది, స్వాధీన పతిక సత్యభామ వీరితో గోపాలకృష్ణుని కూటమి వర్ణింపబడినది.[1] కృష్ణుని యష్టభార్యలను అష్టవిధనాయికలుగ జిత్రిం

1. జారిణి భద్ర, పుట ౮౮, జారిణి లక్షణ యని పుట ౫౮, రెండుపర్యాయములు జారిణులను వర్ణించినట్లు ముద్రిత ప్రతియందు గలదు. ఇది పొరపాటు. సంపాదకులు దీనిని సవరించియుండిన బాగుగ నుండియుండును.

చుట కాళయ్య ప్రధానోద్దేశమని తెలియవచ్చుచున్నది. పంచమాశ్వాసమున మన్నారుగుడి స్థలమాహాత్మ్య కథనము గలదు. కవిత్వము సరసమైనదే. ఇతని సమాస రచన శ్రీనాథుని రచనం దలపించుననియు, నన్నయ వలె మత్తేభవృత్తము వసిపించుటయందు గట్టివాడనియు, శృంగార రసమును ఆంధ్రకావ్యములందు వలెగాక అమరుక కావ్యమునందువలె భావప్రధానముగనె యావిష్కర్షము గావించినాడనియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు వ్రాయుచున్నారు. ప్రశంసా ముత్తమ ప్రశస్త మనున్యాయము బడిచెప్పిన మాటలని తోచుచున్నవి. ఇంతకంటె, "ఈయన కవిత్వము రసవంతమైనదే కాని విశిష్ట గుణము గలది కాదు." అను సీతారామ భట్టాచార్యులవారి యభిప్రాయమె సత్యమునకు దాపుగ నున్నది.

ఒక దృష్టిని జూచిన కాళయ్య తరువాతి మధురాపురాంధ్ర కవులకు మార్గదర్శకుడైనట్లు తోచుచున్నది. ఇతని శృంగార వర్ణనలు నాయికానాయకు లొండొరుల కూటమిఁగోరి పడు తాపసోపముల నుగ్గడించుచున్నవి. మధురాపుర కావ్యములం దీలక్షణము దఱచుగ గానవచ్చును. మధుర వారికి దంజాపురకవు లాదర్శప్రాయము లగుటవలన నొకవేళ వారీ వలపుటంగలార్పును కాళయ్యకడ నభ్యసించి యుండిన నుండవచ్చును.

రంగాజమ్మ:—ఈమె తన వైదుష్యము నిట్లు చెప్పుకొన్నది. "విచిత్రతరపత్రికా శతలిఖిత వాచికార్థావగాహన ప్రవీణ. తత్ప్రతి పత్రికా శతస్వహస్త లేఖన ప్రశస్తకీర్తి. శృంగార రస తరంగిత పద కవిత్వ మహనీయమతిస్ఫూర్తి. అతులితాష్ట భాషా కవితా పర్యంకమనీషా విశేష శారద. రాజనీతి విద్యా విశారద, విజయరాఘవ మహీపాల రచిత కనకాభిషేక." పాటలు పదములుగాక రంగాజమ్మ యాఱు గ్రంథములు రచించెను. సంగ్రహ రామాయణ భారత భాగవతములు మూడు; మన్నారుదాస విలాసోషా పరిణయ ప్రబంధములు రెండు; మన్నారు దాస విలాస యక్షగాన మొకటి. ఇందు మొదటి మూడును నామమాత్రావశిష్టములైపోయినవి, తక్కిన మూడును తంజావూరు సరస్వతీమహాలు పుస్తకభాండాగారమునం దున్నవి. మన్నారు దాస విలాస యక్షగాన మాంధ్ర సాహిత్యపరిషత్తువారిచే ముద్రింపఁబడినది. తక్కినవి రెండును అముద్రితములు. ఎవ్వరో యొకరిద్ద రీ గ్రంథములను జదివిరి. దూరమున ద్రావిడదేశమున నిక్షిప్తమై యుండుటచే నివి యాంధ్రుల కందుబాటున లేవు. కావున వారి యభిప్రాయములను అంగీకరించి తృప్తి పడవలసి యున్నది. వీరిలో గణ్యులు కురుగంటి సీతారామ భట్టాచార్యులవారు. వీరు తంజావూరు పుస్తక భాండాగారాధికారులై యున్నపుడు భాండాగారములోని యన్యాంధ్ర గ్రంథములవలె రంగాజమ్మ కృతులను జక్కగ పరిశోధించి వానికి గాకితపు ప్రతులను వ్రాయించిరి. ఈమె గ్రంథములను వీరిట్లు ప్రశంసించి యున్నారు.

"ఉన్నవానిలో మొదటిది మన్నారుదాస విలాసము. ఈ గ్రంథమునందలి నాయకుఁడైన మన్నారుదాసుఁడు విజయరాఘవ నాయకుఁడే. ఈ గ్రంథము తనయేలికయైన విజయరాఘవ నాయకునిపై వ్రాయబడినది. రెండవది హరివంశాంతర్గతమైన యుషాపరిణయగాథ. ఈ రెండు ప్రబంధములను జదివిన వారికి మొదటిదానికంటె రెండవది మిన్న యని కన్పట్టక మానదు. కథాసంవిధానమందును, కవితా పటిమయందును, శైలీరీతియందును నీ రెండవది తెనుగున గల గొప్ప ప్రబంధములతో సరియని చెప్పుట నిజము చెప్పుట యగును." "ఈ గ్రంథము కనుపర్తి యబ్బయామాత్యునికి పూర్వము వ్రాయబడియుండిన, యబ్బయామాత్యుని 'యనిరుద్ధ చరిత్ర'కంటె సర్వ విధముల మేలని చెప్పుటకు తగినదై యున్నది."

మన్నారు దాస విలాసనాటక మప్పటి యక్షగాన రచనలలో ప్రసిద్ధికెక్కినది. యక్షగాన ప్రకరణమున నీనాటక విషయము విచారింతము.

తంజావూరు సంస్థానాశ్రితుఁడు గాకపోయినను విజయరాఘవునకు సమకాలికుఁడగుటచేత నవరము చిననారాయణరాజును ఇచట ప్రస్తావించుట యుచితము. ఇతఁడు చెంజి రాజ కుటుంబమునకు సంబంధించినవాడు గావచ్చునని ఇంతకుపూర్వ మూహించితిని. చిన నారాయణ కవి కువలయాశ్వ చరిత్రమను రసవత్తమ కావ్యమును రచియించి తన పెంపుడు తండ్రియైన నారాయణభూపాలున కంకితమిచ్చెను. ఇతఁడు మహాకవి. నాయక యుగంపు పింగళి సూరన్న యని చెప్పవచ్చును. కొన్ని విషయములం దితఁడు సూరన్నను మించినట్లగపడును. ప్రతిభాతిశయమునను గల్పనా సామర్థ్యమునను వీరిరువురును సమానులే యైనను చిననారాయణరాజు కవిత్వమందలి శిల్ప పరిపక్వమును ప్రసన్నత్వమును, నిగ్గును సూరనార్యునందు గానరావు. సంస్కృత పాండిత్యము గలవాడైనను, సంస్కృత పదములను సమాసములను గుప్పిం

షక దాక్షిణాత్యాంధ్రకవులకు సామాన్యమైన తియ్యని తేట తెనుఁగుమాటలను గూర్చి హృద్యమైన పద్యములతో నెల్లవారికి సులభగ్రాహ్యముగ గ్రంథమును రచించినాఁడు. చేమకూర వాని భావగాంభీర్యమును చమత్కార నైపుణియు నితని కతీతములే, కాని పద గుంభనయందును వర్ణనాకౌశల్యమునను నతనికి సమానుఁడని చెప్పవచ్చును. ఇతని కవిత్వ విశేషమునుగూర్చి వ్రాయవలసిన దింకేనియు కలదు, కాని సమయము చాలదు.

విజయరాఘవునితోఁ దంజావూరు నాయక రాజ్యము సమసిపోయినది. మొదట నది మధుర నాయకులకు గైవసమాయెను, కాని యటుపిమ్మట స్వల్ప కాలముననె శహాజీపుత్రుఁడు ఏకోజీ వారిని జయించి మహారాష్ట్ర ప్రభుత్వము నెలకొల్పెను. అంతట ఆంధ్రుల యధికార మచట మాసిపోయినది, కాని యాంధ్రభారతి మునుపటికంటె నధికతరముగ బ్రబలినది. ఇందుకు గారణమేమన మహారాష్ట్రు లాంధ్రులను జయించి తమ ప్రభుత్వమును స్థాపించినను, ఆంధ్రులచే వారును బరాజితులైరి. మహారాష్ట్రుల విజయము రాజకీయము, ఆంధ్రవిజయము సాంస్కృతికము. తంజావూ రాంధ్రనాయక ప్రభుత్వము ఫలరహితమై పోలేదు. వారి నాశ్రయించుకొని యుండిన తెనుఁగుప్రజయం దది స్థిరముగ నిలచిపోయినది. వారి ముద్ర లేక నాగరకతకు నెలావణి లేకపోయినది, వారి జీవితప్రకార మందఱకు మేలుబంతి యైనది. విజ్ఞానమునకు వారు పెట్టినదే భిక్ష, కళా కౌశలమున వారిదే మీఁదిచేయి. ఆంధ్రభాషాపరిచయము రసికతకు ముఖ్యచిహ్నము, ఆంధ్ర కవిత నొసటి మాణిక్యము. కావున మహారాష్ట్రరాజులందఱు తెనుఁగు నభ్యసించిరి, సభయందు తెనుగు మాటాడిరి, తెనుఁగు విద్వాంసులను గవులను గాంధర్వ విద్యా విశారదులను గాయన గాయనీ జనులను జేరదీసి నాయకరాజులవలె నాశ్రయమొసఁగిరి. మహారాష్ట్రరాజు లాంధ్రమున గవన మల్లుటకు నేర్చి కావ్యములను నాటకములను రచించిరి. కాని పద్యప్రబంధ రచన సన్నగిలెను, ద్విపద కావ్యములును, యక్షగానములును దామర తంపరగ నభివృద్ధి నందెను. వీనిగూర్చి ప్రకరణాంతరమున విచారింతము.

విజయరాఘవుని యనంతరము, మధుర పుదుకోట సంస్థానములు ప్రబంధరచన కిరవు-గాయెను. మధుర సంస్థానమునం దాంధ్ర సారస్వతమును నెలకొల్పినవాఁడు ముద్దళగరి. ఇతఁడు తిరుమల నాయకుని మనుమఁడు, క్రీ. శ. ౧౬౫౯ మొదలు ౧౬౮౨ వఱకు మధురరాజ్యమును పాలించిన చొక్కనాథనాయకుని సవతి తమ్ముఁడు[2]. క్రీ. శ. ౧౬౬౩ వ సంవత్సరమున

---

2. సత్యనాథ అయ్యరుగారు అళగరి చొక్కనాథునికి పాలిచ్చి పెంచిన దాది కొడుకని వ్రాసిరి. (*History of the Nayaks of Madura*, p. 165) అతఁడు చొక్కనాథుని "దూదు భాయి" అని తంజావూరి యాంధ్రరాజుల చరిత్రయందు కలదు. కాని సమకాలిక రచన యగు సత్యభామా సాంత్వనమున, "మేదినీవరుముద్దుతిరుమల వీర ధరాధినాథుండు మీనాక్షమాంబ యందు చొక్కనాథావనీపాలు లిం గాంచికయందు ముద్దళఘరీంద్రుఁ," గాంచె నని యున్నది. పుట. 41. శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిలవారలనో ముద్దళగరిపై కనువెట్టజేసినారు. "ఇతఁడు చింకౌలమారి. పొగడితే పొంగి పోయేవాఁడు. తంజావూరి కోట నాలుగు రెట్టలనా యేకోజీని నాలుగు రోజులలో తాను వోడించినట్లు "పెద్దళగిరి విజయము" అని గ్రంథం చెప్పించుకొన్నాఁడు. ఉళక్కి గెల్పు చాటించుకొన్నాఁడు. నాలుగు దిక్కులకూ నాలుగు ఉత్పలమాలలు పెద్దవి. మొత్తం దరకాలు ౫౩౦ ఉంటవి. గ్రంథం పెరిగిపోతుంది. కొంచెంకూడా ఉదహరించలేను." అని వక్కాణించినారు...పుట ౧౬. అ. జ్ఞా...కొంచెము కాంతమునస్కులై విచారించి యుండిన శాస్త్రిలవారింత తీవ్రముగ నళగరిని నిరసించియుండెరు. ముద్దళగ్గిరి పై శాసనమును వ్రాయించిన దెప్పుడు? అనునది ప్రశ్నమునువ వితర్కింపఁదగిన విషయము. ఏకోజీ తంజావూరికోటను స్వాధీనపఱచుకొనినపిమ్మటనై యుండెదుగదా. తత్పూర్వమై యుండవలయును, అనుచేని యేకోజీతో యుద్ధము సాఁగకముందే అతని నాలుగు దివములలో నోడించినాఁడనని కల్పనా కథను గట్టిశాసనమున నీయబద్ధ విజయమును బ్రకటించుకొనినాఁడైన నుండవలయును; లేదేని, తంజావూరిని యేకోజీ సాధించుటకు పూర్వమెకసారి యెత్తివచ్చి యళగిరిచే బరాజితుఁడై మరలి పోయి యుండవలయును. రెండవపక్షమే సత్యమని నావిశ్వాసము. ఇది యెట్లుండినను సుప్రసిద్ధ వాఙ్మయ విమర్శకులని పేరందిన శాస్త్రిలవారు ఆ యుత్పలమాలలను వ్రాసి ప్రకటింపకపోవుట యత్యంతము శోచనీయము. ఉత్పలమాలలను రచించినవారెవ్వరు? రచనా కాల మెప్పుడు? అందలి వృత్తాంతమెట్టిది? కవిత్వమేపాటిది? అను ప్రశ్నలు భాషాభిమానుల

చొక్కనాథ నాయకుఁడు విజయరాఘవుని వధించి తంజావూరి రాజ్యమును స్వాధీనపఱచుకొనిన పిమ్మట ముద్దళగిరిని దానికి పాలకుఁడుగ నియమించెను. అతఁడట నళగిరి కొంతకాలము నివసించి యా రాజ్యముపై నెత్తివచ్చిన మహారాష్ట్రులతో నొకటి రెండు పర్యాయములు పోరవలసి వచ్చెను. తంజాపురమున నున్నప్పుడే యతని కాంధ్రభారతి ప్రసన్నయాయెను. ఇతని పేర మూడు కృతులు వెలయుచున్నవి. "పెద్దళగిరి విజయము" ఇది మహారాష్ట్రి యేకోజీపై నీతఁడు వడసిన విజయమును వర్ణించు ౫౩౦ చరణములు గల యుత్పల మాలిక. తంజావూరికోట నాలుగు దిక్కుల యందును చెక్కఁబడియున్నది. అప్రకటితము. ఇంతకంటె దీనినిగూర్చి చెప్పుటకు వలనుపడదు. రెండవది లింగనముఖి కామేశ్వర కవికృత సత్యభామా సాంత్వనము. ఇతనికే తిరుకామ కవి యని నామాంతరము గలదు.

"అనువుగ రుక్మిణీ పరిణయంబును
మున్ హవణించి యార్యులౌ
ననఁ దనియించినావు మును
నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియింపు మీ సొగసు
పొడిమి మీఱఁగ సత్యభామ సాం
త్వనమున గప్పురంపు చలువన్
గెలువన్ దిరు కామసత్కవీ."

యని కృతిపతి తన్ను సంబోధించినట్లు చెప్పుకొన్నాడు. ఈ యంశమే యాతనివచన ధేను మహాత్మ్యములోని కడపటి పద్యమువలన విదిత మగుచున్నది.

"వివిధ కళాకలాపఖని వెంగన
లింగముఖేంద్రు నాగన
త్కవి తిరుకామ కోవిద
శిఖామణి ధీరులు పాకశైరిలో
కవి కచ కల్పక స్తబక గంధ
ధురంధర సూక్తి యుక్తి నా
నవునని మెచ్చ నావుల
మహాత్మ్యమొనర్చెను తేటమాటలన్."

ఇది చొక్కనాథ నాయకున కంకిత మీయబడెను. తిరుకామ కవి మూడుతరముల మధుర నాయక రాజుల యాస్థానమందున్నను, చొక్కనాథ నాయకుని రాజ్యకాలముననె, గ్రంథరచనకు గడఁగినట్లున్నది. ఇతఁడు హవణించిన రుక్మిణీపరిణయ కావ్య మిప్పటి వఱకు లభ్యము గాలేదు. సత్యభామా సాంత్వనము గంటివారి శృంగార గ్రంథమాలయందు ముద్రితమై ప్రకటింపబడినది. ఇందలి కథ నరకాసురవధ. నాలుగాశ్వాసముల గ్రంథము. మొదటి యాశ్వాసము మధురా పురవర్ణన కృష్ణవర్ణనతో సమాప్త మగుచున్నది. ఇంద్రాగమనము నరకాసుర దుష్ప్రవర్తన, నరకాసురవధోద్యోగము, వసంతోత్సవము, సత్యాకృష్ణుల విహారము, యుద్ధప్రయాణము, సత్యభామ యుద్ధప్రేక్షణాపేక్ష, తన్నివారణము, మొదలగు సంశివర్ణనలతో రెండవ యాశ్వాసము ముగియుచున్నది. స్కంధావారమున కృష్ణుని విరహవేదన, ద్వారకయందు సత్యతాపము, ప్రద్యుమ్నుని ద్వారకా ప్రయాణము, సత్య రాక వీనితో మూడవ యాశ్వాస మంతమందుచున్నది. యుద్ధవర్ణన, నరకాసురవధ, భగదత్త పట్టాభిషేకము, షోడశ సహస్ర స్త్రీ వివాహము, సత్యభామకోపము, కృష్ణుఁ డామెకు కోపోపశమనము చేయుటతోఁ బ్రబంధము తుదముట్టుచున్నది.

(సశేషం)

---

హృదయముల మొలకలెత్తును. పెద్దళగిరి విజయము చారిత్రకముగను వాఙ్మయదృష్టియందును ముఖ్యమైనది. భాషాభిమానులెవ్వరైనను దీని ప్రతిని వ్రాయించి ప్రచురింతురుగాక !



# తొలకరి చినుకులు



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

అలరిన వేడ్క నిండు మన మాదట రాగ సమంచితమ్ముగా
తలిరు పదమ్ములుంచి జలదాళి పసిండి హొయల్ పయంటగా
దిలి తొగరుం జిగుర్చెదవి తిన్నన నొత్తి యొకింత దాచి, వే
నలి గదలన్ విలోలనయనమ్ముల విభ్రమ క్రమ రేఖనై!

తొలకరి కార్మొయిల్ కొనల దూసిన నూత్న తమాల శాఖ రా
గలలితమూర్తినై, చనవుగా చిఱుగుమ్మను వంగి చూచె శీ
తల మృదు వాత పూర్వక సుధామధు ధారలు జాలువాఱ్చి, బీ
టలు వడి మండిపోయిన యెడంద నవామృత సేచకమ్ముగా!

ఉన్నత పర్వతాగ్రముల, నుజ్జ్వలరమ్య హిరణ్య కందరా
సన్న పథాల దేలిన నిజాశయ భవ్యకళా విలాసముల్
క్రొన్నురువుల్ ఘటించి, తళుకుల్, మెలపుల్, వలపుల్, కలల్ ధున్
సన్నుత వైఖరుల్ దొఱయ సాగినవీ తొలుకారు ప్రొద్దులన్!

ఈ సుమకోమలాంగి విరియించిన కేశవినీలపాశమే
యానలో సుళ్లువెట్టు! సువిహాయస సౌధతలాగ్ర తత్పద
న్యాస విలాస మాధురు లనన్యముగా మధు రోహ లేచు; కా
నీ సుకుమార మీ యెడద నేదొ విషాదనదమ్మె మ్రోసెడిన్!

చింపిరి జుత్తుపై చినుకు చిందులు ద్రొక్కగ పాత గట్టి మే
కంపిల వానలో నిలిచి, కానికినైయిటు యాచ్ఞ వెట్టు నీ
పొంపొక యింత లేని పసిబోటియు, ప్రక్కన చిన్ని తమ్ముడున్
సొంపులు వోవు నా కవిత సోయగమున్ హసియించినట్లవున్!

పడ పడ యెండల వంగురి,
వడ వడ వడగాలి తెరల వడియనసువులే!
తొలకరి చినుకుల టపటప
గిలకొట్టె నెడంద బ్రతుకు క్రిందుల్ మీదుల్!!

ఇలాంటి స్వప్నం అనుభవిస్తూ నిరుపేదల్లోని నిరుపేదై నిక్షేపంగా, తన నీడే తనకు జ్యోతిగా దాపుడులేని జీవితాన్ని గడిపే వాడొకడున్నాడీ లోకంలో, గడప లేక, గరణ లేక! అతని పేరు శరణయ్య!— శ ర ణ య్య అంటే జ్ఞాపకం వస్తూవుంది. "ధర్మం శరణంగచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి! బుద్ధం శరణం గచ్ఛామి!—" కాని శరణయ్య బౌద్ధమత సన్యాసి కాడు. అద్వైతసన్యాసి అంతకన్నా కాడు. అసలు ఏ సన్యాసీ కాడు. తన నీడే తన జ్యోతిగా, దాపుడు లేని జీవితాన్ని గడిపే వాడొక ఉత్తమ మనుష్యుడు. మగవాడు. ఎదిగిన వాడు. ఎత్తుగావుంటాడు. బలంగా వుంటాడు. ఛాతీ పోలీసువుద్యోగానికి సరిగా ఉంటుంది. ఎత్తు ఆలాంటిదే. కాని ఎప్పుడూ నిద్రమత్తే ఆ వ్యక్తికి. ఆలి లేదు. అనురాగం లేదు. బాలబాలికలంటే పడదు. పశుపక్ష్యాదులన్నా తద్వతే!

అయితే అతనికి ఆకలితీరడమేలాగు? కాలంగడవడమేలాగు? అవి రెండూకూడా అతగాడికెన్నడూ సమస్యలుగా దట్టలేదు. తాతతండ్రులు సంపాదించిన కొండ్ర కొంత వుంది.

ఏపూర్వులో వేసిన చెట్లయ్యుంటాయి అవి. కాకుంటే వాటికవి మొల్చినవయ్యుంటాయి. తోటవనం అదీ కొంతవుంది. మళ్లీ వొక ముంజెకాయ తినడు. బుర్ర గుంజు ఇంత కొట్టుకోడు. మనము రోడ్డంట నరమానవుల్ని ఏలా తప్పుకుంటూపోతామో, ఆలా చెట్టుచెట్టూ తప్పుకుంటూ వనమంతా తిరుగుతూ ఎక్కడో ఒకచోట ఏ రయితో ఇన్ని పచ్చికాయలుగాని, పచ్చి బియ్యము గాని, పచ్చిపప్పుగాని ఆఖరకు పట్టెడుపైనా సరే, ఫలహారంగా పెడితే దాన పొట్టనింపుకొంటూ, చేరువనేవున్న నదిలో స్నానం చేస్తూ, సర్వవిధాలా సంతోషం అనగా వేడుకచే కలిగే సంతోషంకాదు, తృప్తిచే కలిగే సంతోషం పొందేవాడు. "తాత తండ్రులిచ్చిన కొండ్ర లేకుంటే?" అని అడిగారా పాఠకులు, అది వేరేచోట అడగవలసింది. శరణయ్యవున్న స్థలంలో కాదు... నిజం నిజంగా చెప్పుకోవాలిగాని, ఆలాఅయివుంటేనో, ఇలా అయివుంటేనో అని అనుకోరాదు. ఇంతకూ బాగా ఆలోచిస్తే అతని కాచెట్లు, పగటివేళ నీడను, రాత్రివేళ అంధకారాన్ని ఇచ్చేవి. అంతకు మినహా మరేమి యివ్వవు. మరేమీ కావుకూడాను.

ఇలా వుంటూవుండగా ఒక రోజున హఠాత్తుగా ఆ వూళ్ళో వాళ్లకు వెదుళ్ళ పండుగ వచ్చింది. ఎన్ని పండగలైనా మనం ఎరుగుదుం గాని వెదుళ్ళపండగ ఆ వఱకెఱుగము మనమెవల్లమూను. తొల్లిక్కంను గురించి వినేం! సత్తెకట్ల వెధవ అని తిట్టేం! కాని వెదుళ్లకు వెదుళ్లు, వరదలోపట్టి, ఇవలకు లాగి, బుజాన్ని వేసుకుని ఎవరికివారు చిరునవ్వుతో తీసికొనిపోవడం ఎప్పుడూ ఇదివరలో వినలేదు! కనలేదు! ఈ సాహసం అంతా చూచినప్పుడు శరణయ్యకే సాయపడాలని బుద్ధిపుట్టాక ఇతరుల మాట ఇక చెప్పాలా?

అసలు చాలా కాలాన్నుంచి నది ఇగుర్చుకు ఇగుర్చుకుపోతూ ఇసక మాత్రంగా ఇనుకూటగా కొంచెంకొంచెం ఉన్నానంటూ వుండే సందర్భంలో ఓ చీకటి రాత్రి గడవకుండానే అంతా జలమయమై పూరుకుంది. తెల్లారగట్ల స్నానానికి అదివరకెంతో దూరం పోయేవాళ్లు, అసలే నడవక్కరలేకుండా కాళ్ల దగ్గరకు నీళ్ళొచ్చిపడ్డాయి. లంకలూ లేవు. లాకులూ లేవు. అంతా ఒకటే పొర్లుపొర్లు. 'గాలపు' గుజ్జం నుసుగులు గ్రక్కేటట్టు నీరు ప్రాణం దాల్చి నురుగు గ్రక్కుతూ, బరువు వస్తువును తేలిక వస్తువుగాను, తేలిక వస్తువును బరువు వస్తువుగాను చూపిస్తూ ఒకటే శోభ, క్షోభ నిద్దరినుంచి అద్దరిదాకా కాపరుస్తూ వుంది. అందులోనే చిత్రం!

తెప్పలకు తెప్పలే, కుప్పలకు కుప్పలే, వెదుళ్లు కట్లుతెగి, కలప పట్లుతప్పి, పలకలు కూడా డోలకలా అన్నంత వేగంగా విడివడ్డాయి. పట్టువడ్డానికి బిడ్డా? కరగి పోవడానికి బెడ్డా? దేనికదే అడ్డదిడ్డపు టొయ్యారాన్ని రాత్రి చీకటి గుయ్యారం అంతా గడపి తెల్లారి వెల్తురులో పట్న ప్రజకళ్లల్లో పడ్డాయి. కాళ్లకాళ్లల్లో నిలబడ్డాయి. పట్టి పైకి తీస్తారా పట్టినే సముద్రానికంటా పోనిస్తారా? ఆ తేలేకర్రనూ? ఆ మెదిలే కలపను? ఇల్లులేనివాడు సుందరంగా ఇల్లు కట్టొచ్చునని, పెళ్లిచేసుకునేవాడు పందిరి వేసుకోవచ్చునని, నీటదూకి, నురుగునూకి ప్రతీవాడు ఆ రోజున "వెదుళ్ల పండగ" "వెదుళ్లపండుగ" అంటూ ఒళ్లుమఱచి సంచరించిన వాడే. ప్రతి ఆడదీ అయా మగాడికి తోడ్పాటైందే.

శరణయ్య మాత్రం కొంతసేపు విస్తుపోతూ చూశాడు! చూసిచూసి అన్నాడు- "వెదురైతే పట్టేరు. కలపైతే పోగెట్టేరు! స్థలం మీకెక్కడ?" అని అడిగాడు.

ఆలా అడుగుతూనే వున్నాడు శరణయ్య, శరణయ్య చరణాల క్రిందకు వఱక వచ్చి అరికాలు గోకినట్టు అయింది. శరణయ్య ఒహో దొడ్డ నవ్వునవ్వి అడుగు మార్చాడు. మార్చాడో లేదో ఒక సడుచు కుట్టిన, అంతా బాగావున్నది-"ఒయ్యోయ్యి! నీ వెవరివో? జరగబోక! కుసింగా ఈ వెదురు నీకు జేరేసేని!" అని ఓ వెదురుగడ జారే శరణయ్యకు దాపెట్టి నిలేసింది. మొదటి వెదురుకు రెండో వెదురు కలేసింది. రెండో వెదురుకు మూడో వెదురు, ఆలా చేర్చి, "శివాశివా! యిదేంపాపం?" అని శరణయ్య అనుకునేలా అందించింది వెదుళ్లతో శరణయ్యను, శరపరంపరగా, అణచేసింది. "ఇక చాలు" అన్నా వినిపించుకునే వాటంలో లేదు అది. ఒక్క గడనూ కూడా వాలుకు పోనీక, తేర్చిలాగి, శరణయ్య మీదికి విసరజొచ్చింది. శరణయ్య మరి చేసేపనిలేక తనమీదకొరగిన గడలను ఆలా తన తాటి వనంలో ఓ తాటిచెట్టుకు జేరవేసేడు. ఆ పిల్ల ఊరికే వెదురు గడలను అందివ్వడం, ఇతడూరికే తాడికి జేరెయ్యడం! ఇలా కొన్ని గంటలు వామూ, వాక్యం మాని ఆ యిద్దరూ గోదావరీ ప్రవాహం మధ్యను ఈదులాడినంత శ్రమపడి, మెట్ట

కేలకుమట్టమధ్యాహ్నానకు "ఏం, మాఁవా!" అని అది, "ఏం కోడలా?" అని శరణయ్య ఒకర్నొకరు చూచుకొన్నారు.

చూచుకోవడంలో పూచిన చెట్టులా అది వికసించింది. ఆమెకు ఇతడు ఏలాగో తట్టేడు. ఏలాగేమిటి? శరణయ్య లాగేను. "ఏం శరణయ్యమాఁవా! నీవే! ఇంనాళ్టున్నుంచీ వెదుళ్ళందుకున్నాది?" అని, ఏమీ ఎఱగని దానిలా, అడిగింది. శరణయ్య ఆ ఆడమనిషిని పునః పునః పరకాయించి, "చూస్తే పిల్లవుగాని మాట్లాడితే ఇల్లాలులాగు పలకరించేవు! నీ వెదుళ్ళలా నా తాడికి జేరమోసి ఆలా వుండవలసిందేనా ఈపైని?" అని అడిగేడు. "స్థలం మరొక్కడన్నా దొరికేదాకా ఆలా ఉండవలసినవే అవి" అని పిల్ల అంది.

శరణయ్య కెక్కడలేని కోపం ఆపాళంగా వచ్చి, ఒక గొడ్డలి తెచ్చి, ఒక్కొక్క తాడిచెట్టే నఱక జొచ్చాడు. అతగాని వూహ "ఆ పిల్లకు వెదురు జేరేసేందుకు చోటు లేకుండ చేదా"మని. గొడ్డలిదెబ్బకు— ఒక్కొక్క దెబ్బకు - పై మట్ట అల్లల్లాడి క్రింద వీరు చెదరి -ధడేల్మని- చప్పడవుతూ వుంటే పిల్ల హడలిపోయింది. "భగవంతుడా! ఏ తాడిచెట్టుమీద పడుతుందా?" అని వణికిపోయింది. "శరణయ్యమాఁవా! అంత కోపం అవితే ఏలా?" అంది. "చెట్టుకు జేరేసినగడ చెట్టుదే! నీవు ఈ స్థలం వదలి వెళ్ళిపో తక్షణం వెళ్ళిపో" అన్నాడు శరణయ్య.

పిల్ల తక్షణం వెళ్ళిపోయింది. "వెదురు దొంగవెదురు సుమా." అని పిక్కాసింది. "దొంగవు నీవా? నేనా?" అంటూ శరణయ్య నీళ్లు నమిలినట్టుఅని గొడ్డలెత్తలేక పోయినాడు. గొడ్డలి గడలకు జేరేసి తాటి మువ్వంక ఒకసారి గాంచి "ఇది మా సెడ్డ పన్నాగం పన్నేసింది! ఎవరా ఆ పిల్ల?" తెఱపినే తేరిపారిచూచాడు.

పిల్ల 'మరియమ్మ'లా తట్టింది, వెను తట్టు జటా అది, అల్లాడేలా, కుఱకుఱలాడుతూ నడుస్తూవుంది. "మరియమ్మా!" అని కేకేసేడు; తన అరచేతులు తననోటికి దాపినవాడై బూరా వూదినట్టు కూకేశాడు. "నన్నేనా? నాను రాను" అంది మరియమ్మ.

"ఎఱిగున్న మనిషే
మఱపు కొచ్చింది!
తిరిగి పోనాకమత్తె
తెలివేల? కాల్చనా?"

ఆంటూ ఓగీతిక అల్లుకు శరణయ్య ఆ మరియమ్మను మరియాదగా వెంటాడించాడు మట్ట మధ్యాహ్నపు టెండలో.

"కాపలాకాస్తే దొంగసరుకు కాకపోవచ్చు" అన్నాడు చెవిలో అన్నట్టు చేరికకు వెళ్లి. మరియమ్మ, మెలితిరిగినట్టు శరణయ్యవంకకు మెడ త్రిప్పి, "నీవా? నేనా? కాపలాకాయడం?" అంది. "సరుకు నా వంతు, కాపలాకాయడం నీ వంతు" అన్నాడు. "అమ్మితే వచ్చేలాభం?" అని అడిగింది. "ఇదేం పెద్దవ్యాపారమా లాభా

నికి ?" అన్నాడు శరణయ్య. "వ్యాపారమో వ్యవహారమో నా కదంతా తెలియదు" అంది మరియమ్మ. "సాక్ష్యం మఱీ వేరు" అన్నాడు శరణయ్య.

అంతలో వాళ్ళిద్దఱూ నిలబడ్డ చాయనే వాళ్లున్న పాళంగా వాళ్ల మీదకు తభీమని ఒక తాడిచెట్టు వొరిగింది. ఇద్దరూ చెరోవైపునకు తప్పుకున్నారు. తప్పుకున్నట్టుగా, మరో తాడి, మరో తాడి తభీ తభీమని గొడ్డలిపెట్టున పెటిల్లుమంటూ మఱీ మీదకు పడసాగాయి. చుట్టూ చూచేరు శరణయ్య మరియమ్మ ఏకచూపుగా! శరణయ్య గొడ్డలివేయి గొడ్డళ్లై, చెట్టుకో గొడ్డలి, గొడ్డలికో మనిషి నిలబడ్డారు. కోరమీసాలు వడేశారు.

శరణయ్య మరియమ్మకేసి, మరియమ్మ శరణయ్యకేసి, బండోరులు భయకంపనంగా చూచుకొన్నవారై, మఱికొట్టబడని చెట్టు ఆ వెదుళ్లుదాపెట్టిన చెట్టేనని తెలుసుకోగలిగారు. ఇద్దఱూకూడా వెదుళ్లమధ్యకు దూఱి ఆ ఒంటితాడి మొదలున కూర్చున్నారు.

"బయటికి రాండి!" అని కులంవారు అంతా కూడకట్టు కొక్క గొంతుకనరిస్తే, మరియమ్మ మడతపడ్డ జడరిబ్బను సరిచేసుకుంటూ యివతలకు వచ్చింది. కాని శరణయ్య ఆలాగే తాటి నంటిపెట్టుకుండిపోయాడు. గడలన్నీ వొత్తిగించి యివతల పారేసినా, చెట్టును విడువకుండా శరణయ్య పూర్ణ సంతోషం వెలిబుచ్చాడు.

"మీరా తాళ్లు ఇంకా వాసాలుగా చేసుకోండి! ఆ స్థలంలో ఇళ్లేసుకోండి! ఆ వెదురంతా పెండెంక్రింద పెణకక్రింద ఉపయోగించుకోండి! నన్ను నా పురాతనపు తాడిచెట్టును ఇలా వుణ్డియ్యండి!" అన్నాడు.

ప్రజలప్పుడు తాముకట్టిన వెదురుంచుకోవడానికి జాగా నేకాకుండా, ఇల్లుకట్టుకోవడానికికూడా జాగా సంపాదించుకున్నవారయ్యారు. అదంతా వేశే ఒక పెద్ద పేటగా తయారై యూరుకొంది ఒకలిప్తలో.

మఱెప్పుడన్నా మరియమ్మను శరణయ్య చూచినప్పుడు, తొల్లింటికోపం పాపం అంతా మఱచిపోయి— "మరియమ్మా! మనిషికి ఒక తాడిచెట్టు ఒక్క వెదురుబొంగు ఉంటేశాన! నీ వంత పెద్దలోగి లెందుక్కట్టేవు? అన్ని వెదుళ్లెందుకు నెట్టేశేవు?" అనీ వాడు యథాలాపంగా! మరియమ్మ అతగాడి ఆ తాడిచెట్టు మువ్వంకచూస్తూ "వెదుళ్ల పండగ!" అని చిరునవ్వు నవ్వేది!



ఆషాయంకాలము చే
శేపంగతి వాడు దోపలేదు; మనంచేసెనో
హో! పగము రంగు కోరపగ
మోసడి సన్న మ్రోగు మురువును! అంతే!

'ఒకరోజు' అనే ఈ క్రిందిశీర్షిక కవిభావనా రంజితమైన వీరి ప్రకృతివర్ణన కుదాహృతిగా తీసుకోవచ్చును.

'జీవిత మ్మసంబద్ధ ప్రుంభావమయము
గాగ దోషించు మనికి రేలాగో యనకు;
మంచు వేసవి చిగురించు మావి మొక్క!
పికము లవకుచుంపె జలువ చిప్పిలు మొయిళ్లు!
గొంతులో గద్గదంబిసావంతిరోల్ల
మింగి చిరునవ్వు పెదవుల మేళవించి
పాడుమా కోకిలం బట్లు పాటనొండు!
ఆడుమా! చాతకం బట్టు లతిపిపాస!'

మాటవాడు, ఒకానొక పువ్వును జూచి, ఎదలోబడె నస్తమయము, మొదలైనవీ జాతికి చెందిన ఈ త్రిమ ప్రకృతివర్ణన చిత్రణలే.

ఈ సంపుటిలో కవికొండల వారి ప్రకృతి కవితా వైవిధ్యం చక్కగా ప్రతిఫలించింది. ఇది ప్రకృతి కవితాభిమానులందరికీ అవశ్య పఠనీయమైన సంపుటి.

---

## చికిత్సాసార సంగ్రహము

సంపాదకులు: డాక్టర్. యస్. జానకిరామశాస్త్రి. ప్రకాశకులు: గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ. మదరాసు. వెల: 11-8-0.

గ్రంథ సంపాదకులు పీఠికలో తెలియజేసినట్లిది ఒక ప్రసిద్ధాయుర్వేద గ్రంథం కాదు. గృహస్థులెవరో ఆయుర్వేద గ్రంథాలన్నీ పరిశీలించి నిత్యకృత్యంలో ఉపయోగించే ఆరోగ్యాయుర్వేద విషయాలన్నీ ఒక తాళపత్ర గ్రంథంలో చేర్చారు. అది మదరాసు ప్రాచ్యతాళపత్ర భాండాగారికులు ప్రచురించారు. దానికే చికిత్సా సారసంగ్రహమని పేరు.

ఇది రాయల్ సైజులో 518 పుటల గ్రంథము. గ్రంథాంతంలో అనుక్రమణిక మొదలయిన ఉపయుక్త విషయాలన్నీ ఉన్నాయి. తప్పొప్పులపట్టిక ఒకటి చేర్చవలసి ఉన్నా, వ్యవధి లేకపోవడంవల్ల ఆపని జరగలేదని సంపాదకులు తమ పీఠికలో తెలియజేస్తున్నారు.

అయితే ఈ గ్రంథంలో అనేకరోగాలు, వాటి నిదానాలు, ఆయారోగనివారణలకు ఉపయుక్తములైన మూలికలు, ఔషధాలు, అవి తయారుచేసేవిధానాలు, ఇంతేకాక పథ్యాపథ్యాలు మొదలైన ఆయుర్వేదానికి సంబంధించిన విశేషాలెన్నో ఉన్నాయి.

గవర్నమెంట్ ఓరియంటల్ లైబ్రరీవారు బహు వ్యయప్రయాసలతో ప్రకటించిన ఈ గ్రంథం కేవల ప్రాచీన వైద్యశాస్త్ర పరిశోధకుల కేమీ సహాయకారి కాజాలదు.

పోనీ ఇందులో ఉన్న ప్రక్రియలు, చిట్కాలు మొదలైనవి జనసామాన్యానికి ఏమైనా ఉపయోగిస్తాయా అంటే అదీ కనబడదు.

సంపాదకులు 'తమ పూర్వపీఠిక'లో "ఈ గ్రంథమున కొన్ని వశ్యయోగములు, సువర్ణీకరణయోగములు, రజతీకరణయోగములు చెప్పబడియున్నవి. కాని పాఠకులకు వాటి రహస్యములు తెలిసికొనకను, ఏమాత్ర మనుభవము లేకను ఈ యోగముల నుపయోగించిన

ఒక వేళ కోరిన ఫలితములు కలుగక పోవచ్చును." అని వ్రాశారు.

దీనినిబట్టిచూస్తే జనసామాన్యానికిగూడా ఇది ఉపయోగపడెదని తేలింది.

అందుచేత ఇంతగా ధనవ్యయంచేసి ప్రాచీన వైద్యశాస్త్రీయ గ్రంథం ప్రకటించ దలచినప్పుడు ఇంతకంటె మరి ఒక సుప్రసిద్ధగ్రంథ మేదైనా ప్రకటించియుంటే బాగుండేది.

ఏతావాతా ఈ కాలం వైద్యుల కీగ్రంథంవల్ల ప్రాచీనకాలంలో ఉన్న కొన్ని చిట్కాలు, ప్రక్రియలు కొన్ని ఔషధాల తయారీలు మాత్రమే తెలుస్తాయి. ఇక మిగిలినవాటిలో ఉపసన్నిపాత విధాన మొక్కటే ముఖ్యమైన విషయం.

ఇకముందునింకైనా సంపాదకు లీ విషయాలు జాగ్రత్తగా గమనించి ఇంతకంటె ఉత్తమ శాస్త్రీయ గ్రంథాలు ప్రకటించగలరని ఆశిస్తున్నాము.

## 1 తేనెసోనలు మొదటి సంపుటము
## 2 తేనెసోనలు ద్వితీయ సంపుటము.

[ఖండకావ్య సంపుటాలు]

రచయిత, విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ ప్రతులకు రచయిత, 66, సామిపిళ్ళవీధి, మూరై, మదరాసు. సంపుటము ఒక్కొక్కటి: వెల 1-4-0.

ఇవి రెండూ రచయిత అప్పుడప్పుడు రచించిన ఖండకావ్య సంకలనాలు. వీటిలో మొదటిదానికి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, రెండవదానికి శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు ప్రవేశికలు రచించారు.

రచయిత ఈ కాలంలో బాగా ప్రచారంలో ఉన్న ఖండకావ్య రచనాపద్ధతి ననుసరించి ఈ రెండు సంపుటాలలోను, చిన్న చిన్న కథాకావ్యాలు, ప్రకృతి వర్ణనలు, చాటువులు, అనువాద కావ్యాలు, భావచిత్రణలు మొదలైనవన్నీ సమకూర్చారు.

వీరి రచనలో సాంప్రదాయిక ఛందస్సులే గాక వినూతన ఫణితిలో రచించిన గేయ ఛందస్సులుకూడా ఉన్నాయి.

వీరి కవిత అంతటా భాషాసాంప్రదాయికమైన శిష్టమార్గంలో నిర్దుష్టంగా సాగిపోతుంది.

కవిత మొదటి సంపుటిలోకంటె రెండవ సంపుటిలో కొంచెం హెచ్చుస్థాయిలో నడుస్తుంది. ఈ క్రింది ఉదాహరణలనుబట్టి వీరి పద్యరచనాపద్ధతి కవితాస్థాయి అవగాహన చేసుకోవచ్చును. ఈ వృత్తం వీరు రచించిన ఆంధ్ర సౌందర్యలహరిలోనిది.

"శర దమృతాంశుకాంతివయి,
　　చంద్రకళా రమణీయ చూడవై,
వర మభయంబు, పుస్తకము,
　　స్ఫాటిక మాలయు దాల్చి చేతులన్
బరగెదు, నిన్ను సత్కవులు
　　పల్కరు మ్రొక్కిన గాంత్రముగాదె తా
రోరిమను గోస్తనీ మధుపమో
　　మధురంబుల దివ్యవాక్కులన్"

కోపనాస్వభావవర్ణన పరమైన ఈ క్రింది వృత్తం వీరి స్వీయరచనాఫణితిలో ఉత్తమ కవితకు ఉదాహరణం.

"అల్లిక వేనలిం దొరగి యంతట
　　నంతట బూలురాల, న
ల్లల్లన ముంగురుల్ గునిసియాడ
　　ముఖాంబుజమందు, గాని చె
క్కిళ్ళను గ్రమ్మ గెంజెదవి
　　కిప్పుడె కంపమునంద, మిణ్గురుల్
చల్లెడు పల్కు మాపుల
　　పసందగునీ సొబగెంతొ సుందరీ!"

---

## చిన్నయ్య
[జీవిత చరిత్ర]

కొత్త సత్యనారాయణ చౌదరి. అమృతలూరు, గుంటూరు జిల్లా, వెల: ఆరణాలు.

ఇది పరవస్తు చిన్నయసూరి చరిత్ర సంగ్రహంగా వివరించే చిన్న పుస్తకం.

ఈ పుస్తకంలో వీరు చిన్నయ సూరి బాల వ్యాకరణాన్ని గురించీ హరికారికలను గురించీ చెలరేగిన వాదోపవాదాలు ఇంకా మిగిలిన చారిత్రిక వివాదాలు ఇంకా వివరంగా ఇచ్చియుంటే ఇది ఇంకా పాఠక జనోపయోగిగా ఉండేది.

ప్రస్తుత గ్రంథం చిన్నదైనా ఇందులో చిన్నయ్యసూరి జీవితచరిత్రకు సంబంధించిన వివరాలన్నీ ఉన్నాయి.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.